సాయి

# లీలాతరంగిణి





సంకలనం

## కొమాటగిరి కృష్ణమోహనరావు

ఎడిటర్ 'శ్రీవాణి'

**శ్రీవాణి పబ్లికేషన్స్**

24-52, రామానాయుడుపేట,

మచిలీపట్నం - 521 001.

సాయి లీలాతరంగిణి

ప్రథమ ముద్రణ : ఆగష్టు 2000
కాపీలు : 2000

వెల : **రు. 40-00**

ప్రతులకు :
**శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్ ట్రస్ట్**
ప్రశాంతి నిలయం - 515 134.
అనంతపూర్ జిల్లా

ముద్రణ :
**శ్రీవాణి ఆఫ్‌సెట్ ప్రింటర్స్**
రామానాయుడుపేట,
మచిలీపట్నం - 521 001.
ఫోన్ : 08672 -21137

# మనవి

"అత్యంత శక్తివంతమైన దుర్భిణీ యంత్రములు కూడా చూడజాలని పదార్థములను నేను చూడగలను. నాకెటువంటి ఎక్సరే ఫొటోలు అవసరం లేకుండ రోగ నిర్ధారణ గావించ గలను. ఏడువేల సంవత్సరములనాటి విషయములేకాదు, డెబ్బది వేల సంవత్సరముల నాటి విషయములు కూడా నాకు తెలుసును. నేను కాలముతో ముందు వెనుకలకు వెళ్ళి కోరిన దేనినైనా చూడగలను. నేను దేశ కాల పరిమితుల కతీతుడను. నేనొకసారి రెండు శరీరము లందుండుట మీకాశ్చర్యము కలిగి యుండవచ్చును. రెండేమిటి? ఒకేసారి వేల శరీరములందు, వివిధ ప్రదేశములందుండగలను. మీకు నేనొక వస్తువును సృష్టించి బహూకరించితిని అనుకొనుడు. మీరేదైనా పెద్ద ఆపద యందున్నపుడు, అది నాకు వచ్చి చెబుతుంది. ఆ క్షణమే నేను మిమ్ము చేరి కావలసిన సహాయము నందించెదను. అంతేకాదు, మీ వద్ద నేను సృష్టించి ఇచ్చిన వస్తువు ఏమీ లేకున్నను, మీకు నాయందు అవిభాజ్యమైన భక్తి ప్రేమలున్న, మీరెచ్చట ఉన్నను, ఏ సమయమందైననూ, నేను వెంటనే ప్రతి వచనమిచ్చెదను. మీరు ఏ నామరూపము లను కొలచి ప్రార్థించిననూ నేను జవాబు చెప్పెదను. అన్ని రూపములు నావే కదా!" అన్నారు ఒకసారి భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు.

భగవాన్ సాయి దివ్యశక్తి ఇంతటిది, అంతటిది అని ఎవరూ చెప్పలేరు. సాయి శక్తి అపారము, అనంతము. దానికి పరిధులనేవి లేవు. సర్వశక్తులూ సాయి హస్తగతమయి ఉన్నవి. ఆ దివ్యశక్తి స్వరూపస్వభావాలు అందరికీ అర్థం కావు. మేధావంతులు, శక్తివంతులు కూడా వారి దివ్యశక్తిని అర్థం చేసుకోలేరు. అనుభవజ్ఞులైన శాస్త్రవేత్తలకు, సైంటిస్టులకు సహితం అంతుపట్టని అద్భుతమూర్తి భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారు. ఆయన సర్వజ్ఞులు, సర్వశక్తిసంపన్నులు, సర్వాంతర్యామి, సర్వవ్యాపకులు అనటంలో ఏమాత్రం అతిశయోక్తి లేదు.

సత్యధర్మ శాంతి ప్రేమ అహింసలను మానవాళికి ప్రబోధించటమే భగవాన్ సాయి ప్రధాన లక్ష్యము. మాసిపోయిన, మమత సమతలను, మరచిపోయిన ప్రేమ కరుణలను, మరుగుపడిన మానవత్వమును పునరుద్ధరించి, మానవత్వం గల మానవులుగా తీర్చిదిద్దటమే భగవాన్ సాయి మహత్తర ఆశయం. సనాతన ధర్మ సముద్ధరణ వారి ధ్యేయం. ఆ పవిత్ర లక్ష్య సాధనకు దివి నుండి భువికి దిగి వచ్చారు భగవాన్ సత్యసాయిబాబావారు.

భగవాన్ బాబావారి దృష్టిలో మహిమలకు ఎట్టి ప్రాధాన్యతా లేదు. అయితే, అవి ప్రజానీకంలో ఆస్తికత్వాన్ని విశ్వాసాన్ని పెంపొందించడానికి, నైతిక, ఆధ్యాత్మిక మార్గంలో పయనించడానికి దోహదం చేస్తాయి. స్వామి ఒకసారి మహిమలను

గురించి ప్రస్తావిస్తూ "నేను చేసేది మెస్మరిజం కాదు. నా శక్తి దివ్యమైనది, విశ్వ వ్యాప్తమైనది, అనంతమైనది. అవి నా Visiting Cards. అవి యిచ్చినవారికి ఏదైనా ప్రమాదం సంభవించినా, వారికి నా సహాయం అవసరమైనా, ఆ బహుమతులు మెరుపులా, నాకు ఆ విషయాన్ని తెలియ జేస్తాయి. వారిని అప్పుడు ఆదుకుంటాను. బిడ్డలు కళాశాల నుండి శలవలలో గృహమునకేతెంచి, తిరిగి పోవునప్పుడు, తల్లి తన బిడ్డలకు, నానావిధ రుచ్యపదార్థములు తయారు చేసి పెట్టడం, తన మాతృహృదయమును తెలుపుటకే గాని, ఇతర ఉద్దేశ్యములతో కాదు గదా! అట్లే నన్ను చేరు వారిని భగవన్ముఖులుగా చేయుటకై, ప్రేమతో ఇట్టి దైవీశక్తికి సంబంధించిన మహిమలను చూపి, వారిని దైవభక్తులుగా తయారు చేయుదును. ఇది నా స్వభావము. నా ప్రేమానుగ్రహములు కనపరచు విధానము" అన్నారు భగవాన్ సాయి.

కనుక ప్రపంచంలో ఎందరో భక్తులు ఈ విధంగా భగవాన్ సాయి అనుగ్రహాన్ని పొందగలిగారు. భగవాన్ సాయి దివ్యలీలలను ఆస్వాదిస్తున్నారు, అనుభవిస్తున్నారు, ఆనందిస్తున్నారు. అట్టి వారిలో కొందరు, వారు అనుభవించిన అనుభూతులను, భగవాన్ సాయి వారికి చూపిన మహిమలను 'శ్రీవాణి' (మాసపత్రిక)కు అందించారు. భగవాన్ సాయి దివ్యానుగ్రహంతో గత 15 సంవత్సరాలుగా క్రమం తప్పకుండా వెలువడుతున్న 'శ్రీవాణి' ద్వారా వారి అనుభవాలను పాఠకులకు అందించే మహద్భాగ్యం నాకు కలిగింది. వాటిల్లో కొన్నింటిని ఈ **"సాయి లీలాతరంగిణి"** గ్రంథము ద్వారా, భగవాన్ సాయీ దివ్యాశీస్సులతో, సాయి భక్తులకు, అభిమానులకు అందించగలిగే అవకాశం నాకు లభించింది. అందులకు సాయి మాతకు కృతజ్ఞతతో ప్రణమిల్లుచూ సవినయంగా ఈ ప్రథమభాగమును పాఠకులకు సమర్పించుకుంటున్నాను. కొంతకాలము తరువాత "ద్వితీయ భాగము" కూడా భగవాన్ సాయి దివ్యాశీస్సులతో అందించగలుగుతాననే నమ్మకం నాకున్నది.

ఈ "ప్రథమభాగము" అనుభవజ్ఞులైన 50 మంది భక్తులు ప్రేమతో అందించిన 58 వ్యాసముల సంకలనము. ఈ గ్రంథమును స్వంతం చేసుకొనండి! చదవండి! తరించండి! చదివించండి! తరింపజేయండి! ఇదే నా చిన్న మనవి. సహృదయంతో స్వీకరించండి!

**ధన్యవాదములు**

(కొమరగిరి కృష్ణమోహనరావు)
సంపాదకులు 'శ్రీవాణి'

మచిలీపట్నం,
ది. 27-8-2000

# విషయసూచిక

ఓం శ్రీ సాయిరాం



# స్వామి సన్నిధే మా పెన్నిధి

కొమరగిరి జయప్రద, బందరు.

"వచ్చారా! రండి! ఈ రోజు చాలా సుదినం. శ్రీవాణివారు మాఇంటికి వచ్చారు. 'శ్రీవాణి నావాణి' అని భగవాన్ సాయి అన్నారు గదా! అందువలన శ్రీవాణి పత్రిక చాలా బాగుంటున్నది. మీయొక్క ఆధ్యాత్మికవ్యాసాలు, నీతిబోధలు, సాయి ప్రసంగ వ్యాసాలు పిల్లలను, పెద్దలను కూడా చాలా ఆనందపరుస్తున్నాయి, ఆలోచింప జేస్తున్నాయి. ఒకప్పుడు మీ రాజకీయ ఉపన్యాసాలలాగా, ఇప్పుడు మీ ఆధ్యాత్మిక ప్రసంగాలు కూడా మమ్మెంతో ఉత్తేజపరుస్తున్నాయి" అని ఈ విధంగా అనేది ఎవరితోనో కాదు, సాక్షాత్ మా శ్రీవారితోనే. ఇంట్లో ఉన్నప్పడు 'శ్రీవాణి' పనితోను, బయటకు వెళ్ళినప్పడు 'సాయివాణి'ని వినిపించటంలోను మా శ్రీవారు ఎప్పడూ 'బిజీ'గానే ఉంటారు. అయితే మా శ్రీవారు ఈ స్థితికి ఎదగడానికి, అందరిచేత మెప్పను పొందడానికి కారణం ఏమిటి? కారకులెవ్వరు? విచారిస్తే భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారి అనుగ్రహ ఆశీర్వచనముల ఫలితమేనని మా కుటుంబ సభ్యుల ప్రగాఢ విశ్వాసం.

*"జగతి సత్కీర్తిగాంచి శ్రీసాయి కృపతో*
*సాటి మానవులయందెపుడు మేటియగుచు*
*నిత్యమును ధర్మజిజ్ఞాస నిరతులగుచు*
*ఉత్తమోత్తమ వ్యక్తులై యుండ్రుగాక!"*

అన్నారు భగవాన్ సాయి. ఇది ముమ్మాటికీ సత్యం. శ్రీ సాయి భక్తులైనవారు స్వామి ప్రేమను, అనుగ్రహమును, ఆశీస్సులను పొందినవారు, సాటివారిలో మేటిగా వుండి, అందరిలోను గౌరవాదరాభిమానములను పొందుతూ, సద్గుణ సంపన్నులై ఉంటారని స్వామి చెప్పారు.

## స్వామితో తొలిపరిచయం :

ఎన్ని జన్మల పుణ్యాల ఫలమో, భగవాన్‌సాయి సాంగత్యం లభించటం. అశాశ్వతమైన రాజకీయ పదవులను పొందలేకపోయినా, శ్రీ సాయిరామభక్తి సామ్రాజ్యంలో ఒకరుగా, స్వామిచేతిలో ఒక పనిముట్టుగా మారటం స్వామియొక్క దివ్య సంకల్పమేనని నాభావన. స్వామి చల్లని చూపుతో మా కుటుంబ జీవన విధానమే మారిపోయింది.

పుణ్యక్షేత్రములు దర్శించినా, పుణ్యతీర్థములు సేవించినా, దైవదర్శనం కల్గినా - అంతా మన పూర్వజన్మ పుణ్యఫలమే. దేనికైనా కాలం కలిసిరావాలి. ఆ శుభ సమయమే 1985 సం॥ అక్టోబరు. శ్రీ రాయనపాటి లక్ష్మీ కాంతారావుగారి పుణ్యదంపతుల (రాయ్ టైర్స్) ప్రేరణ వలన భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారి దర్శనం ప్రప్రథమంగా మా శ్రీవారికి లభించింది. ఆ ప్రథమ దర్శనంలోనే శ్రీవారికి, స్వామి ప్రత్యేకమైన ఇంటర్వ్యూను ప్రసాదించారు. 'శ్రీవాణికి తమ ఆశీస్సులు' అని అడుగగా, "ప్రతి మంచి పనికీ నా ఆశీస్సులు వుంటాయి" అన్నారు స్వామి. ప్రప్రథమంగా నవంబరు-85 శ్రీవాణి కవరు పేజీ మీద స్వామి ఫోటో వేసి, లోపల స్వామిని గురించి ఒక వ్యాసం కూడా వ్రాసాము. అదే స్వామితో మా తొలి పరిచయము.

## పదిహేనువేల పుష్పాలు :

అది 1986సం॥ ఏప్రియల్ నెల. ఒకరోజు మధ్యాహ్నం మండుటెండలో స్వామి అనుగ్రహమనే మేఘం పదిహేనువేల పుష్పాలనే చల్లని ప్రేమ జల్లును మా మీద కురిపించి, మమ్ములను ఆశ్చర్యచకితులను, ఆనంద భరితులను చేసింది. పత్రిక నడపటంలో కష్టసుఖాలను గమనించారు స్వామి. సర్వాంతర్యామి తమ యొక్క అనుగ్రహం మాపైన ఉన్నదని తెలియజేయటానికి, స్వామి స్వయంగా సంతకంచేసిన 15వేల రూపాయల చెక్కును పంపి, ఆర్థికంగా మమ్ములను ఆదుకున్నారు. అది మొదలు, ఇప్పటివరకు శ్రీవాణి పత్రిక ఒక్కనెల కూడా బ్రేక్‌పడకుండా, సాయి దివ్యాశీస్సుల వలన సాఫీగా నడుస్తున్నది. "భయమేల సాయీ ఉండగ, భక్తులపాలిటి అండగ".

## లింగమూర్తి :

"ఇది నీ పుట్టిల్లు. ఎప్పుడు వచ్చినా మీ కోసం తలుపులు తెరచి ఉంటాయి. ఈసారి వచ్చినప్పుడు పిల్లల్ని కూడా తీసుకొనిరండి!" అన్నారు స్వామి. అది 1986 జూలై నెల. నా జీవితమనే పుస్తకంలో సువర్ణాక్షరములతో లిఖించవలసిన దివ్యమైన రోజు. గురుపూర్ణిమకు ప్రశాంతి నిలయంలో ప్రవేశించినరోజు. స్వామి మాకు ఇంటర్వ్యూ ప్రసాదించినరోజు. మా జన్మ తరించడానికి స్వామి తమయొక్క అనుగ్రహానికి చిహ్నంగా లింగమూర్తిని సృష్టించి ప్రసాదించిన శుభదినం. కోటి తల్లుల ప్రేమతో మా కష్టసుఖములను విచారించి మమ్ములను దీవించిన

దివ్యమైనరోజు అది. ఆ నలభై నిముషములు స్వామి యిచ్చిన ఇంటర్వ్యూలో, నలభై సంవత్సరాలు అనుభవించని ఆనందాన్ని అనుభవించాను నేను. స్వామి యిచ్చిన లింగమూర్తిని అభిషేకించిన తీర్థంలో గ్లూకోజ్, ఐరన్, 'బి' కాంప్లెక్స్ లాంటి శక్తివున్నదన్నారు స్వామి. ఆనాటి నుండి భగవాన్ శ్రీ సాయీశ్వరుడు మా ఇలవేలుపై, మా ఇంట, వెంట, జంట- అన్నింటా తోడు, నీడై మమ్ములను కాపాడుతున్నారనటంలో ఎట్టి సందేహములేదు.

**అంగుళీయకం :**

1986 నవంబర్‌లో స్వామి పుట్టుపండుగకు పిల్లలందరినీ తీసుకొని పుట్టపర్తి వెళ్ళాం. పుట్టుపండుగ అయిన తర్వాత స్వామి మాకు ఇంటర్వ్యూని ప్రసాదించారు. పిల్లలందరికీ తగిన బుద్ధులు చెప్పారు, నా సందేహాలను తీర్చారు. ఒక ఆకుపచ్చరాయి అంగుళీయకమును సృష్టించి, శ్రీవారి వేలికిపెట్టి పచ్చగా ఇలాగే ఉండాలని ఆశీర్వదించారు. మేమందరం ఎంతో ఆనందంతో బయటకు వచ్చాం. అవి ఎంతో మధురమైన, మరుపురాని, మధురక్షణాలు.

**WATCH :**

అది 1987 మార్చి నెల. తాను నమ్మిన రాజకీయాలను వదలలేక, ఏమిచేయాలో తోచక, ఒక చంప ఎన్నికలు జరుగుతున్నా స్వామి వద్దకు వెళ్ళారు. 20 రోజులపాటు స్వామి సన్నిధిలో ఉండిపోయారు శ్రీవారు. అప్పడు స్వామి మూడుసార్లు శ్రీవారికి ఇంటర్వ్యూ ప్రసాదించారు. స్వామి యొక్క సహజమైన కరుణావృష్టిని వారిపై కురిపించి వారిలోని నైరాశ్యమును తొలగించి, అప్పటి పరిస్థితులను గురించి వివరించి, ధైర్యాన్ని కలిగించి, కర్తవ్యాన్ని బోధించి, ఒక Watch ని సృష్టించి చేతికిపెట్టి, అంతరార్థాన్ని వివరించారు. ఇది ఎప్పడూ నిన్ను వాచ్ చేస్తుంటుందని చమత్కారంగా నవ్వుతూ అన్నారు స్వామి. ఇది జరిగిన తరువాత, వారు రాజకీయాల జోలికి వెళ్ళలేదు. వారికి, నాకు కూడా మనస్సుకు కొండంత ధైర్యం కలిగింది. ఎందుకంటే అన్నీ స్వామి చూచుకుంటారులే అని.

**ప్రేమజ్యోతి :**

కాలానుగుణంగా కొన్ని సహజమైన ఒడుదుడుకులు కలిగినా, మన వెనుక ఏదో ఒక మహాశక్తి ఉన్నదని, అది మనలను నడిపిస్తున్నది అనే ధైర్యంతో ముందుకు నడుస్తున్నాం. 1988 సం॥ మే నెలలో శ్రీవారికి 20 రోజులు, బెంగుళూరులో తమ దివ్యసనిధిలో ఉండే భాగ్యాన్ని కలిగించారు స్వామి. ఉదయం, సాయంత్రం స్వామి సన్నిధిలో వుండి తమ సంశయాలను తీర్చుకున్నారు శ్రీవారు. ఒక పుస్తకమును వ్రాయటానికి వారిలో ప్రేరణ కలిగించారు స్వామి. దానికి తెలుగులో 'ప్రేమజ్యోతి' అని, ఇంగ్లీషులో Light of Love అని పేరు కూడా స్వామియే పెట్టారు. నా ఆరోగ్యం కోసం ప్రత్యేకమైన విభూతి ప్రసాదమును కూడా పంపారు. శ్రీవారిలో

అనంతమైన మానసిక శక్తిని, అంతులేని ఆనందాన్ని పెంచి బందరు పంపించారు. స్వామి కలిగించిన స్ఫూర్తితో వెలువడిందే 'ప్రేమజ్యోతి'. ఆ ప్రేమజ్యోతి ఎంతో మంది హృదయాలలో దివ్యజ్యోతులను వెలిగించింది. ఆ వెలుగు బాటలో ఎందరినో నడిపించింది. స్వామి సన్నిధికి చేర్చింది.

## పుట్టింటికట్నం :

1993 ఆగష్టులో మా పెద్దవాడు చి॥ చంద్రశేఖర్‌కు, మా చిన్నఅమ్మాయి చి॥ విజయగౌరిలకు ఒకరోజు తేడాలలో వివాహలగ్నములు పెట్టుకున్నాము. ఆరెండు శుభలేఖలు తీసుకొని జూలైలో పుట్టపర్తి వెళ్ళారు శ్రీవారు. లైనులో కూర్చున్నప్పుడు స్వామికి ఆ రెండు శుభలేఖలు యివ్వగా, మంచిది! మంచిది! అంటూ వాటిని తీసుకొని వెళ్ళారుట. మధ్యాహ్నం శ్రీ చిరంజీవరావుగారిని పిలిచి స్వామి "కృష్ణమోహనరావు పిల్లల పెళ్ళిళ్ళుట! శుభలేఖలు యిచ్చాడు. ఇది కూతురికి, ఇది కోడలికి" అని చెప్పి రెండు పెద్ద జరీవున్న పట్టుచీరలను, స్వామియే స్వయంగా ఒక Bag లో పెట్టి శ్రీ చిరంజీవిరావుగారికి యివ్వగా, వారు శ్రీవారికి కబురు పంపి వాటిని అందజేశారు. స్వామి అనుగ్రహం లాగానే ఆ చీరలు కూడా చాలా బరువుగానే ఉన్నాయి. సాక్షాత్ సర్వేశ్వరుడే మా పిల్లలను ఆశీర్వదించి, ప్రేమతో పంపిన పుట్టింటి కట్నంగా మేమంతా భావించాం. స్వామిది కోటితల్లుల ప్రేమ. అందువలననే ఆయనకు 'సాయిమాత' అనే పేరు సార్థకమైంది. తరువాత మా రెండవ కుమారుడు చి॥ ఉదయ కుమార్ పెండ్లి శుభలేఖలు తీసుకొని వెళ్ళగా, స్వామి తన దివ్యాశీస్సులను అందించారు.

## సాయిరామ పాదుకలు :

1995 సం॥ మే నెలలో స్వామికి చేయించిన వెండి పాదుకలను తీసుకొని కొడైకెనాల్ వెళ్ళగా, ఆ పాదులకను స్వామి పూర్తిగా ధరించి ఒక క్షణం నిలబడి పాదనమస్కారం యిచ్చి, విభూతి ప్రసాదం యిచ్చి ఆశీర్వదించారు. వాటిని శ్రీసాయి రాముని పవిత్రమైన పాదుకలుగా భావించి మేము మా పూజామందిరంలో పెట్టుకొని నిత్యమూ పూజిస్తున్నాం. ఆ సాయిరాముని పాదుకలు మా ఇంటిలోని వారందరిని కాపాడుతున్నాయని మానమ్మకం, విశ్వాసం, ఎందుకనగా మేము చేసే ప్రతిపని స్వామికి విన్నవించుకుంటూ, మేము కొన్న ప్రతివస్తువులను స్వామి పాదముల చెంతపెట్టి స్వామి ఆశీస్సులను కోరుతుంటాం.

## షష్టిపూర్తి :

అది 1996 సం॥ మార్చి 13వ తేది. స్వామి దర్శనం అయిన తరువాత, స్వామి లోపలికి వెళ్ళగానే, మేము గేటుదాటి బయటకు వచ్చాము. ఇంతలో స్వామి పిలుస్తున్నారని కబురు వచ్చింది. నాకాళ్ళ నొప్పుల మాట కూడా మరచి ఇద్దరం త్రయీభవనంలోనికి పరుగెత్తాం. స్వామి చిరునవ్వులు చిందిస్తూ "ఎక్కడికి

వెళ్ళావు? మూడు తూర్లు ముగ్గురితో కబురంపాను" అన్నారు స్వామి. ఇపుడే బయటికి వెళ్ళాను స్వామి అన్నారు వారు. పిల్లలంతా బాగున్నారా? నీ ఆరోగ్యం ఎలా ఉన్నది?' అని అడిగారు నన్ను. శ్రీవారితో "ఇంతమంది పిల్లకాయలను తీసుకొని యింతదూరం ఎందుకు? ఎంత శ్రమ? ఎంత ఖర్చు? మీకు చుట్టాలూ, స్నేహితులు ఎక్కువ. అందరినీ పిలుచుకొని ఇంటివద్దనే షష్టిపూర్తిని చేసుకోండి!" అని చెబుతూ మా ఇద్దరిని దగ్గరకు రమ్మనమన్నారు. ఢమరుకం బంగారు గొలుసును సృష్టించి నా మెడలో వేశారు. మా ఇద్దరికి పట్టు బట్టలు పెట్టి ఆశీర్వదించారు. ఈ బట్టలను కట్టుకొని ఇంటివద్దనే శాస్త్రోక్తంగా షష్టిపూర్తి చేసికొని మళ్ళీ రండి! ఆశీర్వదిస్తానని చెప్పారు. స్వామి సంకల్పం వలన, దివ్యాశీస్సుల వలన బందరులో మా షష్టిపూర్తి, ఊహించని రీతిలో కడు వైభవంగా జరిగింది. దర్శనం అయిన తరువాత బయటకు వెళ్ళిన వారిని పిలిచి స్వామి ఇంటర్వ్యూ యివ్వటం మాత్రం చాలా విశేషమైన విషయమని అక్కడ అందరూ అన్నారు. దీనికి నాంది ఏమిటంటే, శ్రీవారికి అరవైవసంతాలు నిండిన సందర్భంలో మాకుటుంబ సభ్యులందరూ స్వామి ఎక్కడ ఉంటే అక్కడకు వెళ్ళదామని నిశ్చయించుకొని, ముందుగా స్వామి అనుమతిని కోరటానికి వెళ్ళాము. స్వామితో ఆ విషయం చెప్పకముందే, స్వామి ఈ విధంగా మమ్ములను దీవించారు. స్వామి సర్వాంతర్యామి. సర్వజ్ఞుడు. వారికి తెలియనిది అంటూ ఏమిలేదనేది మరొకసారి ఋజువు చేసారు.

**మంగళసూత్రములు :**

1996 సం॥ డిశంబర్ 23వ తేది మా మూడవవాడు చి॥ శ్యామ్‌ప్రసాద్‌కు వివాహలగ్నం పెట్టుకొని శుభలేఖలు తీసుకొని స్వామి వద్దకు వెళ్ళారు శ్రీవారు. లైన్లలో కూర్చొనినప్పుడు, స్వామి దగ్గరకురాగా శ్రీవారు శుభలేఖలు అందజేయగా, వాటిని స్వామి తీసుకొని "అంతా నేను చూచుకుంటానులే" అంటూ వెళ్ళి పోయారుట. ఆ రోజు సాయంత్రం భజనకు ముందుగా వచ్చి "పెండ్లికి మంగళసూత్రాలు కావాలి గదా!" అన్నారుట "తమరే అనుగ్రహించాలి స్వామీ!" అన్నారుట శ్రీవారు. అప్పుడు స్వామి చేయిపట్టమని, మంగళ సూత్రములు రెండు సృష్టించి యిచ్చారుట. మళ్ళీ లోపలికి వెళ్ళివచ్చి పెండ్లికూతురికి జరీపట్టుచీరె, పెండ్లి కొడుకుకు పట్టు బట్టలు మరియు నాకొక పట్టుచీరె తీసుకొని వచ్చి యిచ్చి శ్రీవారికి పాదనమస్కారం, విభూతి ప్రసాదం యిచ్చి దీవించారుట. ఈ విధంగా దర్శనం సమయంలో యివ్వటం అరుదైన సంఘటన. స్వామి యిచ్చిన కానుకలను ప్రసాదంగా భావించి, ఎంతో సంతోషంతో ఇంటికి తిరిగి వచ్చారు శ్రీవారు.

**మధురస్మృతి :**

1999 సం॥ మే 23వ తేది ఆదివారం. బెంగుళూరు లోని రమేష్ హాల్‌లో అఖండ భజన జరుగుతున్నది. భక్తులు శ్రావ్యంగా పాడుతున్నారు. త్రయీభవన్‌లో

నుండి స్వామి అడుగులో అడుగు వేసుకుంటూ గేటు వద్దనున్న వారిని పలుకరిస్తూ, కొందరికి పాదనమస్కారం, మరికొందరికి విభూతి ప్రసాదం యిస్తూ చిరునవ్వులు చిందిస్తూ రమేష్‌హాల్ లోనికి ప్రవేశించారు. చల్లని పిల్లగాలి చిలిపిగా స్వామి పాదాలను స్పర్శించింది. స్వామి అంగీ కొంచెం ప్రక్కకు తొలిగింది. బ్రహ్మకడిగిన పాదములు చాలా స్పష్టంగా కనిపించాయి. ఆనందం కలిగింది. దర్శనం జరిగింది. స్పర్శనం కూడా దొరుకుతే బాగుంటుంది అనుకున్నాను. నా మనసులోని మాట స్వామికి తెలిసినదేమో! మగవారి వైపుకు వెళ్ళి శ్రీవారిని ఇంటర్‌వ్యూకు పిలిచారు. అది గమనించి నేను త్రయీభవన్‌లోకి నడిచాను. స్వామి గుమ్మం వద్దనే నిలబడి చిరునవ్వుతో అందరినీ లోపలకు పిలిచారు. లోపల స్వామి సింహాసనం ముందు కూర్చునే భాగ్యం నాకు కలిగింది. స్వామి తన సహజమైన మందహాసంతో మమ్ములందరినీ పలుకరించి విభూతి సృష్టించి యిచ్చారు. నన్ను దగ్గరకు పిలిచారు. కండ్లజోడు తీయమన్నారు. ఒక బంగారు గొలుసును సృష్టించి నామెడలో వేశారు, దీవించారు. తరువాత అక్కడ వున్నవారిని మరొక గదిలోనికి విడివిడిగా పిలిచి ఏదో మాట్లాడారు. చివరకు మా ఇద్దరిని కూడా పిలిచారు. మేము లోపలకు వెళ్ళగానే "కాళ్ళ నొప్పులు ఎలా ఉన్నాయి? బాగా నొప్పులుగా ఉంటున్నాయి గదూ! ఒకకాలు అసలుపని చేయటంలేదు. చాలా బాధపడుతున్నావు. అయినా తిరుగుతునే ఉన్నావు" అన్నారు నావైపు చూచి. నేను నవ్వి ఊరుకున్నాను. స్వామికి తెలియనిది ఏమున్నది? "శ్రీవాణికి మీ ఆశీస్సులు" అన్నారు శ్రీవారు. శ్రీవాణికి నా ఆశీస్సులు ఎప్పుడు ఉన్నాయి. "శ్రీవాణి నావాణే గదా! శ్రీవాణిని అందరూ మెచ్చుకుంటున్నారు. అది చాలా అభివృద్ధిలోనికి వస్తుంది. నీవు ఇంకా శ్రీవాణి మీదనే ఎక్కువగా దృష్టి కేంద్రీకరించు!" అన్నారు స్వామి. ఇంకా అనేక ఆధ్యాత్మిక విషయాలను బోధించారు. "తమ అనుగ్రహం వలన మేమంతా బాగానే ఉన్నాము. పిల్లలందరికీ సద్గుణములు, ఆయురారోగ్యములు ప్రసాదించండి స్వామీ!" అన్నాను నేను. "తప్పకుండా నేను అందరిని చూస్తూనే ఉన్నాను. నాకు అన్నీ తెలుసు. అన్నీ నేను చూచుకుంటాను. ఇక మీరు అంతర్ముఖింకాండి. బాహ్యం! బాహ్యం! ఎంతసేపు! మనస్సు నిర్మలంగా ఉంచుకోండి. పొగడ్తలకు పొంగిపోవద్దు. స్వామి చెప్పినవి మరచిపోవద్దు. మీ మంచి కోసం, మీయందు ప్రేమ వుండబట్టే కదా! ఇంతసేపూ చెప్పాను." అన్నారు స్వామి నాకు దుఃఖం పొంగివస్తున్నది. స్వామి తమ అమూల్యమైన కాలాన్ని మా కోసం సుమారు అరగంట వెచ్చించారు. అంత సేపూ వారి పాదసేవ చేసుకోవటానికి మా ఇద్దరికీ అవకాశం యిచ్చారు. వచ్చే టప్పుడు స్వామి పాదములకు నమస్కరించగా "దీర్ఘసుమంగళీభవ' అని కన్న తల్లి కన్నా ఎక్కువగా హితబోధ చేశారు. తల్లి కూడా అంత ఓపికగా చెప్పదేమో! స్వామి ఒకసారి 'మనది హృదయ సంబంధం' అన్నారు మాతో. హృదయ సంబంధం అంటే ఇలాగే ఉంటుందేమో! ఇంటర్‌వ్యూ అయిపోయి బయటకు వస్తుంటే, శ్రీవారిని

పిలిచి ఒక గడియారం సృష్టించి చేతికి పెట్టారు స్వామి. నేను మెట్లు దిగుతుంటే 'మెల్లగా, మెల్లగా నడు!" అన్నారు స్వామి. ఆవును విడచి వచ్చే లేగదూడలు లాగా, కళ్ళు తుడుచుకుంటూ బయటకు వచ్చాం. అది మా జీవితంలో మరువలేని మధుర స్మృతి.

ఈ విధంగా మా కుటుంబ సభ్యులకు ఎన్నో సార్లు ఇంటర్వ్యూలు అనుగ్రహించారు, పాదనమస్కారాలు యిచ్చారు, విభూతి ప్రసాదాలు ప్రసాదించారు. ఇంకా ఎన్నో...ఎన్నో... యిచ్చారు. రాజకీయాలలో నిర్విరామంగా తిరుగుతున్న మా శ్రీవారికి ఒక మంచి మార్గమును కూడా చూపించారు.

ఏజన్మలో ఏ పుణ్య కార్యాలను చేశామో! ఏ సత్కార్యాల నాచరించామో! మాకు మాత్రం తెలియదు. ఎన్ని జన్మల పుణ్యఫలమో! ఈ జన్మలో మాత్రం స్వామి అనుగ్రహాన్ని పొందగలిగింది మా కుటుంబం. ఆ సర్వాంతర్యామి ప్రేమ కరుణలకు పాత్రులమైనాం. స్వామి ఋణమును తీర్చుకోగలమో! లేదో! అయితే స్వామి ఋణమును తీర్చుకుంటే ఒకందుకు మంచిది కాదేమో! బదులు తీర్చుకుంటే స్వామికి దూరం కావచ్చునేమో! అదే నా భయం. కాబట్టి ఆ తల్లికి, ఈ పిల్లలకు, గురువుకు శిష్యులకు, జీవుడికి, దేవుడికి ఈ అవినాభావ సంబంధం జన్మ జన్మలకు ఇలాగే కొనసాగాలని నా భావన. అయితే స్వామి అనుగ్రహం ఆశీస్సులు లభించాయనే గర్వంతో, అహంకార, అహంభావములకు లోనుకాకుండా అనుగ్రహించ మని స్వామినే ప్రార్థిస్తున్నాను. జన్మజన్మలకు స్వామి సన్నిధే కావాలని మనసావాచా కోరుకుంటున్నాను. స్వామి చేసే సత్కార్యాలలో మేమూ ఒక పనిముట్టుగా ఉపయో గపడి మా జన్మలను సార్థకం చేసుకొనే విధంగా మమ్ములను తీర్చిదిద్దాలని స్వామినే వేడుకుంటున్నాను. 'సర్వదా సర్వకాలేషు' స్వామి మా ఇంట, వెంట, జంట వుండి మమ్ములను ముందుకు నడిపించాలని ఆ సాయీశ్వరుని ప్రార్థిస్తున్నాను.

అయితే ఇదంతా ఎందుకు వ్రాస్తున్నానంటే, స్వామితో గడిపిన పవిత్రమైన క్షణాలను, మధుర స్మృతులను మననం చేసుకోవటమే నా ఉద్దేశ్యం. స్వామి అనుభూతులను పదిమందికీ పంచటమే నాలక్ష్యం. అహంకారం కాదు, ఆడంబరంగా పదిమందికి చెప్పకోవాలని మాత్రం కాదు. శేషజీవితంలో కూడా స్వామికి దగ్గరగా వుండే విధంగా, అవసరమైన శక్తి సామర్థ్యాలను, సద్బుద్ధిని, వివేకమును ప్రసాదించమని స్వామిని మనః పూర్వకంగా ప్రార్థిస్తున్నాను, అర్థిస్తున్నాను, వేడుకుంటున్నాను.

నవంబర్ - 1999

# సర్వాంతర్యామి భగవాన్ శ్రీ సత్యసాయిబాబా

గొల్లకోట రామారావు, కాలిఫోర్నియా

ఉత్తర అమెరికాలోని కాలిఫోర్నియా రాష్ట్రమునకు రాజధాని సేక్రమెంటో, సేక్రమెంటో నగరమునకు ఉత్తర భాగమునగల పొలములలో వరి ఎక్కువగా పండించబడుచున్నది.

సేక్రమెంటో రాజధాని సమీపమునగల నగరములలో, ఫోల్సమ్ ఒకటి. ఫోల్సమ్ నగరములో నివసించే శ్రీ గొల్లకోట నాగసాయిబాబా (ఇంజనీరు) వారి భార్య డాక్టరు లక్ష్మి, కుమార్తె సుధ శ్రీ భగవాన్ సత్యసాయి బాబావారి పరమ భక్తులు. శనివారము, ది. 29-5-1999 తేదీన నేను, నా ధర్మపత్ని సుబ్బలక్ష్మి, శ్రీ నాగసాయి బాబా, వాని కుటుంబముతో కలసి 'కలుస' గ్రామములోగల శ్రీ సత్యసాయి బాబా గృహమునకు వెళ్ళినాము. మేము కారులో ప్రయాణం చేయునపుడు కలుస గ్రామమునకు ముందుగల రహదారికి ఇరువైపులగల సస్యశ్యామలమైన వరి పొలములు చూడ, చాలా ఆహ్లాదకరముగా నున్నవి.

కలుస గ్రామములో శ్రీ అమిప్రసాద్ మంగ్రు, వారి భార్య శ్రీమతి రామ్‌కుమారి అనువారు 953 సిఓక్ వీధి, కాలిఫోర్నియా, 95932లో నివసించుచున్నారు. శ్రీ అమిప్రసాద్ దక్షిణభారత దేశమునకు, శ్రీమతి రామ్ కుమారి ఫిజికి చెందినవారు. వీరు చాలా నిరాడంబరులు, సహృదయులు, శ్రీ షిర్డిసాయిబాబావారి భక్తులు. వీరి గృహములో అత్యద్భుతములు జరుగుచున్నవి. శనివారము సాయంత్రము జరిగే భజనలో పాల్గొనుటకు, కలుసలో జరిగే అద్భుతములను కనులార గాంచుటకును, మేము రెండు గంటల ముప్పది నిముషములు కారులో ప్రయాణము చేసి, కలుస చేరితిమి. లాసేంజలిస్ మున్నగు వివిధ ప్రాంతముల నుండి భక్తులు చాలా మంది ఆ రోజున కలుసవచ్చి, భజన కార్యక్రమములో పాల్గొనిరి.

సాయంత్రము 5 నుండి 7 గంటల వరకు జరిగిన కార్యక్రమములో, ముందుగా భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారి అష్టోత్తర శతనామావళిని అందరు చదువు చున్నప్పుడు, దైవమందిరము వద్ద ఉంచిన గ్లాసులోగల నీరుపైకి పొంగి, క్రిందగల ఒక పళ్ళెములోనికి వచ్చినది. తరువాత అందరు సాయి భజన కీర్తనలను పాడిరి.

ఏసుక్రీస్తు పటములో, వారి హృదయము నుండి అమృతము ప్రవహించి, క్రింద ఉంచబడిన పళ్ళెములోనికి చేరినది. శివుని పటము మీద విభూతిచేరి, ముద్దలుగా నిల్వవున్నది. శ్రీ బాబావారి పాదములు గల ఫోటో నుండి తేనె ప్రవ

హించుచున్నది. శ్రీ సత్యసాయిబాబావారి కొరకు వేసి ఉంచిన కుర్చీనిండా విభూతి చేరినది. ఒక అలమారు తలుపుకు అంటించబడిన, భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారి పటములో, వారి దివ్యహస్తము నుండి తేనె, క్రింద ఉంచబడిన ప్లేటులోనికి ప్రవహించుచున్నది. లక్ష్మీదేవి పటము నుండి కుంకుమ వచ్చినది. ఈ అత్యద్భుతము లను మేము, ఇతర భక్తులు కనులారగాంచి, ఆనంద పరవశులమైతిమి.

భజన అనంతరము వచ్చిన భక్తులందరకు భోజనము ఏర్పాటు చేయబడినది. పిదప శ్రీ అమిప్రసాద్ వచ్చిన భక్తులకు తీర్థము, తేనె, విభూతి పొట్లములు పంచి ఇచ్చిరి. వారి గృహములో దేవుని పటముల నుండి తేనె, అమృతము, విభూతి నిత్యధారగా వచ్చుచున్నవి. భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు సర్వాంతర్యామి అను ధృడ విశ్వాసముతో ఏసియా దేశస్థులు, అమెరికన్లు, అనేక ఇతర జాతులవారు వేల సంఖ్యలో కలుస గ్రామమునకు వెళ్ళి భక్తి శ్రద్ధలతో భజన కార్యక్రమములలో పాల్గొను చున్నారు. పుట్టపర్తికి వెళ్ళిన కొందరు అమెరికావాసులు స్వామిని "మీరు అమెరికా ఎప్పుడు వస్తారు" అని అడిగినప్పుడు, "నేను కలుసలో ఉన్నాను" అని శ్రీ సత్యసాయి బాబావారు జవాబు చెప్పిరి. ఈ విషయము శ్రీ అమిప్రసాద్‌గారు, వారి భార్య చెప్పిరి.

ఏ నోటవిన్నా 'సాయిరాం, సాయిరాం, అనే పలకరింపులే విదేశములలో వినవచ్చుచున్నవి. కలుస గ్రామము వెళ్ళి, స్వామివారి అద్భుతలీలలను గాంచువారు, భజనలలో పాల్గొనువారు ధన్యులు; అది వారి పూర్వజన్మ సుకృతము.

*నవంబర్ - 1999*



# ముక్తి ఫలం

*స్వార్థ అహంకారములను తొలగించుకొని, దివ్యత్వాన్ని చేరుకోండి! సామాన్య భక్తి నుంచి అనన్య భక్తికి చేరుకోవటానికి ప్రయత్నించండి! మొగ్గవిచ్చి, పరిమళాన్ని వెదజల్లినట్లుగ, మనసు వికసించి, విశాలమై, సత్య సహన శాంతి ప్రేమ పరిమళాలను వెదజల్లాలి. దుర్గుణ నాశనం, పవిత్ర పోషణల ద్వారా హృదయ కమలము వికసించి 'ముక్తిఫలం' లభిస్తుంది.*

**- బాబా**

# అదే మా తొలి పరిచయం

వి. రామం, ఖమ్మం

మాది పండిత కుటుంబం. నిజాం పరిపాలనా కాలంలో, కొల్హాపూర్ సంస్థానంలో మా నాన్నగారైన శ్రీ రామసుబ్బారాయుడుగారు రాజగురువుగా, ఆస్థాన కవిగా ఉండేవారు. "పూర్వజన్మ కృతం పాపం వ్యాధి రూపేణ పీడితః" అన్నట్లు మా అన్నగారికి టాన్సిల్స్ బాగా ముదిరిపోయి ఆపరేషన్ చేయవలసి వచ్చింది. ఆ రోజులలో మా రాజాగారి కుటుంబం కొంతకాలం భాగ్యనగరంలోను, మరికొంత కాలం మద్రాసులోను ఇంకా కొంతకాలం బెంగుళూరులోను ఉండేది. శస్త్రచికిత్స నిమిత్తం మా అన్నగారిని తీసుకొని బెంగుళూరు వెళ్ళారు మా నాన్నగారు. అక్కడకు వెళ్ళిన తరువాత రాచబిడ్డలు నాన్నగారితో "మాష్టారూ! తొందరపడి ఆపరేషన్ చేయించకండి. వైట్ ఫీల్డ్‌లో ఎవరో సత్యసాయి బాబాగారు ఉన్నారుట. ఆయన చాలా మహత్యాలు చూపుతున్నారుట. అబ్బాయిని ఒకసారి చూపించండి" అని సలహా యిచ్చారుట. అప్పుడు కాదనలేక మా నాన్నగారు, మా అన్నగారిని అక్కడికి తీసుకొని వెళ్ళారు. స్వామి ఆశ్రమం గేటులో ప్రవేశిస్తున్న సమయంలో బాబాగారు కారులో బయటకు వెళ్ళుతున్నారుట. వారు కారులోనుంచి మా నాన్నగారిని చూచి "అబ్బాయిని పుట్టపర్తి తీసుకురాండి" అని చెప్పి వెళ్ళిపోయారుట... నాన్నగారు చేసేది లేక బంగళాకు తిరిగి వచ్చారు.

నాన్నగారు గాయత్రి ఉపాసకులు, సహజకవి. మొదటి చూపులోనే బాబాగారి శక్తిని గ్రహించగలిగారు. ఆపరేషన్ చేయించకుండా, మా అన్నగారిని తీసుకొని మా నాన్నగారు పుట్టపర్తి వెళ్ళారు. ఆ రోజులలో పుట్టపర్తి ప్రయాణం అంటే చాలా ప్రయాసతో కూడినటువంటిది. అట్లాగే పర్తిచేరారు. స్వామి ఆ రోజులలో పాత మందిరంలో ఉండేవారు. జనం తక్కువగా ఉండేవారు. ఆ రోజు రాత్రి అక్కడనే బసచేశారు. ఆ రాత్రే స్వామి నాన్నగారివద్దకు వచ్చి, నాన్నగారు పరుచుకున్న ప్రక్కపైన కూర్చొని "అబ్బాయికి తగ్గిపోతుందిలే" అంటూ కరుణా దృష్టిని సారించి, కరము త్రిప్పి విభూతిని సృష్టించి, మా అన్నగారి నొసటన పెట్టి, టాన్సిల్సుతో బాగా వాచివున్న మెడచుట్టూ విభూతిని రాసారుట. అప్పుడు నాన్నగారు "కలదేమో! ఈ ముని కరకంజమందు చింతామణి" యనుచు పద్యాలు చెప్పటం మొదలుపెట్టారుట. చదువు...చదువు... అంటూ పద్యాలు చదివించుకున్నారుట. తెల్లవారే సరికి అన్నయ్య మామూలు మనిషిగా లేచారుట. టాన్సిల్స్ మటుమాయమై పోయినాయి. స్వామి అనుగ్రహమును పొంది ఆనంద పరవశులై కొల్హాపురం చేరుకున్నారు. నాటినుండి పలుసార్లు పర్తిని దర్శించాము. మా కుటుంబ

మంతయూ అనేక దివ్యాను భూతులను పొందాము. ఒక పర్యాయం మా నాన్న' గారి ప్రాణాలను కూడా కాపాడారు స్వామి. టాన్సిల్స్ బాధనుండి విముక్తుడైన మా అన్నగారు ఎవరో కాదు. వారే 'కవికుమార్'. బాబావారి కృపనుపొంది, వారి అనుగ్రహము నకు పాత్రులై, వారి సన్నిధిలోనే, "సనాతన సారధి" పత్రికాసేవలో కాలం గడుపుతున్నారు. స్వామివారితో అదే మా తొలి పరిచయం.

*నవంబర్ - 99*



# ప్రేమ లేకపోతే జీవితమే లేదు

*"మానవత్వానికి నాలుగు స్తంభాలు. అవే సత్య, ధర్మ, శాంతి, అహింసలు. ఈ నాలుగింటిలోనూ 'ప్రేమ' అంతర్వాహినిగా ఉంటుంది. ఈ నాలుగింటి యందు సమానంగా ఉంటుంది. ఈ నాలుగింటిని సమైక్యం చేస్తుంది. ఆ తరువాత పవిత్రం చేస్తుంది. దివ్యత్వాన్ని అభివృద్ధి పరుస్తుంది. ఆలోచనలలో ప్రేమ చేరినప్పుడు అది సత్యమవుతుంది. భావాలలో ప్రేమ చేరినప్పుడు శాంతి ఏర్పడుతుంది. ప్రేమ ఆచరణలో వచ్చినప్పుడు ధర్మమవుతుంది. ప్రేమను సరిగా అర్థం చేసుకుంటే అదే అహింస. అన్నింటియందు ప్రేమ ప్రాణాధారంగా ఉంటుంది. ప్రేమకు సమానమై నటువంటిది ప్రేమ మాత్రమే. ప్రేమ లేకపోతే జీవితమే లేదు."*

- బాబా

# ఇక్కడ చూచిన, అక్కడ చూచిన ఒక్కడే ఉన్నాడు

- కామరాజు అనిల్‌కుమార్, ప్రశాంతినిలయం

ఆ రోజుల్లో నేను బెంగుళూరు బృందావనంలో ఉండేవాడిని. కాలేజీకి చక్కని తోటలు ఉన్నాయి. అది ఆదివారం. స్వామి బృందావనంలోనే విడిది చేశారు. నేను కొత్తగా చేరిన రోజులు. కాలేజి తోటలో, సిటీ నుంచి వచ్చిన కొంతమంది ఆర్మీ (సైనికులు) వారు శ్రద్ధతో పనిచేస్తున్నారు. ప్రతి ఆదివారం వారు వస్తారని వ్యానులోనే కాఫీ, ఫలహారాలు తెచ్చుకుంటారని స్వచ్ఛందంగా, నిస్వార్థంగా ప్రేమతో సాయంకాలం దాకా పనిచేసి వెళ్తారని వాకబు చేయగా తెలిసింది. మంచిదేనను కున్నాను. అందులో గత 25 సంవత్సరముల పాటు ఆంధ్రదేశమంతా సంచరించిన అనుభవం నాకు ఉంది. ఈ ఆర్మీ వాళ్ల సేవాభావం చూసి మురిసిపోయాను. ఇంతలో సందడి ప్రారంభమయింది. తీరా చూస్తే స్వామి కారులో కాలేజికి వస్తున్నారన్నారు. సంతోషం అనుకున్నాను. కారు కాలేజీ పోర్టికో దగ్గర ఆగింది. స్వామి నన్ను రమ్మనమన్నారని ఒక విద్యార్థి చెప్పాడు. పరుగెత్తుకుంటూ వెళ్లేను. స్వామి కారు లోనించి క్రిందికి దిగి నన్ను దగ్గరగా రమ్మని సౌంజ్ఞ చేశారు. అప్పుడు అక్కడ తోటలో పనిచేసేవారిని చూపిస్తూ నన్నడిగేరు. "ఎవరు? ఎక్కడ్నించి వచ్చారు? ఏం చేస్తున్నారు?" నేను "స్వామీ! సిటీ నుంచి వచ్చారు. సేవ చేస్తున్నారు" అన్నాను. ఎవరు Permission ఇచ్చారు" అని అడిగారు. 'నాకు తెలియదు స్వామి' అన్నాను. 'నీవు Principal వి కదా! నీ Permission లేకుండా రావచ్చునా? నీకు తెలియకుంటే సరిపోతుందా?' అన్నారు స్వామి. "స్వామీ! వాళ్లనందరిని ఇప్పుడు వెళ్లి పొమ్మని చెప్తాను. క్షమించండి" అన్నాను నేను ప్రాధేయపడుతూ. "నీవు వారిని రమ్మనలేదు గదా! పొమ్మనే అధికారం ఎక్కడిది? ఊరుకో" అన్నారు స్వామి. కారులో తిరిగి స్వామి త్రయీ బృందావనం మందిరంలోకి వెళ్ళినారు. నాకు కా[illegible] తీరిక చిక్కింది. ఇది మంచి సమయమనుకున్నాను. ఆర్మీ వాళ్ల దగ్గరికెళ్లి వివరాన్నిలంటిని క్షుణ్ణంగా సంపాదించాను. ఈ మాటు "వీరెవరు?" అని స్వామి అడిగితే గడగడ గుక్క తిప్పకోకుండా చెప్పటానికి సిద్ధ పడ్డాను. సాయంకాలమైంది. సుమారు గం॥ 4-00లకు సాయంకాలం అనుకోకుండా, స్వామి కాలేజీకి తిరిగి విచ్చేశారు. నేను రెడీ అయ్యున్నాను కదా! కారులోంచి దిగి గార్డెన్ వైపుగా నడుస్తున్న స్వామిని సమీపించి అక్కడ పనిచేస్తున్న ఆర్మీ వారి గురించి నేను సేకరించిన సమాచారాన్ని విపులంగా చెప్పసాగాను. చక్కగా ఆలకించారు స్వామి. అందంగా హుందాగా ముందుకు సాగుతూ స్వామి ఆర్మీ వాళ్ల నాయకుడు సూద్‌గారిని సమీపించి పలకరించారు. 'ఎప్పుడు వచ్చావు? నీ వేలికి ఉన్న ఉంగరం 15

సంవత్సరముల క్రితం ఢిల్లీలో నీకు నేను ఇచ్చినదే గదా!" అంటూ నావంక చిలిపిగా చూశారు. మళ్లీ సూద్‌గారితో స్వామి అన్నారు. "నీకు ఇద్దరు పిల్లలు కదా! అవును! ఇపుడు అమ్మాయి డాక్టరు చదువుతున్నది గదు! ఏది! నీ ఉంగరం ఇటు ఇవ్వు, మారుస్తాను" అని అంటూ ఆ ఉంగరాన్ని తీసుకొని చక్కని డైమండ్ రింగుగా మార్చి ఆయన వేలికి తగిలించారు. నన్ను నేను నమ్మలేకపోయాను. అంతా తెలిసిన స్వామి నేను ఆర్మీ వాళ్ల గురించి చెప్తున్నప్పుడు ఏమి తెలియనట్లు ఎందుకు వినాలి? ఈ ఆలోచన నాకు వచ్చింది. కాని వెంటనే సమాధానం దొరికింది. స్వామికి అంతా తెలుసు. నిజమే. ఇది నాకు తెలియాలి కదా! నా అనుభవానికి రావాలి కదా! లేకపోతే 15 సంవత్సరముల క్రితం కలసిన వాడిని గుర్తించి పలకరించి ఇప్పడు ఆయన పిల్లలు ఏం చేస్తున్నారో చెప్పే స్వామిని ఏమనుకోవాలి చెప్పండి? కాలేజీలో నేను అన్నీ చూచుకోవాలి అని కర్తవ్యం చెప్పినట్లు అయింది. స్వామి సర్వజ్ఞత్వము నా అనుభవంలోకి వచ్చినట్లయింది. ఈ ప్రయోజనాలని ఈ లీల నాకు అందించింది.

నేను గుంటూరులోనే పుట్టి పెరిగి దీర్ఘకాలం ఉద్యోగం చేసినవాడిని. ఎండలకు, కారం కారంగా తినే పచ్చళ్లకు అలవాటుపడిన వాడిని. కాని నేను చేరిన బెంగుళూరు చల్లగా, చప్పగా తినే పదార్థాలతో ఉన్న ఊరది. నేను ఉమ్మడి కుటుంబం నుండి వచ్చిన వాడిని. ఎప్పుడు సందడిగా ఉండే వాతావరణం మా గుంటూరు. కాని, నన్ను స్వామి తీసుకొచ్చిన బెంగుళూరు నిశ్శబ్దంగా గంభీరంగా ఉంది. అందులో కాడిగోడిలో కాలేజీ సమీపంగా త్రయీబృందావనం ప్రక్కనే బంగళాలో నివాసం. చుట్టూ చెట్లు, చల్లని ఈదురుగాలి. నా పిల్లలు ఇంకా చదువు కుంటున్నందువల్ల కాపురం గుంటూరులోనే ఉంచి బెంగుళూరులో ఒంటరిగా కొన్ని సంవత్సరాలు గడిపేను. స్వామి బెంగుళూరులో విడిది చేసిన రోజులలో కళ్యాణశోభ చెప్పనలవి కాదు. సిటీలోని కార్లన్నీ అక్కడే ఉన్నాయా అనిపిస్తుంది. ఆటో రిక్షాలన్నీ భక్తులను బృందావనానికి స్వామి దర్శనానికి చేరవేస్తుంటాయి. బృందావనంలో ప్రకృతి నాట్యం చేస్తున్నట్లు అనిపిస్తుంది. పుష్పాలతో నిండిన పూలతోటలు పులకరించి, పరవశించి స్వామి పలకరింపుకు ఎదురుచూస్తున్నట్లు అనిపిస్తుంది. కాని స్వామి బృందావనం నుండి తిరిగి పుట్టపర్తికి ప్రయాణమైన ఒక పదినిమిషాలలో అంతా నిర్మానుష్యంగా, ఎడారిలా నీరసంగా, పేలవంగా, నిరుత్సాహంగా, నిర్వీర్యంగా మారి దీనమైన ఒంటరి తనాన్ని మిగులుస్తుంది. బాబాయే బృందావనానికి శోభ, కళ, అందం, ఆనందం, అందరు కిలకిల నవ్వుతూ కనిపించడానికి కారణం. స్వామి బృందావనం విడిచిన రోజున సాయంకాలం రోడ్డుమీద వీధి దీపాలు కూడా ఉండవు. రెండు పిచ్చికుక్కలు తిరుగుతుండేవి.

స్వామి హీరో. ప్రకృతి జీరో. ఆ హీరో ప్రక్క జీరోకు విలువ. ఒకటి ప్రక్కన సున్న ఉంటే పది, లేకుంటే సున్నాయే కదా! రెండు సంవత్సరాలు క్యాంటీన్‌లో చప్పిడి తిండి తింటూ గడిపేను. ఇక ముమ్ముందు గడపటం కష్టమనిపించింది మా ఆవిడకి. ఒక పుస్తకంలో అన్నం ఎలా వండాలి. కూర ఎలా చెయ్యాలి, ఎప్పుడు పొయ్యి మీద పెట్టాలి, ఎప్పుడు దించాలి. ఏమేమి చెయ్యాలి అన్న విషయాలు స్పష్టంగా రాసి ఆ ప్రకారం నన్ను వంట చేసుకొమ్మని చెప్పి గుంటూరు ప్రయాణ మయింది. ఆ మరునాడు నా తొలి వంట ప్రయత్నం చేశాను. పుస్తకంలో ఆవిడ రాసినవి చదువుకుంటూ కుక్కర్‌లో అన్నీ ఉంచాను. అన్నం పప్పు రెడీ అవుతాయను కుంటున్నాను. కాని అర్ధగంట దాటిన తరువాత "స్టౌ" ఆపివేసిన తరువాత కుక్కర్ మూత రావడం లేదు. నా బల ప్రయోగం పనికి రాలేదు. ఈలోగా దర్శనానికి, కాలేజీకి టైమ్ అయిపోతుంది. ఆ రోజున స్వామి బృందావనంలోనే ఉన్నారు. పరుగెత్తుకుంటూ వెళ్ళి దర్శనం లైనులో కూర్చున్నాను. స్వామి నా దగ్గరకు వచ్చి నిలబడి నవ్వుతూ "ఛీ! ఛీ! ఏం వంట చెయ్యడం? కుక్కర్‌లో నీళ్ళులేవు. బియ్యం ఉడుకుతాయా? ఉప్పులేని పప్పు పనికొస్తుందా? నీకు వంట రాదా? నీవు చేసుకోలేవు. పచ్చళ్ళు తీసుకెళ్ళి క్యాంటీన్‌లో తిను సరిపోతుంది" అన్నారు. నా చుట్టు ప్రక్కల వారు ఘొల్లుమని నవ్వారు. నా బండారం బైటపడింది. అయినా స్వామికి నా ప్రయోగం తెలిసిందే అని ఆనందించాను.

నేను బెంగుళూరు నుండి పుట్టపర్తికి కాలేజి పనిమీద వచ్చాను. వేడి నీళ్ళ స్నానానికి అలవాటు పడ్డాను. అందువల్ల నాతో Immersion Heater కూడా తెచ్చుకున్నాను. పొద్దున్నే లేచి దర్శనానికి సిద్ధమౌతున్నాను. తీరా స్నానం చేద్దా మనుకునే సరికి నీళ్ళు వేడెక్కలేదు. ఏమైందా అనుకున్నాను. కరెంటుపోయింది. ఏం చేసేది? దర్శనానికి ఇంకా పదినిమిషాలే ఉంది. పోనీలే అనుకున్నాను. ఖండ స్నానం చేశాను. (కాళ్ళు, చేతులు, ముఖం.). డ్రెస్ చేసుకున్నాను. వేగంగా వెళ్ళి దర్శనం లైనులో కూర్చున్నాను. స్వామి యధాప్రకారం ముందుగా స్త్రీల వైపు బయలుదేరి పురుషుల వరుసలలో భక్తుల్ని పలుకరిస్తూ నాముందు నిలబడి పైకి చూస్తూ అన్నారు. "కొందరు పూర్తిగా స్నానం చెయ్యకుండా దర్శనానికి వస్తారు.' ' అమ్మ బాబోయ్ మన గుట్టును స్వామి రట్టు చేస్తున్నారనుకున్నాను. ప్రశార్ధకంగా ముఖం పెట్టాను. స్వామి నా వంక సూటిగా చూస్తూ అన్నారు. "పుట్టపర్తిలో వేడినీళ్ళు కావాలా? చన్నీళ్ళు చాలదా?" చాలా సిగ్గేసింది. స్వామి అన్నందుకు కాదు నా పక్కన కూర్చున్న పిల్లలు, టీచర్లు వింటున్నారని బాధ. విదేశీయులని కొందరిని ఇంటర్వ్యూకి పిలిచారు, నేను వెంటనే రూముకొచ్చేసరికి కరెంటు వచ్చింది. హీటరు పెట్టి బక్కెటు నీళ్ళు మరగగాచాను. సబ్బు అరిగేలా రుద్దాను, శుభ్రంగా

స్నానం చేసాను. డ్రెస్సు మార్చి భజనకు వెళ్లి కూర్చున్నాను. అసాధారణంగా భజన మధ్యలో బాబా నాదగ్గరకి వచ్చి అన్నారు. "మాములుగా స్నానం చేస్తే చాలు సర్. సబ్బు అరగదియ్యక్కర్లేదు. బాబా స్నానం గురించి అడుగుతున్నారేంటి అనుకుంటున్నావా? Where Am I. నేను అంతటా ఉన్నాను. తెలుసుకో. ఖంగారు పడకు. ఇక అడగను లే!" అన్నీ కనబడే స్వామికి తెలియకుండా ఏది దాచగలం? అన్నీ తెలిసిన స్వామికి గోప్యంగా ఏది ఉంచగలం? ఈ దేవుడుతో బ్రతుకు కష్టమే అనిపించింది.

ఒకసారి బెంగుళూరు నించి పిల్లలు టీచర్లతో పరీక్షలయ్యాక దసరాలకి పుట్టపర్తి చేరుకున్నాం. నాకు ప్రత్యేకంగా ఆనందంగా ఉంది. నా పుట్టిన రోజు 25 అక్టోబరుకు స్వామి దగ్గర ఉండటం జరుగుతోంది కదా అని! గుంటూరు నించి భక్తులెవరో వస్తుంటే వారితో నాకు ఒక టిఫిన్‌బాక్స్ బొబ్బట్లు పంపించింది మా ఆవిడ. అవంటే నాకు చాలా చాలా ఇష్టం. నా రూంలో ఎప్పుడూ జనమే! ఇటలీ, ఫ్రాన్స్, టర్కీ, యు.ఎస్.ఎ. అంటూ గ్రూపులుగాను, మన ఆంధ్రానించి పరిచయమున్న వారు ఎప్పుడూ వస్తుండేవారు. "స్వామి విశేషాలు చెప్పండి. లీలలు చెప్పండి సర్! అనుభవాలు చెప్పండి" అంటూ వచ్చేవారు. నాకేమో పెద్ద వీక్‌నెస్! స్వామి గురించి చెప్తుంటే విసుగు విరామం ఉండదు. కాలం తెలియదు. అదొక తెలియని ఉత్సాహం, ఆనందం, ఆవేశం, సంతృప్తి నాకు కలిగేవి. మరి బొబ్బట్లు తినేదెప్పుడు? నాకు ఛస్తే ఎవరికి ముక్క కూడా పెట్టడం ఇష్టం లేదు. సరే! ముహూర్తం నిశ్చయించాను. అక్టోబరు 25, పుట్టినరోజున ఉదయం 6-30 అందరు దర్శనానికి వెళ్తారు, నాకోసం వచ్చేవారుండరు. అయినా ఎందుకైనా మంచిదని దీపం ఆర్పి ముందు జాగ్రత్తగా లోపల బోల్టు వేసి మెల్లిగా బొబ్బట్ల బాక్సు మూత తీసాను. లోపల, నేతి వాసనతో ఘుమఘుమలాడే బొబ్బట్లని వరుసగా ఆనందంగా తినేసాను. శుభ్రంగా కడుక్కుని మూడో కంటికి తెలియకూడదని నోటిలో లవంగాలు నములుతూ వడివడిగా దర్శనానికి కూర్చున్నాను. మామూలుగా దర్శనం ఇచ్చే రూటు మార్చి స్వామి నేరుగా వరండాలోకి వచ్చేసి నడుచుకుంటూ నా వైపు వస్తూ నవ్వుతూ అన్నారు. "అయిందా? అన్నీ నువ్వే తిన్నావా? పొట్టలో చేరాయికదా! Safe ఇంక భయంలేదు. కాస్త ఇతరులకు కూడా పెడితే ఏం పోయింది? ఈ రోజు Birthday నీది కదా, పాద నమస్కారం చేసుకో!" అన్నారు. బ్రహ్మానంద భరితుడనయ్యాను.

ఒక రోజున బెంగుళూరు కాలేజి ఆడిటోరియంకి వచ్చారు స్వామి. నన్ను పిలిచి. 'అన్ని సీట్లు సరిగా ఉన్నాయో లేదో చూసుకో! స్క్రూలు, బోల్ట్‌లు టైట్‌గా బిగించాలి. Summer Courses వస్తున్నాయి. ఆడిటోరియం ఇవతల ప్రక్కషీట్స్ వేయిస్తున్నాము. గెస్ట్ కూర్చోవడానికి వీలుగా ఉంటుంది. జాగ్రత్తగా చూసుకో!"

అన్నారు. సాయంత్రం దాకా ఉండి అన్ని కుర్చీలు చెక్‌చేసి బాగున్నాయని నిర్ధారించుకున్నాను. ప్రక్కన షీట్స్ వేయడం దాదాపు పూర్తయింది. ఒకటో రెండో వెయ్యాల్సి ఉంది. భజనకు మామూలు ప్రకారం వెళ్లేను. స్వామి నన్ను పిలిచి అడిగారు 'షీట్స్ వెయ్యడం పూర్తయిందా? ఆడిటోరియంలో ఛైర్స్ బాగున్నాయి కదా!' అన్నారు. నేను "స్వామీ! షీట్స్ వేయటం పూర్తయింది. అన్నాను అయితే కాలేజికి పోదాంపద' ' అన్నారు. నేరుగా ఆడిటోరియంలో కొచ్చేసారు. స్వామి. దాదాపు 1000 కుర్చీలు ఉన్నాయి. చేతితో చూపిస్తూ దూరంగా నలభై వరసో, యాభయ్యో వరసో మూలగా ఉన్న కుర్చీ చూపిస్తూ 'దాన్ని చెక్ చెయ్యి' అన్నారు. తీరా నేను అక్కడకు వెళ్లి చూసేసరికి ఆ కుర్చీ సీట్ చాలా లూజ్‌గా ఉంది. బోల్ట్ పూర్తిగా ఊడిపోయాయి. "సరిగ్గా ఉన్నాయన్నావే? ఏది?" అన్నారు. నేను చూసినప్పుడు బాగానే ఉన్నాయి. నన్ను ఏడిపించడానికి ఆమూల ఆ ఒక్క కుర్చీని స్వామి లూజ్ చేసారేమో అని మనసులో అనుకున్నాను. బైటికి వచ్చి షీట్స్ ఎలా ఉన్నాయో చూడ్డానికి వచ్చారు స్వామి. నా ఖర్మ కాలి ఇంకా ఒకటి రెండు వెయ్యవలసి ఉంది. నేను పూర్తి చెయ్యక పోతారా అన్నవుద్దేశంలో అన్నాను. స్వామి నన్ను పిలిచి "కంప్లీట్ అయిందన్నావే ఏది? ఇంకా ఆ రెండు వెయ్యాలి కదా! నాకు తెలుసు కాలేదని. నీకు తెలియాలని పిలుచుకొచ్చాను" అన్నారు బాబా. Baba is Perfect. మనం ఏది Perfect కాకుండా ఉండకూడదన్నమాట అని గ్రహించాను.

బెంగుళూరు త్రయీబృందావనంలో రోజూ స్వామి నన్ను మాట్లాడమనేవారు. వారి ఉపన్యాసాలని అనువదించమనేవారు. అనేకానేక అవకాశాలు వచ్చాయి. నాకు వారి లీలలు చెప్పడం అదో సరదా! ఎప్పటికప్పుడు విన్నవి విన్నట్లు చెప్తుండే వాడిని. అందరు ఆనందించేవారు. స్వామి లీలలు ఎవరిని ఆనందపరచవు చెప్పండి? ఒక భక్తుడు, నాకు బాగా తెలిసిన ఆయన తన అనుభవాలని నాకు సుదీర్ఘమైన లేఖలో రాసారు. నేను కోటు జేబులో పెట్టుకున్నాను. యధాప్రకారం స్వామి సన్నిధిలో మాట్లాడుతున్నాను. స్వామి నావంక చూస్తూ "కోటు జేబులో ఏదో తెచ్చావుగా! ఆ విషయాలు కూడా చెప్పు" అన్నారు. సాయి రమేష్ మంటపంలో మా వూరి వాళ్లని కలిసి కాని తెలిసిన, వాళ్లని మందిరంలోకి వస్తే స్వామి నేను కలిసిన వాళ్ల పేర్లతో సహా చెప్పి "మాట్టాడి వస్తున్నావా?" అనేవారు. తుంకూరులో (Karnataka) Granite Factory సందర్శించడానికి బాబా వెళ్లారు. నన్ను కూడా వెంట రమ్మన్నారు. అక్కడికి చేరేటప్పటికి ఉ॥ గం॥ 10-00 లు అయింది. ఎత్తైన వేదిక పైన ప్రఖ్యాత హిందూస్తానీ గాయకుడు అనూప్ జలోటా భక్తి గీతాలు ఆలాపిస్తున్నాడు. వేదిక చాలా సుందరంగా ఉంది. పైన షామియానా, స్టేజి పైన నెమళ్ల రూపంలో పుష్పాలంకరణ. ఢిల్లీ నించి వాణిజ్య ప్రముఖులు కొందరు విదేశీయులు

ఉన్నారు. స్వామి సందేశమిచ్చారు. నాకు అనువదించే అవకాశము వచ్చింది. ఆ తరువాత విదేశీయులతో కూడిన బోర్డ్ ఆఫ్ డైరెక్టర్స్‌తో స్వామి వారికి భోజనాలు ఏర్పాటు చేసారు. చాలా చాలా ఆశ్చర్యకరమైన సన్నివేశమది. ఏ దేశం వారితో ఆ భాషలో మాట్లాడారు స్వామి. నేను లోపలికి వెళ్ళాలో లేదో తెలియక బయట చాటుగా నుంచున్నాను. అవసరమైతే వెంటనే వాలే దూరంలో ఉన్నాను. ఇన్ని భాషలలో మాట్లాడే స్వామిని చూసాను. తెలుగు తల్లి నోముల పంట ఆంధ్రభాష అదృష్టం, దేశభాషలందు తెలుగు లెస్స అన్న రాయల సూక్తికి నిదర్శనం, తేట తీపి తెలుగు భాగ్యం స్వామి తెలుగులో ప్రసంగించేట్లు చేస్తున్నదేమో అని అనిపించింది. వారికి రాని భాష లేదు. అలవోకగా దేశవిదేశభాషలన్నీ స్వామికి వచ్చినవే! ఒక్కొక్క దేశం వారు గ్రూప్స్‌లో వస్తుంటారు. ఇంటర్వ్యూకి స్వామి వారిని పిలుస్తారు. ఎక్కడ ఎప్పుడు అనువాదకులుండరు. సర్వజ్ఞులైన స్వామికి ఏది కొత్త? భోజనాలకు కూర్చున్నారు అందరూ. రౌండ్ టేబిల్స్, వాటి చుట్టూ కుర్చీలు వేసి వున్నాయి. అవి Guests Number కి సరిపడగ ఉన్నాయి నాకు ఖాళీ లేదు. బాగుండదని బైటికి వచ్చేసాను ఎవరికి చెప్పకుండా ఇంక తిరుగు ప్రయాణమయ్యాం. బెంగుళూరులో ఒక భక్తునింటికి వెళ్ళేరు స్వామి. అక్కడ కాఫీ, టిఫిన్ ఏర్పాటు చేసారు. పెద్ద రౌండ్ టేబుల్ చుట్టూ కుర్చీలు వేసి ఉన్నాయి. అందరం డైనింగ్ హాల్‌కి వెళ్ళాము. స్వామి పెద్దగా అన్నారు. "అనిల్ కుమార్ భోజనం చెయ్యలేదు పాపం! అన్ని ఐటమ్స్ డబుల్ డబుల్ వడ్డించండి" అన్నారు. అది ఆ దయానిధి మాతృహృదయం.

అది కొడైకెనాల్. రోజు పిల్లలతో ఉదయం ఒక గంట 'సాయిశృతి' ముందు ఉన్న 6 కిలో మీటర్ల విస్తీర్ణం కల లేక్ చుట్టూ వాక్ కు వెళ్ళేవాళ్ళం. ఒక రోజున వాకింగ్ అయిన వెంటనే పిల్లలు 'సాయిశృతి' మందిరానికి వచ్చి స్వామి ముందు కూర్చున్నారు. నేను చేరడానికి ఆలశ్యమైంది. కొంత స్వంతపనులుచూసుకుని వచ్చాను. నేను వచ్చేటప్పటికి పెద్దగా నవ్వులు వినపడుతున్నాయి. నా గురించే అనుకున్నాను. లోపలికి వెళ్ళగానే స్వామి ఎందుకు ఆలస్యమైంది" అన్నారు. నేను సమాధానం చెప్పలేదు. మళ్ళీ అడిగారు. "స్వామీ! పోస్ట్ ఆఫీసుకు వెళ్లాను అని చెప్పాను. స్వామి పిల్లల వంక తిరిగి "నేను చెప్పాను కదా! పోస్ట్ ఆఫీసుకు వెళ్ళాడని' అన్నారు. అందరు బిగ్గరగా నవ్వారు. స్వామి నేను ఎక్కడికి వెళ్ళానో, ఏం చేశానో క్రికెట్ కామెంటరీలాగా వాళ్ళకి పూస గుచ్చినట్లు చెప్పారు నేను రాకముందే. అందుకనే అందరు నవ్వారు. "పోస్ట్ ఆఫీసులో ఏం చేశావు" అన్నారు స్వామి. లెటర్ వ్రాశాను అన్నాను. "ఎవరికి రాశావు" అన్నారు. "నా భార్యకి వ్రాశాను" అన్నాను. "చూశారా! భార్యకి లెటర్ వ్రాస్తూ పోస్ట్ ఆఫీసులో కూర్చున్నాడని చెప్పానా లేదా?" అన్నారు స్వామి. ఇక చూడండి అందరూ ఒకటే నవ్వులు. మన స్టూడెంట్స్

లో ఒకరికి ఇచ్చి పోస్ట్ చెయ్యమనవచ్చును గదా! మా స్టూడెంట్స్ మీ ఊళ్ళలోని పిల్లలలాగే కవర్ చించి చదువుతారనుకున్నావా? మా పిల్లలు అలాంటివారు కాదు' అన్నారు.

ఒకసారి కొడైకెనాల్‌లో స్వామి సేవాదళ్ వారికి పని ఇచ్చారు. నేను కూడా పాల్గొన్నాను. స్వామి అక్కడికి వచ్చి చూస్తారని అనుకోడంచేత నేను కూడ చేరాను. పెద్దగా నేను పనిచేసింది లేదు. స్వామి ఎప్పుడు వస్తారా నన్ను చూస్తారా అన్నదే తపన. ఇంకేం. శుభఘడియలు రానే వచ్చాయి. అంతా చూచుకుంటూ స్వామి రానే వచ్చారు. నన్ను చూస్తూ అన్నారు. అంతా Stunt. పనిచేస్తున్నట్లు బానే నటిస్తున్నావు!" మన నటన వారికి తెలియనిదేముంది గనుక. సేవాదళ్ కన్వీనర్ అక్కడ పని చేసినవారికి ఐస్‌క్రీములు పంచారు. నా వంతు నాకు దక్కింది. ఆ తరువాత మందిరంలోకి వెళ్ళాను. స్వామి పిల్లలకు ఐస్‌క్రీమ్స్ పంచుతున్నారు. నేను చేయి చాచాను. స్వామి నన్ను చూసి అన్నారు. "ఏయ్! బయట నీవు తిన్నావు." "స్వామి నేను లేదు అనలేదు కదా!" అన్నాను. "మరి మళ్ళీ ఎందుకు అడుగుతున్నావు?" అని అడిగారు. "స్వామీ! బయట ఐస్‌క్రీమ్స్ సేవాదళ్ వాళ్ళు ఇచ్చారు. ఇక్కడ మీరు ఇస్తున్నారు. అందుకని చేయి చాచాను" అన్నాను. "ఏమి! అంత రుచిగా ఉందా?" అంటే 'భలే బావుంది స్వామీ" అని జవాబిచ్చాను. "అలాగా అయితే రెండు తిను" అంటు రెండు కప్స్ ఇచ్చారు. ఒకరోజున ఉదయం కొడైకెనాల్‌లో నా ప్రక్కనే ఒక భక్తుడు కూర్చొని ఉన్నాడు. Breakfast సమయమది. ఇడ్లీ, వడ, పూరి వడ్డించారు. స్వామి మెల్లగా నడుచుకుంటూ వచ్చి "ఏమి వడ్డించారు?" అని అంటూ ప్లేట్‌లో వడ్డించిన ఐటమ్స్ చూశారు. నా ప్రక్కన కూర్చున్న ఆయన ప్లేట్‌లోంచి ఒక పూరి చేతితో పట్టుకుని మధ్యలోకి విరిచారు. ఆశ్చర్యం అందులో డైమండ్ రింగ్ ఉంది. దానిని ఆయన వేలికి తొడిగారు. ఖచ్చితంగా సైజ్ సరి పోయింది. ఇది నేను గమనించి నా ప్లేట్‌లోని పూరీని మెల్లిగా తినటం ప్రారంభిం చాను. స్వామి అడిగారు 'ఏమి! మెల్లిగా తింటున్నావు?' నేనన్నాను. "ఏమో స్వామి! నా ప్లేట్‌లో పూరీలోకూడా డైమండ్ రింగ్ ఉందేమో తింటే నా గొంతులో ఇరుక్కు పోతుందేమోనని చిన్నగా తింటున్నాను" అందరూ ముక్తకంఠంతో నవ్వారు. "నేను ఎందుకు ఇస్తాను? మీ అత్తగార్ని అడుగు" అన్నారు స్వామి హాస్యంగా! ఆ సంవత్సరం శ్రీరామనవమి కొడైకెనాల్‌లో జరిపారు. నేను కొత్తగా కుట్టించుకున్న సూటు వేసుకుని కూర్చున్నాను. 'ఏమి! కొత్తగా ధరించావు?' అన్నారు బాబా. 'పండగ గదా స్వామీ' అన్నాను. 'నేను తమిళ్‌లో ధారాళంగా మాట్లాడగలను. కొడైకెనాల్‌లో చేరిన వారంతా తమిళియన్లు. అందువల్లనే Translation అవసరం ఉండదు." అని అన్నారు స్వామి. క్షణం ఆగి మళ్ళీ "పాపం! కొత్త

సూటు ధరించావు. అందరు చూడాలి కదా! ఈ రోజు Double Translation పెడదాము. నేను తెలుగులో చెప్తే మహదేవన్ తమిళ్‌లో చెప్తాడు. నీవు ఇంగ్లీషులో చెప్పు' అన్నారు. Double Translation రెండు మూడు పర్యాయాలు కొడైకెనాల్‌లో జరిగింది. ఒకసారి Translation లో చేదు అనుభవం ఎదురైంది. అది మొదటి అనుభవం. నాకు పూర్తిగా కొత్త. ఏదో చేతనైనంత తంటాలు పడుతునే ఉన్నాను. అయితే విడ్డూరమేమంటే సామాన్యమైన సాధారణ వాడుకలో ఉన్న పదాలకు కూడా అనువాదంలో మాటలు దొరకలేదు. కృష్ణుని గురించి స్వామి వివరిస్తున్నారు. "ఒకరోజు కృష్ణుడు చెరుకును కత్తితో ముక్కలు చేస్తున్నాడు. ఆ సమయంలో ప్రమాదమున తన వేలుకి కత్తి తగిలినట్లు రక్తము కారినట్లు నటించినాడు. అష్టభార్యలందరు వైద్యునికి, ఔషధాలకై, కట్టుకట్టడానికి వస్త్రాన్ని పట్టుకు రావడానికి వెళ్ళినారు. కాని సమీపమున ఉన్న ద్రౌపది చీర చెంగును చించి కట్టు కట్టింది. దానికి ప్రతిఫలంగా నాడు కురుసభలో పరాభవం జరుగుతున్న సమయంలో అక్షయంగా చీరలనందించినాడు కృష్ణుడు. "అనువదించడం ప్రారంభించాను. "వేలు తెగినట్లు నటించినాడు" అన్న దానికి తెగి Cut అన్న పదం నాకు తట్టలేదు. "చీర చెంగు చించి కట్టుకట్టింది" అన్న మాటలో "కట్టు కట్టింది Bandage అన్నమాట నాబుర్రకు తట్టలేదు. బాబా అందించారు. బ్రతికి బైట పడ్డాను. భోజనాల సమయంలో "ఈ పొద్దు Translation బాగా లేదు" అన్నారు. నేను సిగ్గుతో తలవంచుకున్నాను. స్వామి మళ్ళీ ఇలా అన్నారు. "నీ ఉండేదా గుంటూరులో! ఈ స్వామి ఉండేది కొడైకెనాల్. ఏతీరు Translation చేతువో" బాబోయ్! దేవులపల్లి కృష్ణశాస్త్రి గారు రాసిన సినిమా పాటలాంటిది అది. 'భాగ్యరేఖ' సినిమా అనుకుంటాను. "నీ ఉండేదాకొండపై! నా స్వామి నేను ఉండేదీ నేలపై! ఏ లీలా సేవింతునో స్వామి" అన్న పాట దేవులపల్లి వారిది. 'స్వామి! దేవులపల్లి వారి సినిమా పాట అన్నాను. నాకు అన్ని తెలుసు. రాసేటప్పుడే నాకు తెలుసు' అని నవ్వుతూ అన్నారు. నన్ను నవ్వించినట్లయింది, సర్వజ్ఞత్వము తెలిపినట్లయింది కదా! అదే స్వామి అంటే.

ఆ రోజున మా అమ్మాయి దగ్గర్నించి ఉత్తరం వచ్చింది నాకు. అమెరికాలో స్వామి ఎలా ఆశీర్వదిస్తున్నారో, కాపాడుతున్నారో వివరిస్తూ స్వామి అనుభవాలని నాకు రాసింది. అన్ని పరీక్షలలోను అత్యుత్తమ స్థానంలో స్వామి దయవల్ల కృతకృత్యురాలనవుతున్నట్లు రాసింది. స్వామికి నమస్కారములు తెలుపమని కోరింది. అది చదువుతున్నాను దర్శన సమయంలో. ఈలోగా స్వామి వచ్చారు. నేను వెంటనే ఉత్తరాన్ని జేబులో పెట్టుకున్నాను. బాబా నా దగ్గరకు వచ్చి 'ఏమిటది?' అన్నారు. "ఉత్తరం వచ్చింది స్వామీ" అన్నాను. "నీ కూతురు అమెరికాలో ఉంటూ

సాయి చింత చేస్తూ అన్నింటిలోను ఫస్ట్ వస్తున్నది. నీవు స్వామి దగ్గర ఉంటూ సంసార చింతన చేస్తున్నావు" అన్నారు. నన్ను గట్టిగా మందలించినట్లు భావించాను. ఎక్కడ ఉన్నా సాయిచింత ప్రధానం. చెంత ఉండి సంసార చింతచేస్తే ఏం ప్రయోజనం? ఎంత చక్కని సందేశం. ఒకసారి బెంగుళూరు సిటీకి వెళ్ళి సూటు కుట్టడానికి Cloth Tailor కి ఇచ్చి వచ్చాను. ఒకవేళ సిటీ నించి తిరిగి రావడం ఆలశ్యమైతే నేను కాలేజిలో చాలా పనిమీద ఉన్నానని స్వామి అడిగితే చెప్పమని ముఖ్యులను కోరినాను. ఇంకేం అనుకున్నట్లే జరిగింది. సిటీ నుంచి రావడంలో లేట్ అయింది. కాని బాబా కారణం ఎవరిని అడుగలేదు. ఆలశ్యంగా వచ్చిన నన్ను చూచి బాబా నేను ఏమి చెప్పకుండానే నోరు విప్పక ముందే అన్నారు. "Tailor కు కొలతలు జాగ్రత్తగా ఇచ్చావా? Extra Cloth ని టైలర్ తీసుకుంటాడు. సరిగా ఇచ్చావా? అవును నేను అడిగితే కాలేజిలో బిజీగా వున్నానని వీళ్ళని ఎందుకు చెప్పమన్నావు? నువ్వు సిటీకి వెళ్ళినట్లు నాకు తెలియదా? Where am I? I am Every Where."

ఏవో కొన్ని మచ్చుకి జ్ఞాపకం వచ్చినవి రాశాను. ప్రతి ఒక్కరికి ఎన్నెన్నో అనుభవాలున్నాయి. ఎవరికి పరిమితం కాదు, వారి దయ, కరుణ, ప్రేమ అని నా సంపూర్ణ విశ్వాసం. నా అర్హత, యోగ్యత, ఆధిక్యత, ప్రత్యేకత అని కలలో కూడా అనుకోను. వారి కృపకు తార్కాణమే కాని నా విశిష్ఠత కానేకాదు. ప్రపంచమంతటా కోట్ల సంఖ్యలో బాబా భక్తులున్నారు. దేశ దేశాల్లో ఉన్నారు. సముద్రం Ink గా మార్చి వృక్షాలను పెన్నుగా చేసి భూమిని Paper గా చేసి రాసినా సరిపోదు సాయి వైభవం పూర్తిగారాయటానికి. మనమెంత? దేశాధినేతలు, పండితులు, శాస్త్రజ్ఞులు, పారిశ్రామిక వేత్తలు, వైద్యులు, వివిధ సంప్రదాయాలవారు, భిన్న మతస్థులు, ప్రపంచం నలుమూలల నుంచి వచ్చి వారికి పాదాక్రాంతులవుతున్నారు. మనమెంత After All. వారి పాదరేణువుగా ఉంటే అదే పదివేలు.

నవంబర్ - 1999



# సర్వాంతర్యామి శ్రీ సత్యసాయిరామ్

- వేణుగోపాలస్వామి, శ్రీకాకుళం

నేను, నాభార్య, ఆమె అన్నగారు కలిసి, జమ్ము-కాశ్మీరు రాష్ట్రములో "సాంబా' పట్టణమునకు వెళ్ళితిమి. అచట మా పెద్ద కుమార్తె కుటుంబము యున్నది. మా అల్లుడు మిలటరీ సర్వీసు. వారంతా సాయి భక్తులు. వారలతో సుమారు ముప్పది దినములు కలిసియున్నాము.

మా తిరుగు ప్రయాణము ది. 6-6-1997న నిర్ణయించినాము. మేము ముగ్గురము "జమ్ముతావి-మద్రాసు" ఎక్స్‌ప్రెస్ రైలులో ప్రయాణించుచున్నాము. ది. 7-6-97 రాత్రి గం॥ 8-15 ని॥లకు మా రైలుబండి "ఆగ్రా" రైల్వేస్టేషను విడుచు సమయము నేను ప్లాటుఫారము మీదనే యున్నాను. నన్ను ఉద్దేశిస్తూ "అచ్చ తెలుగుభాషలో" సిగ్నల్ యిచ్చారు. కంపార్టుమెంటుకు పో అంటూ రైల్వే ఉద్యోగి వేషములో యున్న వ్యక్తి నన్ను హెచ్చరించారు. నేను సంభ్రామాశ్చర్యములలో మునిగియున్నాను. నన్నే మరల ఆ వ్యక్తి సంజ్ఞ చేస్తూ, సిగ్నల్ (గ్రీన్) చూపిస్తూ హెచ్చరించారు. వెంటనే నేను దగ్గరలో ఉన్న కంపార్టుమెంటుకు ఎక్కితిని. మరల రైలుబండి ఆగినది. నా కంపార్టుమెంటుకు పోవలెనని, ప్లాటుఫారం మీదకు దిగి నడుస్తున్నాను. ఇంతలో రైలుబండి కదిలింది. వేగముగా పోవుచున్నది. నేను ప్లాటుఫారం మీద పరుగెత్తుచున్నాను. నా కంపార్టుమెంటు దగ్గరకు చేరాను. ఎక్కలేకపోతిని.

నేను ఎచ్చట యున్నానో నాకు తెలియదు. ఐదుసెకండ్ల కాలములో "నేను ప్లాటుఫారంకు-రైలు పట్టాల్కు మధ్య ఉన్న ఖాళీస్థలము మధ్యన ఎడమచేతిని తలక్రింద ఉంచుకుని, గోళగా పడుకొని ఉన్నాను." ఇదే స్వామి లీల. భగవాన్ శ్రీశ్రీశ్రీ సత్యసాయిరామ్ నన్ను ఆ విధముగా అమర్చి నా ప్రాణమును కాపాడారు. నన్ను మాయకప్పబడి ఉన్నది. ప్రక్కకు తిరిగితిని. కదులుచున్న రైలుబండి యొక్క ఇనుపరేకు నామీద గీత గీచినది. నాకు ప్రాణము పోయినంత పనిజరిగింది. "భగవాన్, సాయిరామ్" అంటూ ఆర్తనాదము చేసితిని. తక్షణమే నన్ను తన చేతులతో అదిమి పట్టియుంచి "కదలకు-కదిలితే-చనిపోతావు" అంటూ హెచ్చరించారు. రైలుబండి కొంతదూరములో ఆగినది. కొందరు మనుష్యులు నన్ను వెతుకుతూ వస్తున్నారు. భగవాన్ నాలో శక్తిని కలుగజేశారు. ప్లాటుఫారం మీదకు వచ్చినవారిలో ఒకరు నా దగ్గరకు దూకి, నన్ను అమాంతముగా ప్లాటుఫారము మీదకు చేర్చిరి. కంపార్టుమెంటులో కూర్చుండబెట్టి, నాకు

ఉపచారములు చేసిరి. ఝాన్సీ రైల్వేస్టేషను వచ్చిన తరువాత, నా భార్య ఆమె అన్నయ్య ప్రయాణించుచున్న, కంపార్టుమెంటుకు చేర్చిరి. నేను తిరిగి వెనుకకు, నాతో వచ్చిన వ్యక్తిని గూర్చి చూడగా ఎవ్వరూ కన్పించలేదు. ఈ సంఘటన ద్వారా స్వామి, తాను పుట్టపర్తిలో మాత్రమే ఉంటున్నట్లు కాదని, సర్వాంతర్యామినని, ఎప్పడు, ఎక్కడ భక్తుడు బాధపడుతుంటాడో అక్కడ అనేక రూపాలతో సాక్షాత్కరించి, ప్రేమ వర్షాన్ని కురిపించి, భక్తుల బాధలు తీర్చుతానని, భక్తుల వెంట, జంట, అండగా ఉంటారని తెలుస్తుంది. స్వామి లీలలు అనంతములు. అత్యద్భుతములు.

*నవంబర్ - 99*



# తప్పులు వెదక వద్దు

*"నీలో లేని తప్పులకు ఎవరేమన్ననూ బాధపడకుము. నీలో ఉన్న తప్పులకు, ఇతరులతో అనిపించు కొనకమునుపే, వానిని సరిచేసికొనుటలో నీలో నీవు ప్రయత్నించు. నీ తప్పులు, నీకు తెలుపు వారిపై నీవు కోపముగాని, ద్వేషము గాని పూనక - 'నా తప్పులు తెలిపిరే' అని తెలిపిన వారిలో వున్న తప్పులను వెదకక, తెలిపిన వారికి కృతజ్ఞత చూపు. అట్లుగాక, వారి తప్పులను వెదికి తెలుపుటలో, మరింత నీదే తప్పగును. నీ తప్పను, నీవు తెలిసికొనుటలో మంచియున్నదిగాని, నీ తప్ప చెప్పినవారి తప్పలు వెదకటంలో ఏ మంచీలేదు. దాని వలన ఏ ఫలమూ ఉండదు.*

- బాబా

# శ్రీ సత్యసాయి రత్నాభరణ సృష్టి రహస్యం

- ఘండికోట వెంకటసుబ్బారావు, పుట్టపర్తి

భగవాన్ శ్రీ సత్యసాయీశ్వరుని మహిమలు దివ్యత్వానికి సంబంధించినవని చెప్పడానికి వారు సృష్టిస్తూ ఉన్న మణిమయ ఆభరణాలు మరియొక నిదర్శనం. ప్రాకృతిక ద్రవ్యోత్పత్తిశక్తి అలౌకిక ఆధ్యాత్మిక శక్తియొక్క వశంలో ఉంటుందని చెప్పడానికి ఈ అత్యద్భుత ఆభరణ సృష్టి తార్కాణము కూడా! ఋగ్వేదంలోని మొట్టమొదటి ఋక్కు పరమాత్మని ఈ విధంగా స్తుతి చేసింది :

*శ్రు ఓం అగ్నిమీళే పురోహితం*
*యజ్ఞస్య దేవం ఋత్విజం*
*హోతారం రత్న ధాతమమ్॥*

'అగ్ని' అనేపదం 'అగ్రి'లో నుంచి వచ్చింది. 'అగ్రి' అంటే అన్నింటికి ముందు ఉండే దైవానికి చిహ్నంగా ఉపయోగించబడినది. ఆ దైవం ముందుండి జీవితయజ్ఞాది కార్యాలను నడిపించే పురోహితుడు, హితకరుడు, శుభంకరుడు అతడు 'రత్నధాతమమ్' కూడాను. అంటే రత్నాది ఐశ్వర్యప్రదాత అని అర్థం. సంస్కృతంలో 'రత్నం' అంటే పూర్ణరతి ఆనందం అని అర్థం చెప్పవచ్చును.

ఆధ్యాత్మిక దృష్ట్యా 'రత్నం' అంటే స్వప్రకాశంతో వెలుగొందు సృష్టాత్మక పుంజీభూత పూర్ణప్రజ్ఞకు చిహ్నం. 'ధాతమమ్' అంటే అట్టి స్వయంప్రకాశాన్ని చుట్టూ వెదజల్లే దివ్యకాంతి కిరణాలతో ముంచి ఆనందాన్ని అనుగ్రహించే స్వరూపమే ఆ ఈశ్వరుడు. అదియే ఉనికి యొక్క ఎరుకతో మనం పొందే ఆత్మానందం, పరమానందం, బ్రహ్మానందమున్నూ! ప్రకాశించు ఆత్మచైతన్యాన్ని రత్నంతో పోల్చవచ్చును. రత్నాన్ని రాతిగా చూడద్దు, ఆ రాతిలో కూడ విలువైన దివ్యత్వాన్ని చూడండి' అని బాబా నొక్కి చెప్తూయుంటారు.

భారతీయ సాంప్రదాయంలో విగ్రహారాధన ప్రాముఖ్యతను సంతరించుకొన్నది. ఒక శివలింగానికి తప్ప, మిగతా దేవుళ్ళ విగ్రహాలు రత్న ఖచిత ఆభరణాలతో నిండియుంటాయి. దివ్యత్వానికి ఐశ్వర్యం, సౌందర్యం చిహ్నాలు కదా! పరమశివుడు ఐశ్వర్యవంతుడు కాబట్టి, ఈశ్వరుడని అంటారు. నిరాకారుడు, లింగాకారంతో ఒకరకమైన సాకారుడు అయినా, శివలింగానికి ఆభరణాలు తగిలించడం ఆచారం కాదు. ఈశ్వరుడు (శివుడు) శివశక్తి, అంటే ప్రకృతిలో కలిసియుంటాడు. కాబట్టి సతతం ఐశ్వర్యానికి, సౌందర్యానికి, విభూతి శక్తులకు అతడు మూలాధారం - ఆశ్రయుడు-మూలరాశి-మూలస్థానం. అందుచే అతనికి వేరే ఆభరణాలులేవు.

ఉపచారములు చేసిరి. ఝాన్సీ రైల్వేస్టేషను వచ్చిన తరువాత, నా భార్య ఆమె అన్నయ్య ప్రయాణించుచున్న, కంపార్టుమెంటుకు చేర్చిరి. నేను తిరిగి వెనుకకు, నాతో వచ్చిన వ్యక్తిని గూర్చి చూడగా ఎవ్వరూ కన్పించలేదు. ఈ సంఘటన ద్వారా స్వామి, తాను పుట్టపర్తిలో మాత్రమే ఉంటున్నట్లు కాదని, సర్వాంతర్యామినని, ఎప్పుడు, ఎక్కడ భక్తుడు బాధపడుతుంటాడో అక్కడ అనేక రూపాలతో సాక్షాత్కరించి, ప్రేమ వర్షాన్ని కురిపించి, భక్తుల బాధలు తీర్చుతానని, భక్తుల వెంట, జంట, అండగా ఉంటారని తెలుస్తుంది. స్వామి లీలలు అనంతములు. అత్యద్భుతములు.

*నవంబర్ - 99*



# తప్పులు వెదక వద్దు

*"నీలో లేని తప్పులకు ఎవరేమన్ననూ బాధపడకుము. నీలో ఉన్న తప్పులకు, ఇతరులతో అనిపించు కొనకమునుపే, వానిని సరిచేసికొనుటలో నీలో నీవు ప్రయత్నించు. నీ తప్పులు, నీకు తెలుపు వారిపై నీవు కోపముగాని, ద్వేషము గాని పూనక - 'నా తప్పులు తెలిపిరే' అని తెలిపిన వారిలో వున్న తప్పులను వెదకక, తెలిపిన వారికి కృతజ్ఞత చూపు. అట్లుగాక, వారి తప్పులను వెదికి తెలుపుటలో, మరింత నీదే తప్పగును. నీ తప్పను, నీవు తెలిసికొనుటలో మంచిగున్నదిగాని, నీ తప్ప చెప్పినవారి తప్పలు వెదకటంలో ఏ మంచీలేదు. దాని వలన ఏ ఫలమూ ఉండదు.*

**- బాబా**

# శ్రీ సత్యసాయిబాబా రత్నాభరణ సృష్టి రహస్యం

- గుండికోట వెంకటసుబ్బారావు, పుట్టపర్తి

భగవాన్ శ్రీ సత్యసాయీశ్వరుని మహిమలు దివ్యత్వానికి సంబంధించినవని చెప్పడానికి వారు సృష్టిస్తూయున్న మణిమయ ఆభరణాలు మరియొక నిదర్శనం. ప్రాకృతిక ద్రవ్యోత్పత్తిశక్తి అలౌకిక ఆధ్యాత్మిక శక్తియొక్క వశంలో ఉంటుందని చెప్పడానికి ఈ అత్యద్భుత ఆభరణ సృష్టి తార్కాణము కూడా! ఋగ్వేదంలోని మొట్టమొదటి ఋక్కు పరమాత్మని ఈ విధంగా స్తుతి చేసింది :

*శ్రు ఓం అగ్నిమీళే పురోహితం*
*యజ్ఞస్య దేవం ఋత్విజం*
*హోతారం రత్న ధాతమమ్॥*

'అగ్ని' అనేపదం 'అగ్రి'లో నుంచి వచ్చింది. 'అగ్రి' అంటే అన్నింటికి ముందు ఉండే దైవానికి చిహ్నంగా ఉపయోగించబడినది. ఆ దైవం ముందుండి జీవితయజ్ఞాది కార్యాలను నడిపించే పురోహితుడు, హితకరుడు, శుభంకరుడు అతడు 'రత్నధాతమమ్' కూడాను. అంటే రత్నాది ఐశ్వర్యప్రదాత అని అర్థం. సంస్కృతంలో 'రత్నం' అంటే పూర్ణరతి ఆనందం అని అర్థం చెప్పవచ్చును.

ఆధ్యాత్మిక దృష్ట్యా 'రత్నం' అంటే స్వప్రకాశంతో వెలుగొందు సృష్టాత్మక పుంజీభూత పూర్ణప్రజ్ఞకు చిహ్నం. 'ధాతమమ్' అంటే అట్టి స్వయంప్రకాశాన్ని చుట్టూ వెదజల్లే దివ్యకాంతి కిరణాలతో ముంచి ఆనందాన్ని అనుగ్రహించే స్వరూపమే ఆ ఈశ్వరుడు. అదియే ఉనికి యొక్క ఎరుకతో మనం పొందే ఆత్మానందం, పరమానందం, బ్రహ్మానందమునూ! ప్రకాశించు ఆత్మచైతన్యాన్ని రత్నంతో పోల్చవచ్చును. రత్నాన్ని రాతిగా చూడద్దు, ఆ రాతిలో కూడ విలువైన దివ్యత్వాన్ని చూడండి' అని బాబా నొక్కి చెప్తూయుంటారు.

భారతీయ సాంప్రదాయంలో విగ్రహారాధన ప్రాముఖ్యతను సంతరించుకొన్నది. ఒక శివలింగానికి తప్ప, మిగతా దేవుళ్ళ విగ్రహాలు రత్న ఖచిత ఆభరణాలతో నిండియుంటాయి. దివ్యత్వానికి ఐశ్వర్యం, సౌందర్యం చిహ్నాలు కదా! పరమశివుడు ఐశ్వర్యవంతుడు కాబట్టి, ఈశ్వరుడని అంటారు. నిరాకారుడు, లింగాకారంతో ఒకరకమైన సాకారుడు అయినా, శివలింగానికి ఆభరణాలు తగిలించడం ఆచారం కాదు. ఈశ్వరుడు (శివుడు) శివశక్తి, అంటే ప్రకృతిలో కలిసియుంటాడు. కాబట్టి సతతం ఐశ్వర్యానికి, సౌందర్యానికి, విభూతి శక్తులకు అతడు మూలాధారం - ఆశ్రయుడు-మూలాంశి-మూలస్థానం. అందుచే అతనికి వేరే ఆభరణాలులేవు.

వాటిని ధరించనవసరం లేకపోయినా, భక్తులనను గ్రహించుటకు శివుడు ఐశ్వర్యాన్ని - రత్నాభరణాదులను ప్రసాదిస్తాడు.

అటులనే, భగవాన్ శ్రీ సత్యసాయిలో శివ, నామ, రూప, గుణ, విభూతి, లింగ, క్రియాకలాప సాధర్మ్యాలు. పోలికలున్నవి కాబట్టి, వారిని శివావతారులని వేద, వేదాంగ, వేదార్థవేత్త, కీ.శే. ఘండికోట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు అనేక సార్లు ఉద్ఘాటించేవారు. మన శివసాయి మహాదేవుడు పుట్టపర్తి షట్ చక్రవర్తి, షడైశ్వర్య సంపన్నుడు. తాను రత్నాభరణాదులు ధరించకపోయినా శివునివలె భక్తులకు తాను సృష్టించిన రత్నాభరణాదులను అనుగ్రహిస్తూయుంటారు.

ఈ రీతిగా చూస్తే బాబావారు రత్నధాముడు, రత్నాకరుడు, రత్నకారుడు, రత్నప్రదాత! బాబావారి పుట్టుకయే రత్నాకరవంశంలోకదా! రత్నాకరం అంటే రత్నాలగని, రత్న భాండాగారం. పూర్వాశ్రమాన్నిబట్టి ఆయన సార్థకనామధేయుడని చెప్పవచ్చు. ఎందుకంటే, ఆయన భక్తులకు అమూల్య వజ్రవైఢూర్యాలు, కెంపులు, పచ్చలు, గోమేధికాలు మొదలగు రత్నాలను బహుసుందరంగా అమర్చియున్న బంగారు, వెండి తొడుగులతోసహా ఉంగరాలను, గొలుసులను, కంకణాలను, పతకాలను, మంగళసూత్రాలను, లోలకులను, విగ్రహాలను తృటిలో సృష్టించి ప్రసాదిస్తూ ఉంటారు. ఈ పాటికి ఇవన్నీ లెఖ్ఖకడితే, అవి వేలాది సంఖ్యను మించిగుంటాయి.

మన స్వామి సృష్టించి ఇచ్చే రత్నాభరణాదుల అంతరార్థం ఏడు రకాలుగా వర్ణించ వచ్చును.

1) స్వామి సహజద్రవ్య సృష్టికార్యాలు వారు భక్తులకు ప్రసాదించు Visting Cards లాంటివి. అవి దివ్యత్వ జ్ఞప్తికరాలు.
2) అవి వారి మహిమలకు నిదర్శనాలు
3) అవి వారి అపార, అవ్యాజ, ప్రేమ, ఆప్యాయతలకు, అనుగ్రహానికి చిహ్నాలు.
4) అవి భక్తుల ఆదివ్యాధి నిర్మూలన సాధకాలు.
5) అవి భక్తులతో నేర్పరచుకొన్న సంబంధానికి గుర్తులు.
6) అవి భక్తుల సాధకబాధకాలను ఎప్పటికప్పుడు స్వామికి తెలియపరచే ప్రసారక నిమిత్తాలు.
7) అవి ఆధ్యాత్మిక సత్యాలను వివరించు రూపకీకరణలు.

**రత్నాదుల విశిష్టత :**

ప్రకృతిలో మణులు, రత్నాలు, వజ్రాలు విశిష్టమైన ప్రత్యేకత, అందము, విలువ ఉన్న వస్తువులు. ప్రాచీనతకు, గట్టితనానికి, క్రమపద్ధతిలో ఏర్పాటైన అణుసంఘాత

కాంతికి, అరుదుతనానికి, చిరువెలుగును కూడా ఆకర్షించి, ప్రకాశింపచేయు సామర్థ్యము కల్గినదే వజ్రం. భూగర్భంలో యున్న అత్యుష్ణ అగ్నిలోకాలి కరిగిపోయిన ద్రవ్యం మాలిన్య రహితమై గట్టిపడుచూ, బరువైన భూతలపు ఒత్తిడి వలన పుంజీభూత ఘనీకరణ జరిగి, భూకంపాదుల వలన భూమియొక్క ఉపరితల పొరలలో నుంచి బయటపడునవే ఈ రత్నాది వస్తువులు. వాటి తయారీకి వేలవేలాది సంవత్సరాలు పట్టును. అందుచేత అవి ప్రాచీనతకు, ప్రకాశమాన కాంతితో యుండు చుండుట వలన ఆధునికతకు, చెక్కుచెదరకుండా భవిష్యత్ కాలంలో కూడా ఉండే లక్షణం కల్గియుండుటవలన, అవి చాల విలువై యుండును. మానవుడు అట్టి వస్తువునకు తన శిల్పకళాచాతుర్యంతో దానిని సాపుచేసి, ఇంకో వజ్రంతోనే వజ్రాన్ని రకరకాలుగా తీర్చిదిద్ది, దానికి ఎక్కడ లేని అందాన్ని కలిగించి ఎంతో విలువైనదిగా చేస్తూ ఉంటాడు. ఈ రత్నాలను, వజ్రాలను ఆభరణాలు, గొలుసులు, పతకాలలో పొదిగి వాటికి సౌందర్యాతిశయాన్ని కల్పిస్తారు.

అందుచే ఇవి ప్రకృతి-మానవుడూ- ఇద్దరూ సహకరించి తయారు చేసిన అమూల్యాలు. అంతేకాక అవి సూర్యకాంతి శక్తి ప్రసారసాధనలు, అందుచేతనే మన ప్రాచీన సంప్రదాయంలో మణులకు, మంత్రాలకు, మూలికలకు సమాన ప్రతిపత్తి ఉన్నది. ఈ మకార త్రయాన్ని సరిగ ఉపయోగించు సామర్థ్యం యోగులకు, మహాపురుషులకు ఉంటుందనే ప్రతీతియున్నది.

నవరత్నాలు నవవిధశక్తులను వెదజల్లుతూ, ఆ కాంతులద్వారా కూడా శారీరక, మానసిక రుగ్మతలను నివారించుశక్తిని కల్గించవచ్చును. ఎవరి పరిస్థితిని బట్టి వారికి తగు ఆభరణ సృష్టి చేసి స్వామి ఇస్తారు.

వ్యక్తుల జాతకాలలో నవగ్రహ పరిస్థితులను బట్టి గ్రహబాధలున్నయెడల, వాటిని తట్టుకునేందుకు జప, తపాదులు, మంత్ర తంత్ర, యంత్రాదులతో పాటు రత్నాభరణ ధారణ కూడ ఒక రకమైన పరిహారం. అందుకు తగినట్లు రత్నఖచిత ఉంగరాలు, మాలలు, మణికట్లు మొ॥నవి స్వామి సృష్టించి ప్రసాదిస్తూ యుంటారు.

స్వామి సృష్టించి ఇచ్చిన ఆభరణాలు ఆ వ్యక్తులను అంటిపెట్టుకుయుండేవి కాబట్టి, ఆ వ్యక్తికి అత్యవసర సమయాలలోకాని, భ్రమప్రమాదాది దోషాలు జరుగు పరిస్థితులలోకాని, ఆ విషయం స్వామికి తక్షణం తెలియజేయు వార్తా ప్రసారతంత్రులుగా, వాటి పరిహార వాహినులుగా కూడ స్వామి సృష్టించి ఇచ్చిన ఆభరణాలు ఉపయోగపడునని స్వామి చెప్తూ ఉంటారు.

మా ఘండికోట వంశంలో ఇప్పటికి నాలుగు తరాల వారికి అనేక సందర్భాలలో - ముప్ఫయి అయిదేళ్ళ కాలంలో భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారు

రకరకాల వెండి, బంగారు, విలువైన రాళ్లతో కూడిగున్న ఉంగరాలు, గొలుసులు, వాచీలు, హారాలు, లోలకులు, దండలు మంగళసూత్రాలు సృష్టించి అతి ప్రేమామృతంతో ఆశీస్సులతో మాకు ప్రసాదించారు. వాటి కథాకమామీషు ఈ గ్రంధంలో అక్కడక్కడ పొందుపరచబడినవి.

**ఆభరణాలలో అంతరార్థాలు :**

బాబా సృష్టించి ఇచ్చే వస్తువులు - ఆభరణాలలో అంతరార్థాలు, గుణపాఠాలు ఇమిడియుంటాయి. ఒకసారి ప్రశాంతి నిలయ మందిర వరండాలో బాబా తనకు దగ్గరగా యున్న బాలవిద్యార్థిని ప్రకృతిలో అతి విలువైన పదార్థమేమిటో అని అడిగారు. ఆ విద్యార్థి ఆలోచించి వజ్రము చాల విలువైనదని అన్నాడు. అక్కడ కక్కడే, అందరి సమక్షములోను బాబా తన అరచేతి పట్టేటంతటి ధగధగమెరిసే వజ్రాన్ని సృష్టించి ఇదెక్కడినుంచి వచ్చింది అని ప్రశ్నించి, ఇది ఖాళీ శూన్యంలో నుంచి వచ్చిందని చెప్తూ అందరకూ దానిని చూపించిన తర్వాత 'చూడండి! ఇది శూన్యంలోనుంచి వచ్చి శూన్యంలోనికి వెళ్లిపోతున్నదని చెప్పగానే ఆ వజ్రం అంతర్థాన మైనది. సంకల్ప ప్రభావిత ధార్మిక ప్రకాశశక్తి చుట్టూయున్న సూక్ష్మాణువులలో స్పందనను కల్గించి, వాటిని సంయోగం చేసి, వజ్రవస్తురూపంగా తయారయినది అని చెప్పారు. ప్రకృతిలో ఇట్టి సంయోగ ప్రక్రియ వేలకువేల సంవత్సరాలు పట్టితే, స్వామి సంకల్పమాత్రంతోనే కోణాలుగా కోయబడిన వజ్రం తక్షణం తయారయినది! ఆ సందర్భంలో బాబా అన్నారు. ప్రకృతిలో అతి విలువైన వస్తువులు ప్రాణప్రదాలైన పంచభూతాలనీ, అందుచే భూమిని త్రవ్వితవ్వి పాడుచేయ కూడదనీ, నీటినీ, గాలినీ మలినపరచకూడదనీ, వ్యోమాకాశాన్నీ దుర్వినియోగం చేయకూడదని, సహజ వనరులను జాగ్రత్తగా కాపాడుకోవాలని స్వామి నొక్కివక్కాణించారు.

ఒక అంతరంగిక సమావేశంలో స్వామి ఒక చిరకాల భక్తురాలికి మూడు రంగుల ఆరుమణులు పొదిగియున్న బంగారుపతకంతో కూడియున్న బంగారు గొలుసును సృష్టించి ఇచ్చారు. ఆ తెలుపు, ఎరుపు, నీలపురాళ్ళు ప్రపంచంతో ముడిపడి గున్న సత్త్వ రజ స్తమోగుణాలకు ప్రతీకలనీ, ఆ ఆరుమణులు అరిషడ్వర్గాలైన కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలకు గుర్తులనీ, వాటిని పతకంలో బంధించినట్లు అరికట్టాలని అంతరార్థంగా చెప్పారు.

ఇంకో అంతరంగిక సమావేశంలో 50 సంవత్సరాలుగా వివాహజీవితాన్ని గడిపిన వృద్ధ దంపతులకు మూడుపేటల నల్లపూసల దండతోయున్న మంగళ సూత్రాలను ప్రసాదించారు. అపుడు స్వామి ఈ మూడు పేటలు త్రివర్గాలకు - అంటే ధర్మార్థకామాలకు ప్రతీకలనీ, వైహిక జీవితంలో ఈ మూడు పురుషార్థాలను కలిసి, మెలిసి సఫలీకృతం చేసికోవాలని అంతరార్థంగా చెప్పారు.

మొన్నమొన్నటి వరకు స్వామి ఎన్నో వివాహోత్సవాలను జరిపించారు. వధూవరులకు వారి శుభాశీస్సులతో మంగళమయ మంగళసూత్రాలను సృష్టించి ఇచ్చారు. అటువంటి దృశ్యాలు నేను స్వయంగా లెక్కలేనన్ని సార్లు చూసితిని. మా ఆఖరు ఇద్దరు అబ్బాయిలకు స్వామియే బృందావనంలో జరిపించిన వివాహ మహోత్సవంలో వేలాది భక్తుల సమక్షంలో స్వామి నూతన వధూవరులకు అట్టి మంగళసూత్రాలను సృష్టించి, తరువాతి ఇంటర్వ్యూలో ఆ వివాహబంధం పవిత్రతను స్పష్టీకరించారు.

ఒకసారి యం.బి.ఏ. విద్యార్థుల తరగతిలో బాబా ఆధ్యాత్మిక విద్యయే అన్ని విద్యలకంటే శక్తి వంతమైనదని, సర్వవ్యాప్తదివ్యచైతన్య ప్రభావంతో వస్తు సృష్టిని తృటిలో చేయవచ్చునని చెప్తూ చుట్టూ రంగురంగుల మణులూ మధ్యలో ధగధగా మెరిసే వజ్రాలు పొదిగాన అరచేతంత బంగారు పతకాన్ని సృష్టించి అక్కడున్న పెద్దలకు, పిన్నలకు పరీక్షచేసి చూడమని ఇచ్చారు. నేనది పట్టిపట్టి చూసి నిర్ఘాంత పోతూయుంటే, మనం ఆశ్చర్యపోవలసినది చిత్ర విచిత్ర సృష్టిని చూసి కాదని, ఆ దివ్యసృష్టికర్తను చూసి తన్మయత్వం పొందాలి అని ఒక పాఠం చెప్పారు. ఆ ఆధ్యాత్మిక శక్తితో చేతనరహిత ద్రవ్యసృష్టినేకాక, సచేతన జీవులను కూడా సృష్టించవచ్చునని, కాని అట్లు చేస్తే ఆ జీవుల జీవితాన్ని సరిగ నడిపించవలసిన బాధ్యత కల్గునని చెప్పినపుడు మేమంతా నిశ్చేష్టులమైనాము.

కొడైకెనాల్‌లో ఒకసారి స్వామి హనుమంతుని అపారభక్తికి నిదర్శనంగా సీతమ్మవారు రామపట్టాభిషేక సందర్భంగా తన మెళ్ళో ఉన్న ముత్యాలహారం హనుమంతునికి ఇస్తే, అతడు ఆ ముత్యాలను పళ్లతో కొరికి, చెవి దగ్గర పెట్టుకొని రామనామ ధ్వనికాని, రామచిత్రం కాని వాటిలో లేవని, ఆ హారాన్ని క్రింద పారవేశా డని చెప్పారు. అలా చెప్తూ, ఆ మెరిసే 108 ముత్యాల హారాన్ని స్వామి సృష్టించి చూపించినపుడు మేమందరం స్వామిని మరచి ఆ హారాన్ని చూడటంలో నిమగ్నమైనపుడు, స్వామి అన్నారు: హనుమంతుడు సృష్టికి ప్రలోభపడకుండా సృష్టికర్తపై దృష్టి నిల్పాడని ఇప్పడే నేను చెప్పాను. మీరయితేరః ముత్యాల హారంపైనే దృష్టిని పెట్టుకుంటున్నారు. సృష్టికర్తపై మీ దృష్టిని మరల్చండి" అనే గుణపాఠం చెప్పారు.

ప్రాకృతిక ద్రవ్యసృష్టిశక్తి ఆధ్యాత్మిక శక్తి వశంలో ఉందనడానికి స్వామి సృష్టించి, ప్రసాదించు బంగారు, వెండి, రత్నాభరణాదులు ఒకరకమైన నిదర్శనంగా చెప్పవచ్చును. వారి ప్రజ్ఞాశక్తి, ప్రేమ శక్తి, ప్రాణశక్తుల మేళవింపుతో జరిగే మహత్కార్యాలు ఎన్నో ఉన్నవి కదా!

1996 ఏప్రియల్ నెలాఖరు రోజులలో కొడైకెనాల్‌లో సాయిశ్రుతి అంతర్మండపంలో ఓ పదిమంది పెద్దలు సుమారు 20 విద్యార్థుల మధ్యలో సుఖాసీనులై

భగవాన్ బాబా రామాయణ, భాగవత కథలను వివరిస్తూ యుండేవారు. ఒకొక్క కథోదంతానికి ఒక పెద్ద రత్నఖచిత ఆభరణాన్ని సృష్టించడం, అందరికి స్పష్టంగా చూపించడం - కళ్ళార జరిగినది.

లంకకు వెళ్ళి హనుమంతుడు సీతమ్మ వారికి నమ్మకం కల్గించుటకు శ్రీ రామచంద్రుని పెద్ద వజ్రపు టుంగరాన్ని ఇచ్చి ఉదంతం చెప్పచూ, స్వామి ఆ ఉంగరాన్ని సృష్టించి మాకందరకు చూపించారు. సీతారాముల వివాహ సందర్భంలో జనక మహారాజు రామునికిచ్చిన వజ్రచూడామణిని, సీతమ్మకు బహూకరించిన పెద్ద మాణిక్యాన్ని స్వామి సృష్టించి మాకందరకు చూపించారు. ఆరోజుల్లోనే చేతికి అంతా పట్టే పరిమాణంలో యున్న ధగధగలాడే పెద్ద వజ్రాన్ని స్వామి సృష్టించి చూపించారు.

వజ్రాలతో పొదిగియున్న జంటజూకాలను, వజ్రపు జంట దుద్దులను ఒకటి తరువాత ఒకటిని సృష్టించి, స్వామి ఇద్దరు అక్క చెల్లెళ్ళకు ఇవ్వడం కళ్ళారా చూశాము. బాబావారు కొడైకెనాల్‌లో సృష్టించిన రకరకాల ఆభరణాల జాబితా రెండు పుటలకు మించిపోయినది. ఇవి చూస్తేకాని నమ్మశక్యం కాదు. ఎదురుగుండా ఉన్న చిన్న కొండను బంగారం చేయవచ్చునని, అట్లా చేస్తే వేలాదిజనం కిటకిటలాడి చుట్టూ తొక్కిసలాటలు అగునని, రక్షకభటుల పహారా పెట్టవలసి వస్తుందని, మేమంతా దూరమైపోవలసి వస్తుందని బాబా చెప్పిన మాటలు ఆశ్చర్యచకితులను చేశాయి. "చిత్రంబులు, విచిత్రంబులు సత్యసాయి చారిత్రంబులు" కదా!

శ్రీ ఆదిశంకరాచార్యులవారు సౌందర్యానంద లహరులలో జగజ్జనని వైభవాన్ని మణిమయంగా వర్ణించారు.

*శ్లో॥ సుధాసింధోర్మధ్యే సురవిటపి వాటీ పరివృతే*
*మణిద్వీపే నీపోపవనీవతి చింతామణి గృహే!*
*శివాకారేమంచే పరమశివపర్యంకనిలయే,*
*భజంతి త్వాం ధన్యాః కతిచన చిదానందలహరీం!!*

తా॥ మణిద్వీపంలో కదంబ కల్పవృక్ష వన మధ్యలో, హాయిని కొల్పే పవిత్రమైన దివ్యవాయువు చుట్టూ వీచుచుయున్న చింతామణిమయ ప్రాంగణంలో మంగళకరమైన ఊయలలో పరమశివుని తొడ దిండుగా చేసుకుని యున్న పరమేశ్వరిని ధ్యానిస్తూ చిదానంద తరంగాలలో ఓలలాడు భక్తులు బహుధన్యులు గదా! అటులనే సత్యసాయి అంటే శివశక్తి కాబట్టి ఆ జగన్మాతను మణిమయ ఆభరణాల మధ్య ప్రకాశకాంతులు వెదజల్లుచూ యున్నట్లు మన హృదయకుహరంలో ధ్యానించిన వారికి సకలైశ్వర్యములు కల్గుననుటలో సందేహము లేదు.

తెనుగుసేత : గరిమెళ్ళ కృష్ణమూర్తి.

జూలై - 1999

# శ్రీ సత్యసాయి లింగోద్భవ రహస్యం

- ఘండికోట వెంకట సుబ్బారావు, పుట్టపర్తి

లింగం, అంటే 'లీయతే, గమ్యతే' అనే ధాతుసంపుటి. అన్నీ దేనినుంచి ఉద్భ వించునో, అన్నీ దేనిలో లీనమగునో, ఏది అన్నిటికి గమ్యస్థానమో అట్టి మంగళ స్థానానికి చిహ్నమే శివలింగం. నిత్య, సత్య, బుద్ధ, ముక్తమైన నిరాకార పురుషునికి సాకార ప్రతీకయే లింగం. అండాండ, పిండాండ, బ్రహ్మాండ సృష్టికి లింగం ప్రతీక. 'శివశక్త్యాత్మకం జగత్' పురుష ప్రకృతి సంయోగ ఫలమే లింగరూపసృష్టి', "శివశక్త్యోశ్చ చిహ్నస్య మేళనం లింగముచ్యతే" అన్నది పురాణ వచనం. "బిందుఃశక్తిః, శివోనాదః' ' అంటుంది తంత్రసారం. బిందునాద సంయోగమే కళాత్మకసృష్టి. లింగపురాణం జీవులు, లింగాలు అసంఖ్యాకమని, అవి అనేక రకరకాలని చెప్తుంది. వాటిలో మణిమయ లింగాలు ప్రత్యేకతను సంతరించాయి. వజ్రలింగాలు, మరకత లింగాలు, ముత్యపులింగాలు, నీల లింగాలు, పద్మరాగ లింగాలు, గోమేధిక లింగాలు, వైఢూర్య లింగాలు, సూర్యకాంత లింగాలు విశ్వకర్మచే చేయబడి, దేవతలచే పూజింపబడు చుండునని పురాణాలు ప్రవచించాయి. ఈశ్వరభావనతో పూజిస్తే రత్నలింగాలు యశస్సును, రాతి లింగాలు శక్తులను, ధాతు, లేక లోహలింగాలు సంపదను, దారు (చెక్క)లింగాలు సుఖాలను, పార్థివ (మట్టి) లింగాలు సిద్ధులను ప్రసాదించునని పురాణాలు చెప్పచున్నవి. ఆధ్యాత్మిక అభ్యున్నతికి, సంఘంలో కలహాలు, అశాంతి నివారించుటకు శతరుద్రీయ మంత్రాలతో సహస్ర శివలింగార్చనలు, అభిషేకాలు, పూజలు, హోమాలు ప్రాధాన్యం వహించాయి. బాబావారి దసరా యజ్ఞాలలో ఈ లింగార్చన, హోమ కార్యక్రమాలు ప్రధానంగా ఉంటాయి.

భగవాన్ బాబావారు 1961 మహాశివరాత్రి సందర్భంగా వారి ఉదరంలో తయారయి వారి దివ్యగళం ద్వారా నోటిలో నుంచి ఆత్మలింగం ఉద్భవించింది. ఇదివారి దివ్యాత్మ తత్వానికి ప్రతీక. దివ్యత్వం దృశ్యమానంకాదని, అది అనిర్వ చనీయుం, అగ్రాహ్యం, నిగూఢమని అందుచే దానికి చిహ్నంగా, నిదర్శనగా అందరకు కనిపించే విధంగా ఆత్మతత్వాన్ని ఆత్మలింగ సృష్టిద్వారా వ్యక్తీకరించవలసి వచ్చినదని స్వామి వక్కాణించారు. ఈ విధంగానే 1974 మహాశివరాత్రి పవిత్ర సమయంలో వేదాలు, ఉపనిషత్తులలో చెప్పబడిన 10 అంగుళముల పరిధికల ఆత్మలింగాన్ని సృష్టించి 'అత్యతిష్ఠత్ దశాంగులం' అనే పురుషసూక్త వాక్యాన్ని గుర్తుకు వచ్చునట్లు చేశారు. ఆ సమయంలో ఆ ఆత్మలింగదర్శన భాగ్యము కల్గినవారికి ముందుముందు సంసార చక్రపరిభ్రమణయుండదని ఉద్ఘాటించారు. ఆ ఆత్మలింగంలో జ్యోతి వెలుగుతూ, వివిధ రంగులలో కాంతి కిరణాలు చిమ్ముతూ

కన్పించినది. ఆహా! ఏమి ఆశ్చర్యం! స్వామి సృష్టించిన అనేక రకరకాల లింగాలలో ఈ ఆత్మలింగం అత్యద్భుతమైనది కదా!

లింగోద్భవకరుడైన భగవాన్ శ్రీ సత్యసాయి తన ఉదరంలో నుంచి అనేక రకాల లింగాలను తీయడమేకాక పురాతనంగా లింగప్రతిష్ఠ చేయబడిన గుహ్యంగా ఉంచబడిన సోమనాథ దేవాలయంలోను, బదరీనాథ్ దేవాలయంలోను ఉన్న లింగాలను భూగర్భంలో నుంచి పైకి తీసికొని వచ్చి, వాటిని భక్తులకు దర్శింపచేసి, సృష్టించిన విభూతి, పుష్పాలతో పూజించి, తరువాత వాటిని యథాస్థానానికి పంపడం అత్యాశ్చర్యకర దివ్య అవతార మహిమలు.

బాబావారు ఒక మహాశివరాత్రి సందర్భంగా మహావాక్య చతుష్టయ అర్థాలను లింగాలతో రూపకీకరణ చేస్తూ లింగజ్ఞాన చైతన్య రహస్యాన్ని వెలువరించినారు.

మొదటి మహావాక్యం : **"ప్రజ్ఞానం బ్రహ్మ"**. ఇది ఋగ్వేదంలోని ఐతరేయోప నిషద్వాక్యం. ఇది పరబ్రహ్మకు స్వరూప లక్షణ వాక్యం, పరోక్ష తృతీయా విభక్తి వాక్యం. దాని అర్థం : విశ్వవ్యాప్తిగా ఉన్న, జ్ఞానచైతన్యమైన ఎటుకగా నిల్చి ఉన్న బ్రహ్మ 'పదార్థం'. అదే అండంలోను, పిండంలోను, బ్రహ్మాండంలోను సమానంగా యున్న చైతన్య స్రవంతి. అందమే అంగం. అదే ద్రవ్యజగత్తు. జంగమేనడయాడు జీవం, వాటి సంగమం, కలయికయే దైవం. జీవాత్మ, పరమాత్మల ఆలింగనం అండపిండ బ్రహ్మాండ చైతన్య లింగోద్భవమే అని స్వామి చెప్తూయుంటారు. ఈ బ్రహ్మాండ లింగాకారం 'ప్రజ్ఞానం బ్రహ్మ' అనే మహావాక్యానికి ప్రతీక లేక చిహ్నం అని చెప్పారు. దీనిని వ్యక్తీకరించుటకు భగవాన్ బాబా తన గర్భంలో నుండి బ్రహ్మాండపరలింగాలను సృష్టించేవారు. ఆ లింగంలో గ్రహాధిపతులు వారిగతులు కన్పించునవి. బ్రహ్మాండం అంతా ఒకే చైతన్య దర్శనాత్మకమని, అనేకత్వంలో ఏకచైతన్య దర్శనం చేయాలని, 'తాను' అనే భావన విశాలమగుచూ, 'మేము', 'అతనూ' అన్నీ ఒక్కటే - 'విశ్వం విష్ణుమయం' అనే భావనతో యుండాలని స్వామి చెప్తూయుంటారు. జీవుడు, జగత్తు, దేవుడు ఒకే చైతన్య వ్యాప్తి అని ఉద్ఘాటిస్తూ యుంటారు. ఇది సాలోక్య భావనావాక్యం.

రెండవ మహావాక్యం : **'అయమాత్మా బ్రహ్మ'** అథర్వణ వేదంలోని మాండూక్యో పనిషత్తులోనున్నది. ఇది ప్రత్యక్ష తృతీయా విభక్తిలోనున్నది. ఇది ఆత్మ పదార్థంతో సామీప్యభావన కల్గించేవాక్యం.

విశ్వవ్యాప్తి చైతన్య పరమాత్మ ఇక్కడే ప్రత్యక్షంగా ఉండే జీవాత్మలోనే ఉన్నాడు అనే స్ఫూర్తిని ఈ మహావాక్యం కల్గిస్తుంది. ఇది అట్టి అనుభవానికి దారితీసే అనుభవవాక్యం.

ఈ వాక్యానికి ప్రతీకగా బాబావారు అనేక సదాశివలింగాలను సృష్టిస్తూ యుంటారు. ఆ శివుడే ఈ జీవుడు, ఆ బ్రహ్మయే ఈ ఆత్మ అనే దృఢ చైతన్య భావనకు చిహ్నమే సదాశివలింగం. స్వామి ఇట్టి శివలింగాలను భక్తుల ఆయురారోగ్య, ఐశ్వర్య, యోగ క్షేమాదుల నిమిత్తం వారికి ప్రసాదిస్తూ యుంటారు. అవి జ్ఞాన బోధకాలు కూడా!

మా నాన్నగారికి ఒకసారి సాయీశ్వర లింగచిత్రాన్ని ప్రసాదించి ఇది నా నిజస్వరూపం అని చెప్పారు. ఇంకొకసారి నీలకంఠేశ్వర లింగంఇచ్చి దాన్ని అభిషేకించిన తీర్థాన్ని త్రాగి ఆరోగ్యాన్ని పొందమని స్వామి చెప్పారు. ఇంకొకసారి మా అయిదవ అబ్బాయికి నీలలోహిత లింగం ప్రసాదించి దాని కభిషేకించి జలాన్ని త్రాగుచూయుండమని బోధించారు. ఈ జీవాత్మయే 'జీవో శివస్సనాతనః' అన్నట్లు సదాశివ స్వరూపమని రాత్రి, పగలు, సుఖం, దుఃఖం, అంతా సత్యం శివం, సుందరం, ఆనంద స్వరూపమని, మన హృదయంలో అట్టి సదాశివ చైతన్య స్వరూపాన్ని (లేక) లింగాన్ని ప్రతిష్ఠించి, పూజించాలని స్వామి చెప్తూయుంటారు. అట్టి శివభావంలేకున్న జీవులు జీవచ్ఛవాలే!

ఇక మూడవది **'తత్త్వమసి'**: ఇది సామవేదంలోని ఛాందోగ్యోపనిషద్వాక్యం. ఇది జీవునికి పరమాత్మతో సారూప్య భావన కలిగించు ఉపదేశవాక్యం. ఇది ద్వితీయా విభక్తిలో గురువు శిష్యునికి చెప్పే ప్రబోధవాక్యం. "నీవు ఆ పరమాత్మయే' ' అనే జ్ఞానబోధ చేసే మహావాక్యమిది. జ్ఞానలింగం ఈ మహావాక్యార్థానికి ప్రతిరూపం. శుద్ధ స్ఫటిక జ్ఞాన లింగాలను స్వామి సంకల్పమాత్రంతో సృష్టించి వారి గర్భంలో నుంచి తీస్తూయుండేవారు. ఇంకా, హస్తచాలన మాత్రంతో అనేక స్ఫటికలింగాలను సృష్టించి భక్తులకు ప్రసాదిస్తూ యుంటారు కూడాను. సర్వభూతాంతరాత్మయైన బ్రహ్మపదార్థం మనలోనేయున్నదనే దృఢభావన వలన ప్రాపంచిక ద్వైతభావం అజ్ఞానం. ఈ అద్వైత జ్ఞానాగ్నితో దగ్ధమగును.

ఇక నాల్గవ మహావాక్యం : **'అహం బ్రహ్మా2స్మి'** ఇది యజుర్వేదీయ బృహదారణ్య వాక్యం. 'నేనే ఆ పరం జ్యోతి, పరమాత్మ, పరబ్రహ్మ' అనే ప్రత్యక్ష ఆనందానుభవంతో. ప్రథమ విభక్తిలో - వెలువడిన పారమార్థిక సత్యం. ఈ జీవబ్రహ్మైక్యానుసంధాన మహావాక్యానికి ప్రతీకయే స్వామి సంకల్పసృష్టితో వచ్చే "ఆత్మలింగం" ఇది స్వానుభవ ఆత్మానుసంధానంతో సాయుజ్య భావానికి ప్రతీక, చిహ్నం, గుర్తు, 'ఆత్మప్రథమం, 'తాను' అన్నిటికి ముందు కదా! అన్నిటిని 'నేను' - వ్యక్తిత్వం ఉంది కాబట్టి అదే స్వరం అదే బ్రహ్మ. స్వామి తననుంచి అట్టి ఆత్మబ్రహ్మైక్య బోధక ఆత్మలింగాలను బయల్వెడలినట్లు చేస్తూయుండే వారు. ఇది సాక్షాత్కార తురీయ భావానికి ప్రతీకలు.

ఈ పై నాల్గు వాక్యాలు ఆరోహణ సాధన బోధక సత్యాలు. ఇంకా లింగరహిత ఉపనిషద్వాక్యాలున్నవి. "సర్వం ఖల్విదం బ్రహ్మ", "అవమేవ అహం", అనే వాక్యాలు తురీయాతీత కైవల్య భావానికి ప్రతీకలు. "నేనే నేను" అనేది, సాక్షీ చేతా, కేవలో నిర్గుణః, నిరంజనః, నిరాకారః అనేది లింగరహిత ఆకాశలింగ భావాత్మకాలు. దీనినే చిదంబర రహస్యం అంటారు. ఇది ఏ ఆశ్రయంలేకుండ ఆకాశంలో వ్రేలాడుచున్నట్లు భావన (లింగ) మాత్రం! అని స్వామి ఒకసారి చెప్పారు. నామరూపాలుకల మృణ్మయ పాత్రరూప ప్రపంచంనశిస్తే కేవలం మృత్తే మన్నే అంటే సచ్చిదానంద పరబ్రహ్మమే మిగులును. దానికి ఏ ఆధారం ఉండని కైవల్యం!

భగవాన్ శ్రీ సత్యసాయి సచ్చిదానంద ఆత్మావతారి, బ్రహ్మాండలింగ, సదాశివ లింగ, జ్ఞానలింగ, ఆత్మలింగ దర్శకుడు నిదర్శనం కూడా! స్వామి అన్నారు. బాహ్య దృష్టిలో సత్యసాయి సృష్టించేది ఇంద్రజాలం అనిపించవచ్చు. అది ముమ్మారు కాదు. అంతర్ దృష్టిలో అది అంతా ప్రపంచ నాటక సూత్రధారి యొక్క అద్భుత లీలాకార్యకలాపాలు. ఈ కార్యకలాపాల కథవింటే ప్రాకృతిక, ప్రాపంచిక, లౌకిక కథలను మరచి పోవుట జరుగును. మనను కథరహితం చేయడమే సత్యసాయి కథలోని అంతరార్థం. అంతా వారి కథలోనే అంటే సాయీశ్వర లింగాకారంలోనే ఇమిడియున్నది. ఈ దృష్టిలో అంతా సాయీశ్వరమయమే. అట్టి భావనతో 'సాయి శివో2హం' అనే అద్వైత పంచాక్షరీ మంత్ర సారమే సాయి లింగసృష్టి రహస్యం.

లింగోద్భవకరుడైన శివసాయిని వర్ణించాలంటే ఈ క్రింది పది నమక వాక్యములు జ్ఞాపకమొస్తాయి.

**1) ఊర్ధ్వలింగాయనమః** **2) హిరణ్యలింగాయనః**

**3) దివ్యలింగాయనమః** **4) సువర్ణలింగాయనమః**

**5) భవలింగాయనమః** **6) శర్వలింగాయనమః**

**7) శివలింగాయనమః** **8) జ్వలలింగాయనమః**

**9) ఆత్మలింగాయనమః** **10) పరమలింగాయనమః**

తెనుగుసేత : **గరిమెళ్ళ కృష్ణమూర్తి** *జూన్ - 1999*



# బృందావనంలో సాయి లీలావినోదం

- కొమరగిరి కృష్ణమోహనరావు, బందరు

బృందావనంలో సాయి కృష్ణుని దివ్యలీలలు చూచిన వారికి తెలుస్తుంది. అనుభవించిన వారికి అర్థమవుతుంది. అనుభూతిని పొందినవారు తరిస్తారు. అలనాడు శ్రీరామచంద్రుని దివ్యసన్నిధిలో వుండి వారి దివ్యానుగ్రహానికి పాత్రులైన కపిసేనలో మనం వున్నామో లేదో మనకు తెలియదు. ఆనాటి సాయికృష్ణుని ప్రేమామృతాన్ని పొందిన గోపగోపికలలో మనం ఉన్నామో లేదో మనకు తెలియదు. కాని ఈ సాయీశ్వరునికి సమకాలీనులుగా ఉండే మహద్భాగ్యం మనకు ఈనాడు లభించింది. బృందావనంలో సాయికృష్ణుని దివ్యలీలలు కొన్నింటిని 'శ్రీవాణి' పాఠకులకు అందిస్తున్నాను. చదివి ఆనందించండి! తరించండి!!

**శ్రీవాణికి ఆశీస్సులు**

"శ్రీవాణి నావాణే గదా! దానికి ఎప్పుడూ నా ఆశీస్సులు ఉంటాయి. శ్రీవాణి బాగున్నది, చాలా బాగున్నది. అందరూ కూడా బాగున్నదని మెచ్చుకుంటున్నారు గదా! అది చాలా అభివృద్ధి చెందుతుంది" అని అన్నారు భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారు. నాకు, నా శ్రీమతికి ఇచ్చిన ప్రత్యేకమైన ఇంటర్వ్యూలో. అది ఎప్పుడో కాదు, ఎంతకాలం క్రిందటోకాదు, ఎక్కడోకాదు. ది. 23-5-99 ఆదివారం ఉదయం బృందావనం (బెంగుళూరు)లో స్వామి ప్రసాదించిన ఇంటర్వ్యూలో. అప్పుడు నేను ధైర్యం చేసి 'స్వామీ! శ్రీవాణికి తమ ఆశీస్సులు' అని అంటుండగానే స్వామి పై మాటలు అన్నారు. స్వామి దివ్యసన్నిధిలో షుమారు ముప్పది నిముషములు ఉండే మహద్భాగ్యం ఆనాడు మాకు కలిగింది. ఆ సందర్భమున ఎన్నో వ్యక్తిగత విషయాలేగాక, అనేక ఆధ్యాత్మిక విషయాలు కూడా స్వామి ప్రస్తావించి మమ్మల్ని ప్రభావితులను గావించారు, ఆనందపరిచారు. మాతోపాటు ఆనాడు పదునాలుగు మందికి స్వామి ఇంటర్వ్యూ ప్రసాదించారు. లోపలికి వెళ్ళగానే మహిళలకు విభూతి సృష్టించి యిచ్చారు. తరువాత ఒక లాకెట్ (ఒక వైపు రామ పట్టాభిషేకం, రెండవ వైపు ఓంకారం)తో కూడిన బంగారు గొలుసును సృష్టించి నా శ్రీమతి మెడలో వేశారు. ఆఖరికి గొలుసుతో కలిగి ఉన్న ఒక క్రొత్త చేతి గడియారాన్ని సృష్టించి నా చేతికి స్వామియే పెట్టారు. (పాత గడియారం తీసివేయమనగా తీసివేసాను).

ఇంటర్వ్యూ గదిలో స్వామి మాట్లాడుతున్న సందర్భంలో నా శ్రీమతి "షష్టిపూర్తికి ముందు బెంగుళూరు వచ్చినప్పుడు యిచ్చిన ఇంటర్వ్యూ (13-3-1996) లో నాకు ఈ ఢమరుకం గొలుసును ప్రసాదించారు. దానిని సాయి రామరక్షగా భావించి

తీసి దాచకుండా, మెడలోనే ఉంచుకున్నాను" అని చెబుతుండగానే, "అందుకోస మనే గదా! ఇప్పుడు పట్టాభి సీతారాములను ఇచ్చింది. తీయకు ఉంచుకో!" అన్నారు. ఈ ఇంటర్వ్యూ మాకు ఒక దివ్యానుభూతిని ప్రసాదించింది.

## స్వామి ఎక్స్‌పర్ట్ డాక్టర్

అమెరికాలోని అనుభవజ్ఞులైన డాక్టర్లు ఆపరేషన్ తప్ప మరో మార్గంలేదని స్పష్టంగా చెప్పిన తరువాత, భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు సృష్టించి యిచ్చిన విభూతి ప్రసాదంతో స్వస్థత చేకూరిన సంఘటన ఒకటి ఈ మధ్య బెంగుళూరు లోని బృందావనంలో జరిగింది. జి.వి. మనోహర్ అమెరికాలో చాలాకాలంగా ఉద్యోగం చేస్తున్నాడు. అయితే గత 9 నెలలుగా తన రెండు చేతులు తిమ్మిర్లతో బాధపడుతూ, రానురాను స్పర్శజ్ఞానం కూడా పోయింది. చిట్టచివరికి క్రిందనున్న "న్యూస్‌పేపర్"ను కూడా చేతితో తీసుకోలేని స్థితి వచ్చింది. అమెరికాలోని డాక్టర్లు ఎన్నో మందులు వాడారు. లాభం లేకపోయింది. ఆపరేషన్ తప్ప మరో మార్గంలేదని చెప్పగా బెంగుళూరులోనున్న తన తండ్రి శ్రీ ఘండికోట వెంకట సుబ్బారావుగారికి ఫోన్‌లో పరిస్థితిని వివరించగా "ఆపరేషన్ వద్దు, వెంటనే బయలుదేరిరా! బాబాగారు ఎట్లా చెబుతే అట్లా చేద్దాం!" అని సుబ్బారావుగారు తన కుమారుని ఆదేశించారు. తండ్రి ఆజ్ఞానుసారం మే రెండవ వారంలో అమెరికా నుంచి మనోహర్ బృందావనం (బెంగుళూరు) చేరుకున్నాడు. వచ్చిన నాలుగు రోజులకు, బాబాగారు అతనిని ఇంటర్వ్యూకి పిలిచి అతని వ్యాధిని గురించి ఒక Expert Doctor చెప్పినట్లుగా అంతా చెప్పి 'అక్షయ విభూతి భరిణ'ను సృష్టించి యిచ్చి, దానిలోనున్న విభూతిని తీసుకొని బాబాయే అతని రెండు చేతులకు వ్రాసి 'అంతా నయం అవుతుందిలే' అని ధైర్యం చెప్పి పంపారు.

బృందావనంలో మేమందరం ఒకే బ్లాకులో దర్శనం కోసం రోజూ కూర్చునేవారం. అది గురువారం (20-5-99). నాకు దగ్గరలోనే కూర్చున్నాడు మనోహర్. అతనిని స్వామి ఇంటర్వ్యూకు పిలిచారు. ఇంటర్వ్యూ గదిలో యోగక్షేమాలు అడిగిన తరువాత స్వామి "మీ అమ్మా నాన్నలతో కూడా ప్రత్యేకంగా మాట్లాడాలి. మీ ముగ్గురు కలిసి సరిగా మధ్యాహ్నం గం॥2-00లకు నా దగ్గరకు రండి! (త్రయిభవన్)" అని చెప్పి మనోహర్‌ను పంపివేశారు. స్వామి ఆదేశానుసారం ఆ ముగ్గురు స్వామి వద్దకు వెళ్ళారు. స్వామి అతని జబ్బునంతా వివరించుతూ లాకెటు (ఒకవైపున స్వామి, రెండవ వైపున ఓంకారం) ఉన్న బంగారు గొలుసును సృష్టించి మనోహర్ మెడలో వేసారు. ఒక పచ్చరాయి గల ఉంగరమును కూడా సృష్టించి అతని వేలికి తొడిగి, "నీకు మూడురక్షలు ఇచ్చాను. (అంతకుపూర్వం మూడు రోజుల క్రిందట

ఇచ్చిన| అక్షయ విభూతి భరిణతో సహా) అవి నీకు రక్షగా ఉంటాయి" అంటూ మరల విభూతి సృష్టించి రెండు చేతులకు స్వయంగా వ్రాసారు స్వామి. "ఏమి ఫర్వాలేదు. నీవు ఇక అమెరికా వెళ్ళవచ్చు. రెండు చేతులతో ఏ పనైనా చేయగలవు. రెండు చేతులతో రెండు పెట్టెలు కూడా మోయగలవు" అని ఆశీర్వదించి పంపారు. మరునాడే అమెరికా పయనమైపోయాడు మనోహర్. విమానాశ్రయంలో మనోహరే రెండు బరువైన సూట్‌కేసులను రెండు చేతులతో పట్టుకొని నడిచాడని తండ్రి శ్రీ ఘండికోట వెంకట సుబ్బారావుగారు చెప్పగా విని ఆశ్చర్యపోయాను. 1977వ సంవత్సరంలో ఈ మనోహరే అమెరికాలో కడుపు నొప్పితో పదినెలలు బాధపడ్డాడు. అమెరికాలో ఎంతోమంది డాక్టర్లు ఎన్నో మందులు యిచ్చారుట. కడుపునొప్పి తగ్గలేదు. ఆపరేషన్ చేయాలన్నారు డాక్టర్లు. అప్పుడు కూడా అమెరికా నుంచి పుట్టపర్తి రాగా స్వామిపిలిచి విభూతి సృష్టించి పొట్టకు వ్రాసి నోటిలో వేసారు. మరునాటి నుంచి ఈనాటి వరకు మరల కడుపునొప్పి రాలేదుట మనోహర్‌కు.

స్వామి యొక్క దివ్యశక్తి డాక్టర్లకుగాని, సైంటిస్టులకుగాని అందనిది, అంతుపట్టనిది, మందులకు లొంగని, ఆపరేషన్లకు నయంకాని వ్యాధులు సహితం భగవాన్ సాయి హస్త స్పర్శతో అదృశ్యమైపోతున్నాయి. అయితే ఆ మహిమాన్వితుని అనుగ్రహం ఎప్పుడు? ఎవరిమీద? ఏవిధంగా వర్షిస్తుందో! ఎవరు చెప్పగలరు?

*జూన్ - 1999*



*"**నాది లెక్చర్ కాదు, మిక్చర్.** దానిని మందువలె త్రాగాలి. కొంచము కూడా విడువకూడదు. అనాది వేదవిహితమైన సంస్కృతిని ఆచరించి, ధైర్యసాహసములతో ఆధ్యాత్మిక మార్గమందు ప్రవేశించి, నిరుత్సాహమునకు, సందేహమునకు చోటివ్వక, ముందంజ వేసి, ఆత్మతృప్తిని, ఆత్మశక్తి అనుభవించి, మీరందరూ ఆనందించాలని ఆశిస్తూ ఆశీర్వదిస్తున్నాను."*

**- బాబా**

# శ్రీ సత్యసాయి విభూతి సృష్టి రహస్యము

- ఘండికోట వెంకట సుబ్బారావు, పుట్టపర్తి

శ్రీ సత్యసాయీశ్వరుడు తన అప్రతిహత సహజ సంకల్పశక్తితో తన రిక్తహస్తచాలన మాత్రంతో, ఇంచుమించు ఆరు శతాబ్దాల నుండి అద్భుతంగా సృష్టి చేయుచున్న అపరిమిత వస్తు సముదాయంలో మూడురకాల వస్తువులు ప్రాధాన్యతను సంతరించుకొన్నాయి. ఒకటి విభూతి, రెండు శివలింగాలు, మూడు రత్నాభరణాదులు.

ఈ ముఖ్యమైన మూడు వస్తువులూ శ్రీ సత్యసాయి అవతారమహిమకు బాహ్యచిహ్నాలు. ఇవి సాయీశ్వర తత్త్వమైన "సత్యం, శివం, సుందరం" ఆనంద భావాలను వ్యక్తీకరించు వస్తువులు కూడా.

*- విభూతి పారమార్థిక సత్యాన్ని వ్యక్తీకరిస్తుంది.*

*- లింగం శివతత్త్వాన్ని సూచిస్తుంది.*

*- ఆభరణం పరమేశ్వరి - శివశక్తి రామణీయతకు, సుందరానికి చిహ్నం.*

- దేవుడు విభూతిమయుడన్నది సత్యం
- జీవుడు లింగమయుడన్నది శివం
- జగత్తు రత్నమయం అన్నది సుందరం.

సత్యం, శివం, సుందరం మేళవింపే శివశక్త్యాత్మకమైన సౌందర్యలహరి, ఆనందలహరి! ఈ మూడిటి మేళవింపే సచ్చిదానందాత్మక ఆత్మావతారియైన శ్రీ సత్యసాయి.

**సత్యసాయి విభూతి వైశిష్ట్యం :**

భగవాన్ బాబావారు ముఖ్యంగా ఉదయం, సాయంత్రం దర్శనం వేళల, లోపల ఇంటర్వ్యూ వేళల కూడా అనేక సార్లు విభూతిని సృష్టించి ఇవ్వడం బహిరంగంగా అందరూ చూస్తూనే ఉంటారు. మహాశివరాత్రి సందర్భంగా రిక్తహస్తచాలన మాత్రంతో సృష్టించిన విభూతి ధారలతో షిరిడి సాయి విగ్రహానికి అభిషేకం జరుగుచూ ఉండేది. వేలాది ప్రేక్షకుల సమక్షంలో ఈ సృష్టించిన విభూతి "తుఫాను"లను నేను అనేక సార్లు చూశాను. అప్పడప్పుడు బాబావారు విభూతితో పొంగి పొరలుచున్న పెద్ద భరిణలను సృష్టించి ఇవ్వడం ఎన్నో మారులు తిలకించాను. అటువంటి విభూతి పాత్రలను బాబా సృష్టించి మా కుటుంబానికి రెండుసార్లు ప్రసాదించారు. ఇంకొకటి దేశవిదేశాలలో బాబా భక్తుల గృహాలలో, మందిరాలలో

బాబా చిత్రాల నుంచి విభూతి దానంతట అది ఊరి చిమ్మడం నేను ప్రత్యక్షంగా దగ్గిర ఉండి పరీక్షించి చూసి ఆశ్చర్యపోతిని.

**బాబా విభూతిని ఎందుకు సృష్టించి ఇస్తారు?**

మొదటిది విభూతి మహా పవిత్ర వస్తువు. అది శివమహాదేవుని వైరాగ్య చిహ్నం. ప్రాపంచిక వస్తువులన్నీ చివరకు బూడిదగా అగునని మనకు చెప్పే గుణపాఠం. అది శివప్రీతి. శివస్వరూపాలకు విభూతిని పెట్టడం, అభిషేకం చేయడం సనాతన సంప్రదాయం. బాబా 'శివసాయి మహాదేవుడు' కాబట్టి విభూతి స్వామి పరమపవిత్ర ప్రసాదం.

రెండవది స్వామి ఇచ్చే విభూతి మంగళకరమేకాక రోగనివారణకరం. అది స్వామి తరుచుగా ప్రసాదించే మందు. అందుకే స్వామి ఇచ్చిన విభూతిని నోట్లో వేసికొని అక్కడికక్కడే తినమనడం లేక నీటిలో కలిపి కొద్దికొద్దిగా తాగమనడం లేక ఫాలం మీద, ఛాతి మీద వారే విభూతిని రాయడం చేస్తూయుంటారు. నా పితృపాదులు కీ.శే. ఘండికోట సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి ప్రశాంతి నిలయంలో ఉన్నప్పుడు ఇంచుమించు ప్రతిరోజు స్వామి విభూతిని సృష్టించి ఇచ్చేవారు. అపుడపుడు నాన్నగారి శిరస్సుపై ధారగా విభూతిని చల్లేవారుకూడా.

మూడవది స్వామి విభూతి మానసికవ్యాధి నివారకం మానసిక శాంతికరం. లేనిపోని భయాలు, ఉద్రేకాలకు ఉపశమన కారకం. స్వామి విభూతి భూత, ప్రేత, పిశాచ భావనలను తుదముట్టించు శక్తి కలది. స్వామి ఇచ్చు విభూతి మహామహిమాన్వితం. అందుకే

*శ్లో॥ పరమం పవిత్రం బాబా విభూతిం పరమం విచిత్రం లీలా విభూతిం ।*
*పరమార్థ ఇష్టార్థ మోక్షప్రదాతం బాబా విభూతిం ఇదమాశ్రయామి ॥*

**విభూతి రహస్యం :**

ఉపనిషత్తులు విభూతి మహిమను రకరకాలుగా వర్ణించినవి. విభూతిని రుద్రవీర్యం అంటాయి. రుద్రుడు లోకాలను ప్రళయకాలంలో దహించగా అంతా బూడిదగా అయింది. ప్రపంచం అస్థిరం, అనశ్వరం, బూడిద మాత్రమే అనే భావన పరమ వైరాగ్య కారణం, చిహ్నం.

ఇంకొకటి - మన ప్రాపంచిక కామాలను, బాధలను, వాసనలను నశింపజేయుశక్తికలది ఈ విభూతి. శివుడు మన్మథుని తన మూడవ నేత్రం తెరిచి దహించగా మిగిలిన బూడిదను వంటికి రాసుకొని తన కామ విజయాన్ని ప్రకటించాడు. అప్పటి నుండి శివునికి 'కామారి' అనే పేరు వచ్చినది. మనం కూడా

ప్రాకృతిక కోరికలను దహించి ప్రశాంతిని పొందవచ్చునన్నదే ఈ వృత్తాంతసారం. వస్తుప్రపంచమంతా చివరకు బూడిదగా మారును. మారకుండా మిగిలేది విభూతియే సాయి శివ మహిమయే.

శివుని భస్మోద్ధూళితమూర్తి అంటారు. శ్రీ సత్యసాయి మహాశివరాత్రి సమయంలో బిందెలబిందెల విభూతి కరచాలనంతో సృష్టించి విభూతి వర్షంతో తనను, వేదికపైయున్న వారందరిని ముంచివేసి, భస్మోద్ధూళితమూర్తిలా దర్శనమిచ్చేవారు.

బృహజ్జాబాలోపనిషత్తు విభూతిని అయిదుపేర్లతో వర్ణించినది. "విభూతిః పంచభిః నామోభిః భృశం విభూతి ర్భసితం భస్మ క్షారంరక్షేతి భస్మనో భవంతి పంచనామాని విభేతి అని, భసితం అని, భస్మ అని, క్షారం అని, రక్ష అని మొత్తం అయిదుపేర్లు ఉన్న పవిత్ర వస్తువు.

(1) **ఐశ్వర్యకారణాత్ విభూతిః** భూతికరం భూతిః విశేషేణ భూతిః విభూతిః అంటే స్వామి సృష్టించిన విభూతి ఐశ్వర్యకారకమే కాకుండ విశేషమైన ఐశ్వర్యాన్ని అంటే, పరమార్థజ్ఞానాన్ని ప్రసాదించును అని కూడా.

(స్వామి విభూతి - భస్మం మనలోని పాపాలను, అంటే దుర్భావాలు, దురాశలు, ధూర్తగుణాలు, దుర్మార్గ ప్రవృత్తులను నశింపజేస్తుంది).

(2) **భస్మం** అనేది రెండవ పేరు. 'సర్వఅఘ భక్షణాత్'. పాపాలను భక్షించేది, నశింపజేసేదియే భస్మం.

(3) **భసితం** మూడవపేరు. 'భాసనాత్ భాసకాత్ భసితం'. స్వామి సృష్టించి ఇచ్చిన విభూతి తను తెల్లగా ప్రకాశిస్తూ ఇతరులను ప్రకాశింపజేయును. అంటే మనలోని పుణ్యములను అంటే సద్భావాలు, సద్గుణాలు, సత్య-ధర్మ-శాంతి-ప్రేమ-అహింస త్యాగం అనే సత్యసాయి షడ్వర్గ మానవతా విలువలను ప్రకాశింపచేసేదియే స్వామి విభూతి భసితం.

(4) **క్షారం** నాల్గవపేరు. "ఆపదాం క్షారణాత్" ఆపదలను క్షరం - నాశనం చేసేది కాబట్టి క్షారం అగును. స్వామి విభూతి మనకు శారీరక, మానసిక బాధలు, రోగాలు, ఇతర ప్రమాదాలు రాకుండా కాపాడును.

(5) అయిదవపేరు '**రక్ష**'. 'అపస్మారభవ భీతిభ్యాః' 'అభిరక్షణాత్ రక్షః' - ఇతి. అంటే భూత, ప్రేత, పిశాచ, బ్రహ్మ రక్షోగణాల నుంచి మనలను పూర్తిగా రక్షించేది స్వామి విభూతి.

భగవాన్ శ్రీ సత్యసాయి సృష్టించి ఇచ్చే విభూతికి ఈ పైన చెప్పిన పంచ లక్షణ మహిమలు ఉంటున్నవి. దానికి ఉదాహరణ నాలుగు తరాలుగా మా ఘండికోట వంశీయులకు స్వామి అనేక సందర్భాలలో సృష్టించి ఇచ్చిన విభూతియే తార్కాణం.

ఒకసారి నాకు విభూతిని సృష్టించి ఇచ్చి, తత్త్వజ్ఞానాన్ని - బ్రహ్మసూత్ర రహస్య ప్రబోధను ప్రసాదించారు. ఇంకొకసారి విభూతిని సృష్టించి మా మూడవ కుమారుని నోట్లోవేసి, కడుపుపై రాసి, వాని చిన్న పేగులలోని రంధ్రాలను పూడ్చి, వాని దుర్భరమైన కడుపునొప్పిని శాశ్వతంగా తీసివేశారు.

ఇంకొకసారి పదిహేడు సంవత్సరాలు నిస్సంతతిగాయున్న పెద్దకోడలుకు సుగంధ విభూతిని సృష్టించి, సంవత్సరం తిరగకముందే మగపిల్లవాడు పుట్టగలడని ఘంటాపథంగా చెప్పడం, తరువాత సుఖప్రసవానికి పటికబెల్లం సృష్టించి ఇవ్వడం, అట్లే జరగడం, పుట్టిన పిల్లవానికి 'జయవర్ధన్' అని తక్షణమే నామకరణం కూడా స్వామి చేసి ఆశ్చర్యపరచినారు.

ఇంకొక మనవరాలు ప్రసవంలో ఏర్పడిన చిక్కును సృష్టించిన విభూతి ద్వారా తొలగించినారు. ఇంకొకసారి మా కుటుంబ సభ్యులలో ఒకరికి మానసిక ఆందోళనలను విభూతినిచ్చి తగ్గించారు. మా నాన్నగారి అంతిమ రోజులలో, ఒకసారి పిల్చి కైలాస విభూతిని శివచిత్రంతోయున్న బిళ్ళను సృష్టించి ఇచ్చి మోక్షసాధన రహస్యాన్ని వెలువరించారు.

భగవాన్ శ్రీ సత్యసాయి శివసాయిమహాదేవుడని చెప్పటకు వారు అపారంగా, అనవరతంగా సృష్టించు విభూతియే తార్కాణం. ఇంకొక పెద్ద తార్కాణం ఏమిటంటే, దేశవిదేశాలలో భగవాన్ సత్యసాయి చిత్రాలపై దానంతటదానిగా విభూతి రేఖలు, ధారలు కనిపిస్తూ యుండడం. ఈ విభూతి వ్యాసం ముగిస్తూయుండగా కృష్ణాజిల్లా తిరువూరు భక్తులు మా ఇంటికి వచ్చి అట్టి విభూతితో నిండిన అనేక స్వామి చిత్రాలను చూపించినారు. ఈ ఉదంతం కూడా సమయానికి స్వామిచేసే మహిమయే కదా!

తెనుగుసేత : గరిమెళ్ళ కృష్ణమూర్తి

మే - 1999



# సాయీ! అంటే ఓయీ! అంటారు.

- టి.ఎస్.ఎన్. మూర్తి నరసన్నపేట

శ్రీ సత్యసాయి సేవాసమితి నరసన్నపేట వారి ఆధ్వర్యంలో నిర్వహించబడు తున్న వసంత నవరాత్రులలో భాగముగా ది. 01-4-98 బుధవారం సాయంత్రం గం॥ 7-00లకు ఏర్పాటు చేసిన నా ఆధ్యాత్మిక ప్రసంగాన్ని ముగించుకొని తిరుగు ప్రయాణములో బస్ కాంప్లెక్స్‌కు నేను, ఆ సమితి కార్యకర్త ఒకరు కలిసి చేరుకున్నాం. కాశీబుగ్గ పోవుటకు ఆఖరి బస్సు రడీగా యున్నది. నాతోబాటుగ వచ్చిన సాయి సోదరుడు నాకు మరొక్కసారి సాయిరామ్ చెప్పి వెనుతిరిగాడు. నేను APZ 2032 బస్సు ఎక్కి కూర్చొని నా మామూలు అలవాటు ప్రకారం సాయి గాయత్రి పారాయణం ప్రారంభించాను. రాత్రి సుమారు గం॥ 9-00ల ప్రాంతములో భోజనాదికాలు ముగించుకొని బస్సు డ్రైవర్ సాయి సోదరులు శ్రీ హుస్సేన్ మరియు కండక్టర్ శ్రీ యమ్.ఎస్. రాజులు వచ్చి బస్సు బయలుదేరదీసిరి. నేను నిద్రలోకి జారుకున్నాను.

రాత్రి సుమారు గం॥ 10-30 ని॥లకు మా బస్సు మండల కేంద్రమైన నందిగాం విడిచిపెట్టి పలాస వైపు ప్రయాణం సాగిస్తోంది. మా గమ్యస్థానము మరొక 9-10 కి॥మీ దూరం ఉందనగా, తురకలకోట గ్రామ శివార్లలోనికి బస్సు చేరింది. ఆకాశం చిల్లులు పడిందా? అన్నట్లుగా ఒకటే కుండపోతగా వర్షం. రహదారిపై వాహనాలన్నీ మసక మసకగానే కన్పిస్తున్నాయి. వర్షపు నీరు కిటికీల గుండా లోనికి రావడంతో నాకు నిద్రాభంగం కలిగి అటుయిటూ చూస్తున్నాను. యింతలో ఒక పెద్ద కుదుపునకు లోనయిన మా బస్సు రోడ్డు వారగా ప్రక్కకు దొర్లి, రహదారి నుండి సుమారు 15-18 గజాల దూరం వరకు రోడ్డుప్రక్క పొలాల లోనికి దొర్లుకుంటూ రాసుకుపోయింది. బస్సు దొర్లడం నాకు అనుభవంలోకి వచ్చిన మరుక్షణం నేను "ఓం శ్రీసాయిరాం ఓం శ్రీసాయిరాం" అని అరవడం ప్రారంభించాను. బస్సు బోల్తాపడిన సమయంలో మేము ముగ్గురం ఒక స్త్రీమూర్తితో సహా ప్రయాణికులం మరియు డ్రైవర్, కండక్టర్ మాత్రమే బస్సులో ఉన్నాం. బస్సు ఏవిధంగా పడిందోగాని, బస్సు పడిపోయింది అని డ్రైవరు అరిచే సమయానికి నేను మాత్రం చక్కగా బస్సు ప్రయాణాలలో మాములుగా నిలబడి ఉన్నట్లుగానే అనుభూతితో నిలబడియున్నాను. జోళ్లు మాత్రం నా కాళ్లకు లేవు. ఎంత ప్రయత్నించినా అటుయిటూ ఎక్కడా నా స్పర్శకు అందలేదు. పది పదిహేను నిముషాలు గడిచేసరికి బస్సులోనికి వర్షపునీరు చేరడం ప్రారంభమైంది. కిటికీల అద్దాలు బద్దలవడంతో మేమంతా తడిసి ముద్దవుతున్నాం. డ్రైవరుగారు కొంచెం అధైర్యపడినప్పటికి కండక్టర్‌గారు మాత్రం తన ముఖ్యకాగితాలను భద్రపర్చుకొనిన

మరుక్షణం ఎంతో ధైర్యంగా మా కందరికి ధైర్యంచెప్పి, తానే ముందుగా డ్రైవర్ సీటు వద్దకు వెళ్ళి ఆ తలుపుతీసి బయటకు దిగి మమ్ముల్ని ఒక్కొక్కర్ని వరుసగా డ్రైవర్ డోర్ గుండా రమ్మనమని చెప్పి, అలా బస్సు పైకి చేరుకున్న మమ్మల్ని తన భుజాలపై కూర్చొనబెట్టుకొని ఆసరా కల్పించి, సుఖంగా రోడ్డుమీదకు చేర్చినారు. బస్సు పడీపడడంతో అద్దాలన్నీ బ్రద్దలయి గాస్లుముక్కలు బస్సుఅంతా చెల్లాచెదురుగా పడిపోయినను, వాటిపై మేము చెప్పల్లేని కాళ్ళతో అటుయిటూ తిరుగాడినప్పటికి మా ఐదుగురిలో ఏ ఒక్కరికి చిన్న గాయమైనా కాలేదు. ఆ వర్షపు రాత్రి-ఆ దారిలో వస్తున్న లారీని ఆపించి మమ్మల్నందర్ని ఎక్కించడమేగాక మా తోటి ప్రయాణికురాలి రెండు బియ్యం మూటల్ని కూడ మోసుకొని వచ్చి, లారీలో చేర్చి, మమ్మల్ని సేదదీరమని చెప్పిన సంఘటన తలచుకుంటే ఒళ్ళుపులకరిస్తోంది. లారీ ఎక్కిన వెంటనే తడిసిముద్దయి గజగజలాడుతున్న మాకు తమ వద్దనున్న పొడి బట్టలు యిచ్చి మాకెంతో ఊరటకల్గించి మా గమ్యస్థానమైన కాశీబుగ్గ నీల్‌కమల్ జంక్షన్ వద్ద సురక్షితంగా దింపి వెళ్ళినారా లారీ డ్రైవర్, క్లీనరులు.

పడిపోయిన బస్సులోనుండి తన భుజాలపై ఆసరా ఇచ్చి రోడ్డుపైకి చేర్చిన కండక్టర్ రూపంలోను, పొడిబట్టలిచ్చి ఊరట కల్గించిన లారీ డ్రైవర్, క్లీనర్ రూపాలలోను, బస్సులో నుండి బస్సు పైభాగానికి సురక్షితంగా చేర్చిన డ్రైవర్ రూపంలోను ఆ వర్షపు రాత్రిలో వచ్చింది భగవాన్ శ్రీ సత్యసాయియే అని ప్రగాఢంగా విశ్వసిస్తూ, సాయీ అంటే ఓయీ అని పలికి మమ్మల్నందర్ని కంటికి రెప్పలా కాపాడిన శ్రీ సత్యసాయి దివ్య పాద పద్మములకు శతకోటి వందనములు సమర్పించు కుంటున్నాను.

*నవంబర్ -1998*



*"ఇనుపకడ్డీ నీటిలో మునుగుతుంది కానీ, దానిని ఒక పళ్లెముగా తయారు చేస్తే, అది నీటిలో తేలటమే గాక, కొంత బరువును కూడా మోస్తుంది. అదే విధంగా మానవుని మనస్సు సంసార సాగరంలో సులభంగా మునిగిపోతుంది. దానిని భగవన్నామమనే సమ్మెటతో డొల్లగా చేయండి. అప్పుడది సంసార సాగరంలో తేలుతుంది."*

**- బాబా**

# ఆపన్నివారకుడు శ్రీ సత్యసాయి

- మాధవ, వేంసూరు, ఖమ్మంజిల్లా

ఈశ్వరాంబ ప్రేరణతో భక్తురాలికి ఆపరేషన్ చేసి ఆమె బాధను తొలగించిన ప్రేమమూర్తి భగవాన్ శ్రీ సత్యసాయి లీలలు అత్యద్భుతం. ఆంధ్రప్రదేశ్‌లోని ఖమ్మం జిల్లా వేంసూరు మండలం వేంసూరు గ్రామంలో రిటైర్డ్ టీచర్ శ్రీ శంకరయ్యగారి కోడలు కలకొడిమ సుధ తలనొప్పితో విపరీతంగా బాధ పడుతోంది. ఆమె బాధ చూడలేక స్పెషలిస్టుకు చూపించాలని కారు మాట్లాడుకొని ది. 18-7-98న వెళ్లాలని నిశ్చయించుకొన్నారు.

ఆ రోజు తెల్లవారుఝామున ఈశ్వరాంబగారు ఆ గ్రామంలో ఉన్న కళ్యాణి సుధ మంచం వద్దకు వచ్చి ఈశ్వరాంబ పాదాల నుండి ఉద్భవించిన విభూదిని కళ్యాణి సుధ నోటిలో బలవంతంగా చొప్పించింది. ఫలితం ప్రశాంతంగా నిద్రపోయింది బాధితురాలు. కదల లేని పరిస్థితులలో నున్న సుధ తనంతాను ఉదయం లేచి నెమ్మదిగా కాలకృత్యాలు తీర్చుకోగలిగింది. బంధువులు ఆశ్చర్యపోయారు. సుధ కోరికపై ప్రయాణం ఆగిపోయింది.

మరునాడు మహిళాదినోత్సవం. ది. 19-7-98 ఉదయం ఈశ్వరాంబగారు, డాక్టర్ రూపంలో ఉన్న స్వామి వచ్చి తల్లి ఆజ్ఞచే స్వామి సుధ మెదడు ఆపరేషన్ చేసి అందలి మాలిన్యమును మంచం క్రింద పడవేసి, కుట్లు వేసి శిరస్సుపై విభూదిని నింపి, ప్రతి రోజు వచ్చి చూసి వెళ్తాను అని అభయమిచ్చారు. స్వామిని చూడలేకపోయినా ఆ గ్రామంలో 60, 70 మంది యీ ప్రక్రియను చూడగలిగారు. కానీ ఆ గ్రామంలోని కుమారస్వామి, సుధ మాత్రమే వైద్య బృందాన్ని చూడగలిగారు. ఆ గదిలో క్రింద పడ్డ రక్తము, మాలిన్యము, సుధ తల పై కుట్లు గ్రామస్థులందరూ చూసి అబ్బురపడ్డారు. డాక్టరు రూపంలో ఉన్న స్వామి 'గది తలుపులు, కిటికీలు బంధిస్తే ఎట్లా రావాలి? తలుపులు తెరిచి ఉంచమని' అన్నారట. స్వామి 2,3 రోజులు వచ్చి డ్రసింగ్ చేసి భక్తురాలి బాధను పోగొట్టి ఆపన్నివారకుడు అయినారు శ్రీ సత్యసాయి. స్వామి సుధచే విభూది, కుంకుమ సృష్టించి భక్తులకు యిప్పించారు.

ఈ సంఘటన ద్వారా స్వామి తాను పుట్టపర్తిలో మాత్రమే ఉంటున్నట్లుకాదని, సర్వాంతర్యామినని, ఎప్పుడు ఎక్కడ భక్తుడు బాధ పడుతూ ఉంటాడో అక్కడ అనేక రూపాలలో సాక్షాత్కరించి ప్రేమ వర్షాన్ని కురిపించి భక్తుల బాధలు తీర్చుతానని వెంట, జంట, అండగా ఉంటానని తెలియజెప్పటానికే యీ చమత్కారం చేశారని అవగతమవుతోంది. స్వామి లీలలు అనంతం, అద్భుతం.

నవంబర్ - 1998

# డా॥ బూర్గుల రామకృష్ణారావు

డి. వెంకటేశ్వరరావు, హైద్రాబాద్

డా॥ రామకృష్ణారావు బహుభాషా కోవిదుడు, రాజకీయవేత్త, 1956వ సంవత్సరంలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర అవతరణ జరిగే వరకు ఆయన హైద్రాబాద్ రాష్ట్రానికి ముఖ్యమంత్రిగా ఉన్నారు. హైదరాబాద్ రాష్ట్రం ఆంధ్రలో విలీనమయి ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర అవతరణకు ఈయన ఎంతో కృషి చేసారు.

స్వామితో రామకృష్ణారావుగారికి 1955లోనే పరిచయమైంది. అనేక అనుభవాల ద్వారా వారి కుటుంబం అంతా స్వామి భక్తులయ్యారు.

ఆంధ్ర రాష్ట్రం ఏర్పడిన తర్వాత, భారత ప్రభుత్వం డా॥ రామకృష్ణారావుని మొదట కేరళ రాష్ట్రానికి, తర్వాత ఉత్తరప్రదేశ్ రాష్ట్రానికి గవర్నరుగా నియమించింది.

1961వ సంవత్సరంలో డా॥ రామకృష్ణారావు ఉత్తరప్రదేశ్ గవర్నర్‌గా ఉన్నపుడు ఆయన, ఆయన భార్య, బరైలి నగరాన్నుంచి నైనిటాల్‌కు ప్రభుత్వం పనిమీద రైలులో ప్రయాణిస్తున్నారు. వీరిద్దరికి ఒక ఫస్టుక్లాస్ పెట్టె పూర్తిగా కేటాయించబడింది. ఆ పెట్టెలో సెక్రటరీలుగానీ, అంగరక్షకులుగానీ లేరు. మరో పెట్టెనుండి ఆ పెట్టెలోకి రావటానికి దారిలేదు.

రాత్రి గం॥ 11-00 సమయంలో రైలు చాలా వేగంగా పోతున్నప్పుడు, రైలు పెట్టెలోని ఫాను నుండి నిప్పురవ్వలు రావటం డా॥ రామకృష్ణారావు గమనించారు. స్విచ్ఛి ఆపినా ఫాను తిరగటం ఆగలేదు. ఈ నిప్పురవ్వలు క్రమక్రమంగా పెద్దవౌతున్నాయి. ఆ పెట్టెలో రైలు ఆపటానికి గొలుసుగాని, మరే విధమైన పరికరంగానీ లేవు.

మొదట నిబ్బరంగా ఉన్నా, నిప్పురవ్వల ఉధృతం ఎంత ఎక్కువైందంటే, ఆ పెట్టెకు త్వరలో నిప్పంటుకొని ఆ ఇద్దరూ సజీవదహనమౌతామని భయపడ్డారు.

అప్పుడు చేయగలిగింది దైవాన్ని ప్రార్థించటమే. ఆ దంపతులిద్దరూ దైవాన్ని ప్రార్థించారు. కొన్ని నిమిషాల తర్వాత పెద్ద తలుపుని ఎవరో గట్టిగా కొడుతున్న శబ్దమైంది. వేగంగా వెళుతున్న రైలుపెట్టె తలుపు దగ్గరకు ఈ అర్థరాత్రి ఎవరు వచ్చారూ అని ఆశ్చర్యపోతూ డా॥ కృష్ణారావు తలుపు తీసారు. కాకీ దుస్తులు వేసుకున్న యువకుడైన ఒక మెకానిక్ లోపలికి వచ్చి, ఎవరితోనూ ఏమీ మాట్లాడకుండా తన సంచిలో నుంచి పరికరాలు తీసుకొని 10 నిముషాల్లో ఫాను బాగుచేశాడు. నిప్పురవ్వలు రావడం ఆగిపోయాయి. రిపేరుపని పూర్తయ్యాక తలుపు దగ్గరకు వెళ్ళి నేలపై కూర్చుని, వాళ్ళిద్దర్ని పడుకోమని, తాను తర్వాతి స్టేషన్‌లో దిగిపోతానని

చెప్పాడు. రామకృష్ణారావుగారి భార్యకి అనుమానం వచ్చింది. ప్రాణాలకు తెగించి అర్ధరాత్రి సమయంలో స్పీడుగా పోతున్న రైలు పెట్టెల బయట ప్రయాణం చేయటానికి సాహసించిన ఈ మెకానిక్ తప్పక దొంగ అయిఉంటాడని, తామిద్దరూ నిద్రపోగానే విలువైన వస్తువులు, ధనం దొంగతనం చేసి ఎక్కడో దిగిపోతాడని భావించింది. డా॥ రామకృష్ణారావు అతనినేమి పట్టించుకోకుండా పుస్తకం చదవటంలో నిమగ్నమయ్యారు. రెండు నిముషాల తర్వాత ఆ మెకానిక్ వారి దగ్గరకు వచ్చి తను వెళ్ళిపోతున్నానని, తలుపు లోపల వేసుకోమని చెప్పాడు. స్పీడుగా పోతున్న రైలులో ఇంత చీకటిలో ఎక్కడకు పోతాడని ఆలోచిస్తుండగా ఆ యువకుడు తలుపు తీసుకొని బయటకు వెళ్ళిపోయాడు.

డా॥ రామకృష్ణారావుకి ఆలోచించగా ఆశ్చర్యం వేసింది. ఆ మెకానిక్‌కి ఈ పెట్టెలో ఫాను చెడిపోయిందని ఎలా తెలిసింది, అతను స్పీడుగా పోతున్న రైలు ఎలా ఎక్కగలిగాడు. ఇప్పుడు ఎలా దిగిపోయాడని ఆలోచించి వాటికి సమాధానం దొరక్కపోవటంతో నిద్రకు ఉపక్రమించారు.

ఇది జరిగిన నెలరోజులకి డా॥ రామకృష్ణారావు ప్రభుత్వం పనిమీద విమానంలో కాన్పూరు నుండి వారణాసికి వెళ్ళాల్సి వచ్చింది. విమానంలో ఆయన భార్య, సెక్రటరీ, ఒకరిద్దరు సహాయకులు ఉన్నారు.

వారణాసి వచ్చిందిగానీ విమానం క్రిందకు దిగకుండా చాలాసేపు ఆకాశంలో విమనాశ్రయం చుట్టూ తిరుగుతూంది. డా॥రామకృష్ణారావు తన అనుచరుడి ద్వారా విషయమేమిటో పైలట్‌ని కనుక్కోమని పంపించగా, ఆ పైలట్ ఏమి చెప్పాడంటే, విమానం చక్రాలు పట్టుకుపోయాయని, అవి క్రిందకు దిగటంలేదని, విమానంలో పెట్రోలు అయిపోతూందని, అందుచేత విమానాన్ని ఏదైనా గడ్డివున్న ప్రదేశంలో దింపడానికి ప్రయత్నిస్తున్నామని, అలాదిగినప్పడు చక్రాలులేని విమానానికి, నేలకి కలిగిన రాపిడి వల్ల విమానం అగ్ని ప్రమాదానికి గురిఅయ్యే అవకాశం ఉందని తెలియ పరిచాడు.

విమానాశ్రయంలో ఫైరింజన్లని, అంబులెన్సులని సిద్ధం చేసారు. అనేకమంది పోలీసులను, డాక్టర్లును పిలిపించారు. విమానాన్ని ఈ అత్యవసర పరిస్థితులలో దించటానికి తన అనుమతి ఇచ్చేముందు, డా॥ రామకృష్ణారావు స్వామిని మనసులో తలచుకొని తమని రక్షించమని ప్రార్థించారు.

డా॥ రామకృష్ణారావుగారి సెక్రటరీ కూడ స్వామి భక్తుడే. స్వామి ఆయనకు ఒక ఉంగరం సృష్టించి యిచ్చారు. డా॥ రామకృష్ణారావు ప్రార్థన చేస్తున్న సమయంలో విమాన పైలట్ ఆయన సెక్రటరీ చేతికున్న ఉంగరాన్ని చూశాడు. అంతకుముందే

అది స్వామి ఇచ్చిన ఉంగరమని పైలట్‌కి తెలియటం వల్ల, సెక్రటరీని పిలిచి, విమానం చక్రాలు క్రిందకు దించటానికి ఉన్న మీటను ఉంగరం ఉన్న చేత్తో ఆఖరి ప్రయత్నంగా క్రిందకు నొక్కమని చెప్పాడు. వియానంలో ఉన్నవారి జీవితాలకు అవే ఆఖరి ఘడియలని భయపడుతున్న సెక్రటరీ, స్వామిని మనసులో తలుచుకొని ఆ మీట నొక్కాడు. అంతవరకూ క్రిందకు దిగకుండా మొరాయించిన చక్రాలు అతి సునాయాసంగా, ఎంతో తేలికగా క్రిందకు దిగిపోయాయి. విమానంలో ఉన్నవారందరూ ఒక్కసారి గట్టిగా ఊపిరిపీల్చుకున్నారు. పైలట్ క్షేమంగా విమానాన్ని క్రిందకు దించాడు.

స్వామి బెంగుళూరులో ఉన్నారని తెలుసుకొని రామకృష్ణారావుగారి భార్య స్వామికి ఫోన్ చేసింది. స్వామే ఆ ఫోన్‌కాల్ అందుకున్నారు. రామకృష్ణారావుగారి భార్య తమని విమాన ప్రమాదం నుండి కాపాడినందుకు కృతజ్ఞతలు తెల్పుతూ విమాన ప్రమాదం :గురించి చెప్పటం ప్రారంభించింది. అప్పుడు స్వామి ఆమె మాటలకు అడ్డువచ్చి, ఆ విమానానికి ఏమి జరిగిందో ఎవరు ఎలా భయపడ్డారో, రామకృష్ణారావు ఏమని ప్రార్థించారో, అప్పుడు స్వామి విమానం చక్రాలు క్రిందకు దిగేలా ఎలా చేశారో వివరంగా చెప్పారు. రామకృష్ణారావుగారి భార్య ఆశ్చర్యం నుండి తేరుకోకమునుపే స్వామి ఆమెను "రైలులో జరిగిన సంఘటన గురించి ఏమీ మాట్లాడలేదు. ఆ సంఘటన జ్ఞాపకముందా?" అని అడిగారు.

ఆమెకు ఆ సంఘటన గుర్తుకురాలేదు. అప్పుడు స్వామి "రైలులో ఫాను నిప్పలు చిమ్ముతుంటే నేను వచ్చి రిపేరు చేస్తే నన్ను దొంగ అనుకున్నావు గదా!" అని అడిగారు. అప్పుడు ఆమెకు ఆ సంఘటన జ్ఞాపకం వచ్చి స్వామిని క్షమాపణలు అడిగి, కృతజ్ఞతలు తెలియజేసుకుంది. స్వామి పెద్దగా నవ్వి ఫోను పెట్టేశారు.

డా॥ రామకృష్ణారావు దంపతులకు స్వామి ఇటువంటి అనుభవాలు చాలా కలిగించారు. 1967వ సం॥లో రామకృష్ణారావు జబ్బుపడి ఆఖరి ఘడియల్లో మంచంలో ఉన్నప్పడు స్వామి హోవర్డుమర్ఫెట్, మరికొంత మంది భక్తులతో కలసి హైదరాబాదులోని ఆయన ఇంటికి వెళ్ళి దర్శనమిచ్చి, తన బొటన వేలిద్వారా గంగాజలాన్ని ఆయన నోటిలోపోసి ఆయన ఆత్మకు శాంతిని చేకూర్చారు.

ఏప్రియల్ - 1998

# సాయి ఆశీస్సులు - అనువాద అనుభవాలు

కొండూరి నాగమణి, హైదరాబాద్

అది 1988 సంవత్సరం - ఫిబ్రవరి నెల.

స్కూటరు యాక్సిడెంటులో గాయపడి మంచంలో ఉన్న మా మరిది వై.యస్.యన్. మూర్తికి మనసు ప్రశాంతంగా ఉండటానికి మంచి పుస్తకాలు చదువుకుంటూ ఉంటే బాగుంటుందని అతని మిత్రుడు శ్రీ గోపి "లవింగ్ గాడ్" పుస్తకం ఇచ్చి వెళ్ళారు. కీ.శే. శ్రీ యన్. కస్తూరిగారు వ్రాసిన ఆ పుస్తకాన్ని ఒకసారి చదువుదామనే ఆసక్తితో నేను తీసుకున్నాను. కస్తూరిగారి అమ్మాయి వివాహం గురించి వ్రాసిన ఘట్టం ముందుగా ఆ పుస్తకంలో చదివాను.

అప్పటికి మా అమ్మగారి ద్వారా స్వామి యందు విశ్వాసం, నమ్మకం కొంత ఏర్పడినప్పటికీ ఇంకా నేను పుట్టపర్తి వెళ్ళటానికి వీలు కుదరలేదు. ఆ సమయంలో మా అమ్మగారు మా బంధువులలో ఒక అమ్మాయికి స్వామి అనుగ్రహంతో వివాహం నిశ్చయమవుతుందని కొంతముందుగా స్వామి ప్రేరణతో చెప్పటం జరిగింది. అందువల్ల పుస్తకంలో కస్తూరిగారి అమ్మాయి వివాహం స్వామి అత్యంత అద్భుతంగా జరిపించిన ఘట్టం నన్ను అమితంగా ఆకర్షించటం వలన ఆ సన్నివేశం వరకు తెలుగులో వ్రాసి వైజాగ్‌లో ఉన్న మా అమ్మగారికి వెంటనే పోస్టులో పంపించాను. తరువాత పుస్తకం చదవటం పూర్తి చేస్తుండగా పుస్తకమంతా తెలుగులో వ్రాయాలనే ప్రేరణ నాలో బలంగా కలగటం ప్రారంభించింది.

నిజానికి అప్పటివరకూ నేను ఎటువంటి అనువాదము చేసి ఉండలేదు. అందుకు సంబంధించిన నియమ నిబంధనలు కూడా నాకు ఏవీ తెలియవు. వెంటనే వైజాగ్ ఫోను చేసి, "అమ్మా! నీకు పుస్తకంలో ఒక సంఘటన తెలుగులో వ్రాసి పంపాను కదా! ఆ పుస్తకం పూర్తిగా తెలుగులో వ్రాయనా!" అని అడిగాను. తప్పకుండా వ్రాయమని మా అమ్మగారు ఆశీర్వదించి ప్రోత్సహించటంతో అది స్వామి అనుగ్రహంగా భావించి 'లవింగ్ గాడ్' పుస్తకం తెలుగులోకి అనువదించటం ప్రారంభించాను.

అలా అనువాదం చేస్తుంటే చూసినవారంతా "ఇలా పుస్తకం తెలుగులో ఎందుకు వ్రాస్తున్నారు? ఇంతకు ముందు ఇంకెవరూ ఈ పుస్తకం తెలుగులో అనువదించ లేదా? ఇలా అనువదించమని మీకు ఎవరైనా చెప్పారా? అనువాదం అయ్యాక ఎవరు అచ్చు వేయిస్తారు?" అంటూ నన్ను అనేక విధాలుగా ప్రశ్నించేవారు. "నాకేమీ తెలియదు. స్వామి కృపవలన ప్రేరణ కలిగింది. అమ్మ ఆశీర్వదించింది. స్వామి పుస్తకం ఎలా అచ్చు వేయిస్తారో అది స్వామి నిర్ణయం" అని చెప్పేదాన్ని.

అనువాదం చేస్తున్నంతసేపూ శ్రీ కస్తూరిగారే నేనుగా అనుభూతిని పొందుతూ, అందులోని ప్రతి సంఘటనా, సన్నివేశమూ కళ్ళకు కట్టినట్లుగా, స్వయంగా నేనే అనుభవిస్తున్నట్లుగా అనిపించేది. చిన్నతనం నుంచి తెలుగు మీడియంలో చదువుకున్న నాకు ఆంగ్లభాష కఠినంగానే ఉండేది. కాని, పుస్తకం తెలుగులో వ్రాస్తూ ఉంటే అదంతా ప్రత్యక్షంగా జరుగుతున్నట్లు, చెపుతున్నట్లు అనుభూతి పొందేదాన్ని. కస్తూరిగారు ఆంగ్లంలో వ్రాసిన గేయాలు, పద్యాలు మాత్రం అనువదించకుండా మిగిలిన పుస్తకమంతా స్వామి దయవలన మూడు నెలల్లో అనువదించటం జరిగింది. కాపీరైట్స్ రచయిత శ్రీ కస్తూరిగారివి. ఆయన తన హక్కులను శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ట్రస్టుకు అధీనం చేశారు. పుస్తకం తెలుగులో అనువదించే సమయానికి వారు కీర్తిశేషులైనారు. ఇంతకీ ఈ "లివింగ్ గాడ్" ఇంకెవరైనా అనువదించారో, అప్పటికే అచ్చు వేయబడిందో, అచ్చులో ఉందో మాకు వివరాలేవీ తెలియవు. తెలిసిందల్లా ఒక్కటే. ప్రేరణ కలిగించేదీ, మన చేత చేయించేదీ అంతా భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారేనని మాత్రమే.

స్వామి అనుగ్రహం వలన మొట్టమొదటి సారిగా నేను, మా పిల్లలు ముగ్గురూ, అమ్మతో కలసి 1988వ సంవత్సరం ఆగష్టు నెలలో పుట్టపర్తి వెళ్ళాము. పుస్తకం వ్రాతప్రతిని పట్టుకుని దర్శనం వరుసలలో కూర్చున్నాము.

స్వామి దగ్గరకు రాలేదు, పలకలేదు. ఆ రోజు ఆగష్టు 14వ తేదీ. పుట్టపర్తిలో లెక్చరరుగా పనిచేస్తున్న మా బంధువు ఒకరికి పుస్తకం అనువాద విషయం గురించి చెప్పి, వ్రాత ప్రతిని చూపించాను.

ఆయన వెంటనే "ఇది నిజంగా అద్భుతమైన లీల! ఎందుకంటే సరిగ్గా ఈ రోజుకి కస్తూరి దివంగతులై సంవత్సరం అయింది. ఈ రోజు ఆయన వర్ధంతి. ఏదో విశేషం లేనిదే స్వామి ఇలా చేయించరు. పుస్తకం తప్పక అచ్చు వేయబడుతుంది. నాకు తెలిసినంతవరకూ దీనిని ఇంకా ఎవరూ తెలుగులో అనువదించలేదు. అయితే ఎప్పుడు అచ్చు అవుతుందో, ఎన్నేళ్ళకు అవుతుందో అదంతా స్వామి అనుగ్రహం మాత్రమే" అని అన్నారు. హైదరాబాదు తిరిగి వచ్చాక వారి సలహా మేరకు వ్రాతప్రతిని ఆచార్య శ్రీ జి.వి. సుబ్రహ్మణ్యంగారికి ఇచ్చాను. వారు ఎంతో ఆప్యాయంగా వ్రాతప్రతిని చదివి "అనువాదం బాగుందమ్మా! కాని, అచ్చు వేయటం విషయం నిర్ణయించవలసినది స్వామి మాత్రమే" అని చెప్పారు.

తరువాత నేను పుస్తకం మొదటినుంచి మళ్ళీ సరిచూసుకుంటూ ఒకసారి అందులోని పాటలు, పద్యాలు కూడా అనువదించి మరలా మొత్తం ఫెయిర్‌కాపీ తయారు చేశాను. మొదటిసారి అసంపూర్ణంగా ఉన్న ప్రతిని తీసుకువెళ్ళటం వలన

బహుశా స్వామి ఆశీర్వదించలేదేమోనన్న ఉద్దేశ్యంతో ఈసారి మరింత దృఢ విశ్వాసంతో, స్వామి నాకు ఇంక ఇంటర్వ్యూ ఇచ్చేసి, నాచేతిలో నుంచి పుస్తకం తీసుకుంటారన్న ఆశతో మళ్ళీ పుట్టపర్తి వెళ్ళాను. 1989లో. ఉహూ! ఈసారి కూడా స్వామి ఏమీ మాట్లాడలేదు. ఆ వ్రాతప్రతిని ఏం చెయ్యాలో నాకు తెలియలేదు. "అమ్మా! నువ్వు ఒక్కదానివి ఈ అనువాదం చదివినా చాలు. నాకు తృప్తిగా ఉంటుంది. అచ్చు విషయం స్వామి ఇష్టం కదా!" అన్నాను. తిరిగి వచ్చేస్తూ ఏదైనా పుస్తకం కొనుక్కుందామని బుక్‌స్టాల్‌కి వెళ్ళాను. అక్కడ "సత్యం శివం సుందరం నాల్గవ భాగం" ఆంగ్ల పుస్తకం చూసి "సాయిరాం! సత్యం శివం సుందరం నాల్గవ భాగం తెలుగు పుస్తకం ఒకటి ఇవ్వమని" అడిగాను. "లేదమ్మా! ఇంకా నాల్గవభాగం తెలుగు అనువాదం రాలేదు" అని చెప్పగానే నేను ఆంగ్ల పుస్తకమే కొని తెచ్చుకున్నాను. ఆ రోజు సాయంకాలం బయలుదేరి హైదరాబాదు వచ్చేశాము.

మరునాడు ఉదయం బస్సులో ఆఫీసుకు వెళుతూ సత్యం శివం సుందరం పుస్తకం (నాలుగవ భాగం) చదువుతున్నాను. అలా చదువుతుంటే మనసులో ఆ పుస్తకం తెలుగులో వ్రాయమన్నట్లుగా, బలంగా ప్రేరేపిస్తున్నట్లుగా అనిపించింది. "స్వామీ! అనువాదం పూర్తయిన పుస్తకం ప్రతిని మీరు తీసుకోనే లేదు. ఇప్పుడు మళ్ళీ ఈ పుస్తకం తెలుగులోకి అనువదించమని ప్రేరణ కలిగిస్తున్నారా! ఏమిటీ ఈ పరీక్ష!" అని ఆశ్చర్యపడుతూనే ఉన్నాను. కాని, మనసులో కలుగుతున్న ఆ ప్రేరణ నిగ్రహించుకోలేనంత బలంగా, తీవ్రంగా అనిపించసాగింది. ఆఫీసుకు వెళ్ళగానే ముందుగా అమ్మకు ఫోను చేసి "అమ్మా! ఇలా ప్రేరణ కలుగుతున్నది. ఏం చెయ్యాలి? మొదటి అనువాదం సంగతి ఏమీ తెలియకుండా ఇంకొకటి ప్రారంభించటం ఏమిటీ? అందరూ ఏమనుకుంటారు?" అని అడిగాను. "బలమైన ప్రేరణ స్వామి కలుగచేస్తున్నారు కాబట్టి తప్పకుండా వ్రాయి. అన్నీ ఆ స్వామే చూసుకుంటారని" అమ్మ ధైర్యం చెప్పి ఆశీర్వదించింది.

ఆఫీసులో ఏదోపని చేస్తున్నానే కాని నాకు ఏమీ తోచటం లేదు. పోనీ ఈసారి ఒక ఉత్తరం వ్రాసి స్వామికి రిజిష్టరు పోస్టులో పంపిద్దాము. స్వామి ఆ ఉత్తరం అందుకుంటే అది ఒక సూచనగా భావించవచ్చని అనుకుంటూ స్వామికి ఉత్తరం వ్రాశాను. ఇంతలో మాకు తెలిసిన వాళ్ళు అదేరోజు పుట్టపర్తి వెళుతున్నారన్న విషయం గుర్తుకు వచ్చి గబగబ మా ఆఫీసు ప్రక్కనే ఉన్న వారింటికి వెళ్ళి ఉత్తరం ఇచ్చి స్వామికి ఇమ్మని చెప్పాను. "మేము మొదటిసారి పుట్టపర్తి వెళుతున్నాం. మా దగ్గర నుంచి స్వామి ఉత్తరం తీసుకుంటారా!" అని వాళ్ళు సందేహం వ్యక్తం చేశారు. స్వామి అనుగ్రహం అయితే తప్పక తీసుకుంటారని చెప్పి వచ్చేశాను.

వాళ్ళు పుట్టపర్తి నుంచి తిరిగి రాగానే ఎంతో ఆనందంగా 'మొదటి వరుసలో వారికి స్థానం లభించిందనీ, ఉత్తరం తీసి యిచ్చేలోగా స్వామి ముందుకు వంగి ఉత్తరం తీసుకున్నారనీ' చెప్పారు. నా ఆనందానికి అవధులు లేవు. ఎంతో తృప్తిగా సత్యం-శివం-సుందరం నాలుగవ భాగం తెలుగు అనువాదం ప్రారంభించాను.

కొద్ది నెలల కాలంలోనే స్వామి అనువాద కార్యక్రమాన్ని పూర్తి చేయించారు. ఈ సారి రెండు వ్రాత ప్రతులూ పట్టుకుని దర్శనం వరుసలలో కూర్చున్నాము. కాని, ఈసారి కూడా స్వామి మాట్లాడలేదు. మావంక కన్నెత్తి కూడా చూడలేదు. ఏం చెయ్యాలో మాకు తెలియలేదు. 'స్వామీ! నీ చరిత్ర సత్యం-శివం-సుందరం.' అందువల్ల నీవు ఎలా అనుకుంటే అలాగే జరగనీ? అంతా నీ ఆశీర్వాదమే" అనుకున్నాము.

ఈలోగా స్వామి నాచేత మరొక పుస్తకం వ్రాయించారు. 'జీవితపర మార్థము-వేదాంత శాస్త్రము' అను పేరుతో క్లిష్టమైన ఆధ్యాత్మిక విషయములను సరళమైన తెలుగులో వ్రాసే భాగ్యం కలిగించారు. ఈ పుస్తకం వ్రాయటంలో శ్రీ మల్లాప్రగడ శ్రీరంగారావుగారు, శ్రీ ఈశ్వరప్రగడ శేషావతారముగారు నాకు మార్గదర్శకులై ఎనలేని సహాయ సహకారములను అందించారు. ఇదే సమయంలో అనగా 1990వ సంవత్సరంలో డాక్టర్ రామ్ తుకారామ్ కాకడేగారు వ్రాసిన 'షిరిడి నుండి పుట్టపర్తి' పుస్తకం అనుబంధ ప్రకరణలను ఇంగ్లీషులోను, తెలుగు లోను వ్రాసే అవకాశం స్వామి నాకు ప్రసాదించారు.

1991లో పుట్టపర్తి వెళ్ళినపుడు లవింగ్ గాడ్, సత్యం-శివం-సుందరం వ్రాతప్రతులను శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ట్రస్టు కన్వీనరు శ్రీ ప్రమోద్ కుమార్ సూరి గారికి ఇచ్చినపుడు వారు ఆ ప్రతులను స్వీకరించి, వాటిని పరిశీలించిన తరువాత తమ నిర్ణయం తెలియచేస్తామని చెప్పారు.

1992లో పుట్టపర్తి వెళ్ళినప్పుడు శ్రీ సూరిగారు పుస్తకాలు రెండూ అచ్చు వేయిస్తామని చెప్పి మాకు అమితమైన ఆనందం కలిగించారు. కాపీరైట్స్ పత్రం పైన సంతకం చేసి తిరిగి వచ్చేశాము. స్వామి మాత్రం మాట్లాడలేదు. మళ్ళీ 1994 వరకు ఏ కబురూ తెలియలేదు. 1994లో పుట్టపర్తి వెళ్ళినపుడు శ్రీ సూరిగారు వ్రాతప్రతుల ఎడిటింగ్ పూర్తయిందనీ, త్వరలో ప్రచురణ ప్రారంభించ బోతున్నామని చెప్పారు. స్వామి దయవలన రెండు పుస్తకాల అనువాదాలూ హైదరాబాదులోనే అచ్చు వేయబడడం వలన నాకు ప్రూఫ్ రీడింగ్ కూడా స్వయంగా చూసుకునే భాగ్యం కలిగింది. లవింగ్ గాడ్ (సత్యసాయి ప్రేమ సుధా స్రవంతి), సత్యం-శివం-సుందరం నాలుగవ భాగం రెండు పుస్తకాలు 1995వ సంవత్సరం

ఉగాదికి ప్రశాంతి నిలయంలో విడుదలయినాయి. అదే ప్రెస్‌లో 1995 ఏప్రిల్ నెలలో జీవిత పరమార్థం-వేదాంత శాస్త్రం కూడా తిరుమల తిరుపతి దేవస్థానం, మాండలీక ఆశ్రమం (తెనాలి) వారి ఆర్థిక సహాయంతో అచ్చు వేయబడింది.

పుస్తకాలు అచ్చు వేయబడ్డాక కూడా స్వామి మాట్లాడలేదు. ఈ రోజు వరకు కూడా పలకరించలేదు. కాని, 1995లో పుట్టపర్తి వెళ్ళినప్పుడు బుక్‌ట్రస్ట్ కన్వీనరు శ్రీ సూరిగారు స్వామి ఆశీస్సులతో మరికొన్ని ఆంగ్ల పుస్తకములను ఇచ్చి వాటిని కూడా తెలుగులోకి అనువదించే భాగ్యం కలుగచేశారు. సాయి అవతార్ ఆఫ్ లవ్ (Sai Avtar of Love) విజన్ ఆఫ్ సాయి - II (Vision of Sai II) రెండు పుస్తకాల అనువాద ప్రతులు ప్రస్తుతం ట్రస్టు వారి పరిశీలనలో ఉన్నాయి. స్పిరిట్యువాలిటి అండ్ హెల్త్ (Spirituality and Health), భక్తి అండ్ హెల్త్ (Bhakti and Health) పుస్తకముల వ్రాతప్రతులు ట్రస్ట్ ద్వారా స్వామికి అందచేయవలసి ఉన్నది.

ఈ అనువాద అనుభూతులను సాయి కుటుంబ సభ్యులందరితో కలసిపంచుకోవాలన్న ఆశతో ఈ విషయములన్నింటిని సవివరంగా విన్నవించు కుంటున్నాను.

స్వామి అనుగ్రహం మనపై వర్షించటానికి ఆయన మనతో నేరుగా మాట్లాడకపోయినా అవ్యక్తంగా వారు మనను ముందుకు నడిపిస్తూ, ఆధ్యాత్మికంగా పురోగమింపచేస్తారన్న దృఢవిశ్వాసం అనుభవపూర్వకంగా మాలో బలపడింది. స్వామి మనకు ఏ విధమైన సేవ ప్రసాదించినా అది మన ఆధ్యాత్మిక పురోగమనం కోసము, మనలోని మలిన గుణములను తొలగించి, మనలో అవసరమైన మార్పులను కలిగించి తన దగ్గరకు చేర్చుకోవటం కోసమేనన్న విషయం అర్థమవుతున్నది. మనమంతా స్వామి చేతిలో కేవలం పరికరముల వంటి వారమే! యుగావతారి సంకల్పంలో మనమంతా భాగస్వాములమే!

*నవంబర్ - 1997*

# కరుణామయుడు స్వామి

ఆర్.వి. రామారావు, అనకాపల్లి

భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు శివశక్తి స్వరూపులు - కలియుగంలో భక్త జనోద్ధరణకు పరమేశ్వరుడు తన శక్తి స్వరూపాన్ని కూడా తన యందే లీనం చేసుకొని సాయిగా అవతరించారు. అంతటి మహిమాన్వితమైన భగవత్ స్వరూపం భక్తుల కోసం భువికి దిగివచ్చి, నరాకారంతో, చిద్విలాస చిన్మయ మూర్తిత్వంతో కోటితల్లుల ప్రేమ మాతృత్వంతో కలియుగాన నేడు పరిఢవిల్లుతున్నది. "అణోరణీయాన్ మహతోమహీయాన్" అన్నట్లు అణువులో అణువుగా అడుగడుగునా ఇంట, జంట, వెంట ఉండి స్వామి తన వార్ని లీలా వినోదంతో రక్షించుకుంటున్నారు. స్వామి లీలల్లో ఎన్నెన్నో చమత్కార పూరితాలు. మాట్లు వేసే వానిగా రూపం ధరించినా, ఎలక్ట్రిషియన్‌గా రైల్లో ఫ్యాను బాగుచేసినా, డాక్టరుగా అవతారం దాల్చి ఆపరేషన్ చేసినా, జోడి ఆదిపల్లి సోమప్పగా రక్షించినా, స్వామి సర్వాంతర్యామి అని తెలియజేసేందుకే! ఇటీవల నా అనుభవంలో స్వామి చూపించిన చిన్న చమత్కార లీలకు పరవశుడనై, స్వామికి వినమ్రుడినై, విశదీకరిస్తున్నాను.

ఇటీవల ఒక ఆదివారం అనుకోకుండా అనకాపల్లి నుండి విజయనగరం వెళ్ళవలసి వచ్చినది. ఆదివారం సాయి కార్యక్రమాలు ఎన్నో ఉంటాయి. ప్రత్యేకించి ఆనాడు ఉదయం సేవా కార్యక్రమం, పదిగంటలకు బాలవికాస్ కార్యక్రమాలతో పాటు సాయంత్రం గం॥ 5-30 నుండి బ్లడ్ గ్రూపింగ్ కార్యక్రమం నిర్ణయించాము. విజయనగరం వెళ్ళవలసి రావడంతో కొంత నిరాశపడినా ఇతర సాయి బంధువుల సహకారంతో విజయనగరం వెళ్ళిరావడానికి సమితి అనుమతి లభించింది. మా కన్వీనరుగారు మాత్రం ఒక షరతు విధించారు. ఏ పరిస్థితులలోను సాయంత్రం గం॥ 5-30 ని॥వరకు వచ్చి బ్లడ్ గ్రూపింగ్ కార్యక్రమాన్ని దగ్గరుండి పర్యవేక్షించమని తెలిపారు. విజయనగరంలో పని ముగించుకొని హడావుడిగా 2 గంటలకు బస్టాండు చేరాను. అనకాపల్లి బస్ రడీగా ఉంది. ఎలాగైనా గం॥ 5-30 ని॥లకు అనకాపల్లి చేరవచ్చనే ఆశతో బస్ దగ్గరకు వెళ్ళాను. బస్సు చాలా రద్దీగా ఉంది. కాలు పెట్ట వీలు కానంతమంది జనం. కిక్కిరిసిన ప్రయాణీకులను చూసి డోరు వద్ద ఉన్నవారందరూ దిగిపోతే తప్ప బస్సు కదలదని డ్రైవరుగారు నిష్కర్షగా చెప్పి క్రిందనే ఉండిపోయాడు. విధిలేక ఒక్కొక్కరూ దిగిపోతున్నారు. ఆ సన్నివేశం చూసి నాకు ఎంతో నిరాశ కలిగింది. ఆ బస్ తప్పిపోతే నేను అనకాపల్లికి సమయానికి చేరుకోలేను. స్వామి కార్యక్రమంలో పాల్గొనలేను. ఇచ్చిన మాట నిలబెట్టుకోలేను. 'స్వామీ ఏమిటీ పరీక్ష' అనుకున్నాను. ఒక్కొక్కరే బస్ దిగుతున్నారు. డోరు దగ్గర

కొంత ఖాళీ అయింది. మిగిలిన ప్రయాణీకులు అభ్యర్థనపై డ్రైవర్ కూడా తన సీట్లోకి చేరాడు. బస్ కదలబోతుంది. తిరిగి బస్ నాలుగు గంటల దాకా లేదు. 'సాయిరాం' అనుకొని గబుక్కున బస్‌లోకి ఎక్కాను. డోరు వద్దఉంటే దింపి వేస్తారని జనాన్ని నెట్టుకుంటూ లోపలికి వెళ్ళాను. నాలుగు, అయిదు సీట్లకు అవతల ఇద్దరు కూర్చొనే సీటులో ఒక్క కుర్రాడు మాత్రం కూర్చొన్నాడు. అది చూసి ఆత్రంతో అరిచాను. సీటు ఖాళీ ఉందా అని! అందరూ నా వైపు ఆశ్చర్యంగా చూశారు. ఆ కుర్రాడు రమ్మన్నట్లు చేయి ఊపాడు. గబగబా దగ్గరకు వెళ్ళాను. 20 సంవత్సరాల స్టూడెంటు. 'మీరేనా సార్ అనకాపల్లి వెళ్ళేది'! అని అడిగాడు. 'అవును' అని అతని ప్రక్కగా వెళ్ళి కిటికి ప్రక్క సీటులో కూర్చొన్నాను. అంతవరకు ఆ సీటులో న్యూస్ పేపరు వేసి ఉంది కూర్చున్నాక అడిగాను. 'నీకెలా తెలుసు నేను అనకాపల్లి వెళ్ళాలని?' ఆ అబ్బాయి చెప్పింది విని షాకయ్యాను. అంతవరకు ఆ సీటులో ఒక వయసు మళ్ళిన ముసలతను తెల్లటి దుస్తులతో పేపర్ చదువుతూ కూర్చున్నాడట. బస్ మరో అయిదు నిమిషాలకు కదుల్తుందనగా (అంటే నేను అప్పటికి బస్ డోరు వద్దకు చేరాను) లేచి ప్రక్కన కూర్చున్న కుర్రాడితో నీలాగే గళ్ళ షర్టు వేసుకొని ఒకతను వస్తాడు. అతను అనకాపల్లి వెళ్తాడు. నీవు అతనికి ఈ సీటు ఇవ్వు అని చెప్పి పేపరు వేసి దిగిపోయాడుట. అందుకే కుర్రాడు నన్ను చూడగానే మీరేనా అనకాపల్లి వెళ్ళేది' అని అడిగి సీటు ఇచ్చాడు. స్వామి ఎంత కరుణామయులు? తన కార్యక్రమంలో పాల్గొనాలని ఆరాటపడే ఒక సామాన్యునికి బస్‌లో సీటు చూపించే తీరిక చేసుకున్నారు. ఆ మాటలు విని, ఆ కుర్రాణ్ణి అతని రూపం చెప్పమన్నాను. తెల్లగా ఉన్నారు. గుబురు జుట్టు ఉంటుంది. ఎంతో ప్రశాంతంగా ఉన్నారు. అంతవరకు పేపరు చూస్తూ కూర్చొని, సడన్‌గా లేచి చెప్పి గబగబా వెళ్ళిపోయారు అని చెప్పాడు. అయితే డోరు వద్ద నిలబడ్డ నేను దిగేవారినందరినీ చూశాను. అసలు అలాంటి వ్యక్తి డోరులోంచి దిగలేదు. క్షణంలో స్వామి మాయమయ్యారు. అనుకున్న ప్రకారం గం॥ 5-30 ని॥లకు మందిరం చేరాను. కార్యక్రమంలో పాల్గొన్నాను. సీటు చూపించే పని కూడా నీవే వహించి మా కోసం నీవు సేవ చేస్తావా స్వామీ? ఇంక నేను ఏమిచ్చి నీ ఋణం తీర్చుకోగలం. కరుణామయా, ఇది తలచుకుంటే మాకు ఆగదు దుఃఖం! మా మీద నీ ప్రేమ వర్షం ఆగిపోని ధారాపాతం.

నవంబర్ - 1997

# నీలమేఘ శ్యామం...నీలోత్పలాంజనే...

భారతీకృష్ణ, సికిందరాబాదు

అది ఫిబ్రవరి 1997, 7వ తేదీ. విశాలమైన జగతి అలికిడికి మరచి ఆదమరచి నిద్రిస్తోంది. రేయింబవళ్ళు దిగుళ్ళలో అలసిన శరీరం కూడా కాస్త నిద్రకు జిరిగింది. కన్నుమూత పడిందో...లేదో కమనీయ దృశ్యం... కళ్ళెదుట సాక్షాత్కరించింది.

"అదిగో ద్వారక..ఆలమందలవిగో.." అన్నట్లుగా "అదిగో పుట్టపర్తి..." తీయని గంభీరమైన పలుకు ఎవరిదా పలుకు? వెనుతిరిగి చూసిన నా కళ్ళకి ఎవరూ కనిపించలేదు. ఇల వైకుంఠపురమైన పుట్టపర్తి వీధుల గుండా ఆర్తిగా వెదుకులాడుతున్న నేను తప్ప మరి ఎవరూ లేరే.. నాముందు ఎవరో దారి చూపిస్తూ.. వారి వెనుకగా పరుగు పరుగున నేనే నడుస్తూ.. అసలెందుకీ తొందర? ఎవరి కోసం ఈ తపన? ఎవరి కోసం ఇంత ఆత్రం?

*నీ రూపమె నా కన్నుల ఇల వైకుంఠ పథం*
*నీ ధ్యానమె నా మనమున ఘనమౌ పరమానందం*
*నీ గానమె నా గళమున మధురం అతి మధురం*
*సాయీశుని పద సేవయే ఈ జన్మకు పరమార్థం*
*శరణం తవ చరణం... తవ చరణం మమ శరణం...*

చంద్రునికి వెన్నెల తోడైనట్టుగా నా తోడూ నీడైన నా మనసు అంత తొందరలోనూ మధురమైన గీతాన్నాలపిస్తోంది. నా స్వామి ఏరీ.. నా కంటికి కనిపించరే.. నా స్వామిని చూడాలి.. ఎక్కడ నా స్వామి! ఎక్కడ..!

హఠాత్తుగా నా కనుల ఎదుట అద్భుతమైన సుందర దృశ్యం. కళ్ళు చెదిరాయి. తనువు పులకరించింది.

తనువులోని అణువణువూ ఆనందంతో పులకరించింది. కన్నులర మోడ్పులైనాయి. కాని! కళ్ళు మూసుకుంటే కంటి ఎదుట దృశ్యమదృశ్యమవుతుందేమో.. ఏ స్వామి కోసం ఇంత పరుగున ఒంటరిగా.. ఆత్రంగా.. వెదుకులాడుతూ వచ్చానో..రఘుస్వామి నా కన్న తండ్రి...

పరిమళ భరితమైన పూల పానుప మధ్య, శ్వేత వస్త్రాంబరధారియై పూలంగి సేవలో కళ్యాణ చక్రవర్తిలా చిరుదరహాసంతో ఊయలలూగుతున్నారు. అంతటి సుందరాకారుడైన నా స్వామి దివ్య చరణారవిందముల చెంత భక్తితో నమస్కరిస్తూ నేను కూర్చున్నాను. నా మనసులో సాయి నామం. సాయి రామ నామం అవిరా

మంగా సాగిపోతోంది. నా ఒడలు నాకు తెలియలేదు. నా ఆర్తి తీరింది. స్వామి పాదాల చెంత సేద తీర్చుకుంటుంది నా తనువులోని అణవణువు. ఇంతలో... స్వామి తమ పాదాలను నా చేతుల మధ్యలో వదిలి ఎటో వెళ్లిపోయారు. ఉలిక్కిపడ్డాను. అటు ఇటు వెతుకుతూ ఆ గది అంతా పరికించాను. ఊ హూఁ లేరు.

*దొరతనము చూపవా..*

*దొంగాట తగునా మాధవా...*

పరిసరాలన్ని పరికిస్తున్న యెద రొద చేస్తోంది. సకల సద్గుణ రాముడు కనుమరుగైనాడని కలవరపడుతోంది. పదే పదే ఇంటి చుట్టూ పరుగులు తీసాను. సరిగ్గా పది అడుగుల దూరంలో ఎదురుగా ఒక ఇల్లు కనబడింది. ఏదో ఫంక్షన్ జరుగుతున్నట్టుగా ఉంది. బయట వీధి వాకిలిలో టెంట్ వేసి ఉంది. ఆ టెంట్ మధ్యలో స్వామి నవ్వుతూ కూర్చున్నారు. కళ్లతోనే సైగ చేశారు. రా..రమ్మని.. ఆయాసపడుతూ స్వామి పాదాలచెంత వ్రాలిపోయాను. చుట్టు నలుగురైదుగురు ఆడవారు. ఇంటినిండా 50మందికి పైగా సాయి భక్తులు. సంతోష సంబరాలెందుకో అర్థం కాలేదు. కానీ.. విశేషమైన పూజలు జరుగుతున్నట్టుగా గ్రహించింది మనసు. ఇంతలో.. స్వామి నా భుజం తట్టి.. "స్పెషల్ పూజలు అయితే పిలుస్తాను వస్తావా?" అని అడిగారు. ఆ పిలుపుకే పరవశించిన నేను, "తప్పకుండా స్వామీ! పిల్లలు పెద్దవాళ్లైనారు. ఇప్పుడు నాకు ఫరవాలేదు." తడబడుతూ అన్నాను. అక్కడే గుమ్మంలో నిలబడిన ఒకాయన స్వామిని లోపలికి పిలిచారు. స్వామి అంగీకరించలేదు. 'ఊహు..రాను! నా కిక్కడే బావుంది' అంటూ నా వైపు తిరిగి "మీ ఇంట్లో కొబ్బరి చెట్టు ఉంది. మీకు హాయిగా ఉందా?" అని అడిగారు నన్ను. (మాకు సొంత ఇల్లు, ఇంటినిండా పచ్చని చెట్లు ఉన్నా పరిస్థితుల కారణంగా చాలా ప్రాబ్లమ్‌లో ఉన్నాం) "లేదు స్వామీ! నాకు మీ దగ్గరే బావుంది" అన్నాను నేను. స్వామి నా చేతిని అందుకొని, ఇంకొక చేతితో వేరొకరిని అందుకొని స్టెప్స్ వేస్తూ ఆనందంగా నాట్యం చెయ్యసాగారు. నేను ఇంట్లో వ్రాసి పాడుకున్న స్వామి పాటలు పుట్టపర్తి వీధుల గుండా గాలిలో తేలియాడుతూ మైకులో వినబడుతున్నాయి.

*చల్లని వెన్నెలలు కురిసే కన్నులు*

*తెల్లని మల్లియలు విరిసే నవ్వులు*

*తియ్యని అమృతము చిలికే పలుకులు*

*సాయీ! అంటే ఓయీ! అంటూ బుజ్జి నడకల పరుగులు*

*నీలమేఘ శ్యామ సాయీ.. నీ లీలగని మది పరవశించును హాయీ!*

అది ఆనందం... అదే బ్రహ్మానందం. ఆ సమయం బాధ్యతలన్నీ మరచిన మనసుకి అదొక మరపురాని కానుక! భవబంధాలన్నీ తెంచుకొని ఆ భవునిలో లీనమవ్వాలని బలమైన కోరిక!

ఇంతలో తెల్లవారింది. కల కరిగింది. దృశ్యమదృశ్యమయింది. మేల్కొంచిన మస్తిష్కం మనుగడ ఒడిలో సుప్రభాత సేవలు ప్రారంభించింది.

కాని! ఆ కలనే కలవరిస్తున్న జీవితానికి మాత్రం 7 రోజుల వయసు పెరిగింది. సరిగ్గా వారం. ఫిబ్రవరి 14-2-1997 రథ సప్తమి. ఆ రోజు అంబర వీధుల పయనించి తూర్పు వాకిలి ముంగిట సప్తాశ్వాల సింహాసనాన జగముల నేలే దినకరుడు ధగధగ కాంతులీనుతున్నాడు. ముత్తైదువలు భక్తిగా సమర్పించే ఆవుపాల పొంగలి కోసం కొంచెం ఆకలిగానే ఉన్నట్టుగా కనబడుతున్నారు.

*అఖిల జగదాధారం.. ఆనంద భాస్కరా..*

*ఆరగించుమోయీ... మన్నాదరించుమోయీ..*

పాలపొంగలి సమర్పిస్తూ, సూర్య నమస్కారా లొనరిస్తూ.. ఎక్కడ వేళకి శ్రీవారికి కారియర్ ఇవ్వటం లేటవుతుందో.. పిల్లల స్కూల్‌కి సమయం దాటిపోతోందో.. కంగారు. ఆడవారికి ఉదయం పూజలు హడావుడి పెడుతుంటాయి. సరిగ్గా.. ఆ సమయంలోనే తీరిక దొరికినట్టుంది ఈ జగత్ నియంత అయిన మన స్వామికి. క్రిందట వారం నీకు కనబడిన దృశ్యం కల కాదు, అది నిజం కాబోతోంది రోజు అంటూ ఉదయం 9 గంటలకు పట్టపగలు నా వెంటబడుతూ "హిమాయత్‌నగర్‌లో విజయబాబుగారికి ఫోన్ చెయ్యి" స్వామి గంభీరమైన వాయిస్ వినబడింది. కలగంటున్నానా.. లేదే.. మళ్ళీ వినిపించింది.. మళ్ళీ.. మళ్ళీ ఒకసారి భ్రమ! మరి పదే పదే వినిపిస్తే సందేహం లేదు. ఇది స్వామి ఆజ్ఞ! అంతే మరి ఆలోచించలేదు. వెంటనే విజయబాబుగారికి ఫోన్ చేశాను.

"అమ్మాయి, కులాసాగా ఉన్నావా?" ఆప్యాయతానురాగాలు పాలు తేనెలా కలగలిసిన అమృతం లాంటి పలకరింపు అది.

'ఈరోజు మీ ఇంటికి వద్దామను కుంటున్నానండీ..' స్వామి ఫోన్ చెయ్యమన్న సంగతి చెప్పలేదు. అది ఇంకా భ్రమ అనే అనుకుంటున్నాను.

"ఈరోజు ఆనంద్‌బాగ్‌లో కృష్ణమూర్తిగారింటికి వస్తున్నామమ్మా" అన్నారు వారు.

"కృష్ణమూర్తిగారెవరండీ?" అడిగాను. మేం ఉండే ఇంటికి ఆనంద్‌బాగ్ దగ్గర. వీలయితే వారి ఇంట్లోనే విజయబాబుగార్ని కలుసుకుందామని.

"వీరి అడ్రస్ సరిగ్గా చెప్పలేను కానీ, వారి ఇంట్లో నుండి ఫోటోల ద్వారా విభూతి పడుతూ ఉందిట. ఆయన ఇ.సి.ఐ.ఎల్.లో పని చేస్తారు. ఇలా అడిగితే ఎవరైనా అడ్రస్ చెపుతారు" అన్నారు వారు. 'సరేనండీ! వీలయితే వస్తాను.' ఫోన్ పెట్టేసాను. ఆ కృష్ణమూర్తిగారెవరో? వారి ఇల్లెక్కడో నాకు తెలియదు. మా బంధువులొకళ్ళు కొద్దికాలం ఆనందబాగ్ లో ఉండి ఈ మధ్యన మా ఇంటికి దగ్గరగా వచ్చారు. వారింటికి వెళ్ళి కృష్ణమూర్తిగారి వివరాలడిగాను. వారికి తెలుసని, నాకు తోడుగా వారి అమ్మాయిని ఇచ్చి పంపించారు. ఇద్దరం కలిసి వెళ్ళాక, కృష్ణమూర్తిగారు ఇల్లు మారారని తెల్సింది. స్వామి పరీక్ష పెట్టారనిపించింది. ఏం చెయ్యాలా అని ఆలోచించి అక్కడే తెలిసున్న మా స్నేహితురాలి ఇల్లు వెతుక్కుంటూ వెళ్ళాం. ఎంతో ప్రేమగా మమ్మల్నిద్దర్నీ కృష్ణమూర్తి గారింటికి తీసుకొని వెళ్ళింది.

ఎర్రని ఎండలో దాదాపు 3 కి.మీ. నడిచీ నడిచీ కలలో స్వామి కోసం ఆత్రుత పడినట్టుగా... ఎంతో ఆత్రుతగా ఇల్లు చేరిన నాకు నిజంగా షాక్ తగిలిందనే చెప్పాలి. స్వామి కలలో కనబడి స్పెషల్ పూజకు వస్తావా అని నన్ను అడిగిన ఇల్లు అది. ఆ ఇంట్లో ప్రతి అంగుళం నాకు పరిచయమే. కలలో లానే, బయట టెంట్‌వేసి ఉంది. దాదాపు ఆడ, మగా అందరూ ఏభైకి పైగా కలసి కూర్చొని భజన చేస్తున్నారు. టెంట్ మధ్యలో కుర్చీల్లో నిలువెత్తున పెట్టిన షిర్డీసాయి. సత్యసాయి ఫోటోల నుండీ విభూతి గుట్టలుగా రాలుతోంది. ప్రక్కనే కొంతమంది మగవారు ఒక హోమగుండం చుట్టూ కూర్చొని హోమం చేస్తున్నారు. విజయబాబుగారి ఫ్యామిలీ అంతా వచ్చారు. కృష్ణమూర్తి గారి కుటుంబ సభ్యులందరికీ నన్ను పరిచయం చేసారు. స్వామి సర్వజ్ఞత తల్చుకొని నాకు ఒళ్ళంతా ఆనందంతో పులకరించింది. ఇల వైకుంఠపురమైన పుట్టపర్తి అదే! స్వామి ఎక్కడ ఉంటే అదే పర్తి అని చెపుతుంటారు. ఆ రోజు కృష్ణమూర్తిగారిల్లు అంత వైభవంతోనూ కళకళలాడి పోతోంది. భజన అనంతరం చక్కటి స్వామి భోజనం ఆరగించాం. విజయబాబుగారు నాచేత పాటలు పాడించారు. అక్కడే ఉన్న స్వామి ఫోటో నుండి అమృతం ధారలుగా కురుస్తోంది. కలలో స్వామి నాతో ఆడినట్టుగా, విజయబాబుగారు రెండు మూడు చెంచాలు తీసి "అమ్మాయి పట్టు తీసుకో.." అంటూ నా నోటిలో పోసారు. ఆ సమయంలో నాకంతా చిత్రంగా ఉంది. ఇదెలా సాధ్యమని నాకు నమ్మబుద్ధి కావటం లేదు. క్రిందటి వారమే ఇదంతా నా కలలో ఎలా చూపించారు? ప్రొద్దుట నా వెనక చేరి అదృశ్యంగా నాతో మాట్లాడి ఇలా ఎందుకు నన్ను తీసుకు వచ్చారు? అలౌకికమైన ఆశ్చర్యానందానుభూతి అది. ఇంతకీ అసలు విషయం. స్పెషల్ పూజ అన్నారు కదా స్వామి. ఆ రోజు విశేషమేమంటే... కృష్ణమూర్తిగారి ఫ్యామిలీ పుట్టపర్తి వెళ్ళినపుడు స్వామి వారికి ఆకుపచ్చ ద్రాక్షపండు లాంటి శివలింగాన్ని సృష్టించి

ఇచ్చి, దానికి నీలోత్పల హోమం చెయ్యనున్నారుట. భద్రాచలం, రాజమండ్రి పరిసరాల నుండి నీలోత్పలాలు (నల్ల కలువలు) తెప్పించి ఆ రోజు ఆ హోమం అక్కడ నిర్వహించారు. ఆ కలువలు సంపాదించడానికి వారికి చాలా ప్రయాస కలిగిందట. అందుకే స్వామి నాకు కలలో పువ్వుల మధ్య కనబడినారు. ఇంకొక విశేషం కూడా ఉంది. ఫిబ్రవరి 14న వారి ఇంట విభూతి రావడం మొదలై ఆనాటికి 7 సం॥ అయిందట. ప్రతిరోజూ వస్తూనే ఉందట. ఇంకా వస్తూనే ఉంది. ఈ సంగతులేవీ నాకు తెలియవు. అసలు వారెవరో నాకు తెలియదు. వారిల్లు అంతకన్నా తెలియదు. ఆ విశేషమైన పూజ సంగతి కూడా తెలియదు. వారం క్రితం నాకు ఆ ఇంటిని కలలో చూపించి, ప్రతీ విషయం అక్కడ జరిగింది జరిగినట్లుగా నాకు ముందుగానే తెలియబర్చి నన్ను అక్కడికి రప్పించి, నా పాటలు విని, నాకు ప్రసాదం, దివ్యామృతం, విభూతి నొసంగి ఇంత కరుణను నాపై కురిపించి నన్ను ధన్యురాలను చేసారా స్వామి. ఏ సమయంలో ఎవరిని ఏ విధంగా అనుగ్రహిస్తారో సం॥ల పర్యంతమూ తపమొనరించినా తెలుసుకోలేము. జరిగిన సంగతి నా ద్వారా విన్న అక్కగారి వారందరి ఆనందం ఏమని వర్ణించను? ఇంతటి అద్భుతమైన లీల నాకు చూపించిన నా స్వామికి ఏమి అర్పించుకోగలను ఆయన అనుగ్రహం పొందడం తప్ప!

*అభయ కలశము పాణి ద్వయమున అందగా*
*భవ సముద్రను చరణమందు తరించగా*
*పూర్వజన్మల పుణ్యమిపుడు ఫలించగా*
*నీ సేవలో నా జన్మ ధన్యత నొందెగా*
*నీలమేఘ శ్యామ సాయీ..!*
*నీ లీల గని మది పరవశించెను... హాయీ...!*

యదార్థంగా జరిగిన ఈ లీలను శ్రీవాణి పాఠకులందరితో పంచుకోవడం సంతోషంగా ఉంది. ఎడిటర్ గారికి నా కృతజ్ఞతలు తెలియచేసుకుంటున్నాను.

నవంబర్ - 1997



జన్మిస్తున్నాడని ప్రకటిస్తున్నాను" అని ప్రకటించారు. మా అబ్బాయితో మా కోడలు గర్భవతి అని నిర్ధారణ కాగానే తనకు తెల్పమన్నారు. ఒకనాడు ప్రశాంతి నిలయం వరండాలో ఉండగా అమెరికా నుండి నాకు కేబుల్ వచ్చింది. దానిలో కోడలు గర్భవతి అనీ, డాక్టర్లు రెండుమారులు పరిశీలించి నిర్ధారణ చేసినారని తెలుపబడింది. నేను వెనువెంటనే స్వామికి ఆ కేబుల్ వార్త చూపించినాను. అది స్వామివారి అనుగ్రహం అని తెలిపాను. స్వామి ఎలుగెత్తి అందరికీ వినపడేలాగున "అది నీ నమ్మకానికి సంబంధించినది కాదు. నీకు త్వరలో మనుమడు కలుగుతాడని సత్యసాయి కొద్దినెలలు క్రితం ప్రకటించాడు. మరి అది అంతే..." అన్నారు.

అప్పుడు నేను స్వామివారి ఎదుట నేను మరింత జాగ్రత్తతో మాటలాడి ఉండవలసినదని గ్రహించాను.

సరిగా కొద్దిరోజులకు పూర్వమే స్వామివారు నా భార్యను ""నీ కోడలి ప్రసవ సమయంలో సహాయంగా నీవు న్యూయార్కులో ఉండకుండా ఇక్కడ కాలక్షేపం చేస్తున్నావేమిటి" అని మందలించారు. తదుపరి స్వామి పటికబెల్లం సృష్టించి మా కోడలుకు నొప్పులు ప్రారంభం కాగానే దానిని నోటిలో వేయమన్నారు. ఆ సాయంత్రమే బొంబాయి నుండి న్యూయార్కు వెళ్లటం కెన్నెడీ విమానాశ్రయంలో మా దంపతుల్ని మా అబ్బాయి, కోడలు మమ్ములను కలిసికొనుట ఒక ఆశ్చర్యం. ఆ రాత్రియే మా కోడలుకు నొప్పలు రావటం ప్రారంభించగానే మేము స్వామివారు ఇచ్చిన పటికబెల్లం ఆమె నోటిలో ఉంచటం జరగటం ఒక ఆశ్చర్యకరమైన సంఘటన. అర్ధరాత్రి మగశిశువు జన్మించాడు. ప్రసవం తేలికగా సహజంగా జరిగింది. సరిగా 12 గంటలలో స్వామివారు బిడ్డకు 'జయవర్ధన్' అని నామకరణ చేయమని కేబుల్ ద్వారా తెల్పారు. మా కుటుంబంలో మా మొదటి మనుమడు ఆవిర్భవించాడు.

మన భారతావనిలో శ్రీరాముని 'మాయా మానుష విగ్రహుడు' అంటారు. 'మాయ' అంటే నిజమైన ఘనతను కప్పిపుచ్చేది అని అర్థం. శ్రీకృష్ణుని 'లీలామానుష విగ్రహుడు' అంటాము. ఆయన అనేకమైన లీలలను చూపించే అవతారము. మరి స్వామివారి అనంతమైన లీలలు, అద్భుతమహిమలు, సాక్షాత్తు దైవ అవతారము కల్గినవారిని సుమారు 25 ఏళ్ల నుండి చూచుచూ, అనుభవించుచున్న మనము స్వామివారిని ఏమని పిలువవలసి యుండును?

స్వామివారిని 'మహామహిమ మానుష విగ్రహు'డని సంభోదించుట ఉచితమని నిశ్చయించినారు. ఆయన అనేకానేక శక్తి సంపన్నుడు, తన బిడ్డలయెడ అనంత కరుణా మూర్తియైన అవతారపురుషుడు.

తెనుగుసేత : డా॥ రాపర్ల జనార్ధనరావు నవంబరు - 1996

# ప్రాణ ప్రయాణ సమయే

- పాలగుమ్మి జగన్నాథరావు, రాజోలు

చాలా విచిత్రమయినది ఈ మానవ జీవితం. ఎన్నో లక్షల జన్మలు ఎత్తినగాని ఈ నరజన్మ లభించదంటారు. ఎంత అమూల్యమైనది! కాని యిది కేవలం నీటి మీది బుడగ వంటిదట. ఎంత క్షణికమయినది! చెట్టున మగ్గిన పండు లాగ, పండిపోయిన ఆకులాగ, గోడను కొట్టిన పిడకలాగ, బీట తీసిన కుండలాగా ఏ క్షణంలో నయినా రాలిపోవచ్చు!

**జీవిత లక్ష్యం :**

"పెరుగుట విరుగుట కొరకే , పుట్టుట చచ్చుట కొరకే" అనే సామెత ఉందిగద. అయితే కేవలం చావడానికేనా మనం పుట్టినది? కాదు కాదు. ముమ్మాటికీ కాదు అంటారు స్వామి. రోడ్డు ప్రమాదంలో మరణించిన తన భర్తకై విలపించుచున్న ఒక ముసలామెకు స్వామి ఉత్తరం వ్రాస్తూ "గతించినదానికి రాబోయేదానికి మధ్యనున్న విరామమే ఈ జీవితం. మన చేతులలో లేనిదానికి లేదా సరిచేయ శక్యము కానిదానికై విలపించుట కోసం కాదు మనం జన్మించినది. ఈ జీవితంలోనే దైవాన్ని అన్వేషించి దైవానుభూతిని పొందాలి" అని మన జీవిత లక్ష్యాన్ని తెలియపరిచారు.

మృత్యువు మన జన్మ హక్కు. ప్రతి ఒక్కరు సాధించెడి వరం యిది. మాతృగర్భం నుండి బయటపడిన మరుక్షణమే ప్రతిజీవి, "పై" ప్రయాణానికి 'టిక్కెట్టు' సంపాదించినాడు. మానవుడు తన గమ్యాన్ని చేరడానికి సుదీర్ఘమయినట్టియూ మరియు క్లిష్టమైనట్టియూ ప్రయాణం చేయాలి. ఆ ప్రయాణంలో స్వల్ప మజిలీయే మానవ జీవితం.

స్వామికి అప్పుడు 25 సం॥లు ఉండవచ్చు. నడివయస్సులో నున్న వారి అక్కగారి భర్త మరణ వార్త విని శ్రీ కస్తూరిగారు కంటతడి పెట్టగా స్వామి ఆయనను మందలించి "కస్తూరీ! చావుపుట్టుకలు లేకపోతే నాకు కాలక్షేపం ఎట్లా?" అని ప్రశ్నించారుట. అందుచేత మనమంతా భగవానుని చేతిలో పాచికలము. సమయం రాగానే తెరపడుతుంది. ఈ జీవితనాటక రంగంలో మన పాత్ర ముగుస్తుంది.

"దేహమనిత్యము. ఆత్మ అనంతము" అనే సత్యాన్ని ధృడంగా విశ్వసించాలని స్వామి బోధిస్తూఉంటారు. స్వామి విభూతిని సృష్టించి మనకు నుదుట అద్దుతారు. ఏనాటి కోనాటికి ఈ దేహం బూడిద మయం అనే చేదునిజం స్ఫురణకు రావాలి.

ఈ ప్రశ్నకు తేలికగా సమాధానం తెల్పగలనని భావించాను. నేను మానవునికి శక్తి ఏఏ రూపాలలో సంప్రదాయకంగా, ఆధునికంగా లభిస్తున్నదీ అన్న విషయాన్ని ఏకరువు బెట్టాను. స్వామి శక్తి లభించే ఉత్పత్తి స్థానాల పట్టికను వింటూ, ఇంకా, ఇంకా ఉన్నాయి. అనటం మొదలుపెట్టారు. చివరికి నేను చెప్పవలసిన పట్టి చివరకు వచ్చేశాను. ఇక స్వామి తాను మాట్లాడటం మొదలుపెట్టి "Geo pressured energy" గూర్చి చెప్పటం మరిచిపోయావు" అన్నారు. ఎంతో వివరణతో, ఎంతో సూక్ష్మంగా, ఈ శక్తి యొక్క రూపం ఏమిటి, ఇది భూగోళంలో అంతర్గతంగా ఉండి, ఎంతో గ్యాస్‌ను ఉద్భవింపజేసి, శక్తివంతంగా, సంక్షిప్తంగా, చాలా హెచ్చు మొత్తంలో లభిస్తుందని స్వామి తెలిపారు. వారు మూడు వాయువులను పేర్కొన్నారు. Hydraulic, Natural gas and Thermal అని విశదీకరించారు ఇది ఆశ్చర్యకరమైన విషయం. ఏదో బహుకొద్ది మంది శాస్త్రజ్ఞులు, పరిశోధకులకు మాత్రమే నేటికిని ఉపయోగింపబడని ఈ క్షిప్తమైన శక్తిని వెలువరించే పరిశోధనాంశాన్ని గూర్చి చర్చింపగలరు.

స్వామికి వేద విద్యయందు, ఆధునిక శాస్త్ర విషయము అందు, గలపాండిత్యం అపారం. ఆంధ్ర దేశములో ప్రసిద్ధి పొందిన వేద పండితులు మా తండ్రిగారు శ్రీ ఘండికోట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. స్వామివారు కేవలం సరస్వతీరూపులు, సర్వశాస్త్ర విజ్ఞానసంపన్నులు అని చెప్పారు. ఒక పర్యాయం మా తండ్రిగార్ని ఈ విషయాన్ని వేదాల ఆధారంతో నిరూపించమన్నాను కూడ. వేదసార మెరిగిన నా జనకునికి స్వామిమీదగల భక్తి అపారము. ఆయన స్వామివారు ఏది తెల్పినను అది వేదములలో వ్రాయబడి ఉన్నదని నాకు తెలియపరచారు. స్వామి మాటలలోని నిత్య సత్యములైన విషయాలకన్నింటికి వేదములలోని బుక్కులతో పోల్చి చెప్పేవారు. ఈ సందర్భంలో ఒక విషయ్యం నా మెదడులో మెదులుతోంది.

అప్పడే పోష్టుమాన్ మా ఇంట్లో 'సనాతన సారథి' ఇచ్చి వెళ్ళాడు. దానిని వెంటనే తెరిచి మా నాన్నగారిని అందులో స్వామి వారు తెల్పిన అంగాలకన్నిటికి వేద ప్రమాణాలు తెల్పమన్నాను. వారు చిరునవ్వుతో ఈ పోటీని ఎదుర్కొనేందుకు సంసిద్ధులైనారు. వెనువెంటనే అందులోగల ప్రతి వాక్యానికి వేదశాస్త్రాధారాలు చూపించటం మొదలుపెట్టారు. ఒక్కొక్క మాటకు ఒక్కొక్క వేదమంత్రం తెలియ జెప్పారు. స్వామి తెల్పిన ప్రతిమాటకు వేదప్రామాణ్యం కలదని నిరూపించారు. నేను స్వామి వారికి గల విస్తారమైన వేద పాండిత్యం అవగాహన చేసికొని స్తబ్ధుణ్ణి అయ్యాను.

మా ఇంట అనేకానేకములైన సాయిమహిమలు, వారి ద్వారా అనుకూలించిన అనేక చికిత్సలు, అనేక సంవత్సరములనుండి మేము చవి చూచుచున్నాము. అన్నిటికైన మిన్నయైన ఆశ్చర్యజనకమైన చికిత్స స్వామివారి మహిమ నా మూడవ అబ్బాయికి

జరిగింది. చిన్న ప్రేవులలో ఇలియం తావునందు సన్నని బెజ్జములు పడి, తీవ్రమైన జ్వరము. బాధతో ఉన్నప్పుడు మాకు తెలియవచ్చింది. సుమారు ఏడు నెలలు ఆస్పత్రిలో ఉండి అనేక పర్యాయములు ఎమర్జన్సీ పరిస్థితులు ఎదుర్కొనుచు నిష్ణాతులైన డాక్టర్ల వైద్య సేవలతో న్యూయార్కు నందలి ఆస్పత్రులలో చికిత్సలు చేయించాను. ద్రవ పదార్థములతో, బేబీ ఫుడ్స్ మీద అప్పుడు బ్రతుకుతున్నాడు. న్యూయార్కు నందలి వైద్యుడు ఆపరేషన్ అవసరమని, ఆపరేషన్ పిదప యావజ్జీవమూ ఒక చిన్న సంచితో ఉండవలసి వస్తుందని మాకు తెల్పాడు. ఆ పరిస్థితిలో మేము బృందావనంలో ఉన్న స్వామి చెంతకు చేరాలని నిశ్చయించాము. పిదప సాయిరాం షెడ్‌లో చాలా సేపు స్వామివారిరాకకై నిరీక్షించాం. ఎంతో ఆశ్చర్యజనకంగా, స్వామియే సరాసరి మావద్దకు వచ్చి లోపలకు సందర్శనానికి రమ్మన్నారు. విభూతిని సృష్టించి స్వామివారే అబ్బాయి నోటిలో కొద్ది విభూతిని ఉంచి తమ కరుణ హస్తాలతో నిమిరారు. పొట్టమీద తమ హస్తాలతో నెమ్మదిగా స్పృశించారు. స్వామివారు అప్పటికప్పడే అబ్బాయికి జబ్బు నయమైపోయిందని ప్రకటించారు. తెలుగువారి మసాలాకారాలు కూడా తినవచ్చునన్నారు. ఆహా! ఏమి స్వామి! ఆదినం క్రిస్మసుకు పూర్వదినం (భోగిలాంటిది) కాబట్టి స్వామి విదేశీ యులందరినీ విందుభోజనానికి ఆహ్వానించి మమ్మల్ని కూడా రమ్మనమన్నారు. మా అబ్బాయిని ముందుగా భోజనంలో వడ్డించినవి ఏమీ తినవద్దనీ, న్యూయార్కు నుండి తెచ్చిన ఆహారపదార్థాలు అచ్చటి మంచినీళ్ళు మాత్రమే తీసికొనాలని మేము హెచ్చరించాము. కాని మా అబ్బాయి మా మాటలన్నీ ప్రక్కకు నెట్టివేసి, ధైర్యంతో కడుపారా వడ్డించినవన్నీ తినేశాడు. మరి స్వామివారు కూడా అలాగే చెప్పారుకద. న్యూయార్కు వెళ్ళినప్పడు డాక్టర్లకు చూపించాం. వారు నమ్మశక్యంగాని ఇది ఒక అద్భుతమైన విచిత్రము అని తెల్పారు. వైద్యపరంగా ఇదొక ఆశ్చర్యజనకమైన చికిత్సా విషయం అన్నారు.

అసాధ్య విషయాన్ని సాధ్యంగా చేయటంలో స్వామి మా మూడవ మనుమని జన్మ విషయంలో నిరూపించారు. 17 ఏళ్ళు నా పెద్దకుమారునికి సంతాన ప్రాప్తి కలుగలేదు. యూరప్, అమెరికాలోని సుప్రసిద్ధ వైద్యులు సంతానం కలగటం అసాధ్యమని తెలుపుట జరిగింది. మా అబ్బాయి, కోడలు చెప్పాపెట్టకుండా సరాసరి బృందావనం వచ్చేశారు. అంతమందిలో స్వామీ ఆ దంపతుల్ని గుర్తించారు. స్వామి నాతో మీ అబ్బాయి కోడలు వచ్చారని చెప్పితే నాకెంతో ఆశ్చర్యం వేసింది, స్వామి వారిని నాతోపాటు జాయింట్ ఇంటర్వ్యూకు తీసికొని రమ్మని చెప్పారు. ఇంటర్వ్యూలో దంపతులు స్వామివారికి పాద ప్రణామములు సమర్పించిన మీదట, స్వామివారు సన్నని, పరిమళయుతమైన విభూతిని సృష్టించి నాముందు తదితర భక్తుల ముందు "సత్యసాయి ఘండికోటవారి కుటుంబానికి "వంశవర్ధనుడు"

# మహామహిమ మానుష విగ్రహం

## శ్రీ. ఘండికోట వెంకట సుబ్బారావు, పుట్టపర్తి

స్వామి రెండు శివలింగాల్ని నోటినుండి వెలికితీయడం చూచిన దృశ్యం మరుపురాని ఒక దివ్యమైన అనుభూతి. వేదిక నుండి స్వామి, విభూతిని ఒక తుఫాను వలె అందరి పైన విస్తరింపచేయటం మెదడును చలింపచేసిన మరియొక మహోత్కృష్టమైన అనుభవం. ఆ విభూతి వేదిక నిండా, నా బట్టలపైనా క్రుమ్మరించ బడినది. కస్తూరిగారు తలక్రిందులు చేసి పట్టుకొనిన ఖాళీ పాత్రనుండి స్వామి చేతితో సైగ చేయగానే అపారంగా షిర్డీసాయిబాబా విగ్రహంపైన ధారగా పుణ్య విభూతి పడటం ఒక అసాధారణమైన దృశ్యం.

శ్రీ సాయి విశిష్ట వ్యక్తిత్వంతో నా తొలిపరిచయం 1960 దశాబ్దంలో అనూహ్యమైన రీతిని జరిగింది. ప్రశాంతి నిలయంలో నా సన్నిహిత బంధువును చాలాకాలం పిదప చూడాలనే సందర్భంలో మహాశివరాత్రి నాడు అచ్చటకు చేరటం సంభవించింది. ఆనాటి రాత్రి స్వామి శివలింగ ఆవిర్భావాన్ని గూర్చి చేసిన ఉపన్యాసం నా హృదయంలో చెరగని ముద్ర వేసింది. ఎంతో దగ్గర నుండి స్వామి రెండు శివలింగాల్ని నోటినుండి వెలికితీయడం చూచిన దృశ్యం మరుపురాని ఒక దివ్యమైన అనుభూతి. వేదిక నుండి స్వామి, విభూతిని ఒక తుఫానువలె అందరిపైన ప్రసరింప చేయటం మెదడును చలింపచేసిన మరియొక మహోత్కృష్టమైన అనుభవం. ఆ విభూతి వేదిక నిండా, నా బట్టలపైనా క్రుమ్మరించబడినది. కస్తూరి గారు తలక్రిందులు చేసి పట్టుకొనిన ఖాళీ పాత్ర నుండి స్వామి చేతితో సైగ చేయగానే అపారంగా షిర్డీసాయిబాబా విగ్రహం పైన ధారగా పుణ్య విభూతి పడటం ఒక అసాధారణమైన దృశ్యం. తదుపరి రెండు రోజులలో స్వామివారి వేరొక రకమైన అద్భుతలీలలు చూచే అదృష్టం నాకు సమకూరింది. సుమారు పన్నెండుమంది బ్రహ్మచారులకు యజ్ఞోపవీతధారణ, ఉపనయన మహోత్సవం జరుగుతోంది. చౌలము (చెవులు కుట్టటం) కూడా ముందుగా జరగాలి గదా. కాని చాలామంది పిల్లలు చెవులు కుట్టించుకోలేదు. స్వామివారు వేంచేశారు. పిల్లల చెవులు కుట్టించ బడకుండా ఉండటం చూచారు. వారి చెవులు (తమ్మిలు) చేతితో స్పృశించారు. చూడండి! వారి చెవులకు కుట్టించకుండానే రంధ్రాలు ఏర్పడ్డాయి. స్వామివారే స్వయంగా బాలుర చెవి రంధ్రాలలో పోగుల్ని జొప్పించారు. ఆనాటి మహోత్సవంలోని ముఖ్య సంఘటన స్వామివారు యజ్ఞోపవీతాలను తమ లీలతో సృష్టింపచేసి బ్రహ్మచారుల తల్లితండ్రులకు అందచేయుట. సాంప్రదాయ సిద్ధంగా యజ్ఞోపవీతాలు బిడ్డలకు తల్లిదండ్రులు ధరింపచేయాలి కదా! స్వామి సర్వజ్ఞాని యని అనేకమంది పండితజ్ఞులు ప్రకటించియున్నారు. అయితే ఇచ్చట వేద విజ్ఞానపరమైన సంఘటన

ఒకటి ఆధునిక భౌతికశాస్త్రమును గూర్చిన మరియొక సంఘటన వెల్లడించటం ముఖ్యమని తలంచుచున్నాను.

ఒక పర్యాయం ప్రశాంతి నిలయంలో ప్రతిభాశాలురైన వేద పండితుల సభ జరిగే సమయంలో నేనుండటం తటస్థించింది. ఈ సందర్భంలో సోమయాగ స్థలిలో ఇటుకలతో యాగస్థలి ఎలా నిర్మించటం అనే శాస్త్రచర్చలో ఇద్దరు ప్రసిద్ధ వేద పండితుల మధ్య బేధాభిప్రాయాలు తలెత్తినాయి. యాగవేదిక నిర్మాణంలో వారలకుగల అభిప్రాయ బేధాల్ని స్వామి ఎదుట తమ వద్దగల 'శ్రౌత' గ్రంధరాజాల్ని చూపించి తమ తమ వాదనలను వివరించారు. వాస్తవానికి పీఠాధిపతులు, మఠాధిపతులకు కూడా ఈ యజ్ఞకార్యక్రమాలలో ఏమి చేయవలసినది అనే విషయం అంతు చిక్కదు. వేదాంత పరమైన ఆధ్యాత్మిక వివరణలు వారికి తెలియును గాని, ఈ యజ్ఞయాగాది విషయములలోని స్థూల, సూక్ష్మ వివరణలు తెలియవు. బహుశః ఈ భిన్నాభిప్రాయములు గల వేద పండితులు యజ్ఞయాగ నిర్వహణలలో స్వామివారి పాండిత్య ప్రకర్షణను పరిశోధించేందుకు వచ్చినారే మోనను శంక కూడా కలుగక పోలేదు. ఈ యాగప్రకరణ విషయములు అందరకీ తెలియరానివి. ఏదో కొద్ది కుటుంబాలకు సంప్రదాయపరముగా, అనుశృతముగా వచ్చిన వారికే ఈ విషయములు అర్థమౌతవిగాని, అందరికీ తెలియని అంశములు, ఈ యజ్ఞ నిర్వహణాంశములు. కాని ఎంతో ఆశ్చర్యంగా ఈ యజ్ఞ నిర్వహణలో తలలెత్తిన వివాదాంశాల్ని సరియైన శాస్త్రీయ విధానం ఏది అనే విషయం తెలియజేసి, వేదాంతర్గతమైన, నిగూఢమైన విషయాన్ని పండితోత్తములకు వివరించటం గొప్ప ఆశ్చర్యకరమైన విశేషం. స్వామి తెల్పిన ఈ వివరణ ఈ ఇరువురు పండితోత్తములకు అంగీకార యోగ్యము కాలేదు. వారిరువురునూ తమ వద్దగల తాళపత్ర గ్రంధాలలో స్వామి తెల్పిన నిర్ణయం పొందుపరచబడి యున్నదాయని వెదకటం ప్రారంభించారు. స్వామి తెల్పిన నిర్ణయమే వేదగ్రంధములలో పొందుపరచబడడం ఆ వేద పండితులకందరకూ స్వామి వారి వేద విషయ ప్రావీణ్యతకు విస్మయంపొంది వినయంతో మరలినారు.

భౌగోళికశాస్త్ర విషయంలో స్వామికి గల అపార పాండిత్యము గూర్చి ఈ రచయిత అయిన నేను స్వానుభవ పూర్వకంగా చెప్పదలచినాను. స్వామివారు ఒకనాడు నన్ను న్యూయార్క్ నగరంలోని యునైటెడ్ నేషన్స్ సంస్థలో ఎనర్జీ శాఖలో "నీవు 'Head of the energy department' గా ఏ శక్తిని గూర్చి పనిచేస్తున్నావు" అని ప్రశ్నించారు. ఇదేదో ఒక జోక్‌గా ప్రశ్నించారేమో అని కూడా నాకు అనిపించింది. స్వామి నన్ను "శక్తి ఎన్నెన్ని రీతులలో ప్రాధమికంగా మనకు లభ్యమవుతుందని?" ప్రశ్నించారు. షుమారు పదిహేనేళ్ళు ఎనర్జీ శాఖకు ఆధిపత్యము వహించి అనేకమైన అంతర్జాతీయ సభలలో ప్రాతినిధ్యం వహించిన నేను స్వామి అడిగిన

ఈ విధంగా ప్రాపంచిక వస్తువుల యందు మమకారము తగ్గించుకొని శాశ్వతా నందము వైపునకు దృష్టిని మరలించాలి.

ఎందుకు పుడుతున్నావ్? మరల పుట్టకుండా ఉండడానికి. ఎందుకు చస్తున్నావు? మరల చావకుండా ఉండడానికి. చావు పుట్టుకలు ఒకే నాణానికి రెండు ముఖముల వంటివి. మన నిజతత్త్వం ఆత్మ స్వరూపం కాబట్టి స్వామి మనలందరినీ "దివ్యాత్మస్వరూపులారా!" అని సంబోధిస్తారు.

**కర్మఫలం :**

ఏ దైవమయితే మనకు శరీరము, మనస్సు, బుద్ధిని ప్రసాదించినాడో ఆ దైవమే మనలో కోరికలను కూడా నాటినాడు. అందుచే కర్మఫలాన్ని ఆ దైవానికే అంకితం చేయాలి. "ఎవరు చేసిన కర్మ వారనుభవించక తప్పదు" అని శాసనము. మానవుడు నిండానూరేళ్ళు బ్రతుకుతాడని అనుకున్నా ఈ మహాకాల ప్రవాహంలో ఈ వంద సంవత్సరాల అంకె ఏ మాత్రము విలువలేనిది. అందుచేత మనం చేసిన కర్మల ననుభవించడానికి మరల మరల జన్మించవలసినదే. 'ఇంగువ గుడ్డ' సామెతలాగా. ఇంగువను తీసివేసినా గుడ్డ వాసన పోదు. అట్లే గత జన్మలలోని "వాసనల" ప్రభావం ఈ జన్మలో కూడ ఉండితీరుతుంది. మనం చేసే ప్రతి చిన్న పని, ఊహించే ప్రతీ ఆలోచన, మాట్లాడే ప్రతీ మాట యొక్క ప్రభావం మనకు తెలిసినా తెలియకపోయినా మనపై తప్పక పని చేస్తుంది. సైన్సులో కూడ "ప్రతి క్రియకు ప్రతిక్రియ కలదు" అనే సూత్రం ఉంది. (Every action has its reaction) ఇచట చిత్రగుప్తుని గురించి స్వామి చెప్పిన వివరణను గుర్తించుట అవసరము.

**చిత్రగుప్త :**

యమధర్మరాజు కొలువులో లేఖకుడయిన చిత్రగుప్తుని గురించి మీరు వినియే యుందురు. ప్రతి జీవియొక్క మంచి చెడ్డలను సూచించెడి ఒక రిజిష్టరు (పుస్తకము) ను అతడు జాగ్రత్త పెట్టును. చనిపోయిన తర్వాత ఆ జీవికి సంబంధించిన వివరములన్నియూ యమ సభలోనికి తేబడి మంచి చెడ్డలను తేల్చివేసి నికరము చూపబడును. అపుడు యమధర్మరాజు తగు శిక్షను విధించును. ప్రతీవాని మనస్సులోను ఈ చిత్రగుప్తుని కార్యాలయముకలదు. అతడు సర్వకాల సర్వావస్థల యందు మెలుకువగా అప్రమత్తతతో ఉండును. చిత్రగుప్త అనగా 'గుప్త' (రహస్యమయిన) చిత్రమా అని అర్థము. క్రియారూపమును దాల్చు రహస్యము లయిన ప్రేరణములను మరియు వాటిని నిర్లక్ష్యము చేసినట్టియు లేక తృణీకరించి నట్టియు సందర్భములన్నిటినీ లిఖించును..." అని స్వామి చక్కగా వివరించిరి.

## మానవుడు కర్మపాశ బద్ధుడు

స్థంభానికి కట్టబడిన ఆవు త్రాడు మేరకే మేయగలదు. గాని దానిని దాటి వెళ్లలేదు. అట్లే మానవుడు కర్మపాశానికి బద్ధుడై ఉండవలసినదే. రమణ మహర్షి, రామకృష్ణ పరమహంస మొదలగు మహానుభావులు శారీరక బాధలననుభవించడానికి అంగీకరించినారు గాని తమ భక్తుడెంత వేడుకొన్నను తుచ్ఛమయిన ఈ శరీర రక్షణకై అమూల్యమయిన ఆధ్యాత్మిక సాధనలను వృధాపరచుటకు అంగీకరించలేదు.

## ఈ జన్మలోనే అనుభవించాలి.

తమిళనాడుకు చెందిన ప్రఖ్యాత సంగీత విద్వాంసుడు శ్రీ సౌందరరాజన్ కుమారుడు తీవ్ర కామెర్ల వ్యాధితో మంచం పట్టాడు. అతని ఆరోగ్యం గురించి వైద్యులు పెదవి విరిచారు. అతనిని ఇంటికి తీసికొనివచ్చి వాని కోరికపై స్వామిపటం ముందు పడుకోబెట్టారు. తన కుమారుని ప్రమాదస్థితిని స్వామికి తెలియపరచడానికై సౌందర రాజన్ ప్రశాంతి నిలయానికి ఎన్ని సార్లు ఫోను చేసినా గందరగోళం ధ్వనులు వచ్చాయి కాని స్వామి మాట వినబడలేదు. స్వామి నామాన్ని జపిస్తూ ఆ బాలుడు మరణించాడు. "నీ కొడుకు పవిత్రాత్ముడు. బాకీయున్న కొద్దిపాటి కర్మను ఈ జీవితంలోనే చెల్లించి చావు పుట్టుకల బంధాలనుండి విముక్తి అయ్యాడు." అని స్వామి ఆ తర్వాత సౌందరరాజన్‌కు తెలియపర్చినారు.

శేషగిరిరావు 14 సం॥ల బాటు పాత మందిరంలో ఎంతో నిష్ఠగ పూజ చేసేవాడు. "చెట్టు మీద ఉన్న చిన్న కొమ్మ మీద పక్షి కూర్చుంటుంది. కొమ్మ విరుగుతుంది. పక్షి బెదిరిపోతుందా? ఆనందంగా ఎగిరిపోతుంది. అదే విధంగా ఈ శరీరమనే చెట్టు విరిగి క్రిందపడితే ఆత్మ అనే పక్షి దానితోబాటు విరిగి నేల పడదు. రెక్కలు జాపుకుని హాయిగా భగవంతుని దగ్గరకు ఎగిరిపోతుంది. ఈ సత్యాన్ని గ్రహిస్తే ప్రతి ఒక్కరూ కూడ మృత్యుభయం నుండి బయటపడవచ్చు." అన్నారు బాబా.

అయితే మనం జనన మరణ చక్రంలో పడకుండగ తిన్నగ దైవాన్నే చేరుతామనే హామీ ఉంటే తప్ప మృత్యు భయాన్ని ఎలా పోగొట్టుకోగలం?

స్వామి శేషగిరిరావుకు ఈ అభయాన్ని ప్రసాదించారు.

"యమధర్మరాజు వచ్చి ఫోటో తీస్తాను రెడీగ ఉండు స్టెడీగ ఉండు అని చెప్పడు. ఏక్షణంలో నయినా రావచ్చు. అందుచేత ఎప్పడూ మనం ఎంత మంచి ఫోజులో ఉంటే అంత చక్కగా మన ఫోటో పడుతుంది" అన్నారు స్వామి.

శేషగిరిరావు మృత్యు ముఖంలో ఉన్నాడు. అంపశయ్యపై పరుండి భీష్ములవారు నీతిబోధలు చేసిన విధంగా చిక్కి శల్యమై మంచాన్ని బల్లిలాగ అంటి పెట్టుకుని యున్న శేషగిరిరావు చక్కటి వేదాంతాన్ని బోధిస్తున్నాడు. "పరలోకానికి" వెళ్ళిపోతున్నానని చెబుతుంటే చుట్టూ చేరిన భక్తులు కన్నీరు కారుస్తున్నారు. ఆ సమయంలో స్వామి అక్కడకు వచ్చి "ఏమిటి నాయనా! ప్రయాణం అంటున్నావు. ఎక్కడికి అసలు నీకు టిక్కెట్టు ఎవరిచ్చారు? టిక్కెట్టులేని ప్రయాణం ప్రమాదం గద. లే! లేచి పూజామందిరంలో పనిచూసుకో" అని ఆజ్ఞాపించగానే అతడు దులుపుకుంటూ లేడి పిల్లలాగ పరుగెత్తుకుని పోయేడు. ఆరు నెలలయింది. శేషగిరిరావు తీవ్రంగా జబ్బుపడి బాధపడుతున్నాడు. "హాయిగా పోయేవాడిని పోనీయక అడ్డుపడి ఆరునెలలు తిరగకుండానే ఇంత బాధ స్వామి వానికెందుకు కలుగజేసారో?" అని భక్తుల అనుమానం. "అతడు చేసిన కర్మ ఫలితాన్నంతా ఈ జన్మలోనే అనుభవించాలి. పై జన్మకు మోసికొని పోరాదు" అన్నారు స్వామి.

ప్రశాంతత అనే సరస్సులో పూలనావపై తేలిపోతున్నట్లుగా ఆనంద పడిపోతున్నాడు శేషగిరిరావు. ఒకరోజు సాయంత్రం అతడు కొన ఊపిరితో పడియున్నాడు. స్వామి అతని ప్రక్కన కూర్చుని "నాయనా! స్వామి వచ్చారు నోరు తెరు" అన్నారు. శేషగిరిరావు కొద్దిగ నోరు తెరిచాడు. స్వామి ఒక గ్లాసుడు పాలు తీసికొని చెంచాతో కొద్దికొద్దిగా వాని నోట్లో పోసారు. వెళ్ళిపోతూ గుమ్మం దగ్గర ఆగి వెనుకకు తిరిగి "నాయనా! ఇపుడు నీవు వెళ్ళవచ్చు" అన్నారు. శేషగిరిరావుకు "టికెట్టు" దొరికింది. అతి ప్రశాంతంగా స్వామిలో ఐక్యమయ్యాడు.

"సాయి భక్తులనేకులు అంత్యకాలమున అందరివలె శరీర యాతనలబడి దీర్ఘకాలము బాధల పడకయే సునాయాసముగ మరణించుచున్నారు. ఇది మాత్రము ఈ సాయిరామ పరబ్రహ్మము యొక్క అపార మహిమయని ఘంటా పథంగ చెప్పగలను" అని పెద్దబొట్టుగారు యదార్థమును వెల్లడించారు. స్వామి నామాన్ని జపిస్తూ తుది శ్వాస విడిచే ధన్యులెందరో యున్నారు. కొందరు భక్తులయితే స్వామి తమకు దర్శన మిచ్చారని, స్వామిపిలుస్తున్నారని, స్వామి ప్రక్కనే యున్నారని పొంగిపోతూ ప్రాణం వదలుతారు.

## స్వామి ప్రసాదించిన వరం

"అంత్యకాలమునందు ఎవరు నన్నే స్మరించుచూ దేహమును వీడునో అతడు నిస్సందేహముగ నా స్థితిని పొందును." అని గీతాచార్యులు శపథం చేసినారు.

"నాలో ధృడవిశ్వాసం ఉన్న అందరికీ నేనిచ్చిన మాటను నిలుపుకుంటాను. తమ జీవితాలను నాకే అంకితం చేసినవారి అంత్యదశలో నేను దర్శనమిస్తాను.

వారు పట్టరాని ఆనందంతో నాలో ఐక్యమవుతారు." అని సాయి కృష్ణుడు ప్రతిన చేసినారు. అయితే అంత్యదశ ఎపుడో ఎవరు నిర్ధారించగలరు? అప్పుడు భగవన్నామాన్ని స్మరించగలమా?

"పదపదయనుచు కింకరులు పాశములాగువేళ
బంధువుల్ దబదబ బయట పెట్టుడిక లాభము లేదనువేళ
ఆలుబిడ్డలున్ లబలబ ఏడ్చువేళ
తరమా హరినామ మానోట బల్కగన్"

అని స్వామి ప్రశ్నిస్తారు.

స్వామి చిన్నతనంలో "తోలుబొమ్మ" పాటపాడి తత్త్వాన్ని భోధించారు.

బుజ్జుమనుచు జీవుండును పిట్ట
బుట్టబొమ్మను వీడిపోగా
చిబ్బున నారిన కట్టె బొమ్మ యిది
బబ్బున బైటికి పట్టిలాగే బొమ్మయిది
తెత్తెతెత్తెతె తోలుబొమ్మ
దీని తమాష చూడుం మాయబొమ్మ"

జీవితమంతా సాధన చేసిన గాని అట్టి పవిత్ర తుదిఘడియల యందు పొంద జాలము.

90 సం॥ వృద్ధురాలయిన ఇంద్రాదేవి తల్లికి "నీవు ఈ లోకాన్ని వదలిపోయేటప్పుడు నీకు అమృతాన్ని ప్రసాదిస్తాను" అనే వరాన్ని స్వామి ఆమెకు ప్రసాదించారు. ఆమె అంత్యదశ సమీపించింది. ఆమె గదిలో యున్న షిరిడీసాయి ఫోటో కుడికాలు బొటన వ్రేలునుండి రెండు ఔన్సులకు మించిన మంచిసువాసన కలిగి అతి మధురమయిన అమృతం స్రవించింది. ఆ ముదుసలి దానిని పానంచేసి ప్రశాంతంగా సాయిలో కలిసిపోయింది.

వృద్ధురాలయిన కస్తూరిగారి తల్లి జానకమ్మ చిన్న తనంలో యున్న స్వామి యొక్క సున్నితమయిన చేతులను తన చేతిలోనికి తీసికొని "స్వామీ! ఈ వృద్ధురాలు శాశ్వతంగా కన్నుమూసే సమయమున మీ లేత చేతులతో నా గొంతుకలో గంగాజలాన్ని పోసి నాకు మోక్షాన్ని ప్రసాదించండి." అని వేడుకున్నది.

"తప్పక అట్లే జరుగుతుంది" అని స్వామి హామి యిచ్చారు.

జానకమ్మకు అంత్యదశ వచ్చింది. స్వామి బెంగుళూరులో ఉన్నారు. అయితే నేమి ఆమె గదిలోనున్న స్వామి ఫోటోనుండి గంగాజలం ధారాళంగా ప్రవహించింది. జానకమ్మ దోసిట పట్టి మూడు మార్లు త్రాగి కన్ను మూసింది.

తల్లి యశోద బాలకృష్ణుని పెంచిన విధంగ కరణం సుబ్బమ్మ చిన్నిసాయిని ప్రేమతో లాలించింది. అంతే కాదు. స్వామి సాక్షాత్తు పరమాత్మయేయని గ్రహించి తన సర్వస్వం త్యాగం చేసింది. తుదిక్షణాల్లో స్వామి తన యొద్ద ఉండాలని మనసారా కోరుకున్నది. వృద్ధాప్యం వచ్చింది. పరిస్థితి విషమించింది. ఆమె ఎంత వద్దంటున్నా బంధువులు ఆమెను వైద్యం కోసం బుక్కపట్నం బలవంతంగ మోసుకుని పోయేరు. "నా స్వామి చేతుల లోనే నేనుపోవాలి" యని లేని ఓపిక తెచ్చుకొని గర్జించింది.

"ఇది వరకటి స్వామి అనుకుంటున్నావు. ఆయన యిప్పుడు బెంగుళూరులో బాగా బలిసిన భక్తుల యింట ఉంటున్నాడు. ఇంకా ముసలి సుబ్బమ్మ ఆయనకు గుర్తుంటుందని అనుకోవడం ఒట్టి భ్రమ. నీ కర్మ. చావు' అని కాకులలాగ పొడిచారు. సమయం వచ్చింది. కరణం సుబ్బమ్మ శాశ్వతంగా కన్నుమూసింది. ఊపిరిలేదు. నాడిలేదు. బాబాను తిట్టుకుంటూ వారు "శవాన్ని" తీసికొనిపోయే ప్రయత్నంలో ఉండగ ఒక్కసారి వెనక్కి తగ్గారు. సుబ్బమ్మ శరీరం అంతా కవచం లాగున చంద్రకాంతిని బోలిన తేజస్సు కప్పి ఉండడం చూసి ఆశ్చర్యపోయేరు. శరీరం "మార్పు" వచ్చాక చూద్దామనుకున్నారు. మూడురోజులయింది. శరీరం రంగు మారలేదు. ఈగ వ్రాలలేదు. చీమ పీకలేదు. స్వామి బెంగుళూరు నుండి తిరుపతి వెళ్ళారు. అక్కడనుండి తిన్నగా బుక్కపట్నం వచ్చారు. సుబ్బమ్మ పక్కలో కూర్చుని "సుబ్బమ్మా సుబ్బమ్మా" అని రెండుసార్లు పిలిచారు. శాశ్వతంగా మూతపడియున్న కనులు మెల్లగ తెరుచుకున్నాయి. తల్లిలాగ చిన్నిసాయి శరీరాన్నంతటిని తడిమింది సుబ్బమ్మ. కొద్దిగ నోరు తెరవగ స్వామి తమ వేళ్లను ఆమె పెదవులపై ఉంచినారు. అందుండిజారిన గంగాజలాన్ని త్రాగి ధన్యురాలయింది సుబ్బమ్మ.

కరణం సుబ్బమ్మ వలెనే నర్సమ్మ అనే ఆమె కూడ స్వామి భక్తులకెంతో సేవ చేసి అనుగ్రహాన్ని నిండా సంపాదించినది. ప్రశాంతి నిలయంలో ఆమె ఆరోగ్యం ఏమీ బాగుండనప్పుడు గోవాలో మకాం చేసియున్న స్వామి "నర్సమ్మా! ఆశీస్సులు. స్వామి సదా నీ హృదయవాసి. సాయి ఎప్పుడూ నిన్ను మరువడు. ప్రతి క్షణం సాయి నామాన్ని జపించు. నీ మనస్సునంతటిని సాయి రూపంతో నింపుకో. ఒక్క క్షణం కూడ నీ మనస్సును అటు ఇటూ పోనీయకు. నీలోనున్న సాయి నిన్ను రక్షించును. సాయిలో ఐక్యమగుటకు సిద్ధంగా ఉండు" అని ఉత్తరం వ్రాశారు. నర్సమ్మ ఆరోగ్యం బాగా క్షీణించింది. తుదిక్షణాలు సమీపించినవి. కాని అందరూ ఆశ్చర్యపోయేటట్లు ఏదో గొణుగుతూ చేతి వ్రేళ్లను నోటిలో పెట్టుకుంటోంది. "ఏమి చేస్తున్నావని" అక్కడవారు అడుగగా "ఇదిగో స్వామి వచ్చారు. నాకు విభూతి

ప్రసాదించారు." అంటూ కన్ను మూసింది. స్వామి ఒక ఉపన్యాసంలో నర్సమ్మతో పోల్చదగు వ్యక్తి మరొకరు లేరని ఘనంగా పొగిడారు.

కొందరు కుదర్చరాని దీర్ఘవ్యాధులతో బాధపడుతున్నప్పుడు స్వామి వారి సన్నిహితులకు "గత జన్మంలో చేసికొన్న పాప ఫలితమిది. దీనిని ఈ జన్మలోనే అనుభవించి పూర్తి చేసికోవడం మంచిది" అని సలహా యిస్తారు. కర్ణాటకలోని దావణగిరి కాలేజీలో కస్తూరిగారు పనిచేస్తున్నప్పుడు ఆ కాలేజీలో నౌకరయిన అనంతప్ప కూతురు కుదర్చరాని రోగంతో బాధ పడుతున్నపుడు స్వామి అనంతప్పను పిలిచి "అనవసరంగ ఈ డాక్టరు కాదు ఆ డాక్టరు ఈ మందు కాదు ఆ మందు అంటూ పరుగులు తీస్తూ నీ వద్ద ఉన్న కొద్ది మొత్తాన్ని ఏల ఖర్చుపెడతావు? ఈ నెలాఖరులోగా ఈ జీవి పంజరం నుండి బయటపడుతుంది" అని సలహా యిచ్చారు. అట్లే జరిగింది.

కర్ణాటక రాష్ట్రంలో స్వామి ఆదేశం మేరకు అనేక విద్యాసంస్థలు స్థాపించిన నారాయణభట్టు కారు ప్రమాదంలో మరణిస్తాడు. "నారాయణభట్టు నాలో ఐక్యమయినాడు" అని స్వామి వాని తల్లికి టెలిగ్రామ్ పంపినారు. ఒక్కగాని ఒక్క కొడుకుని పోగొట్టుకొన్నప్పటికి ఆ వృద్ధురాలు "మృత్యువు మా అబ్బాయిని ఎలా కాటు వేయగలదు?" అని ప్రశ్నించింది.

స్వామి దృష్టిలో ఎవరి ఉనికి ఈ భూమిపై యింకా అవసరమని తోచునో అట్టివారిని "చనిపోయినప్పటికి" ఆ లోకంనుండి యిక్కడకు ఈడ్చుకుని వస్తారు.

పుట్టపర్తిలో రాధాకృష్ణయ్య మృతి చెందాడు. శరీరం కట్టెలాగ బిగుసుకొనిపోయింది. రంగు మారింది. చీమలు కూడ పట్టినవి. భార్యాబిడ్డలు లబో లబోమని గోల పెట్టారు. స్వామి ఏమిచేసారో ఏమో ఎవ్వరికీ తెలియదు. అతడు లేచి కూర్చున్నాడు. కొద్ది సంవత్సరాలకు అతడు హఠాత్తుగా మరణిస్తాడు. ఈ విషయాన్ని ఒక భక్తుడు స్వామి దృష్టికి తీసికొనిరాగా "అవును. రాధాకృష్ణయ్య అతని కుటుంబసభ్యులు నా భక్తులు. అతని వలన జరుగవలసిన కోర్టు వ్యవహారాలు కొన్ని ఉన్నాయి. అతడు లేకపోతే వాని కుటుంబం వీధిలో పడేది. ఇప్పటికే అతని ఆయుష్షు పెంచాను. ఇంక అవసరం లేదు." అన్నారు స్వామి.

మూడుసార్లు మృతి చెందిన 80 సం॥ల వృద్ధ కోవార్‌ను మూడుసార్లు బ్రతికించారు స్వామి. అటు పిమ్మట అతడు ఆరోగ్యంగా 19 నెలలు జీవించాడు. ముఖ్యంగా అతడు మృత్యుభయాన్ని పోగొట్టుకున్నాడు. ఆధ్యాత్మికంగా అనేక మెట్లు పైకి పోయాడు. తుది క్షణాలలో నామస్మరణ చేస్తూ ఆనందంగ ప్రశాంతంగా పరమాత్మలో ప్రవేశించాడు. ఆ మరుక్షణమే స్వామి Cowan reached here in

Good Shape (కోవాన్ ఇచటకు చక్కగ చేరినాడు) అని అమెరికాలో ఉన్న కోవాన్ భార్యకు Cable వార్త పంపినారు.

**మన భాగ్యమే భాగ్యము**

'తక్కువేమి మనకు రాముడొక్కడుండు వరకు' అని భద్రాచలరామదాసు శ్రీరామచంద్రునికి సంపూర్ణ శరణాగతియై పట్టరాని ఆనందంతో పాడుకున్నాడు. మన వంకర టింకర Shape లన్నింటినీ చక్కగ ఇస్త్రీ చేసి "Good Shape" ప్రసాదించే పరమాత్మ మనలందరినీ కంటికి రెప్పవలె కాపాడుచుండగా మనకు మాత్రము ఏమి తక్కువ?

అహో మన భాగ్యమే భాగ్యము!

నవంబరు - 1996



# భగవత్ చింతన

*"దేహములోని సర్వాంగములు అతి సుందరంగా అతి పుష్టిగా వుండినప్పటికినీ, వీటన్నింటికీ ఆధారమైన గుండె గనుక ఆరోగ్యముగా లేని యెడల, అవన్నియూ ఎంత నిష్ప్రయోజనమో, అదే విధముగ మీకు భౌతికంగా, లౌకికంగా రాజకీయముగా, వ్యాపారికముగా అన్నియునూ పుష్టిగా, తుష్టిగా వుండినప్పటికినీ 'భగవత్ చింతన' లనెడి గుండె లేని యెడల మీరు నిర్జీవులే. కనుక మీ మీ విధులను సక్రమంగా నిర్వర్తిస్తూ 'భగవత్ చింతన' ను మాత్రం నిర్లక్ష్యం చేయకండి. 'భగవత్ చింతన' వలన మీకు సర్వక్షేమములు, సర్వానందములు, సర్వ సుఖములు చేకూరుతాయి".*

\- బాబా

# భగవాన్ సాయి దివ్యలీలలు

యస్. సీతాదేవి, సికింద్రాబాద్

భగవాన్ శ్రీ శ్రీ శ్రీ సత్యసాయిబాబా వారి దివ్యలీలలు, ఒక విధంగా ఈ కలియుగములో మానవాళిని అజ్ఞానము నుంచి జ్ఞాన మార్గములో నడిపించుటకే అని భావించవలసి ఉంటుంది. విగ్రహారాధనే భగవత్ సాన్నిధ్యంగా భావించే మనకు, భగవంతుడు సర్వజీవవాసి, సర్వాంతర్యామి, సర్వశక్తిమంతుడు, సాకారరూపములో కూడా ఉంటాడు. అని నిరూపించే నిమిత్తమే కొన్ని సంఘటనలు కల్పిస్తూ ఉంటారు.

1972వ సంవత్సరము వరకూ భగవాన్ సత్యసాయిబాబావారు ఎవరో నాకు తెలియదు. ఒకసారి మా సోదరి ఇంటిలో బాబావారి ఫోటో, సనాతన సారధి పత్రికలు చూడడం తటస్థించింది. అప్పటిలో ఆయన గురించి నా అభిప్రాయము ఆయన ఒక మహానుభావుడు. కాని ఎప్పుడూ పూజించలేదు. అప్పటిలో నా ఆరాధ్య దేవతలు తిరుపతి వెంకటేశ్వరస్వామి, బెజవాడ కనకదుర్గ, శ్రీశైలం మల్లన్న.

1975వ సంవత్సరము ఆగష్టు 8వ తారీఖున అనగా శ్రావణమాసము, వరలక్ష్మీ వ్రతమునకు ముందు శుక్రవారము మా వారు, పిల్లలతో తిరుపతి వెళ్ళడం జరిగింది. వెళ్ళేముందు వస్తువులన్నీ తీసుకున్న నన్ను చూచి మావారు ఏ పెండ్లికి వెడుతున్నావు? తిరుపతిలో చాలా రద్దీగా ఉంటుంది. అవన్నీ తీసేయి అని కసిరారు. అలా అన్నారన్న కోపముతో ఎప్పడూ తియ్యని చేతిగాజులు కూడా తీసి; ఒక్కో గాజు, మెళ్ళో సూత్రంతాడు మాత్రము ఉంచుకొని మిగిలినవన్నీ పెట్టెలో పెట్టేశాను. మొత్తము 30 కాసులు బంగారము ఉంటుంది. వెండి సామాను 70 తులాలు ఉండవచ్చు. మేము తిరుపతి వెళ్ళిన రాత్రే దొంగలుపడి, మొత్తము వెండి, బంగారము, మంచి బట్టలు అన్నీ కాజేసారు. ఇంటి తాళము బ్రద్ధలుకొట్టారు. ప్రక్కింటివాళ్ళు భయపడి పోలీస్ రిపోర్టు యిచ్చారట. మేము తిరుపతి నుండి ఆదివారం తిరిగి వచ్చేసరికి, మా ఇల్లు పోలీసు కస్టడీలో ఉంది. ఇక అప్పటి మా పరిస్థితి ఎలా ఉంటుందో ఊహించగలరనుకుంటాను.

మేము భగవత్ సన్నిధికేగా వెళ్ళింది? యిలా ఎందుకు జరిగింది? అని బాధపడుతూ ఉంటే, పోలీస్ ఇనస్పెక్టరు నగలు గురించి రకరకాలుగా ప్రశ్నలు అడగడము, జరిగిన సంఘటనను మాటిమాటికి గుర్తు చేస్తూ ఉండటం వలన మనస్సు శాంతిగా ఉండేదికాదు. అలా భారంగా రోజులు గడుస్తున్నాయి. వస్తువులు దొరుకుతాయనే ఆశ, నమ్మకము కలగడము లేదు. మా ఇంటికి నాలుగు ఇండ్లు తరువాత ఉన్న ఒకరి యింటిలో సత్యసాయిబాబావారి భజన నెలనెలా జరుగుతూ

ఉండేది. ఆ యింటివారు, మా విషయము తెలుసుకొని బాబావారి జీవిత చరిత్ర తెలిపే సత్యం, శివం, సుందరం పుస్తకాలు చదువుకోమని తెచ్చి యిచ్చారు. దాని వలన మనస్సుకు శాంతి కలుగుతుందని ధైర్యము కూడా చెప్పారువారు. సత్యం, శివం, సుందరం మొదటి భాగము కొంతవరకు చదివే సరికి బాబాగారు భగవంతుడా! అనే అనుమానము కలిగింది. ఆ పుస్తకములోనే శ్రీ బాబావారు కష్టాలు తెలియచేస్తే, పరిష్కారమార్గము సూచించిన సంఘటనలు కూడా వ్రాసారు కదా! అందుకే బాబాగారికి ఒక జాబు వ్రాశాను. అందులో నాకు మనశ్శాంతి కావాలని కోరుతూ, ఏదైనా మంత్రము ఉపదేశించమని, జరిగిన సంఘటన, త్రికాలజ్ఞులయిన మీకు తెలిసే ఉంటుందని కూడా వ్రాశాను. జాబు పోస్టు శనివారం జరిగింది. కాబట్టి మరల శనివారము నాటికి బాబాగారి దగ్గర నుండి జవాబు వస్తుందనే ఆశతో, ఆతృతతో ఎదురుచూస్తున్నాను. ఆ శనివారము రానే వచ్చింది కాని బాబావారి దగ్గర నుండి జవాబు కాదు. సాయంత్రము ఆఫీసు నుండి వచ్చిన మా వారు వాళ్ళ ఆఫీసుకు సంబంధించిన వారి యింట్లో బాబా ఫోటో నుండి విభూతి పడుతుందట చూసివద్దామా అని అన్నారు. దానితో బాబాగారి దగ్గర నుండి జవాబు వచ్చినంత ఆనందము కలిగింది. వెంటనే వారి యింటికి వెళ్ళాము. నిజంగానే ఆ ఇంటిలో బాబాగారి ఫోటోల నుండేకాక, అన్ని దేవతా పటాల నుండి, చనిపోయిన వారి పెద్దల ఫోటోల నుండి విభూతి కుప్పలుగా రాలడము చూచాము. అంతేకాక భజనకొరకు విడిగా పెట్టిన ఫోటోల ముందు, ఎక్కువగా విభూతిపడి, దానిలో "ఓం నమఃశివాయ" అనే పంచాక్షరీ క్రింద 'బాబా' అనే సంతకము కూడా ఉండడము చూచాము. ఆ ఇంటి ఆమెకు బాబా కన్పిస్తున్నారట. ఆ మంత్రము ఒకరు అడిగారని వారి కోసము యిచ్చానని చెప్పారట. ఆ మాటవినగానే 'నా కోసమా?' అనే భావన కలిగినా నాకు కాదేమోలే అని సరిపెట్టుకున్నాను. కాసేపు భజనలో పాల్గొని యింటికి వచ్చాము. వారింటిలో బాబావారు కన్పించకుండానే ప్రసాదము పెడితే తినడమూ, జ్యోతులు వెలిగించడములాంటి మహిమలు జరిగాయి. ఒకసారి సీతాఫలము తీసుకుని వెళ్ళి పెడితే, ఆ పండు తిని గింజలు కూడా పారవేయడము కన్పించకుండానే చేశారు. అదొక వింత లోకంగా ఉండి, రోజుకొక వింత చూడటముతో నా బాధ చాలా వరకు మరిచిపోయాననే చెప్పవచ్చు. కాని, అప్పుడప్పుడు బాబా జవాబు కొరకు మనసు ఎదురుచూస్తూ ఉండేది.

నా మనశ్శాంతి కొరకు బాబా జీవితచరిత్ర యిచ్చినవారే ఒకసారి దసరా ఉత్సవాలకు పుట్టపర్తి వెడుతూవుంటే, వారితోనే తొలిసారిగా పర్తికి వెళ్ళాను. వెళ్ళిన దగ్గర నుండి స్వామి నన్ను పిలిచి నాకేమైనా చెబుతారనే ఆశతో ఉన్నాను. కాని, స్వామి నాకేమి చెప్పకపోయినా లైనులో ఉన్న నా దగ్గరకు వచ్చి పాదనమస్కారము

చ్చారు. "బాబా! మంత్రము! మంత్రము" అన్నాను అప్రయత్నంగా! "అదే అదే" ంటూ వెళ్లిపోయారు. 'అంటే ఆ విభూతితో యిచ్చిన మంత్రము, నా కొరకేనా'? యితే ఏవిధంగా జపించాలో తెలియదు. జపమాల కొన్నాను. మేముంటున్న డ్డులోనే విశాఖపట్టణము నుంచి ఒక సోదరుడు, మాటల సందర్భములో పమాల ఏ విధంగా పట్టుకొని, జపము చెయ్యాలో వివరించి, లక్షసార్లు పూర్తిచేస్తే ప్పకుండా ఫలితం ఉంటుందని కూడ చెప్పాడు.

ఇంటికి వచ్చాక గడియారము దగ్గర పెట్టుకొని అరగంటసేపటికి ఎన్నిసార్లు పించగలనో అన్నిసార్లు శ్రీ బాబావారు యిచ్చిన 'పంచాక్షరీ' జపించేదాన్ని. ఆ ధంగా మూడువేళలా చేసి, లక్ష పూర్తి చేశాను.

అప్పటి నుండి శ్రీ బాబావారు లీలగా కనిపించడము అంటే కళ్ళు సుకుంటే ఒక నీడలాగ కన్పించేవారు. తరువాత కలలో కన్పించి, ఆధ్యాత్మిక ర్గానికి కావలసిన సూచనలు చేస్తూ ఉండేవారు. "ఆంజనేయుడు నా భక్తుడు తనికి కూడ నైవేద్యము పెట్టు" అని చెప్పారు ఒకసారి. అంటే రెండు నైవేద్యాలు ట్టమన్నారు. బయటకు వెళ్లినప్పుడల్లా, హనుమాన్ చాలీసా మననము సుకోవడము నాకొక అలవాటు. అటువంటిది ఒకసారి, "అవన్నీ ఎందుకూ! ంచాక్షరీ ఉందిగా!!" అన్నారు కలలో.

ఆ విధంగా కొంతవరకు మనశ్శాంతి కలిగినా, ఒక విధమైన ఆందోళన నస్సులో ఉండేది. వస్తువులన్నీ పోయాయి. నాకు ముగ్గురు ఆడపిల్లలు. వాళ్ళ విష్యత్తు ఏమిటా అనే ఆందోళన. అందుకే మా పెద్దమ్మాయికి సంబంధాలు సూడమని మావారిని వేధించేదానిని. అప్పటికి ఆ అమ్మాయి టెన్తుక్లాసు చదువుతూ ఉంది. ఎక్కువ చదివిస్తే పెద్ద సంబంధాలు కావాలి కదా! అని నా భిప్రాయము.

అవి మండు వేసవి రోజులు. ఆ రోజు ఆదివారము. సెలవుదినము కాబట్టి మావారు స్కూటరు క్లీను చేసుకోవడంలో నిమగ్నులయ్యారు. పిల్లలు ప్రక్కింటికి వెళ్లి ఆడుకుంటున్నారు. పెద్దపిల్లకి సంబంధాలు చూడటములేదని అప్పటి వరకు మావారిని విసిగించి అట్లా మంచము మీద నడుమువాల్చాను. మగతలా కళ్ళు మూతలు పడ్డాయి. కలో, నిజమో అర్థం కాని పరిస్థితిలో ఉన్నాను. ఒక ముసలామె నా దగ్గరకు వచ్చి, నా తల ప్రేమతో నిమురుతూ కష్టాలు కలకాలము ఉండవు అని ఓదార్పుగా అంది. వెంటనే మంచము మీద నుండి లేచి కూర్చుని ఆమెను కూర్చోమని చెప్పాను. ఆవిడ నా వైపు ప్రేమతో చూస్తూ ఉంటే ఆ ప్రేమకు నా కళ్ళు నీటితో నిండిపోయాయి. యిప్పుడే వస్తానని లోపలికి వెళ్లి చల్లటినీరు త్రాగేందుకు

తీసుకువచ్చాను. కాని, ఆశ్చర్యం ఆ వృద్ధురాలు స్థానములో శ్రీ బాబావారు కూర్చొని ఉన్నారు. ఆనందముతో ఆయన పాదాలపైన వ్రాలాను. ప్రేమతో నాతల నిమురుతూ, పైకెత్తి "ఉమ" (మా పెద్దమ్మాయి పేరు) పెండ్లి చేద్దామనుకుంటున్నావు కదూ" అన్నారు. అవును అన్నట్లు తల త్రిప్పాను. 'ఇదిగో చూడు! చూడు!' అంటూ తన అరచేతిని చూపించారు. చేతిని పైకెత్తి చూపించినారు. చేతిలో ఒక అలారము టైమ్ పీస్‌లాంటిది ఉంది. మూడు అంకెమీద చిన్నముల్లు ఉంది. అప్పుడే పెండ్లి జరుగదు. చదివించు అన్నారు. అయితే కాలేజీలో సీటు ఇస్తారా అన్నాను. తమాషాగా కనుబొమలెగురవేసి నవ్వారు. నిజానికి బాబా అనంతపురములో మహిళలకు కాలేజి కట్టించారన్న సంగతి నాకు తెలియదు. నా కల విన్నవారు ఆ సంగతి చెప్పారు. అందుకే స్వామి నవ్వి ఉంటారు. అని నేనప్పుడనుకున్నాను. తరువాత నా వస్తువులు కొన్ని దొరుకుతాయని కూడా చెప్పారు. ఇంతలో మావారు తట్టిలేపడముతో మెలకువ వచ్చింది. అంతా కలా! నిజమా! అని అనుకున్నాను. మా వారితో కల విషయము చెబుతూ ఉంటే బాబాల మీద నమ్మకము లేని మావారు "అయితే బాబాకి మెనీ మెనీ థ్యాంక్సు చెప్పాలి. ఎందుకంటే ఇక మీదట ఉమ పెండ్లి చెయ్యమని తొందరపెట్టవు" అన్నారు.

మరల ఆగష్టు వచ్చింది. సంవత్సరమయ్యింది. దొంగలు దొరకలేదు కాబట్టి మీ కేసు కొట్టివేస్తున్నామని, కోర్టు నుండి వచ్చింది. కాని, బాబా మాట పైన విశ్వాసమున్న నాకు తప్పకుండా మా వస్తువులు దొరుకుతాయనే అనిపించేది. అందుకు ఆయన పూజలు, భజనలు మానలేదు. ఇక్కడ ఇంకొక విషయము తెలుపవలసి వుంది. మేము మాంసాహారులమయినా చిన్నప్పటి నుండి అంత ఇష్టపడని నేను అది మానివేయాలనిపించి మానివేసాను. ఇంటిలో మావారితో రోజూ గొడవ. అయినా పట్టుదలగానే ఉన్నాను. ఒకరోజు చాలా గొడవచేసి బలవంతంగా నాతో తినిపించాలని ప్రయత్నము చేసారు. అప్పుడు నేను అన్నదేమంటే ఆగష్టులో నా నగలు పోయాయి కాబట్టి మరలా ఆగష్టు 8 వరకూ చూస్తాను. నా వస్తువులు సంగతి ఏమీ తెలియనట్లయితే; అన్ని రకాల మాంసాహారము తినడానికి రెడీ! కాబట్టి నన్ను అంతవరకు బలవంతపెట్టవద్దని ఆయనని వేడుకున్నాను. దానితో ఆయన ఇక బలవంతము చెయ్యలేదు.

ఆగష్టు 8 వచ్చింది. ఆ రోజుతో నా నియమము స్వస్తి. కాని, అంతకు రెండు రోజుల ముందే శ్రీబాబావారు హైదరాబాదు శివం మందిరమునకు వచ్చియున్నారు. శివంలో శ్రీ బాబావారి దర్శనము, పాదస్పర్శ దొరికాయి. నాకు బాబా వెళ్ళే రోజు మా వారి వైపుచూచి "చాలా సంతోషము" అని మూడుసార్లు ఆశీర్వదించారు. ఆ రోజే పోలీసతను మా యింటికి వచ్చి "దొంగ దొరికాడు. మీ

స్తువులు గుర్తుపడుదురుగాని, స్టేషనుకు రండి" అని మావారిని తీసుకొని వెళ్లాడు. రోజు తారీఖు ఆగష్టు 8. ఇక నా నియమాన్ని నేనెందుకు వదులుకోవాలి? ఒక ధంగా దొంగతనము జరుగుట కూడ నా మంచికే అని, సాకారంగా ఉన్న రమాత్మను పూజించుకోగలుగుచున్నాము. ఒకటి పొందాలంటే, వేరొకదాన్ని గ్యాగము చేయవలసి ఉంటుంది. ఇప్పుడు నాతోపాటు మావారు కూడ ూంసాహారాన్ని విడచి పెట్టారు. దసరానాటికి నా వస్తువులు నాకు చేరాయి. ను కూడ సాయి సంస్థలో చేరాను. శ్రీ బాబావారి దయవలన బాలవికాస్ రువును అయి బాలలకు కొంతవరకు భక్తి, భజనలు నేర్పగలుగుచున్నాను.

ఇకపోతే మా అమ్మాయి 'ఉమ' పెండ్లి విషయము కూడ ప్రస్తావించాలి. దవ తరగతి పాస్ అవగానే అనంతపురము కాలేజీలో ప్రయత్నము చేయగా, లికగా సీటు దొరికింది. ఇంటరు, డిగ్రీ చేసింది. శ్రీ స్వామి కలలో చూపించింది ూడు' అంకె కాబట్టి మూడు సంవత్సరాల వరకు మా అమ్మాయికి పెండ్లి ోగము లేదని అనుకున్నాను నేను.

డిగ్రీ పూర్తయేసరికి 5 సం॥లు అయ్యాయి కాబట్టి కాలేజి వదలి వచ్చేముందు స్వామి దర్శనానికి వెళ్లాను. ఆయన లైనులో తిరుగుతూ మా దగ్గరకి రాగానే, ఉమ పెండ్లి స్వామి" అని మనసులో వేడుకున్నాను. దగ్గరకు వచ్చినప్పుడు ాదములు పట్టుకున్నాను. ఉమ పెండ్లి అంటుంటే 'ఉష్' అని వెళ్లిపోయారు.

ఇంటికి పెద్దపిల్ల కాబట్టి నా తరపు, మా వారి తరపు పెద్దలు బ్రతికి ఉండగానే ండ్లి చేయాలని మా ఉద్దేశ్యము. కాని ఎన్ని సంబంధాలు చూచినా ఒక్కటీ దిరేదికాదు. చదువు పూర్తయిన సంవత్సరము తరువాత పుట్టపర్తికి వెళ్లినప్పుడు ్వామిని ఉమ పెండ్లి గురించి వేడుకుంటూ కూర్చున్నాను. నా దగ్గరకు రాగానే ాజ్‌బెండ్ ఆయేగా' అంటూ వెళ్లిపోయారు. ఆ మాట నాకు కొంత ఊరట లిగించింది.

ఇంతకీ శ్రీ స్వామి చెప్పిన కాలచక్రము ఏమిటనుకున్నారు? అది మూడు రణాలు. మా నాన్నగారు, మా బావగారు, ఆయన వియ్యంకుడు. ఒకే ంవత్సరములో మూడేసి నెలల తేడాలో మరణించారు. మా నాన్నగారు గురు ూర్ణమిరోజు మరణించారు. ఆ సమయమునాలో మేము పర్తిలో ఉన్నాము. ఈ ారి స్వామి నెలాగయినా అమ్మాయి పెండ్లి గురించి అడగాలని, నేను, మా వారు ళ్లాము. అక్కడికి ఈ వార్త ఫోను ద్వారా తెలియడంతో, ఇక స్వామిని అడగకుండానే యలుదేరి మా తండ్రిగారి ఊరుచేరుకున్నాము. ఆ తరువాత మూడు నెలలకే ూ బావగారు (అక్క భర్త) మరణించారు. మా నాన్నగారి మరణానికి మూడు

నెలల ముందే, మా బావగారి వియ్యంకుడు పోయాడు. అనగా ఒక్క సంవత్సరములో మూడేసి నెలల తేడాలో ముగ్గురు మరణించారు. ఆ తరువాత మా అమ్మాయి పెండ్లి కుదరడము, కొన్ని రోజులకే పెండ్లి కూడా అయ్యింది. అంటే శ్రీ స్వామి వారు చెప్పే విషయాలు మానవమాత్రులకు అర్ధము కానివి. మనకు తోచినట్లు మనము ఊహించుకుంటాము. ఆయన చేతిలో గడియారము, మూడు అంకె చిన్నముల్లు. అనగా కాలచక్రము, మూడు మరణాలు అని తరువాత అర్ధమయింది నా మట్టి బుఱ్ఱకు.

జై సాయిరామ్

నవంబరు - 1996



## పరమాత్మను గ్రహించాలంటే.....

*"మీరు చాలా సార్లు పుట్టపర్తి వస్తుంటారు. పవిత్ర గ్రంథాలు చదువుతుంటారు. పండితులు చేసే ప్రసంగాలు వింటుంటారు. నన్ను, నా కార్య కలాపాలను పరిశీలిస్తుంటారు. వీటి వల్ల మీరు పొందుతున్న లాభమేమిటి? వీటి మూలంగా మీరేమైనా బాగుపడ్డారా? మీలో ఉన్న తామసిక, రాజసిక ప్రవృత్తులను గుర్తించుకో గలుగుతున్నారా? అవి పోని కరములని గ్రహించడం మొదటి మెట్టు. తరువాత వాటిని తొలగించుకోవాలి. ఏళ్ళు పై బడ్డ కొద్దీ సాత్విక లక్షణాలు మీలో పెంచుకోగలుగుతున్నారా? ఇంకా తామసిక రాజసిక లక్షణాల ప్రకోపమేనా? పరమాత్ముని గ్రహించాలంటే ఆయనను ప్రేమించి, సన్మార్గంలో సంచరించాలి. ద్వేషమూ, ఉదాసీన భావమూ - ఈ రెండూ అపోహలకు దారి తీస్తాయి. పరమాత్మునితో సన్నిహిత సంబంధం పెంచుకుంటే, ఆయన తన స్వరూపం నీకు ఆవిష్కరించగలడు."*

- బాబా

# 'ఆపద్బాంధవుడు' భగవాన్ శ్రీ సత్యసాయి

- కామరాజు విజయ, ప్రశాంతి నిలయం

"నీవు ఒక అడుగువేస్తే నేను పదడుగులు నీవైపు వేస్తాను. నీవెవరివో, నీకేది కావాలో నీ భూతభవిష్యద్వర్తమానాలంతా నాకు తెలుసు" అంటారు స్వామి. "మీరంతా నావారే, అవసరమని అనుకున్నప్పుడు మీరు పిలిచినా పిలువకపోయినా రక్షించడం నా కర్తవ్యం. నా దృష్టి అంతా మీమీదే" అన్నది భగవానుని మాట. ఇదే అండ దండ మనందరికి.

సాయి కుల్వంత్ హాలంతా జనులతో క్రిక్కిరిసిపోయి వుంది. ఎటుచూచినా జనం, ఎక్కడ చూచినా జనప్రవాహమే. ఎక్కడివారో, ఎక్కడెక్కడివారో, ఒక జాతికాదు, ఒక మతం కాదు. ప్రశాంతి నిలయం ఒక మినీవరల్డ్‌లా వుంది. ఇది నా మాటకాదు, స్వామి అన్న మాటే ఇది.

సుప్రభాత సమయం ఆహ్లాదం కలిగించే వాతావరణం కార్తీకమాసపు చిరుచలిరోజులు భక్తులంతా ప్రభాత దర్శనానికి ఎదురుచూస్తూవున్న మనోహర దృశ్యం నిశ్శబ్ద వాతావరణం. అందరి దృష్టి ఒక్కటే, అందరి గమ్యం ఒక్కటే. అందరి ధ్యేయం ఒకటే. అందరి ధ్యాస ఒక్కటే. అందరు ఒకే ఒక భగవంతుని కొరకు తపన పడుతున్నారు. ఆవేదన పడుతున్నారు. ఇంకా బాబా రాలేదా! అని కొందరు నిట్టూర్పులు విడుస్తున్నారు. ఇంతలో స్వామి రాకకు సూచనగా వాద్యసంగీతం ప్రారంభమైంది. అమ్మయ్య అని కొంచెం 'రిలాక్స్' కాసాగారు భక్తులు. స్వామి మందస్మిత వదనారవిందుడై అరుణకాంతులతో మెలమెల్లగా నడుస్తూ వస్తూ వున్నారు. భక్తుల మొహాలు వికసింపసాగాయి. ఎక్కడివారక్కడ ఎవరి లెటర్లు వారు జాగ్రత్తగా వున్నవో లేవోనని మరోమారు ధృవపరచుకొని స్వామి అడుగడుగును వీక్షిస్తున్నారు. ఒకవైపు భయం, ఒకవైపు సంతోషంలో మునిగిన ప్రజల బాధ వర్ణనాతీతం. బాబాను చూస్తున్నామన్న ఆనందం లెటర్ తీసుకోరేమోనన్న భయం, పాదనమస్కారం దొరుకుతుందో లేదో అనే చింతలతో ద్వంద్వ భావాలతో మునిగివున్నారు. స్వామి 'Wait... Wait.... Wait....' అంటూనే నేరుగా ఇంటర్వ్యూ రూము దగ్గరకు వెళ్ళారు.

70వ జన్మదిన సందర్భంగా అనేక కార్యక్రమాలు ఫైనలైజ్ చేయవలసివుంది. అనేకమంది ప్రముఖులు స్వామి దర్శనార్థం కొరకు వచ్చి వేచియున్నారు. స్వామి ఒక గుజరాత్ గ్రూప్‌ని ఇంటర్వ్యూ రూములోకి తీసుకొని వెళ్ళారు. ఇంటర్వ్యూ కెళుతున్న వారిలో ఒక జంట అందరి దృష్టిని ఆకర్షించింది. అయ్యో వాళ్ళు

బెంగుళూరు శంకర్ దంపతులు. వీళ్లని స్వామి ఇంటర్వ్యూకి పిలిచారా! పోన్లే పాపం! ఎంతో బాధల్లో వున్నారు. మంచిదయింది అనుకున్నాను స్వగతంలో. దర్శనం అయిపోయింది కదా అని మేము గృహోన్ముఖులమయ్యాము.

6 మాసాల క్రితం బెంగుళూరులో జరిగిన విషయం. ఆ రోజు ఆదివారం ఉదయం దర్శనానంతరం ఇంటికి చేరుకున్నాం. ఇంతలో మా కాంపస్ వాచ్‌మన్ 'అమ్మగారూ! ఈ నెంబరుకి అర్జంటుగా ఫోన్ చేయమని అయ్యగారికి చెప్పమన్నారమ్మా అని ఆయాసపడుతూ వచ్చాడు. ఈ నంబరు ఎవరిది అని నేను ఆలోచిస్తూ వున్నాను. ఇంతలో ఇద్దరు దంపతులు మా ఇంటివైపు రాసాగారు. భార్య, భర్త. ఇద్దరు Made for each other జంటలా చాలా చక్కగా వున్నారు. కాని వారి ముఖాల్లో ఏదో దిగులు, మనసులో ఏదో బాధ స్పష్టంగా కనిపిస్తుంది. ఆ దంపతులు లోనికి రావటం తమకు తామే ఇంట్రడ్యూస్ చేసుకోవడం అంతా క్షణంలో జరిగిపోయింది. ఆయన భార్య చెప్పటం ప్రారంభించింది. కోట్ల మీద వ్యాపారం. మా వారు చాలా పెద్ద Industrialist. దురదృష్టవశాత్తు సడన్‌గా వ్యాపారం దెబ్బతింది. అంతా నష్టమే. ప్రెస్టేజ్ కొరకు Factory నడుపుతున్నాం. ఈ సమయం చూచి బంధువులు, స్నేహితులు, అంతా శత్రువులైపోయి ఇంటిమీద కొస్తున్నారు. ఆఖరుకు మా అత్తగారు, ఆడబిడ్డ కూడ వ్యతిరేకంగా మారిపోయినారు. మా ఇంట్లో 50 మంది పనివాళ్ళుండేవారు. ఇప్పుడు 10 మందిని మాత్రమే వుంచుకున్నాం. మేం తిన్నా తినకపోయినా వీరందరికి కోసం వంటలు చేయాల్సిందే. అని షీలాగారు తన బాధనంతా నాతో చెప్పసాగింది. ఇలా చెప్పడం వలన అవిడకి కొంచెం రిలీఫ్ వచ్చిందేమో అనిపించింది నా మటుకు నాకు. "సారీ! అండీ మా గొడవంతా చెప్పి మిమ్మల్ని బాధపెట్టానేమో' అంటూ, 'అయ్యో మరచిపోయాను. మా ఇంట్లో భజనండి. మీరిద్దరు తప్పక రావాలి. పర్సనల్‌గా చెబుదామని వచ్చాము. స్వామి ఏమయినా కరుణిస్తారేమో మా పరిస్థితి చూచి అని రోజు దర్శనానికి వస్తున్నాం' అని చెప్పి భార్యాభర్తలిద్దరు వెళ్లిపోయారు.

మరునటిరోజు వారింట్లో భజనకి మేమిద్దరము (నేను, నా భర్త శ్రీ కె. అనిల్ కుమార్) బయలుదేరాం. బెంగుళూరు సిటీలో ఎక్కడుందో వారి ఇల్లు ఆ పరిసరాలు మాకు క్రొత్త. తెలియదు. ఇల్లు కనుక్కోవడం కొంచెము కష్టమే అయింది. చుట్టూరా విశాలమైన ప్రదేశం. కారు పోవడానికి మాత్రమే దారి. అంతా పూల మొక్కలు క్రీపర్లు Hanging Pots ఎంతో కళాత్మకంగా ఒక నందన వనంలా వుంది. ఇంటి వెనుక చాలా పెద్ద స్థలం. Kitchen Garden ఎంతో ముద్దుగా వుంది. సరే ఇక ఇంట్లోకి ప్రవేశించాం. రాజదర్బారులా వుంది. వరండాలో పెద్ద పెద్ద పింగాణీ కుండీలు బాగా పెరిగిన మొక్కలు, మధ్యలో ఝూలా చాలా

ప్రశాంతంగా, ఆహ్లాదకరంగా వుంది. పచ్చగా నిత్యకళ్యాణం పచ్చతోరణంలాగా వుంది. భజన హాలు చాలా పెద్దది. స్వామి ఫోటోను అనేక రకాల పూలతో అలంకరించారు. రకరకాల పండ్లతో పాలవెల్లి తయారుచేశారు. భజన షుమారు ఒక గంట జరిగింది. ప్రసాద వినియోగానంతరం ఆ దంపతులిద్దరూ వచ్చి 'మీకు చాలా Thanks అండీ ఇంత శ్రమ తీసుకొని వచ్చారు, అని మమ్మల్ని మా ఇంటిదాకా దింపే ఏర్పాటు చేశారు.

మరుసటి రోజు ఉదయం మేము షీలా శంకర్‌ల గురించే మాట్లాడుకున్నాం. ఎంత అదృష్టవంతులు. ఎంత చక్కని జంట. చక్కని ఇల్లు. సిటీలో చాలా మంచి నౌకర్లు, రెండు కార్లు, అందం, ఐశ్వర్యం అన్నీ ఒక్క చోటే చేరాయి. కంఫర్టబుల్‌గా వున్న ఇల్లు. ఆ వాతావరణం మనసుకు ఎంతో ఆహ్లాదం కలిగిస్తుంది. ఇంతలో షీలా గారి కారు డ్రైవరు ఒక Letter తీసుకువచ్చి మావారి చేతిలో పెట్టాడు. నిన్నేగదా కలుసుకున్నది మనం ఇంతలో ఏ అర్జెంటు విషయం వచ్చిందా అనుకుంటూ మావారు Letter చదవటం ప్రారంభించారు. ఆ Letter లో ఇలా వుంది.

**Dear Sir,**

మీకు శ్రమ కలిగిస్తున్నందుకు క్షమించండి. మా పరిస్థితి మీ ఎదురుగా చెప్పలేక ఈ Letter వ్రాస్తున్నాను. మేం చాలా చిక్కుల్లో వున్నాము. మొన్న షీలా చెప్పింది. ఒకవంతు మాత్రమే. కొన్ని కోట్లు బ్యాంకు లోను వుంది. వ్యాపారంలో సొంతం నష్టమొచ్చింది. 500 మందికి 3 నెలల నుండి జీతాలివ్వలేదు. నాకు మీరెక్కడయినా అప్పు ఇప్పించినా సరే లేదా నాకు రెండు ఫ్యాక్టరీలున్నాయి. ఒకటి అమ్మేస్తాను. అమ్మడానికి సహాయం చేసినా చాలు. నా స్థితి చూసి కొనడానికి కూడ ఎవరూ ముందుకు రావడంలేదు. మీకు చాలామంది పరిచయస్థులున్నారు కదా. కాస్త నాకు Help చేసి పెట్టండి. మీ మేలు జన్మజన్మలకు మరచిపోను. నేను ఈ షాక్ కొంతవరకు తట్టుకోగలిగాను. నా భార్య షీలా మాత్రం అన్నం తినడం మానేసింది. నిన్న మీ ఇంట్లో త్రాగిన కాఫీయే. ఈ అప్పుల నుంచి బయట పడడానికి సూసైడ్ చేసుకుందాం, అదే మార్గం అని బాధపడుతుంది. మనశ్శాంతి కొరకే అప్పుడప్పుడు ఈ భజనలు, సత్సంగాలు అన్నింట్లో పాల్గొంటున్నాం. కొంతవరకు ధైర్యంగానే వుందనుకున్నాను. కాని నిన్న ఇంకో షాకింగ్ న్యూస్ తెలిసింది. మా ఇల్లు ఫ్యాక్టరీలు అన్నీ అమ్మివేసినా మా అప్పు తీరే మార్గం కనిపించ డంలేదు. ఏం చేయాలో దిక్కు తోచటంలేదు. భగవాన్ ఒక్కరే నా సమస్యకు పరిష్కారం చూపించగలరు. ఎంతోమందిని నేను స్వామి దగ్గర ఇంటర్వ్యూ ఇప్పించమని ప్రాధేయపడ్డాను. ఒక్క ప్రయత్నము కలిసిరాలేదు. భగవానునికి

నాపై ఎప్పడు జాలి కలుగుతుందో తెలియడంలేదు. వారు ఒక్కసారి నా వైపు చూస్తే చాలు, నా Letter తీసుకుంటే చాలు, నా బాధకి కొంత ఉపశమనం కలుగుతుంది. ప్లీజ్! మీరు కూడ నా కోసం ట్రై చేయ్యండి సార్! ఇంతకన్నా నేను కోరేదేమిలేదు. ఈ లెటరు వ్రాసే సమయంలోనే మీ ఫోను వచ్చింది సార్. మీ మాటలు వింటుంటేనే ఎంతో ధైర్యంగా వుంది సార్. అందుకే స్వతంత్రంగా ఇంత లెటర్ వ్రాయగలిగాను. A friend in need is a friend indeed Sir! మీకు చాలా Thanks Sir. మీరు చెప్పిన వ్యక్తులను ఈ రోజే కలిసి ఫ్యాక్టరీ అమ్మకం విషయం ప్రస్తావిస్తాను. మా సమస్యలు తీరేదాకా మీకు రోజూ ఫోను లేదా లెటరు పంపుతూనే వుంటాను. మీ మంచి సలహాలే నాకు మరల జీవించాలనే ఆశను కల్గించాయి. మా శ్రీమతి కూడ తన నమస్కారములు తెలియచేయమన్నది. మళ్లీ త్వరలోనే కలుసుకోవాలని ఆశిస్తూ...

మీ శంకర్

"అవును ఈయన ఫోను చేశాడంటారేమిటి? ఎవరు చేశారో ఏమిటో నాకంతు పట్టలేదు. ఎంతో ఆనందంగా, అన్యోన్యంగా వున్న జంటకు ఇన్ని కష్టాలా? ఆత్మహత్య చేసుకొనేంత పరిస్థితి ఏమిటి? భగవాన్ ఏమిటి నీ లీలలు? ఒక నెలరోజులు గడిచాయి. షీలా శంకర్ ఈ మధ్యకాలంలో కనిపించలేదు. వాళ్ల డ్రైవర్ మాత్రం రెండుసార్లు Letters తెచ్చి ఇచ్చాడు. అయ్యగారు కారులో పుట్టపర్తి వెళుతున్నారు. ఈ అయ్యగార్ని కూడా వీలుంటే రమ్మన్నారని చెప్పాడు. రెండుమూడు సార్లు పుట్టపర్తి వెళ్లి వచ్చారు ఆ దంపతులిద్దరూ. పుట్టపర్తి వెళ్లి దర్శనం చేసుకుంటే కొంత మనశ్శాంతి లభ్యమైంది. తిన్నగా ఫ్యాక్టరీ బేరానికి రాసాగింది. గవర్నమెంటు నుంచి కూడ కొంత సహాయం లభించింది. ఇంటికి మంచి రేటు రావడం అమ్మివేయడం వలన చాలా అప్పలు తీరిపోయాయి. "భగవాన్ బాబావారి దర్శనము సర్వ కష్టాలనుంచి కాపాడింది మమ్మల్ని" అని వారిద్దరూ ఎంతో ఆనందంగా జీవితం గడుపుతూ భగవాన్ బాబావారి కార్యక్రమాలలో పాల్గొనటం ప్రారంభించారు. షీలాగారు చక్కని గాయకురాలు. మధురమైన గానంతో, ప్రార్థనతో, ఆవేదనతో, భక్తితో భగవానుని ప్రసన్నం చేసుకొన్నారు. వారి ఇంట్లో క్రింది భాగమంతా భజనలకు, స్వామి కార్యక్రమాలకు వినియోగిస్తూ పైన భాగంలో వారు నివసిస్తున్నారు. స్వామిపేర ఒక స్కూలు కూడ ఓపెన్ చేయాలనే సంకల్పమున్నట్లు శంకర్‌గారీ మధ్యనే ఒక Letter కూడా వ్రాశారు. వారు మరల మామూలు స్థితికి రాగానే స్నేహితులంతా దగ్గరవడం ప్రారంభించారు.

ఒక ఆదివారం వారిద్దరూ మా ఇంటికి [illegible] పెడుతూనే ఫోను గురించి ప్రస్తావించారు. మీ [illegible] మాకు ఉత్సాహాన్ని, జీవించాలనే కోరికను కలిగించాయి [illegible] ఈసారి ఆశ్చర్యపోవడం మావారి వంతు [illegible] సర్వాంతర్యామియైన భగవాన్ సత్యసాయిబాబా [illegible] ఆదుకున్నారని నా నమ్మకం. ఒక్క ఫోనుకాలుతో [illegible] ఆధారమైనారు. భగవాన్ ఋణం మనం ఎలా తీర్చుకోగలం?

**"Why fear when I ham here"**

*'సాయీ! అంటే ఓయీ! అంటాను'.*

నమ్ముకున్నవారికి స్వామి అనుగ్రహం నిండుగా ఉంటుందనే దానికి ఈ సంఘటన ఋజువు చేస్తున్నది.

ఫిబ్రవరి 1996

# కర్మఫలత్యాగం

"కర్మలు చేయండి! కాని, వాటి ఫలాల కోసం మాత్రం ప్రాకులాడవద్దు. దానం చేయండి! కాని, దానికి తగిన గుర్తింపు రాలేదని ఫిర్యాదులు మాత్రం చేయకండి. కర్మ కోసమే కర్మను చేసి, దాని ఫలితం సంగతి విస్మరించడం ఉత్తమమైన మార్గం. ఫలాపేక్ష లేకుండా కర్మలు చేస్తే, పాపపుణ్యాల ఫలితం మిమ్ములను బాధ పెట్టదు. లాభం కావాలని కోరితే, నష్టానికి కూడా నీవు సిద్ధంగా ఉండాలి. ప్రేమతో నీవు ఎవరికైనా విసన కర్రతో విసురుతుంటే, నీ ఇష్టం వచ్చినప్పుడు మాని వేయవచ్చును. కాని, జీతం పుచ్చుకొని ఆఫీసులో పంకాలాగే జవాను ఇష్టం వున్నా లేకపోయినా ఆ పని చేస్తూ ఉండవలసిందే. అనగా ప్రతిఫలాపేక్ష లేనప్పుడు నీకు స్వేచ్ఛ ఉంటుంది. ప్రతి ఫలాన్ని కోరినప్పుడు బంధం తప్పదు. కర్మఫల త్యాగంలో ఉన్న రహస్యమిదే!"

- బాబా

# అద్వితీయ దివ్యశక్తి సంపన్నుడు భగవాన్ బాబా

జొన్నా సుబ్రహ్మణ్యం, నెల్లూరు

మానవజీవితం చాలా విచిత్రమైనది. జీవితంలో చిత్రవిచిత్రమైన సంఘటనలు ఊహించని రీతిలో కొన్ని జరుగుతుంటాయి. కొన్నింటిని మాత్రం ముందుగానే ఊహించగలుగుతాం. మంచి జరిగితే సంతోషిస్తాం. చెడు జరుగుతే తమనుతామే నిందించుకుంటాం. దురదృష్టవంతులమని భావిస్తాం. పరులను దూషిస్తాం, చిట్టచివరికి భగవంతునిమీద కూడా నిందమోపటానికి ఏ మాత్రం వెనుదీయం. ఇది మానవ సహజ ప్రవృత్తి. ఇది అనాదిగా వస్తున్న సహజ పరిణామమే. తరాలు తరలిపోతున్నాయి, యుగాలు దొరలిపోతున్నాయి. మనిషి బుద్ధిమాత్రం మారటంలేదు. అయినా మానవుని యొక్క భౌతిక శరీరం Physical Body మాత్రం మారుతునే ఉన్నది. శైశవము నుండి బాల్యమునకు, బాల్యము నుండి యౌవనము, యౌవనము నుండి వార్ధక్యమునకు మారుతునే ఉన్నాడు. కాని మానవుని మనస్సు మాత్రం మారటంలేదు. ఇదే సృష్టి చిత్రం విచిత్రం. అయితే కొన్ని సంఘటనలు చూచినప్పుడు కొందరి మనస్సు కరిగిపోతుంది. మరికొందరి మనస్సు కఠినశిలగా మారిపోతుంది. ఎవరి మనస్సు, ఏ విధంగా, ఎప్పుడు, ఎందుకు మారుతుందో చెప్పలేం.

నా పేరు జొన్నా సుబ్రహ్మణ్యం. నా గృహలక్ష్మిపేరు జొన్నా విజయలక్ష్మి మాది నెల్లూరు జిల్లా, కోవూరు తాలూకా, తలమంచి గ్రామము. మాకు 1975 సం॥లో వివాహమైంది. విద్యావతి, గుణవతి అయిన విజయలక్ష్మి నా గృహలక్ష్మిగా, మా ఇంటిలో అడుగుపెట్టింది. ఆమె రాకతో నా గీత మారింది. నా ఆర్థిక స్థితి మెరుగైంది. నేను చేపట్టిన ప్రతిదీ విజయవంతమవుతుండేది. మా దాంపత్య జీవితం ఆనందోల్లాసాలతో సాఫీగా జరిగిపోతుండేది. అయితే అనుభవించడానికి కావల్సినంత భౌతిక సిరిసంపదలున్నప్పటికీ మనశ్శాంతి మాత్రం లేకుండా పోయింది. కారణం? పెండ్లి అయి 12 సంవత్సరాలు కావస్తున్నా పిల్లలు లేరనే బాధ నా శ్రీమతిని కలచివేస్తుండేది. అది ఒకరు తీర్చేది కాదు, ఆర్చేది అంతకన్నా కాదు. హే భగవాన్! అన్నీ యిచ్చి నాకు ఈ ఒక్కటి ఎందుకు లోటు చేశావయ్యా? అని నాలోనే బాధపడేవాడను. బయటకు నా బాధను తెలియబరుస్తే నా శ్రీమతి యింకా కుమిలిపోతుందేమోననే భయంతో లోలోననే భగవంతుని ప్రార్థించేవాడను, ఇలా కొంత కాలం జరిగింది. ఎంతో మంది దేవుళ్లకు మ్రొక్కాము, తీర్థయాత్రలు సలిపాము. పుణ్యక్షేత్రాలను దర్శించాము. భక్తితో భజనలు చేసాము. ఎన్నో పుణ్యకార్యాలు నిర్వహించాము. బీదలకు, పేదలకు వీలున్నంతగా సహకారం

అందించాం. ఎన్నో పుణ్య కార్యాలను చేసాం. [illegible]
ప్రసాదించి యుండలేదు. చిట్టచివరకు, [illegible]
జనించే సమయంలో మరొక మహనీయుని [illegible]
దివ్య స్వప్నం. భార్యాభర్తలు నిద్రించు సమయమున [illegible]
పొందినది".

**కలలో వాడు కైవల్య దేముడు**

**ఇలలో వాడు ఈశ్వరాంబ తనయుడు**

పండితుని పవిత్రుని భాసించెను. [illegible] మిత్రుల సలహాలతో ముఖ్యంగా నా ఆత్మీయుడు, స్నేహితుడు, శ్రీ [illegible] శ్రీ లంకా వెంకట సుబ్బయ్య ప్రోద్బలంతో 'నడిచే దేవుడు' పుట్టపర్తిలో ఉన్నాడని తెలుసుకొని ఆ మహనీయుని సందర్శించడానికి పుట్టపర్తి ప్రశాంతి నిలయానికి [illegible]

ఏ జన్మలో ఏ పుణ్యకార్యాలను చేశానో నాకు తెలియదు. ఏ సత్కార్యాల నాచరించానో అంతకన్నా తెలియదు, ఏ జీవికి ఏ సేవ చేశానో, ఎవరి కష్టాలను పంచుకున్నానో, ఏ అభాగ్యుని కన్నీరుని తుడిచివేశానో నాకు తెలియదు. కాని ఈ జన్మలో అందరికీ దొరకనిది మాత్రం నాకు దొరికింది. దుర్లభమైన దానిని నేను అందుకున్నాను. అదే.... అదే.... భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారి అనుగ్రహం పొందగలిగాను. వారి దివ్యాశీస్సులను అందుకోగలిగాను, మహామునులకు కూడా లభ్యం కాని భగవత్ సాన్నిధ్యం నాకు లభించింది. నా జీవితం ధన్యమైంది.

అది ప్రశాంతి నిలయం. అదే ప్రేమ సాయి మందిరం. శాంతి, ప్రేమలకు నిలయం. అదే సాయినాధుని ఆలయం. సత్యధర్మములకు నిలయం. అదే సత్యసాయి నిలయం. సర్వ మానవాళికి జ్ఞాన భిక్షను ప్రసాదించు జ్ఞాన కేంద్రం. మానసిక శాంతిని ప్రసాదించుజ్ఞాన కేంద్రం అదే శాంతి ప్రేమలను పెంపొందించు దివ్య ప్రేమధామం. యావత్ ప్రపంచాన్ని ఆకర్షిస్తున్న కేంద్రం 'ప్రశాంతి నిలయం'. ఆ మందిరం ప్రాంగణంలో భక్తుల వద్దకే నడిచివచ్చే దేవుడు భగవాన్ శ్రీసత్యసాయి బాబా.

అది నవంబరు 1వ తేది, 1987 వ సంవత్సరం. మా జీవితగమనం మారిన శుభదినం అదే. భగవాన్ సాయి దివ్యానుగ్రహమును పొందిన పుణ్యదినం అదే. ఎన్నో సంవత్సరాల నుండి దేనికోసం పరితపిస్తున్నామో, అమూల్య పవిత్ర పదార్ధమును ప్రసాదించిన పవిత్ర దినం అదే. అతి దుర్లభమైన ప్రత్యేకమైన ఇంటర్వ్యూను మా దంపతులకు భగవాన్ బాబా ప్రసాదించిన దివ్యాతిదివ్యమైన సమయం అది. ఆ ఇంటర్వ్యూలో స్వామి మా దంపతులను చూస్తూ "బంగారూ! పిల్లలు లేరని

ఆందోళన చెందుతున్నారు గదా! నేను మీకు కొడుకుని ప్రసాదిస్తాను, వాడికి నేనే పేరు పెడుతాను" అని మా దంపతులను స్వామి దీవించారు. ఆనాడు మేము పొందిన ఆనందానికి అవధులు లేవు, వర్ణించడానికి మాటలు చాలవు. నా శ్రీమతి అయితే పరమానంద భరితురాలైంది. నోట మాట రాలేదు. లోలోననే భగవాన్ సాయికి కృతజ్ఞతలు చెప్పకున్నాం. నా భార్యకు 36 డైమండ్స్ కల్గిన చెవిరింగులు సృష్టించి ఇచ్చినారు. ఆతర్వాత స్వామి దివ్యరూపము కలిగిన డాలర్ చైనును సృష్టించి ఇచ్చినారు. ఇంటర్వ్యూ గది నుంచి బయటకు వచ్చాం.

"భగవాన్ సాయి అద్వితీయ శక్తి దివ్యశక్తి సంపన్నుడు, సర్వజ్ఞుడు. వారి శక్తి అనంతం, అనిర్వచనీయం. ఈ చరాచర సృష్టిలో వారికి తెలియనిది అంటూ ఏదీ లేదు. వారి ఆశీస్సుల ప్రభావం అనంతం. వారి మాట ఎన్నటికీ వృథా కాదు. వారి ప్రతి మాట కార్యరూపం దాలుస్తుంది. వారు చెప్పింది అక్షరాల నిజమవుతుంది. వారి వాక్కు వేదవాక్కు" అని మా వెంకట సుబ్బయ్య బయటకు రాగానే చెప్పాడు. ఒక చంప మిత్రుల మాటలు వింటుంటే బాబాపై పెరిగే అచంచలమైన విశ్వాసం మరో చంప బంధువర్గం విమర్శనలు వింటున్నప్పుడు కలిగే బాధ. ఈ రెంటి మధ్య కొంతకాలం జీవితం గడపవలసివచ్చింది. మా బంధువర్గంలో బాబా మీద నమ్మకం ఉన్నవారికన్నా అపనమ్మకం గలవారే ఎక్కువ. వారి సూటిపోటి మాటలకు నా శ్రీమతి బాధపడుతుండేది. "మంత్రాలకు చింతకాయలు రాలుతాయా' అని అమ్మలక్కలు అపహాస్యం చేస్తుంటే కుమిలిపోయేది. మానసిక శాంతి కోసం తరచుగా పుట్టపర్తి వెళ్ళి స్వామిని దర్శించి వచ్చేవాళ్లం. 1989 సం॥లో మా దంపతులకు స్వామి మరల ఇంటర్వ్యూ ప్రసాదించారు. ప్రత్యేకమైన గదిలోనికి పిలిచి "ఏడీ! నీకొడుకు!" అని నా భార్యను ప్రశ్నించారు, అప్పుడు నా భార్య ఏడుస్తూ, 'అప్పుడు మీరు చెప్పారు గాని ఇంతవరకూ ఏమీ లేదు' అన్నది. అప్పుడు బాబా "మీరు తొందరపడవద్దు. పవిత్రమైన పదార్థమును ప్రసాదిస్తాను. ఎప్పడు ఎవరికి ఏది ఇవ్వాలో నాకు బాగా తెలుసు" అన్నారు. అంతా మీ దయ స్వామి అన్నది నా భార్య. నా వరకు నాకు బాబా దివ్యశక్తి మీద సంపూర్ణమైన విశ్వాసం ఉన్నది. బాబాను ఎవరు ఎన్ని విధాల విమర్శించినా, చులకనగా మాట్లాడినా, నాకు బాబా మీద ఉండిన విశ్వాసం మాత్రం ఈషణ్మాత్రం సడలలేదు. మానవజీవితం అనేక కవ్వింపు లతో, వేదనలతో, ఆవేదనలతో కూడుకొని ఉంటుంది. ఒక్కొక్క సమయములో అపవాదులను ఎదుర్కొనవలసి వస్తుంది. అపనిందలను భరించవలసి వస్తుంది. అప్పటివరకు తోడు, నీడగా ఉండినవారు సహితం దూరమైపోతారు. ఏకాకిగానే పయనించవలసి వస్తుంది. వేదనలు, ఆవేదనలు, అపవాదులు, అపనిందలు - వాటికి తట్టుకొని నిలబడితే, ఒక విధంగా వ్యక్తిత్వం యినుమడిస్తుందేకాని, అతని

ప్రతిష్ఠ ఏమాత్రం తగ్గదు. అదే విశ్వాసంతో, బాబు మీద ఉండే భక్తి ప్రపత్తులతో, ఏదో ఒక రోజున ఆయన పలికిన పలుకు వృథాకాదనే నమ్మకంతో, [illegible] అనుగ్రహిస్తారనే విశ్వాసంతో సమితి సేవలలో పాల్గొంటు ఉన్నాము.

స్వామి 65వ జన్మదినోత్సవ వేడుకలలో పాల్గొనటానికి కుటుంబ సమేతంగా పుట్టపర్తి బయలుదేరి వెళ్ళాం. నవంబరు 30వ తేదిన భగవాన్ బాబా వారి దివ్యసన్నిధిలో భక్త ప్రహ్లాద సినిమాను అక్కడి విద్యార్థులకు చూపించడం జరిగినది. పిల్లలు, పెద్దలు ఆ సినిమాను చూసి తన్మయులైనారు. సినిమా పూర్తి అయ్యేసరికి రాత్రి గం॥ 9-30 ని॥లు అయ్యింది. బాబావారు నవ్వు ముఖంతో దగ్గరకు పిలిచి 18 డైమండ్స్‌తో పొదగబడిన స్వామి వారి దివ్యసుందర రూపంతో ఉన్న బంగారు ఉంగరమును సృష్టించి అక్కడనున్న పిల్లలందరికీ చూపించి నా వేలికి స్వామి వారే స్వయంగా తొడిగారు. ఆనాడు భగవాన్ బాబా వారికి పాదసేవ చేసే సదావకాశము కూడా నాకు కల్గింది. జన్మదినవేడుకలు తరువాత వెంటనే బెంగుళూరుకు తిరిగి వచ్చాం. కొంతకాలం తరువాత మా శ్రీమతి హాస్పిటల్‌లో పరీక్ష చేయించగా 'గర్భవతి' అని డాక్టర్లుచెప్పారు. ఆనాడు మేము ఆనందంతో భగవంతుని ప్రార్థించాం, కృతజ్ఞతలు మనసులోనే చెప్పకున్నాం.

వైట్ ఫీల్డులో నున్న స్వామి కాలేజీ పిల్లలకు చూపించడానికి భక్త ప్రహ్లాద సినిమాను తీసుకొని రమ్మనమని కబురు వచ్చింది. అన్నీ సిద్ధం చేసుకొని అక్కడకు వెళ్లాను. ఆ రోజు జనవరి 28. స్వామి దర్శనం కొసం నిరీక్షిస్తున్నాను. అడుగులో అడుగు వేసుకుంటూ, పరిసరాలలో నున్న భక్తులను పలికిస్తూ, సరాసరి స్వామి నా వద్దకు వచ్చి "ఎన్నో మాసం.... ఎన్నో మాసం?"... అని అడిగారు. ' నాల్గవ మాసం స్వామీ!' అన్నాను. కాదు.... కాదు... ఐదవ మాసం అంటూ విభూతి ప్రసాదమును సృష్టించి నా చేతిలో పోసి నీ భార్యకివ్వు' అని నవ్వి వెళ్ళిపోయారు. డాక్టర్ల లెక్క ప్రకారం నా శ్రీమతికి నాల్గవ నెల. బాబావారి ఆజ్ఞ ఐదవ నెల. బాబావారి వాక్కే వేదవాక్కు' అనే నమ్మకంతో అప్పుడప్పుడు బాబా దర్శనం కోసం వెళ్ళుతుండేవాడిని. స్వామి నా భార్య యోగక్షేమములను విచారించి విభూతి ప్రసాదం యిచ్చి పంపు తుండేవారు. 9 నెలలు నిండటానికి 15 రోజులు ముందుగానే మద్రాసు అపోలో హాస్పటల్‌లో చేర్పించి అప్పుడప్పుడు నా శ్రీమతి పరీక్ష కోసం సర్జన్ స్వర్ణకుమారికి చూపించాం. అప్పుడే ఎందుకు తొందర. ఎనిమిదవ నెలయే గదా! అన్నది. అప్పుడు బాబా చెప్పిన విషయాన్ని చెప్పాను. మా మాటను కాదనలేక స్కానింగ్ వగయిరా పరీక్షలు చేసింది. బిడ్డ ఆరోగ్యంగానే ఉన్నాడని చెప్పింది. జూన్ 28వ తేదీకి (1991సం॥) 9 నెలలు పూర్తి అయినవి. బాబా చెప్పిన ప్రకారం సరీగా అదే

రోజున నా శ్రీమతి ప్రసవించింది. డాక్టర్లు అందరూ ఆపరేషన్ థియేటర్ నుండి బయటకు వచ్చి "Your BABA is Great అన్నారు. నా కళ్ళ వెంబడి ఆనందభాష్పాలు జలజలరాలాయి. హృదయంలోనే బాబాకు కృతజ్ఞతలు చెప్పకున్నాను.

భగవాన్ బాబావారి అనుజ్ఞతో, బాబావారి జన్మ దినోత్సవం రోజున అనగా ది. 23-11-1991న హిల్‌వ్యూ స్టేడియంలో బాబావారి దివ్యసన్నిధిలో హరిశ్చంద్ర నాటకమును ప్రదర్శించినాము. భక్తులు చూచి ఆనందించారు. ది. 24-11-1991న మా అందరికి (20 మందికి) స్వామి ఇంటర్‌వ్యూ ప్రసాదించారు. ఆ సందర్భంలో స్వామి షిర్డీ సాయి జన్మ వృత్తాంతమును గురించి వివరించారు. మా అందరికి వస్త్రములు ప్రసాదించారు. పాద నమస్కారములు యిచ్చారు. మా వారంతా పరమానందభరితులైనారు. బయటకు వచ్చేటప్పడు 'స్వామీ! నాకు ఒక రూం ప్రసాదించండి!" అన్నాను. "ఇదిగో నీ రూం యిక్కడ ఉన్నది" అని స్వామి వారి వక్షస్థలమును చూపించారు. ఈ మాటను మనం అర్థం చేసుకుంటే స్వామి తార్కిక చింతన మనకు బోధపడుతుంది. "భక్తుని స్వస్థానం భగవంతుని హృదయమే గదా! అట్టి స్వస్థానమును చేరుకోవటం కోసమే భక్తులు తాపత్రయ పడుతుంటారు. అట్టి పరమోత్కృష్టమైన స్థానమును స్వామి ప్రసాదించినందులకు నా జీవితం ధన్యమైంది.

"స్వామీ! బాబుకు 5 నెలలు పూర్తి కాబోతున్నవి. వాడికి నామకరణం చేయండి స్వామి!" అన్నాను. "ఎప్పడు తీసుకొని వస్తావు?" అని అడిగారు స్వామి. 27వ తేదీ వస్తున్నారు స్వామీ! అన్నాను. రమ్మను! రమ్మను! అని శెలవిచ్చారు. 26 రాత్రికే నా శ్రీమతి వాళ్ళు వచ్చారు. 27 ఉదయం బాబుని తీసుకుని దర్శనం కోసం కూర్చున్నది నా శ్రీమతి. స్వామి వచ్చి బాబును చూచి 'చలి! చలి!' అంటూ వస్త్రము సరీగా కప్పి వెళ్ళారు. నా వద్దకు వచ్చి 'చూచాను! చూచాను! అన్నారు. "ఈరోజు, రేపు అష్టమి, నవములు గదా! దశమి రోజున పిలుస్తానులే! అని చెప్పి వెళ్ళారు. సరీగా 30వ తేదీ సాయంకాలం మా దంపతులను ఇంటర్‌వ్యూకు పిలిచారు. బాబును తీసుకొని వెళ్ళాం. ఆ ఇంటర్వ్యూకు అప్పటి అనంతపూర్ జిల్లా కలెక్టరు శ్యామ్యూల్, IAS మరియు సూపర్ స్పెషాలిటీస్‌లోని ప్రముఖ డాక్టర్ భట్‌గార్లు కుటుంబంతో సహా ఉన్నారు. మేము లోపలికి పోగానే Oh! Boy, How are you, How are you అని Good boy, Good boy అని, వీళ్ళకు 15, 16 సంవత్సరములనుండి పిల్లలు లేరు. వారి బంధువులకు ఈ బాబా మీద విశ్వాసం లేదు. నేను ఎప్పడోచెప్పాను. కొడుకు పుడతాడని నా అనుగ్రహంతోనే వీడు పుట్టాడు. "వీడిని చూడండి! నన్నే చూస్తున్నాడు" అని అన్నారు. వెంటనే లోపలికి వెళ్ళి, ఒక పట్టుశాలువాను తీసుకొని వచ్చి బాబుకు కప్పారు. ఒక తీపి కలకండను

సృష్టించి బాబు నోటిలో పెట్టారు. వీడు Good Boy, వీడు నన్ను తప్ప ఎవ్వరిని చూడటం లేదు' అంటూ స్వామి దివ్యరూపం ఉన్న బంగారు చైన్ డాలరును సృష్టించి బాబు మెడలో వేశారు. ఇవన్నీ చూస్తూంటే మా ఆనందానికి అవధులు లేవు. మా నోటి వెంబడి మాటరాలేదు. కృతజ్ఞతలు చెప్పకుందామంటే నోరు పెగలలేదు. కళ్ళవెంబడి ఆనందభాష్పాలు ప్రవహిస్తున్నాయి. 'ఏం పేరు పెట్టారు? అని అడిగారు స్వామి. 'పేరు కాదు గదా! పుట్టినప్పటినుంచి ఒక్క ఫొటో కూడా తీయలేదు. ఏది జరిగినా... అంతా బాబాతోనే జరగాలి స్వామి' అన్నాను. 'వీడు ఎప్పుడు పుట్టాడు? అనిఅడిగారు స్వామి. 'జూన్ 28' (1991సం॥) అన్నది నా శ్రీమతి. పుట్టిన తిథి ఏమిటని అడిగారు. నేను మరచిపోయి 'సప్తమి' అన్నాను. కాదు....కాదు.... విదియ తదియలలో పుట్టాడని చెప్పి ఏవో లెఖ్ఖలు వేళ్ళతో వేసి స్వభాను అని "సాయి స్వభాను' అని నామకరణ చేశారు. "స్వ" అంటే స్వయంప్రకాశం 'భాను' అంటే సూర్యుడు. ఇది చాలా మంచి పేరు. నేనింతవరకు ఎవరికీ పెట్టలేదు, వీడికి చాలా బాగుంటుంది." అని వెంటనే నా భార్య చేతిలో నున్న బాబును తీసుకొని మమ్ముల నిద్దర్ని వారికి ఇరుప్రక్కలా నుంచోమని ఫొటో తీయించారు. తరువాత బాబును నా భార్యకిచ్చి "వాడు చూడు! నన్నే చూస్తున్నాడు, నన్నే చూస్తున్నాడు" అంటూ ఫొటోగ్రాఫర్ ను పిలిచి నేను వాడిని చూస్తున్నట్లుగా, నన్ను వాడు చూస్తున్నట్లుగా అనగా ఒకరినొకరు చూచుకుంటున్నట్లుగా ఫొటో తీయమన్నారు. తరువాత లోపలి గది లోనికి రమ్మనమన్నారు. అక్కడ బాబుకు అన్నప్రాశన చేశారు. తలనీలాలు కూడా (పుట్టు వెంట్రుకలు) వారే కట్ చేశారు. తరువాత బాబును నా వళ్ళో కూర్చొపెట్టు కొనగా శాస్త్రోక్తంగా ఆశీర్వచనం చేసి అక్షింతలు చల్లి మమ్ము దీవించారు. మా జన్మ తరించింది.

అక్షరాభ్యాస ముహూర్తం 1994 సం॥జూన్ 30వ తేదీన బ్రహ్మశ్రీ పమిడి మర్రి వెంకటేశ్వర్లుగారు రెండు నెలలు ముందుగానే నిర్ణయించారు. రెండు రోజులు ముందుగా బృందావనం చేరుకున్నాం. జూన్ 28 బాబు పుట్టినరోజు కాబట్టి స్వామి వచ్చి దీవించి వెళ్ళారు. మరల 30వ తేదీన స్వామి చేత అక్షరాభ్యాసం చేయించాలని ఒక బ్లాకులో కూర్చొన్నాం. అది సప్తమి గురువారం స్వామి వచ్చారు. భక్తుల మధ్య తిరుగాడి కొంతమంది భక్తులు పరామర్శించి, తిరిగి వెళ్ళటానికి వేదిక మెట్లు ఎక్కుతున్నారు. మా వైపు రానే రాలేదు. నేను బాధపడుతూ, స్వామిని వేడుకుంటూ, కన్నీరు కారుస్తున్నాం. ముహూర్తం తప్పిందేమిటా? అని బాధపడుతున్నాము. వెళ్ళుతూ, వెళ్ళుతూ స్వామి గిర్రున వెనక్కు తిరిగి మేము కూర్చున్న బ్లాక్‌కు వచ్చి నన్ను పలుకరించి, నా చేతిలో నున్న పలకను తీసుకొని ఒక వైపున దేవనాగర

లిపిలో 'ఓం' వ్రాసారు. రెండవ వైపు తెలుగులో 'ఓం' వ్రాసారు. నాకు పాదనమస్కారం ఇచ్చారు. అందరూ ఆశ్చర్యంతో చూస్తున్నారు. స్వామి సహజంగా పలక మీద ఒక వైపునే 'ఓం' వ్రాస్తుంటారు. కాని మా పలక మీద రెండు వైపులా వ్రాయటంలో ఏదో విశేషం ఉండి ఉండాలి. దానిని కాలమే తెలియజేస్తుందేమో!

ఒక పర్యాయం నా మిత్రుడు లంకా వెంకట సుబ్బయ్య, శ్రీ కామరాజు అనిల్ కుమార్ గారితో ఈ విధంగా చమత్కరించారు. అప్పుడు అనిల్ కుమార్‌గారు ఆనందాన్ని వ్యక్తపరుస్తూ మన మిత్రుడు లంకా చెప్పినది నీకు శక్తి ఉంటే సువర్ణాక్షరాలతో చెక్కించుకో నీ జీవిత గాధ, నీ వ్యక్తిత్వము పరిపూర్ణముగా వచ్చినది, మా లంకా చెప్పినది.

***"ఆశీర్వదించువాడు ఆదిదేవుడు***
***తలవంచినవాడు మంచి తలవాడు***
***తలమంచిపిండు***
***తనువు నర్పించినాడు, తనయుని పొందినాడు***
***భార్యకన్న, బిడ్డ కన్న, భాగ్యము కన్న***
***బాబా మిన్న అన్నాడు జోన్నా,***
***నీ జన్మ ధన్యము కదరా ఓ అన్నా."***

స్వామి నాకు ఎన్నోసార్లు ఇంటర్‌వ్యూలను ప్రసాదించారు. అమూల్యమైన వాటిని అనుగ్రహించారు. అన్నిటి కన్నా మించిన వంశోద్ధారకుని ప్రసాదించారు. గత 9 సం॥లలో స్వామి సన్నిధిలో 18 భక్తి సినిమాలను ప్రదర్శించే మహద్భాగ్యం నాకు కల్గింది. అంతేకాదు నాలుగైదు సార్లు భగవానునికి హారతి ఇచ్చే భాగ్యం కూడా కలిగింది. సత్య హరిశ్చంద్ర నాటకములను కూడా స్వామి సన్నిధిలో ప్రదర్శించే అవకాశం కూడా లభించింది. ఇంకా ఇంతకన్నా నా జన్మకు కావల్సింది ఏమున్నది? మహామహులకు కూడా దక్కని మహాభాగ్యం నాకు దక్కింది. ఇది నిజంగా నా పూర్వజన్మ సుకృతమే. ఏ జన్మలో ఏమి చేశానో నాకు తెలియదు కాని ఈనాడు భగవాన్ సాయి అనుగ్రహమును అందుకోగలుగుతున్నాను. వారి ప్రేమామృత ములను ఆస్వాదిస్తున్నాను. ఇదే విధంగా నాలుగు కాలాలపాటు వారి దివ్యాను గ్రహము నా యెడల, నా కుటుంబం యెడల సర్వదా వుండాలని ప్రార్థిస్తూ, అర్థిస్తూ, వేడుకుంటున్నాను.

*నవంబరు - 1995*

# శేషసాయి లీలలు - అనుభూతులు

లోలభట్టు శ్రీనివాసరాజు, తూ॥గో॥జిల్లా

రాజమండ్రిలో యున్న మా పిన్నిగారైన నాగరాజు అన్నపూర్ణగారి శరీరంలో సాధారణంగా యుండవల్సిన ఎంజైములు, పోషక పదార్థములు ఎదుగుదల లేక పోవడం వల్ల ఎప్పుడూ విపరీతమైన గుండె నొప్పితోను ఇతర శారీరక అనారోగ్యంతోను బాధపడుతూ వుండేవారు. అనేక డాక్టర్లచే పరీక్షలు చేయించి మందులు వాడినా ఫలితం కనిపించలేదు.

నేను, మా అమ్మగారు 1993 జనవరి నెల ప్రశాంతి నిలయం సేవలకు పర్తికి వెళుతూ మా పిన్నిగార్ని కూడా తీసుకు వెళ్ళాము. అచ్చట బాబావారి జనరల్ ఆసుపత్రిలో రిపోర్ట్సు చూపించి పరీక్ష చేయించగా మార్చి 23న రమ్మని చీటీ వ్రాసియిచ్చారు.

జనవరి 13 భోగిపండుగరోజున ఉదయం పిన్నిగారికి శరీరమంతా పొక్కులు రావడం, ఉబ్బటం కన్పించింది. ఆ రోజు స్వామి దర్శన సమయంలో లైనులో నిల్చొని వుండగా బాబా అనుగ్రహం చాక్‌లెట్ రూపంలో ఆమె గుండెను తాకింది.

ఆ క్షణంలో ఒళ్ళంతా జలదరించి ఒక దివ్యానుభూతిని పొందారు. సంక్రాంతి పండుగరోజు ఆమె శరీరమంతా ఉబ్బి, అనేక మార్పులు సంభవించి, ప్రాణాపాయం కలిగి పర్తినుండి సజీవంగా తీసుకుని రాగలమా యని మేమంతా భయపడ్డాము. మేము సాయి మీద భారం వేసి సేవలో పాల్గొన్నాము.

ది. 15-1-95 మధ్యాహ్నం గం॥ 1-15 ని॥లకు వెస్ట్ బ్లాక్ 3వ వరండాలో యున్నాను. అప్పుడు మా జీవితంలో ఉహించని రీతిగా సాయినాధుని అనుగ్రహం లీల ద్వారా జరిగింది.

మా అమ్మగారు, పిన్నిగారు భోజనం చేస్తూవున్నారు. ఒక తెల్ల చెంబులో మజ్జిగ పోసి యుంచారు. ఒక స్టీల్ గ్లాసులో పాలు పోసి, ఈ గ్లాసును మజ్జిగ చెంబులో దిగవేసి, గ్లాసుపై మూత వుంచారు. పిన్నిగారు భోజనం చేస్తూ, విషమించిన తన అనారోగ్యం గూర్చి, అస్తవ్యస్తంగా యున్న కుటుంబ పరిస్థితుల గురించి తన వేదనను అంతరంగంలో స్వామికి తెలుపుకుంటూవుండగా. ఒక్కసారిగా పెద్ద శబ్దం వినవచ్చింది.

ఆశ్చర్యపోతూ అటూ ఇటూ చూడగా పెరుగు చెంబులో యున్న పాల గ్లాసు పై భాగం అష్టదళరేకులుగా చీలిపోయి క్రిందమట్టు భాగం శేషుని పడగలాగ

నిలిచింది. వెంటనే ఆమె గ్లాసును చెంబు నుండి పైకి తీసారు. అచ్చట గున్న భక్తులు చూసి స్వామి ప్రదర్శించిన నిదర్శనమని విశ్వసించారు.

ఇంతలో పిన్ని గార్కి ఉన్నట్లుండి విరేచనాలు ప్రారంభమై అనేకమార్లు పోయి వచ్చారు. ఆ విధంగా విరేచనాలు అవడంతో, ఆమె శరీరంలో అనేక మార్పులు కన్పించాయి. ఉబ్బిన శరీరం క్రమంగా తగ్గి ఆ క్షణంలోనే యధాస్థితికి చేరుకొంది. దీనితో ఆమె అనారోగ్యం చేతితో తీసివేసినట్లుగా మాయమై ఆమె ఎంతో మానసిక ఉల్లాసం పొందింది.

వెంటనే చీలిన గ్లాసును స్టీలు పళ్లెంలో యుంచి స్వామి ఆశీస్సులను కోరుచూ, సాయంత్రం దర్శనార్థమై లైనులో కూర్చున్నారు.

గురుగావతారి మందహాస గమనంతో నేరుగా పిన్నిగారి వద్దకు వచ్చి, ఈ లీలా విశేషాన్ని తెల్పమని వ్రాసియిచ్చిన లెటరును తీసుకున్నారు. ఆ గ్లాసును తమ దివ్య హస్తంతో స్పర్శించి, 'ఇది శేషసాయి' అని ప్రకటించి దగ్గరలో యున్న మా అమ్మగార్ని చూపుతూ "బంగారుకు ఇవ్వు" జాగ్రత్తగా పూజ చేసుకో అని చెప్పి, మేము షెడ్‌లో మరచిన తెల్లచెంబు గుర్తుచేసి పూజారూమ్‌లో ఉంచమని చెప్పి ఆశీస్సులు అందజేసి ముందుకు నడిచారు.

అప్పటినుండి మేము బాబా 'శేషసాయి' అవతారంగా మా ఇలవేల్పుగా భావించి, విశ్వసించి ఉదయం, సాయంత్రం అభిషేక, అర్చనాదులు చేస్తున్నాము. రంగంపేట శ్రీ సత్యసాయి భవన్‌లో ప్రతిష్టచేసి పూజలు జరుపుచున్నాము.

ఆ రోజు నుండి పిన్నిగారి అనారోగ్యమంతా మాయమై మునుపటికంటే బలంగా ఆమె పనులు చేసుకుంటూ, మరెన్నో దివ్యానుభూతులూ పొందుతూ వున్నారు. ప్రాణాపాయ స్థితి నుండి తప్పించి పునర్జన్మను ప్రసాదించిన అద్భుతమూర్తికి ప్రణామములు తప్ప ఏమివ్వగలమని సాయినామ స్మరణతో దివ్య జీవన గమనాన్ని సాధన చేస్తూ వున్నారు.

మరొక (స్వప్నసుందరం) సంఘటన ఏమిటంటే, మా అమ్మగారు 10 సంవత్సరముల నుండి ఆయాసముతో బాధపడుతూ వుండేవారు. విపరీతమైన బాధతో ఎన్నో రాత్రులు నిద్ర లేకుండా, మరే యితర మందును గ్రహించక, స్వామి విభూతి ప్రసాదాన్నే స్వీకరిస్తూ వచ్చారు.

ఒకనాటి తెల్లవారుఝామున స్వప్నంలో బాబా ప్రత్యక్షమై మా అమ్మగార్ని 'నీకు ఆరోగ్యం బాగా లేదా?' అని ప్రశ్నించగా 'బాగాలేదు స్వామీ' అని చెప్పగా, సాయి చిరుదరహాసంతో నోటిలో తీర్థాన్ని తీసుకుని మా అమ్మగారి నోటిలో పోశారు.

ఆ జలమే దివ్యఔషధమై నాటినుండి నేటివరకు ఆయాసమొకటే కాక, మరే యితర వ్యాధులు ఆమె శరీరాన్ని తాకలేక పోయాయి.

ఈ విధంగా అనుక్షణం, ఆర్తులకు అండగా యుండి ఆపదలనుతొలగిస్తూ, ఆశ్రితులను రక్షించే ఆపద్బాంధవుడు శ్రీ సత్యసాయి బాబావారి సమకాలీనులుగా జన్మించిన మన అదృష్టము ఏమని చెప్పగలము.

'విశ్వాసమే విష్ణువై రక్షిస్తుంది' అనే సాయివాణి అనుభవ సత్యమై నిలిచింది. సాయినామ స్మరణతో బోధనలను ఆచరణలో పెడుతూ, సాయి సేవలో జీవితాన్ని గడుపుతూ దివ్యపథాన్ని చేరుటకు ఈ క్షణం నుండే కార్యోన్ముఖులమవుదాం. మానవ జీవితానికి ధన్యత గావిద్దాం.

నవంబరు - 1995



# పరమాత్మ నామస్మరణ

"మానవ జన్మ దుర్లభము. ఇది మాటిమాటికి రాదు. దేహము ఒక సత్రము వంటిది. మనసు కాపలాదారు. జీవియే యాంత్రికుడు. కనుక ఎవరికి ఎవరితో ఎట్టి సంబంధము లేదు. యాత్రికుడు మోక్షపురికి ప్రయాణమైనవాడు, వానికి సునాయాస ప్రయాణమునకు సూక్ష్మమైనది పరమాత్మ నామస్మరణయే. ఆ నామ మధురమును రుచి చూచినవారికి ఎప్పటికీ ఆయాసము కాని, అశాంతి కాని, అలసట కాని, ఉండవు. ఆనందముగా, ఉత్సాహముగా, శ్రద్ధతో సాధనా ప్రయాణమును సాగించును. అయితే ఇట్టి సాధనను సాధింప వలెనన్న సద్భావములు ప్రధానము. పాప భయము లేక సద్భావము పుట్టదు, భగవంతునిపై ప్రీతి సహితము కలుగదు. భయమువలన భక్తి, భక్తి వలన భగవదారాధన అలవడును."

- బాబా

# భగవాన్ సాంగా సర్వజ్ఞులు

ఎస్.బి. శ్రీధర్, తిరుపతి

అనుమానమనే నల్లని మేఘాలు సత్యసాయి దివ్యానుగ్రహమనే సూర్యోదయంతో పటాపంచలై 'ఇది కలా? నిజామా?' అని నన్ను నేను ప్రశ్నించుకున్న వేళ. మా అన్నగారు డా॥ రఘునాధాచార్య (తిరుపతి సంస్కృతి విశ్వవిద్యాలయ వైస్ ఛాన్సలర్) గారి కుటుంబంతో కలిసి మొదటిసారిగా ప్రశాంతినిలయం నిలకడ లేని, సడలిపోయే నమ్మకంతో చేరినవేళ. ప్రశాంతి మందిరం ముందు వరుసలో కూర్చున్నాం. ముందుగా టోకెన్ తీస్తుంటె నాకనిపించింది. 'ఇంతమందిలో కొత్తగా వచ్చిన నన్ను దగ్గరగా రానిస్తే ఈయనలో కొంత శక్తి ఉన్నట్లే' అని అనుకుంటుండగా టోకెన్స్ తీసే సంచీ నుంచి చెయ్యి బైటికి వచ్చింది. ఆశ్చర్యం ఒకటో నెంబర్.

లోపలకు వెళ్ళి నిలయం ముందు వరుసలో కూర్చున్నాం. నా చేతిలో నేను బాబావారిని గురించి, విన్న మహోత్మ్యం గురించి, తెలుగు, సంస్కృతంలో వ్రాసుకున్న స్తోత్రం పెట్టుకున్నాను. మందిరం గది తలుపు తెరుచుకుంది 'దివ్యకాషాయ పరివేష భవ్యమూర్తి' అడుగులో అడుగువేస్తూ, క్రమంగా మహిళల వైపు నుంచి మా వైపుకు వచ్చారు. మా అన్నగారిని పలుకరించారు. 'నిన్న వస్తానన్నావ్?' అన్నారు స్వామి. ప్రయత్నించాను స్వామీ! ఫలించలేదు అన్నారు అన్నగారు "మీరు నన్ను చూడాలనుకుంటంకాదు నేను మిమ్మల్ని చూడాలనుకుంటేనే మీరు నాదగ్గరకు రాగలరు" అన్నారు స్వామి. ఈ కొంచెం సమగాములో నాకు పాద నమస్కారం చేసుకొనే అవకాశం దొరికింది. సమస్త లోకభవతరణా లైన సాయి దివ్య శ్రీ చరణాలపై వ్రాలాను. కళ్ళవెంట ధారాపాతంగా నీళ్ళు ఆనందార్ణవంలో మనసు తేలి పోతున్నది.

ఈ విధంగానే మరునాడూ, ఉదయ సాయంత్రాల్లో మొదటి వరుసలోనే దర్శనం లభించింది. ఇక మనస్సులో 'స్వామితో మాట్లాడాలి, నాతో మాట్లాడతారా? మాట్లాడితే ఎంత బావుంటుంది" అనుకున్నాను.

మరునాడు ఉదయం నగర సంకీర్తనలో పాల్గొనటం వల్ల ఉదయం కేంటిన్ లో టిఫిన్ తినకుండానే దర్శనానికి వెళ్ళాము. మందిరం ముందు కూర్చున్న తరువాత "స్వామి త్వరగా వస్తే బావుణ్ణు, ఆకలిగా ఉంది. కేంటిన్ మూసేస్తే బయట హోటల్స్‌లో టిఫిన్ ఎలా ఉంటుందో?" ఈ విధంగా నాలాగా మొదటిసారి నిలయానికి వచ్చిన మా బృందంలో వాళ్ళం చర్చించుచుండగా స్వామి బయటకు వచ్చారు 'సాయిరాం' అని తలచుకుంటూ కూర్చున్నాము. మొదటి వరుసలో మహిళల వైపునుంచి వస్తున్న స్వామి మా వదినగారిని ఇంటర్వ్యూకు పిలిచి, మా అందరినీ రమ్మని ఆదేశించడంతో నా ఆనందానికి అవధులు లేవు.

ప్రశాంతి నిలయం వరండాలో కూర్చున్న మమ్మల్ని 'రండి' అని మందిరంలోకి స్వామి వెళ్ళారు. మేము అనుసరించాం. మా బృందంలో అనేక రకాలవాళ్ళు ఉన్నారు. ఒక బ్యాంకు ఆఫీసర్, ఒక డాక్టరు, మొ॥వాళ్ళు. వాళ్ళందరితో ఆ చిన్న గదిలో సర్దుకున్నాం "చెప్ప బంగారు! ఏమి సమాచారం!" అన్నారు స్వామి.

తిరుపతిలో నిర్మాణంలో ఉన్న మందిరం విషయాలు స్వామికి వివరించారు అన్నగారు. తరువాత బ్యాంకు అధికారి 'స్వామి! ఏ పని చేయాలన్నా అది సక్రమంగా పూర్తి అవుతుందో లేదోనని భయం కలుగుతున్నది భయం పోయేదెలా?' అన్నారు. దానికి స్వామి చిరునవ్వుతో నావైపు చూశారు "భగవద్గీతలోని మొదటి శ్లోకం ఏమిటి? అన్నారు. నాకు అప్పటికి 'ఆ జ్ఞానం' లేదు కేవలం 'అజ్ఞానం' తప్ప 'నాకు తెలియదు స్వామీ!' అన్నాను. 'ఏం తెలుసు మీకు? ఏ హోటళ్లలో ఏం టిఫిన్స్ ఉంటాయి? ఏ హాల్లో ఏ సినిమా ఆడుతున్నది? ఇదేగా!" అన్నారు. ఈ మాట నాకు చెంప ఛెళ్ళుమనిపించినట్లు అన్పించింది. అందుకు కారణం ప్రశాంతి నిలయం ముందు టిఫిన్ గురించి, ఇక్కడ సినిమా హాల్ అన్నా ఎవరూ కట్టలేదే?' అని మా బృందంలో సాగిన చర్చలకు స్వామి చెప్పిన గుణపాఠం. గట్టిగా లెంపలు వేసుకున్నాను. స్వామి చెప్తున్నారు 'ధర్మక్షేత్రే... సంజయ' శ్లోకం మొదటిది. మొదటి పదం 'ధర్మ' ఇక చివరి శ్లోకం ఏమిటి?' అన్నారు స్వామి నాతో. 'స్వామీ! నావిషయం తమకు తెలిసీ ఇంకా..." అని మనసులో అనుకుంటుండగా "యత్రయోగీశ్వరః... మతిర్మమ" అన్నారు స్వామి. ఇక్కడ చివరిపదం 'మమ'. మమ = నాయొక్క, ధర్మ= ధర్మము నాయొక్క ధర్మము' అని ప్రతి పనిని నీవు చేసినట్లైతే నీకు భయం ఎందుకు కలుగుతుంది? నీవు వృత్తిరీత్యా ప్రజల డబ్బును నీ Bank లో భద్రపరచటం చేస్తుంటావు. అది నీ ధర్మం (Duty). కానీ ఒకరోజు 'ఇంత డబ్బులో ఒక 10 వేల కట్టపోతే ఎవరు చూశార్లే' అనుకుని నీ జేబులో పెట్టుకున్నావు. అప్పట్నించీ 'నన్ను ఎవరైనా చూశాడేమో, ఈరోజు ఎలా ఇక్కడ నుంచి బయట పడటం' అన్న భయం నీకు పట్టుకుంది చెమట పట్టింది. కాళ్ళు వణికాయి నీవు నీ వృత్తి ధర్మాన్ని వదలి దొంగ ధర్మం (Duty) చేశావు నీవు దొంగతనం చేయనంతవరకు నిర్భయంగా నీ ధర్మం నెరవేర్చావు, నీ ధర్మం ఎప్పుడైతే తప్పావో నీకు భయం కల్గింది. ఇదేశ్రేయాన్ స్వధర్మో నిగుణః పరధర్మాత్స్వనుష్ఠి తాత్ స్వధర్మే నిధనం శ్రేయః! పరధర్మో భయావహః!!

నీవు నీ ధర్మాన్ని చక్కగా అనుసరించినంతకాలం నీకు మంచి జరుగుతుంది. నీవు పరధర్మాన్ని ఎప్పడు ఆశ్రయించావో, ఆ పరధర్మం నీకు భయాన్ని కల్గిస్తుంది. ఇక్కడ నీ స్వధర్మం Bankలో డబ్బు రక్షించడం, పరధర్మం డబ్బు దొంగలించటం

కనుక నీవు ఏ పని చేసినా 'నా ధర్మము' అని అనుకుని చేస్తే నీవు చేసే ఏ పనిలోనూ భయం కలుగదు" అని ముగించారు స్వామి 'అహా! ఎంతటి చక్కటి సమన్వయం' భగవద్గీతను నిత్యజీవితానికి అన్వయించటం అంటే ఇది 'నా జన్మ తరించింది' అనుకున్నాను. మరో ఆశ మనసులో తలెత్తింది. స్వామి సృష్టిచేసే అద్భుత దృశ్యం చూడాలి. ఆ భాగ్యం నాకుందో? లేదో? అనుకుంటుండగా గదిలో ఒకపక్క ఉన్న ఒక అతనిని ఉద్దేశించి What do you want? అన్నారు. "I Want siva" అని అతని సమాధానం. మొదట నీవు I =అహంకారం, want –కోరిక, ఈ రెంటిని వదులుకుంటే నీకు శివుడు దొరుకుతాడు. 'శివం' అంటే శుభము, మంగళము అని అర్థం. అని అతనిని ఆశీర్వదిస్తున్నట్లు గాలిలో చేయి కదల్చారు. ఆశ్చర్యం! బంగారు డాలర్ మీద శివుని ఆకృతి ఉన్న పతకం వెళ్లి ఆ వ్యక్తి దోసిలిలో పడింది. అంతలో మా అన్నగారి వైపు తిరిగి, 'బంగారూ! ఇదేమిటి? నా కంకణం ఇలా మట్టికొట్టుకుంది ఇటివ్వు Wash నేను చేసి ఇస్తాను' అన్నారు. కంకణం తీసుకుని గుప్పెట్లో ఉంచుకుని 3 సార్లు గాలిలో తిప్పి 'ఉఫ్' మని ఊది గుప్పిట తెరిచారు. ఇంతకు ముందున్న కంకణం కాదు. వేరే కంకణం వచ్చింది. దాన్ని మా అన్నగారికి ఇస్తూ పెట్టుకో అన్నారు. దానికి ఇంతకు ముందున్న 'కొక్కెం' పోయి 'స్క్రూ' వచ్చింది ఆ 'స్క్రూ' తీయడానికి దాదాపుగా మేము అందరం ప్రయత్నించాము రాలేదు. కాసేపటి తరువాత స్వామి చిరునవ్వుతో దాన్ని చేతుల్లోకి తీసుకున్నారు. వెంటనే తిరిగి ఇచ్చారు ఆశ్చర్యం! 'స్క్రూ' తేలికగా వచ్చింది.

వేదపండితులు ఒకరు తమ ఇరువురి మనుమరాళ్లకు స్వామిచేత పోగులు కుట్టించే నిమిత్తం వచ్చారు. స్వామి హస్తచాలనంతో రెండు జతల బంగారుపోగులు సృష్టించి స్వయంగా చెవులకు కుట్టారు. ఆశ్చర్యం! ఆ చిన్నారులకు నొప్పి లేదు. చిరునవ్వులు నవ్వుతూ స్వామి ఆశీస్సులు అందుకున్నారు. తరువాత విభూతి సృష్టించడానికి స్వామి హస్తం 3 సార్లు గాలిలో తిప్పుతున్నారు. నేను తదేకంగా స్వామి హస్తం వైపు చూస్తున్నాను. 'చిటచిట' శబ్దంతో విభూతి వచ్చింది. అందరికీ ఇచ్చారు. స్వామి పాదాలపై వాలాను. నా భుజంపై చేయివేశారు. నా ముఖంలోకి చూస్తూ 'లైట్ వెలగాలంటే లోపలున్న 'ఫిలమెంట్' జాగ్రత్తగా కాపాడుకోవాలి. ఫిలమెంట్ పోతే ఎంత విలువైన దీపమైనా వ్యర్థం. అలాగే జీవితం అనే లైటు ఎక్కువకాలం ప్రకాశించాలంటే 'యౌవనం' అనే 'ఫిలమెంట్'ను జాగ్రత్తగా కాపాడుకోవాలి. సమాజసేవలో జీవితం సార్థకం చేసుకో!' అన్నారు. మళ్ళీ పాదనమస్కారం అనుగ్రహించారు. అనిర్వచనీయానందంతో బయటకు వచ్చాము. సహజమైన స్వాతిశయం ఆవరించింది. 'స్వామి ఇక్కడ ఉన్న 3 రోజులు మొదటి

ప్రశాంతి నిలయం వరండాలో కూర్చున్న మమ్మల్ని 'రండి' అని మందిరంలోకి స్వామి వెళ్ళారు. మేము అనుసరించాం. మా బృందంలో అనేక రకాలవాళ్ళు ఉన్నారు. ఒక బ్యాంకు ఆఫీసర్, ఒక డాక్టరు, మొ॥వాళ్ళు. వాళ్ళందరితో ఆ చిన్న గదిలో సర్దుకున్నాం "చెప్ప బంగారు! ఏమి సమాచారం!" అన్నారు స్వామి.

తిరుపతిలో నిర్మాణంలో ఉన్న మందిరం విషయాలు స్వామికి వివరించారు అన్నగారు. తరువాత బ్యాంకు అధికారి 'స్వామి! ఏ పని చేయాలన్నా అది సక్రమంగా పూర్తి అవుతుందో లేదోనని భయం కలుగుతున్నది భయం పోయేదెలా?' అన్నారు. దానికి స్వామి చిరునవ్వుతో నావైపు చూశారు "భగవద్గీతలోని మొదటి శ్లోకం ఏమిటి? అన్నారు. నాకు అప్పటికి 'ఆ జ్ఞానం' లేదు కేవలం 'అజ్ఞానం' తప్ప 'నాకు తెలియదు స్వామీ!' అన్నాను. 'ఏం తెలుసు మీకు? ఏ హోటళ్లలో ఏం టిఫిన్స్ ఉంటాయి? ఏ హాల్లో ఏ సినిమా ఆడుతున్నది? ఇదేగా!" అన్నారు. ఈ మాట నాకు చెంప ఛెళ్ళుమనిపించినట్లు అన్పించింది. అందుకు కారణం ప్రశాంతి నిలయం ముందు టిఫిన్ గురించి, ఇక్కడ సినిమా హాల్ అన్నా ఎవరూ కట్టలేదే?' అని మా బృందంలో సాగిన చర్చలకు స్వామి చెప్పిన గుణపాఠం. గట్టిగా లెంపలు వేసుకున్నాము. స్వామి చెప్తున్నారు 'ధర్మక్షేత్రే... సంజయ' శ్లోకం మొదటిది. మొదటి పదం 'ధర్మ' ఇక చివరి శ్లోకం ఏమిటీ?' అన్నారు స్వామి నాతో. 'స్వామీ! నావిషయం తమకు తెలిసీ ఇంకా..." అని మనసులో అనుకుంటుండగా "యత్రయోగీశ్వరః... మతిర్మమ" అన్నారు స్వామి. ఇక్కడ చివరిపదం 'మమ'. మమ = నాయొక్క, ధర్మ= ధర్మము నాయొక్క ధర్మము' అని ప్రతి పనిని నీవు చేసినట్లైతే నీకు భయం ఎందుకు కలుగుతుంది? నీవు వృత్తిరీత్యా ప్రజల డబ్బును నీ Bank లో భద్రపరచటం చేస్తుంటావు. అది నీ ధర్మం (Duty). కానీ ఒకరోజు 'ఇంత డబ్బులో ఒక 10 వేల కట్టపోతే ఎవరు చూశార్లే' అనుకుని నీ జేబులో పెట్టుకున్నావు. అప్పట్నించీ 'నన్ను ఎవడైనా చూశాడేమో, ఈరోజు ఎలా ఇక్కడ నుంచి బయట పడటం' అన్న భయం నీకు పట్టుకుంది చెమట పట్టింది. కాళ్ళు వణికాయి నీవు నీ వృత్తి ధర్మాన్ని వదలి దొంగ ధర్మం (Duty) చేశావు నీవు దొంగతనం చేయనంతవరకు నిర్భయంగా నీ ధర్మం నెరవేర్చావు, నీ ధర్మం ఎప్పుడైతే తప్పావో నీకు భయం కల్గింది. ఇదేశ్రేయాన్ స్వధర్మో నిగుణః పరధర్మాత్స్వనుష్ఠి తాత్ స్వధర్మే నిధనం శ్రేయః! పరధర్మో భయావహః!!

నీవు నీ ధర్మాన్ని చక్కగా అనుసరించినంతకాలం నీకు మంచి జరుగుతుంది. నీవు పరధర్మాన్ని ఎప్పడు ఆశ్రయించావో, ఆ పరధర్మం నీకు భయాన్ని కల్గిస్తుంది. ఇక్కడ నీ స్వధర్మం Bankలో డబ్బు రక్షించడం, పరధర్మం డబ్బు దొంగలించటం

# కరుణాంవగాంత్రి చందం

ఎ.ఎమ్.ఆర్.శర్మ పుట్టపర్తి

స్వామి ఇరవైరెండు పి.హెచ్.డి., పోస్టుగ్రాడ్యుయేట్ స్టూడెంట్లతో, వార్డెనుతో సహా ఊటికి ఏప్రియల్ మొదటివారంలో వెళ్ళినారు. దానికి పూర్వము ఒక్కొక్కరికి 500/- రూపాయలు ఇచ్చి బెంగుళూరు సిటీలో మంచి స్వెట్టర్లు కొనుక్కొని రమ్మని పంపిరి. దానికి తగినట్లు మఫ్లర్లు కూడా కొనుక్కొని వచ్చినారు. ఊటి చేరిన తర్వాత వారికి కొన్ని సలహాలిచ్చినారు. "ఇది పుట్టపర్తి లేదా బెంగుళూరు కాదు. తెల్లవారి గం॥ 4-00 లకు లేచి స్నానాలు చేసి తయారుకావలసిన అవసరం లేదు. గం॥6-00లకు ముందు ఎవరూ నిద్రనుంచి లేవరాదు. లేచిన తర్వాత ప్రక్షాళనము గావించి, బ్రష్ చేసుకొని, కాఫీ టిఫిన్లు సేవించిన తర్వాతనే, తీరికగా గం॥ 8-00 లకు వేడి నీళ్ళతో స్నానం చేసి గం॥ 9-00 లకు జనానికి దర్శనమిచ్చే సమయానికి మీరు అక్కడ ఉండాలి. ఇక్కడ చలి జాస్తి కాబట్టి స్వెట్టర్లు ధరించండి. నిండుగా రగ్గులు కప్పుకొనండి-హాయిగా నిద్రపోండి" అని చెప్పి స్వామి తన రూము లోకి వెళ్ళినారు.

అది ఊటీలో స్వామి భవనంలో మేడమీద పెద్ద హాలు. ఆ హాలును ఆనుకొని స్వామి వారి గది. ఆ హాలులోనే విద్యార్థులు, వార్డెను పడుకొనడానికి పరుపులు ఏర్పరచబడినాయి. హాలు తలుపులు మూసివేసి అందరూ పడుకొన్నారు. ఒక మూలలో భగభగమండుతున్న కట్టెలున్న "హర్తు" (Hearth) నుంచి వెచ్చని గాలి వీస్తున్నది. కొద్దిసేపైన తరువాత ఒకతను ఆ చలికి తట్టుకోలేకనో ఏమో, అక్కడున్న నాలుగుకిటికీలు మూసివేసినాడు మరి వచ్చి పడుకొన్నాడు. హాయిగా నిద్రపోయి నాడు. అర్ధరాత్రికి స్వామి ఆ హాలులోకి నిశ్శబ్దంగా వచ్చి మూసివున్న 4 కిటికీలు మరీ తెరచి అస్తవ్యస్తంగా పడుకొనివున్న పిల్లలపై రగ్గులు సరిగ్గా కప్పి, హర్తులో మరికొన్ని కట్టెలువేసి బాగా వెచ్చదనం కలిగేటట్లుచేసి, తన రూములోకి వెళ్ళినారు ఇది ఎవరూ గమనించలేదు.

స్వామి తెల్లవారి 6 గంటలకు హాలులోకి వచ్చి చూస్తే అందరూ మేల్కొని పడకలమీదనే కూర్చొన్నారు రగ్గులు, మఫ్లర్లు కప్పుకొని స్వామికి అందరూ ప్రణామములు చెప్పినారు. అప్పుడు స్వామి తెలిపినారు. "అరే ఇక్కడ ఇప్పుడు 23 శవాలుండేవి నేను కనుక అర్ధ రాత్రి హాలులోకి వచ్చి కిటికీ తలుపులు తెరువకుండా వుంటే ఆ మూలలో వున్న హర్తు నుంచి కార్బన్ మోనాక్సైడ్ జనిస్తుంది. ఆ కిటికీ తలుపుల ద్వారా అది బయటికి పోయి చల్లని గాలి వీస్తుంటే సరిగ్గా ఉంటుంది కానీ ఆ కిటికీలు మూసివేస్తే ఈ హాలులో ఫ్రెష్ గాలి లేక కార్బన్ మోనాక్సైడ్ వల్ల

మీరందరూ రాత్రికి రాత్రే చచ్చిపోయి వుండేవారు. మీలో ఎవరో ఒకరు నిన్న రాత్రి చలికి తాళలేక కిటికీలు మూసినాడు. అందుకే నేను ముందుగానే మీకు హెచ్చరించాను స్వెట్టర్లు వేసుకొని, రగ్గులు కప్పుకొని పడుకొనమని ఇకమీదటైనా జాగ్రత్త పడండి. పై చదువులు ఎన్ని వున్నా కామన్‌సెన్సు ముఖ్యంగా వుండాలి. పదండి, లేచి బ్రష్ చేసుకొని వచ్చి బ్రేక్ ఫాస్టు చేయండి" అని చెప్పి వెళ్లినారు కరుణామయుడైన స్వామి.

మరొక సంవత్సరము 20 మంది విద్యార్థులను టీచర్లను ఎన్నుకొని కొడైకెనాలు చేరినారు. స్వామివారి బంగళాకు (సాయి శృతి) ఎదురుగా పెద్ద సరస్సు కాఫీ టిఫిన్లు అయిన తర్వాత దాని చుట్టూ తిరిగి రమ్మని పంపేవారు స్వామి అది షుమారు 5 కిలోమీటర్లు నడక. తిండికి తగ్గట్లు తగిన వ్యాయామము కూడా ముఖ్యమని స్వామివారి ఆదేశము.

ఒకరోజు అందరినీ పిలిచి కొడైకెనాలు గ్రామానికి వెళ్లి అక్కడ ఒక (Straw) దుకాణానికి వెళ్లి అక్కడున్న 20 హ్యాట్లు కొనమని, బేరం చేయకూడదని, ఆ కొట్టు వాడు ఎంత అడిగితే అంత ఇవ్వవలసినదని చెప్పి వారిలో ఒకరికి రూ 500 లు ఇచ్చి పంపించినారు. వారు పరుగుపరుగున ఆ కొట్టు వెదుకుటకు గ్రామమువైపు వెళ్లినారు. ఆ కొట్టు చేరుకొని అక్కడ కూర్చున్న 9 ఏళ్ల బాలకుడితో ఎవరో కొట్టువాడు అని అడుగగా, తానే అని అతను జవాబిచ్చాడు ఈ హ్యాట్లు మాకు కావాలి, 20 తీసి ఇవ్వమన్నారు. 'అయ్యలారా (సర్) ఇదిగో 20 మీ సైజులకు తగినట్లు ఎంచుకోనండి. మామూలుగా ఒకటి రూ 25లకు అమ్ముతాను కానీ మీరు 20 హ్యాట్లు కొంటున్నారు కాబట్టి మీకు కన్సెషన్‌గా రూ 20 లకే ఇస్తాను తీసుకోనండి" అని అన్నాడా బాలకుడు "లేదు లేదు మాకు 20 హ్యాట్లు కావలసిందే అయితే రూ. 25 కే కొంటాము తగ్గించేది లేదు" అని విద్యార్థులన్నారు. ఇదేదో విచిత్రంగా వుందే అని ఆ బాలకుడు విస్తు పోయాడు. "సర్ మీరెవరు? ఎందుకు బేరమాడలేదు నేను తక్కువ ధరకు ఇస్తానన్నా మీరు ఒప్పకోవడం లేదే ఏమిటి విశేషం" అని ప్రశ్నించాడా బాలకుడు. "మేము శ్రీ సత్యసాయిబాబావారి స్టూడెంట్లము బాబా అంటే ఎవరో నీకు తెలుసా? అని ఎదురు ప్రశ్న వేశారు ఓ తెలియకేం ఇదుగో చూడండి అని తన ఫ్యాంటు జేబులో ఒకవారం కిందట తమిళ వార్తా పత్రికలో బాబా ఫోటో వేస్తూ కొడైకెనాలు వస్తున్నారని సమాచారము నలిగిన న్యూస్ పేపర్‌లో బాబా చిత్రం. వెంటనే ఒక స్టూడెంటు తన జేబులోని బాబా ఫోటోగల క్యాలెండరును ఆ అబ్బాయి కిస్తూ, "ఇదిగో ఇది తీసుకో" అని చెప్పినాడు. వెంబడే ఇరవై జేబుల లోంచి 20 ఫోటోలు బయటికి వచ్చి ఆ అబ్బాయి చేతిలో పెట్టినారు. అతను ఉక్కిరిబిక్కిరైనాడు. బంగళాకు తిరిగి వచ్చిన తర్వాత జరిగినదంతా స్వామికి వివరించినారు.

అప్పుడు స్వామి తెలిపినారు "ఆ అబ్బాయికి తండ్రి లేడు తల్లిని పోషించే భారము ఈ అబ్బాయి పై వుంది. ఆ కోట్లు నడుపుతూ తీరిక సమయాల్లో బూట్ పాలిష్ చేస్తూ డబ్బు గడిస్తున్నాడు. కష్టార్జితమే, దొంగతనము చేయడు. తన తల్లిని శ్రద్ధాభక్తులతో సేవిస్తాడు. రోజూ నేను ఆ సరస్సుపైపు కార్లో వెళ్ళుతూంటే ప్రక్కన నిలబడి చేతులు జోడించి మనసారా ప్రార్థించి నమస్కరిస్తాడు. అందుకే అతనికి ధనసహాయము చేయవలెనని నా సంకల్పమైనది. ఊరికే రూ. 500 ఇస్తే అతను తీసుకోని వుండడు. అందుకే వ్యోట్లు కొనమని, బేరం చేయవద్దని చెప్పి మిన్నుణిను పంపించాను అని అన్నారు కరుణామయుడు బాబావారు.

మరొకనాడు కొడైకెనాలులో స్వామి, విద్యార్థులున్న హాలులోకి వచ్చి, 'లేవండి త్వరగా బ్రష్ చేసుకొని రండి' అని ఆదేశించిన పిమ్మట, గబగబ అందరూ తయారై వచ్చి కూర్చున్నారు. అందరూ బ్రేక్ ఫాస్టుకై ఎదురుచూస్తున్నారు. మామూలుగా 7-15, 7-30 సమయంలో తెల్లవారి బ్రేక్‌ఫాస్టుకై స్వామి విద్యార్థులను వెంటబెట్టుకొని క్రిందకి డైనింగ్ హాల్లోకి వచ్చేసేవారు. కానీ ఆ రోజు వాళ్ళని పై హాల్లోనే కూర్చోబెట్టి ఏదో చర్చ ప్రారంభించేసి తమ దివ్యోపన్యాసము చేసినారు. సుమారు ఒక గంటసేపు, తదుపరి 8 గంటలకు క్రిందికి వచ్చారు. క్రింద చేరిన భక్త జనము, పెద్దలు స్వామి రాకకై నిరీక్షిస్తూ ఎందుకింత ఆలస్యమైనదని విస్తుపోతున్నారు. అందరూ కాఫీ టిఫిన్లు సేవించిన తర్వాత స్వామి విశదీకరించినారు.

క్రిందటి రాత్రి పెద్ద వర్షం కురిసి, వంటకట్టెలన్నియూ బాగా తడిసిపోయినాయి. అక్కడ గ్యాసు పొయ్యి సౌకర్యము అమర్చబడలేదు. వంటవాడు కట్టెలను అంటించే ప్రయత్నములో ఎంతో ప్రయాస పడినాడు. కాని కట్టెలు మండలేదు. ఉన్న రెండు కిరోసిన్ బాటిల్సును పోసినా ప్రయోజనములేదు. దగ్గరగా అంగళ్లు లేవు. కిరసనాయిలు తెద్దామంటే 5 కిలో మీటర్లు వెళ్ళాలి. అప్పటికింకా ఎవరూ దర్శనార్థమై రాలేదు. కారుకాని, సైకిల్‌కాని అందుబాటులో లేదు. అప్పుడు మనసులో స్వామిని వేడుకొన్నాడు. స్వామి, మీరు మామూలు సమయానికే క్రిందికి దిగి బ్రేక్‌ఫాస్టుకు వస్తే ఇంకా ఏమి తయారవలేదు కాబట్టి అందరూ నన్ను తిట్టిపోస్తారు. దయచేసి ఒక గంట సేపు ఆలస్యంగా వస్తే నేను రక్షింపబడతాను. అంతలోపల కట్టెలు మండించి వంటచేసేస్తాను. రక్షించండి అని మనసులోనే ప్రార్థించినాడు ఆ ఆర్తనాదమున్స్వామి విని గ్రహించుకొని, పైన హాల్లోనే ఒక గంట సేపు కాలక్షేపం చేసి, బ్రేక్ ఫాస్టు తయారైనది అని తెలిసిన తర్వాతనే క్రిందికి దిగివచ్చారు. ఆ వంటవాని పరువు కాపాడినారు.

ఇది స్వామి వెల్లడి చేస్తేనే అందరికీ తెలిసింది.

కరుణామయుడు, బాబావారు.

# ఇంతకీ ఆ అపురూప సుందరి ఎవరు?

పాలగుమ్మి జగన్నాథరావు, రాజోలు

శ్రీమతి సీతామహాలక్ష్మి, న్యాయవాది (Lawyer) గా మంచి పేరు తెచ్చుకొని వైట్‌ఫీల్డులో స్థిరపడింది. ఆమె భర్త శ్రీ సాంబశివరావు. రిటైర్డు హైకోర్టు జడ్జి. జడ్జి పదవికి ఆమె పేరును కూడా ప్రతిపాదించగ, ఈ ఆహ్వానమును ఆమె తిరస్కరించింది. "భగవాన్ బాబాగారి దివ్య సన్నిధిలో తప్ప మరెక్కడయినా శాంతి, ఆనందం లభిస్తుందా? దైవ చింతన లేని జీవితము వ్యర్థమే గదా!" అనెడి దృఢ నమ్మకము గలది.

అసలు ఆమె శ్రీ సత్యసాయిబాబావారినెట్లు దర్శించ గల్గింది? తన ఏకైక పుత్రునకు పదకొండవ ఏట కాళ్లకు పక్షవాత రోగం వచ్చి అవిటి వాడయినాడు. పిమ్మటనంతరము ఆమె ప్రయివేటుగ 'లా' చదివి ప్లీడరు వృత్తిలో బాగా రాణించింది. సంఘసేవలో కూడా చురుకుగ పాల్గొని తన భర్త పనిచేసిన ప్రతిచోట సేవా సంఘములను స్థాపించి ముఖ్యంగా అనాథ బాలలకు ఎంతగానో సేవ చేసింది.

తన కుమారుడు జీవితంలో నడువలేడని డాక్టర్లు ధృవపరచినారు. మద్రాసులో మంచాన్ని అంటిపెట్టుకునియున్న తన కుమారునకు అనేక రకాల వైద్యం చేయించింది కాని ఏదీ ఫలించలేదు. ఆమె దుస్థితిని గమనించిన ఇద్దరు స్నేహితులు "ఎందుకు అంతగా బాధపడతావు? రెండు చేతులా సంపాదిస్తున్నావు ఒక్కడే సంతానము. వాడికి ఏ లోటు రాకుండగ జీవితం గడచి పోతుంది" అని ఓదార్చడం మొదలు పెట్టారు.

ఈ విధమైన ఓదార్పుకు ఆమె తట్టుకోలేకపోయింది. డబ్బుతోనే ఈ ప్రపంచంలో అన్నీ సాధించవచ్చు ననెడి వారి సలహాకు ఆమె ఉగ్రురాలయింది.

"ఓ దైవమా! ఎందుకు నాకు ఇట్టి శాపాన్ని కలుగ జేసినావు? నాకు తెలిసినంతవరకు అందరికీ మంచినే చేసినాను. ముఖ్యంగా అనాథ పిల్లలకు ఎంతగానో సేవ చేసినాను. ఎందుకు నా బిడ్డ అవిటివాడై మంచం పట్టినాడు" అని నిరాశ నిస్పృహలతో ఆమె దైవాన్ని హృదయవేదనతో ప్రార్థించింది.

ఒక్కసారి ధగధగ మెరిసెడి ఒక అందమయిన స్త్రీ సోఫాలో ఆమె ప్రక్కన కూర్చున్నది. ఆ అపురూప సుందరి సొగసుకు సీతామహాలక్ష్మి మంత్రముగ్ధురాలయి ఆశ్చర్యంలో మునిగిపోయింది. నోటమాట రాలేదు. 'అసలు నీవు ఎవరు? ఇక్కడకు ఎట్లు రాగలిగితివి? అని కూడ అడుగలేకపోయింది. ఆ లావణ్యవతి నవ్వుతూ మృదువుగా అతి చనువుగా "సీతామహాలక్ష్మీ! బాధపడకు, ఆదుర్దా పడకు. సాయిగాయత్రిని ప్రార్థించు; నీ కుమారుని పరిస్థితి అచిరకాలంలో చక్కబడుతుంది అని సలహా యిచ్చింది.

ఇప్పటికే వంద దేవుళ్ళకు మ్రొక్కుకున్నాను, ఇది చాలదన్నట్లు సాయిబాబా ఒకడా? నాకు అవసరం లేదు అని సమాధానమిచ్చింది సీతామహాలక్ష్మి

"వయస్సులో ఉన్నావు, ఎంతో సంపాదిస్తున్నట్లు ఎన్నో చేస్తున్నట్లు అనుకుంటున్నావు నా మాటలలో నమ్మకముంచి సాయిబాబాను ప్రార్ధించు' అని చెప్పి ఆ వయ్యారిభామ అదృశ్యమయింది.

సీతామహాలక్ష్మికి మతిపోయినట్లయింది. చూస్తుండగనే అంత హఠాత్తుగా ఆమె ఎట్లా అదృశ్యమయింది? మంచం మీద పడుకుని ఇదంతా చూస్తున్న ఆమె కుమారునికి కూడ అంతా చాల విచిత్రంగా ఉంది కాని తల్లికొడుకులు ఈ సంఘటనను గురించి ముచ్చటించుకోలేదు. ఆ రాత్రి పడుకునేముందు అతడు తల్లిని పిలిచి అమ్మా! ఆవిడ చెప్పినట్లుగ సాయిబాబాను ప్రార్థించటంలో తప్పేముంది' అని ప్రశ్నించాడు, ఆ రాత్రి వారిద్దరూ సాయిబాబాను ప్రార్థించి పడుకున్నారు.

అర్థరాత్రివేళ ఒక పెద్ద చప్పడును విని సీతామహాలక్ష్మీ అదురుపాటుగా లేచి లైటు వేసింది, తన కొడుకు చాలా ఉద్రేకంతో 'అమ్మా! నన్ను లేవదీసి కూర్చోబెట్టు నేను నడవాలి" అని అరుస్తున్నాడు. వాడి విపరీతమయిన ఈ కోరికకు ఆమె ఆశ్చర్యపడి 'వెళ్ళి పడుకో, ఈ సమయంలో నడవటం ఏమిటి? క్రింద పడ్డావంటే లేవదీసేవారు కూడా ఎవ్వరూ లేరు' అని సముదాయించడానికి ప్రయత్నించింది. కాని ఆ అబ్బాయి పట్టు విడువలేదు. ఏమయినాసరే నడచి తీరాలన్నాడు.

'నీ కాళ్ళు ఎలా ఉన్నాయి ఏమిటి?' అని ఆమె ప్రశ్నించింది.

"ఇన్నాళ్ళు గాలి తీసివేసిన టైర్లలాగ ఉన్నాయి. ఇప్పడు పూర్తిగ గాలితో నిండిన వాటివలె ఉన్నాయి. కాళ్ళలోకి విద్యుత్తు ప్రవహిస్తున్నట్లుగా ఉంది అమ్మా! నేను నడుస్తాను' అని ప్రాధేయపడ్డాడు.

సీతామహాలక్ష్మి నెమ్మదిగా వానిని లేవదీసి నేలమీద నిలబెట్టింది. ఆ గదిలో ఒక మూల నుండి మరొక మూలకు నడిచేస్తున్నాడు. జోళ్ళు వెతుక్కుని ధరించాడు. సీతామహాలక్ష్మి తన కళ్ళను తానే నమ్మలేక వింతగా చూస్తోంది.

కొన్ని సంవత్సరాలనుండి మంచాన పడియున్న తన కొడుకులో ఒక్కసారిగ ఇంతమార్పు ఎలా వచ్చింది? వైద్యం చేసిన ప్రతీ డాక్టరు, వాడికి నడక రావడం జరగని పని అని చెప్పారు గదా. తెల్లవారుఝామున నాలుగు గంటలయింది. వీధిలోనికి తీసుకొని వెళ్ళమని గొడవచేశాడు. మైలాపూర్ పార్కువద్దకు తీసుకొని వెళ్ళింది ఆమె.

"ఎవ్వరూ ఊహించనిది. వానిలో మార్పును వైద్యులే నమ్మలేకపోయారు' అంది సీతామహాలక్ష్మి

తన కుమారునిలో ఇట్టి అద్భుత మార్పు వచ్చిన తర్వాత ఆమె ఒక రోజున మద్రాసులో ఒకరిని 'సాయిబాబా ఎవరు?' అని ప్రశ్నించింది. మహారాష్ట్రలో షిరిడీ అనే గ్రామములో షిరిడీ సాయిబాబా సమాధి మందిరం ఉందని అక్కడికి భక్తులు వెడుతూ ఉంటారని తెలిసికొనది. కొద్ది రోజుల తర్వాత ఆమె కుటుంబ సభ్యులు అందరూ షిర్డి ప్రయాణమయారు.

వారు షిరిడీ చేరునప్పటికీ సాయంత్రమయినది, గుడికి దగ్గరగా ఒక గదిలో బస చేసిరి. కాస్సేపటికి సుమారు ఇరువది సంవత్సరముల వయస్సుగల ఒక యువకుడు అక్కడకు వచ్చి సీతామహాలక్ష్మి లేచి కూర్చో, తీర్థం యిస్తాను అన్నాడు. క్రొత్త ప్రదేశంలో అపరిచిత వ్యక్తి వద్ద నుండి ఏదయినా తీసుకోవటానికి ఆమె అంగీకరించలేదు. వెంటనే అతడు "ప్రతి ఒక్కరు సీతామహాలక్ష్మి చాలా ఆరోగ్యంగా ఉందని అనుకుంటున్నారు, కాని ఆమెకు ఒళ్లంతా నొప్పులే. లే, లేచి తీర్థం త్రాగు అని గర్జించాడు. అతను చెప్పినది నిజమే. కొడుకుతో పడిన బాధలకు ఆమె అలసి పోయి స్పృహ తప్పే స్థితికి వచ్చింది. ఆమె లేవలేకపోయింది. భర్త కొడుకు సాయంతో లేచి కూర్చొని చేయి జాపింది. ఆహా! అది కేవలం తీర్థం కాదు, అమృతమే! తీర్థం త్రాగిన తర్వాత చూస్తే ఆ యువకుడు అదృశ్యమయినాడు.

షిర్డి దర్శనానంతరం మద్రాసు చేరిన కొద్ది రోజులకు ఆమెకు కలలో ఒకామె కనబడి చేయి పట్టుకొని ఒక ప్రదేశానికి తీసుకొని వెళ్లింది. అక్కడ ధగధగ మెరిసెడి కొండమీద తేజస్సుతో నిండిన ఒక యువకుడు నిలబడి యున్నాడు.

ఆ మర్నాడు ఆమె, ఆమె కుమారుడు శ్రీనుతి హనుమంతరావు ఆహ్వానముపై మొట్టమొదటిసారిగ యింటికి వెళ్లిరి. గుమ్మంలో అడుగు పెట్టగానే ఆ ప్రదేశమంతా బాగా పరిచయమున్నట్లుగా ఆమెకు అనిపించింది. అప్పటికి ఇరువది సంవత్సరములు వయస్సుగల శ్రీ సత్యసాయిబాబా నవ్వుతూ మేడ మెట్లపై నిలబడి యున్నారు. ఆమెకు కలలో కనబడిన వ్యక్తి కూడా సరిగ్గా అట్లాగే ఉన్నాడు. 'అవును, నిన్న రాత్రి నీకు కలలో కనబడ్డాను గదా!' అంటూ ఆమెకు, ఆమె అబ్బాయికి ప్రసాదాన్ని అనుగ్రహించారు.

ఇన్ని అద్భుతాలు జరిగిన తన బిడ్డ అత్యద్భుత చికిత్స పొందిన సీతామహాలక్ష్మి సుమారు పదహారు సంవత్సరాలబాటు బాబావారిని పూర్తిగ మరచిపోయింది. ప్లీడరు వృత్తి ఒత్తిడులు తదితర కార్యక్రమాల మూలాన ఊపిరాడక స్వామి మాటే గుర్తుకు రాలేదు. అంతేకాదు. ఆమె చక్కని గృహిణి ఇంటిలో భర్తకు సేవచేస్తూ అబ్బాయి చదువు విషయము చూస్తూ షిర్డీ సాయి పూజ చేసుకుంటూ ఆఫీసు తదితర వ్యవహారాలను చక్కబెడుతూ ఉండేది. అందుచేత ఆమెకు సుమారు

పదహారు సంవత్సరాలబాటు స్వామిని చూడాలనే సంకల్పమే కలుగలేదు. ఆ తర్వాత ఒక రోజున హైద్రాబాదు నగరంలో శ్రీ బూర్గుల రామకృష్ణారావుగారి భార్య 'భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు సాక్షాత్తు ఈ భువిపై వెలసిన దైవమే' అని చెప్పగా బాబా వారు జ్ఞప్తికి వచ్చారు.

ఆ తర్వాత ఆమె, ఆమె అబ్బాయి బాబావారిని దర్శించుటకు వెళ్ళిన వెంటనే స్వామి వారిని ఆహ్వానించి వారికి మొదటిసారిగా కలలో కనబడుట, ఇద్దరికీ ప్రసాదాన్ని ఇచ్చుట మొదలగు విషయాలను జ్ఞాపకం చేశారు. కుర్రవాని వీపును తట్టుతూ 'ఈ పదహారు సంవత్సరాలలో ఎంత ఎదిగిపోయేవురా' అనగానే ఇంతకాలమూ వృధా అయినందులకు స్వామిని మరచినందులకు ఆమె మనస్సులో నొచ్చుకొని చాలా బాధపడింది. అప్పటినుండి ఆమె తరచు పుట్టపర్తి వెడుతూ ఉండేది. స్వామి ఆమెకు, ఆమె బిడ్డకు అనేక ఆశీస్సులను అందచేస్తూ ఉండేవారు. ఆమె అదృష్టం కొలదీ స్వామి అనేకమార్లు ఆమె ఇంటికి వచ్చి ఆ కుటుంబానికి పాద నమస్కారములను ప్రసాదిస్తూ వారిని కంటికి రెప్పవలె కాపాడుతూ ఉండేవారు.

ఆమె ఆఖరి చెల్లెలు వయస్సులో చిన్నదయినా కడుపులో క్యాన్సరు వ్యాధికి మూడు పెద్ద ఆపరేషన్లు చేయబడినవి. ఇంతకన్నా క్లిష్టమయిన నాల్గవ ఆపరేషను అవసరమయినప్పటికి ఆమె విపత్కర పరిస్థితిని గమనించి ఏమీ ఉపయోగం లేదని వైద్యులు ఆపరేషను చేయుటకు ముందుకు రాకుండిరి.

స్వామీ! మా పదిమంది సంతానంలో నేను పెద్ద దానిని. అది ఆఖరిది. పెద్దదానినైన నేను ఆరోగ్యంగా ఉండి బాగా చిన్నదయిన నా చెల్లెలు అట్టి గడ్డు స్థితిలో నుండుట న్యాయమా? అవసరమయితే నా ఆయుస్సును కొంత తగ్గించి దానికిచ్చి ఆమెను ఆరోగ్యవంతురాలిని చేయండి' అని ప్రార్థిస్తూ ఆ రాత్రి నిద్ర పోయినది.

తెల్లవారుఝామున స్వామి ఆమెకు కలలో కనబడగా స్వామీ! ఆమెకు ఆపరేషను చేయించి మీ ఆశీస్సుల నన్నుగ్రహించండి' అని వేడుకొనెను. ఆమె కోరికను మన్నించి స్వామి ఆమెకు అభయ హస్తమును చూపిరి. షిర్డీసాయిబాబా వలె రోగి మంచం మీద కూర్చుండిరి. 'ఎవరు నువ్వు? నా మంచం మీద ఎందుకు వచ్చినావు' అని ప్రశ్నించగ వాసన కొడుతున్న నీ శరీరాన్ని శుభ్రపరచడానికి వచ్చాను' అని సమాధానమిచ్చిరి. రోగికి ఎక్కడలేని ధైర్యం వచ్చింది. ఆపరేషను జయప్రదమగుట మరియు ఆమె త్వరత్వరగా కోలుకొనుటను చూచి డాక్టర్లు, నర్సులు కూడ వారి కళ్ళను వారే నమ్మలేకపోయారు.

సీతామహాలక్ష్మి ఇప్పుడు మనమలనెత్తింది. ఈ విశ్వమంతా కేవలం భగవాన్ శ్రీశ్రీశ్రీ సత్యసాయిబాబా వారి సంకల్పమాత్రముననే నడుచుచున్నది. "సర్వం శ్రీ సాయి మయం" అనెడి దృఢనమ్మకం గలది. 1976 నుండి కూడా ఆమె కుటుంబ సభ్యులందరూ పుట్టపర్తి, వైట్‌ఫీల్డులో నివసించుటకు స్వామి అనుమతించిరి.

ఒకసారి ఆమె భర్తకు మూత్రంలో రక్తం పోతూ ఉండడం మూలాన బాగా నీర్సపడిపోయాడు. పరిస్థితి విషమించి అంత్యదశ సమీపించిందని గ్రహించారు. ఆపరేషను అత్యవసరం కాబట్టి వెంటనే ఆసుపత్రిలో చేర్చమని వైద్యులు సలహా యిచ్చిరి. స్వామికి దూరమగుటకు ఇష్టం లేక సీతామహాలక్ష్మి స్వామిని హృదయ పూర్వకంగా ప్రార్థించింది. కుటుంబ సభ్యులందరికీ ఇంటర్వ్యూను ప్రసాదించి "శివ - సాయి " ఉంగరాన్ని సృష్టించి సాంబశివరావు వేలికి తొడిగిరి.

అంతే ఆరోజుననే రకస్రావం ఆగిపోయింది. ఆ రోజునుండి అతనిలో ఆరోగ్యం పుంజుకుంది. స్వామి చెప్పిన ప్రకారం స్త్రీకి పతిసేవకు మించినది మరొకటి లేదనే నమ్మకం గలది సీతామహాలక్ష్మి. ఆమె భర్త కూడ బృందావనంలో జరిగెడి నగర సంకీర్తన, భజనలు, మరియు స్వామి ఉపన్యాసాలలో విడువక పాల్గొంటారు. స్వామియే వారికి మూలాధారము.

'నిత్యము పూజ, ధ్యానము చేతువా' యన్న ప్రశ్నకు 'సదా నాలో ఉండెడి దైవాన్ని పూజయని, ధ్యానమని కొద్ది గంటలు మాత్రమే ఎట్లు బంధింతును' అంటుంది సీతామహాలక్ష్మి.

*నవంబరు - 1995*



# క్రోధము

"క్రోధము అనేది దేహాన్ని కూడను భస్మంగావిస్తుంది. క్రోధం మన మనస్సులో చేరితే దేహమంతా వేడెక్కుతుంది. రక్తము వేగముగా ప్రవహిస్తుంది. నరాలు బలహీనమవుతాయి. తిరిగి ఆ శక్తిని పొందాలంటే మూడు నెలలపాటు కూర్చుని భుజించాలి. మనం చేయవలసిన సాధనలకు, కర్మలకు బలహీనత ఏర్పడుతుంది. కనుక ఈ క్రోధమునకు ప్రవేశము యివ్వకుండా చూచుకోవటం సాధకుల యొక్క ప్రధాన కర్తవ్యము."

- బాబా

# "డాక్టర్ ఆఫ్ డ్రీమ్స్" భగవాన్ శ్రీ సత్యసాయిబాబా

-మాదిరాజ రామచంద్రరావు, ఖమ్మం

ఈనాడు నేల నాలుగు చెరగులా 135 పైగా దేశాలలోని శతాధిక మిలియన్ల ప్రజానీకం శ్రీ సత్యసాయిబాబాను సాక్షాత్ భగవత్ అవతారమూర్తిగా, శివశక్తుల సమిష్టి స్వరూపంగా విశ్వసించి, ఆరాధించి ఆనందిస్తున్నారు, పూజించి పునీతు లౌతున్నారు. అచ్యుతుడు, అనంతుడు, అవ్యయుడు, అక్షరుడు, ఆదిమధ్యాంతరహితుడు అయిన నిరాకార అఖండ సచ్చిదానంద పరబ్రహ్మ మానవాళిపైగల అవ్యాజమైన ప్రేమతో మానవాకారంలో భూమిపై అవతరించారు గనుక, భక్త జనోద్ధరణ - భక్త సంరక్షణ - భక్త సంస్కరణ అవతార లక్ష్యాలలో ఒక భాగం కనుక భక్తకోటిని వేయి తల్లుల విమల ప్రేమతో కంటికిరెప్పలా స్వామి అనుక్షణం కాపాడుతున్నారు. భక్తుల బాధలను, గాధలను తనవిగా స్వీకరించి పరిష్కరిస్తున్నారు.

స్వామి సశరీరంగా అనంతజనవాహిని మధ్య నడయాడుతున్నా భౌతిక తలం లో (Physical Plane) లో వైయుక్తికంగా అందరినీ పలకరించటం, కష్టసుఖాలను నివారించటం - ఆనందపరవశులను చేయటం సాధ్యం కాదు - అట్లని ఏ భక్తునీ ఉపేక్షించటం భగవత్ తత్త్వం కాదు - కనుక కోట్లాది భక్తులను ఆనందపరచటానికి భౌతిక ప్రకృతి నియమాలకు అతీతమైన ఆయన స్వంతమార్గాలు (Hot Lines) ఆయనకు ఉన్నాయి. అందులో ఒకటి భక్తులకు స్వప్నంలో దర్శనాలు ప్రసాదించడం, పాద నమస్కారాలు యివ్వటం, వ్యాధులను నివారించటం మొదలైనవి. కలలకు సాధారణంగా అర్థం ఉండదంటారు. అందుకే కలలను 'కల్లలు' (నిజం గానివి) అంటారు. కాని స్వామికి సంబంధించినంతవరకు కలలు కల్లలుగావు. ఈ అంశం స్వామే అనేకమార్లు స్పష్టీకరించారు. తన సంకల్పం మేరకే భక్తులకు కలలో దర్శనాలు యిస్తుంటానని, ఆశీస్సులు అందిస్తుంటానని, వ్యాధుల నివారణ జరుగుతుందని, సందేశాలు అందుతాయని వివరిస్తుంటారు - ఇందుకు కోట్లాది భక్తుల స్వానుభవాలే ప్రత్యక్ష నిదర్శనాలు - అంతేకాదు - ఏ నామంతో భగవంతుని పిలిచినా నేను పలుకుతాను, ఏ భగవత్ రూపాన్ని ఆరాధించినా నాకు ప్రియమే - ఆర్తితో ఏ భక్తుడు తన యిష్టదైవాన్ని ఎలుగెత్తి సహాయం అర్థించినా నేనా బాధ్యతను స్వీకరించి సంరక్షణ చేస్తాను అంటారు బాబా. అనటమే గాదు - ఆచరణలో ఆ విషయాన్ని మనకు శతధా సుస్పష్టం చేస్తున్నారు - ఆ కోవకు చెందినదే ఈ క్రింది సంఘటన.

ఖమ్మంజిల్లాలో చారిత్రక ప్రాధాన్యం గల నేలకొండపల్లి గ్రామం ఒక రెవిన్యూ మండల కేంద్రం - ఆ గ్రామంలోని సాయి భక్తులకు ప్రేమమూర్తి బాబా ఎన్నో మధురాను భూతులను, ఆనందదాయకమైన అనుభవాలను అనుగ్రహిస్తుంటారు. అదే

గ్రామంలో సాయి భక్తులుగాని ఒక పేద కుటుంబాన్ని స్వామి స్వప్నమార్గంలో అనుగ్రహించిన వాస్తవిక దివ్యగాధ యిది. సాయి అనంత దివ్య లీలాంబుధిలోని ఒక చిరుకెరటం ఇది. ఆ గ్రామంలో ఒక పేద రైతు కుటుంబానికి చెందిన 80 సంవత్సరాల వృద్ధుడు ఎర్రా వెంకయ్య. ఆంజనేయస్వామి ఆయన అభిమాన దైవం - తోచినపుడు ఆలయానికి వెళ్ళి ప్రదక్షిణాలు చేసి వస్తుంటారు. సహజ సిద్ధమైన వయోభారం వల్ల ప్రత్యేకించి ఏ అనారోగ్యం లేకున్నా శారీరక పటుత్వం శక్తి క్రమంగా క్షీణించి పోతున్న స్థితిలో ఉన్నాడు. గ్రామంలోని సాయి భక్తులు శ్రీ వంగవీటి నర్సయ్య గారు, యితరులు సాయి భజనలలో పాల్గొనవలసిందిగా ఈయన్ను అనేకసార్లు కోరారు గాని తను ఎన్నడు పట్టించుకోలేదు. స్వామి ఫొటో చూశాడుగాని ఎటువంటి స్పందన కలుగలేదు. ఆయనకు 1994వ సంవత్సరం డిశంబరు, 15, 16 తేదీల్లో అకస్మాత్తుగా తీవ్రమైన కడుపు నొప్పి ఆరంభించింది. స్థానిక వైద్యులు ఖమ్మం పట్టణంలో గల వైద్య ప్రముఖులు డా॥ జె.ఆర్. ప్రసాద్, M.D. గారిని కలవమని సలహా యిచ్చారు. డా॥ ప్రసాద్ పరీక్షించి, Investigations చేయించి మూత్ర పిండాలకు సంబంధించిన వ్యాధిగా నిర్ధారించారు. వైద్యులను సంప్రదిస్తున్న ఆ 4,5 రోజుల్లోనే వ్యాధి కడు తీవ్రరూపం దాల్చి జటిలం అయ్యింది. కడుపు బాగా ఉబ్బింది. మూత్రవిసర్జన స్తంభించింది. ఎప్పుడైన విసర్జన జరిగిన రక్తస్రావం అయ్యేది. ఏమాత్రం ఆహారం తీసుకోలేని స్థితి వచ్చింది. తుదకు ముక్కులగుండా, నోటి గుండా రక్తస్రావం కాసాగింది. పరిస్థితి విషమిస్తున్నదని గమనించిన డా॥ ప్రసాద్, వీరిని హైద్రాబాదులోని ఏదైనా సూపర్ స్పెషాలిటీస్ హాస్పిటల్‌కు తక్షణం తీసుకు వెళ్ళవల సిందిగా తొందరపెట్టారు. ఆర్థికంగా అంత వెసులుబాటు లేని కుటుంబం గనుక. తమ గ్రామం వెళ్ళి వైద్య ఖర్చుల నిమిత్తం హడావుడిగా సొమ్ము సమకూర్చు కుంటున్నారు. ఆ విషమ పరిస్థితుల్లో వీరి కుటుంబానికి బాగా పరిచయస్థురాలైన ఒకావిడ ఈయన్ను హైద్రాబాదు తీసుకొని వెళ్ళటం కన్నా పుట్టపర్తి స్వామి హాస్పిటల్ కు తీసుకొని వెళ్ళటం మంచిదని సలహా యిచ్చారు. అక్కడ డబ్బు ఖర్చు అసలు ఉండదని, వైద్యం చాలా బాగుంటుందని చెప్పారు. ఆమె సలహా మేరకు డిసెంబరు 25వ తేదీన పుట్టపర్తి ప్రయాణమై వెళ్ళారు. పుట్టపర్తి సూపర్ స్పెషాలిటీస్ ఆసుపత్రి వైద్య నిపుణులు ఈయన్ను పరీక్షించి మూత్రపిండాలు పూర్తిగా చెడిపోయాయని ఆపరేషన్‌వల్ల ప్రయోజనం ఉంటుందేమో కాని, రోగి వృద్ధాప్యం, శారీరక స్థితి దృష్ట్యా ఆపరేషన్ మరింత ప్రమాదకరం కావచ్చని అభిప్రాయపడ్డారు. మందులు వాడటం, భగవత్ కృపను అర్థించటం తప్ప ఎవరు చేయగలిగింది ఏమీ లేదని తేల్చి చెప్పారు. భగవాన్ బాబాను దర్శించుకొని యింటికి వెళ్ళి తాము సూచించిన ఔషధాలతో పాటు స్వామి విభూది ప్రసాదం

క్రమం తప్పకుండా సేవించమని సలహా యిచ్చారు. చేసేదిలేక బాధాతప్త హృదయంతో, విషణ్ణవదనంతో డిసెంబరు 30వ తేదీని పర్తి నుంచి యింటికి వచ్చారు. మందులు వాడుతున్నా వ్యాధి నెమ్మదించలేదు. భగవంతుని (సాయిని గాదు) ప్రార్థిస్తూ భారంగా నిమిషాలు, గంటలు గడుపు తున్నారు.

పర్తినుంచి యింటికి వచ్చిన మూడవ నాడు రాత్రి వెంకయ్యకు స్వప్నంలో స్వామి దర్శనం యిచ్చారు. మెడలో స్టెతస్కోప్, చేతిలో కొన్ని వైద్య పరికరాలు ఉన్నాయి. ఆయన వెంట తెల్లని యూనిఫారం ధరించిన యిద్దరు సిస్టర్స్ ఉన్నారు. ఒక సిస్టర్ చేతిలో స్టవ్, మరొకరి చేతిలో కొన్ని కత్తులు, కత్తెర్లు వంటి పరికరాలు ఉన్నాయి. నేను నీకు ఆపరేషన్ చేయటానికి వచ్చాను అన్నారు బాబా. ఈయనేమిటి? ఆపరేషన్ ఏమిటి? ఆయన డాక్టరు కాదుగదా అనుకుంటూ నిశ్చేష్టంగా ఉన్నాడు. బాబా ముడిచిన గుప్పిటను రోగి ముక్కు వద్ద ఉంచారు. ఎటువంటి వాసనో జ్ఞాపకం లేదుగాని, ఆ వాసన చూసిన వెంటనే స్పృహ తప్పినట్లయింది. ఈ స్థితిలో కూడా తన శరీరంపై ఆపరేషన్ వంటి ప్రక్రియ ఏదో జరుగుతున్నట్లు ఈయనకు తెలుస్తూనే ఉంది. క్రమంగా నిద్రలోకి జారుకున్నాడు. మరునాడు కుటుంబసభ్యులకు తన కల గురించి చెప్పాడు గాని స్వామికి సంబంధించిన స్వప్న ప్రాధాన్యత వారికి తెలియనందున ఆ కలను, ఒక మామూలు కలలాగానే భావించారు. కాని ఆశ్చర్యకరంగా వ్యాధి తీవ్రత కొంత ఉపశమించింది. ఈ తగ్గుదల స్వామి అనుగ్రహంవల్లనని వారు ఊహించలేకపోయారు. మూడు రోజుల తర్వాత స్వామి మరల ఆయనకు స్వప్నంలో కన్పించారు. ఆపరేషన్ అయ్యింది గదా! యింకా నొప్పి తగ్గలేదా అంటూ పలుకరించారు. ఈయన ఏ సమాధానం చెప్పక మునుపే వెల్లికిలా పడుకొని ఉన్న ఈయన్ను స్వామి బోర్లగా తిప్పారు, బోర్లగా ఉన్నాయన్ను వెల్లికిలా తిప్పారు. ఇట్లా 2,3 సార్లు అటూ ఇటూ బోర్లించి వ్యాధి పూర్తిగా తగ్గింది, బాధపడకు అంటూ అదృశ్యం అయ్యారు. మరునాటినుంచి నెప్పి తగ్గింది, రక్తస్రావం ఆగిపోయింది. మూత్రవిసర్జన మామూలుగా జరగసాగింది. కడుపు ఉబ్బరం తగ్గింది, తనంతట తానుగా కడుపునిండా ఆహారం తినగల స్థితి వచ్చింది - క్రమంగా సంపూర్ణ ఆరోగ్యవంతుడైనాడు.

అంత్యకాలం ఆసన్నమైనదని తీవ్రంగా మనోవేదన చెందుతున్న అభాగ్యునకు కలలో ఆపరేషన్ చేసి సంపూర్ణ ఆరోగ్యవంతునిగా చేయటమే గాక, తమాషాగా కలలోనే డాక్టరు ఫీజు వసూలు చేసుకొని వెళ్ళారట స్వామి - డిశంబరు 7వ తేదీ రాత్రి నలుగురు డాక్టర్లు వెంకయ్యకు కలలో కన్పించారు. ఆపరేషన్ చేయించుకున్నావు గదా! ఫీజు డబ్బులు ఇవ్వవా? అని అడిగారు. నాకు మీరెప్పుడు ఆపరేషన్ చేశారు.

సాయిబాబా గదా నాకు ఆపరేషన్ చేసింది అని సమాధానం చెప్పాడు. బాబా మేము అంతా ఒకటే. ఆయనే ఫీజు తెమ్మనమని మమ్ములను పంపించాడు. మాటిమాటికీ నీ దగ్గరకు రావటానికి మాకు టయిము లేదు. ఇంకా చూడవలసిన పేషెంట్లు చాలామంది ఉన్నారు అన్నారట. ఎంత ఫీజు యివ్వమంటారు అని అడిగితే నల్గురం ఉన్నాం గదా. తలా 250/- మొత్తం నల్గురకు కల్సి రు. 1,000/- యివ్వు అన్నారుట. వారు కోరిన విధంగా వెయ్యి రూపాయలు కలలోనే చెల్లించాడు. అనాధనాధుడు, ఆర్తజనరక్షకుడు, అని భక్తులు కీర్తిస్తున్న విధంగా అవధులెరుగని తమ ప్రేమపూర్వక దివ్యలీలా వైభవాన్ని, వినోదాన్ని నేలకొండపల్లి సాయీ భక్తులకు అందించి ఆనందపరవశులను జేశారు బాబా. ఈవిధమైన స్వప్న వృత్తాంతాలు ఒక్క ఈ ఎర్రా వెంకయ్యకే పరిమితం గాదు - వేలాదిమంది సాయీ భక్తులు కలల్లోనే స్వామికి పాదనమస్కారాలు చేసుకుంటున్నారు. విభూతి ప్రసాదాలు అందుకుంటున్నారు. ఆపరేషన్లు చేయించుకుంటున్నారు. ఆరోగ్యవంతులౌతున్నారు. మృత్యుముఖం నుండి బయటపడుతున్నారు. అందుకే అనుభవజ్ఞులైన సాయీ భక్తులు ఆయన్ను 'డాక్టర్ ఆఫ్ డ్రీమ్స్' అంటుంటారు. సార్ధక బిరుదాంకితుడు బాబా.

1995 జూన్ 26 నేలకొండపల్లి సత్యసాయి సేవా సమితి కార్యక్రమంలో పాల్గొనటానికి నేను వెళ్ళినపుడు శ్రీ ఎర్రా వెంకయ్యగారిని తొలిసారిగ చూడటం, మాట్లాడటం, ఆయన అనుభవాన్ని తెల్సికొనటం జరిగింది. ఆయన ముఖతా నేను ఆస్వాదించిన ఈ సాయి దివ్యలీలా మధురిమను అందరికీ పంచాలనే తపనతో స్వామి ప్రేరణతో ఈ వాస్తవిక గాధకు అక్షరరూపం యివ్వ సంకల్పించాను.

*నవంబరు - 1995*



## అజ్ఞానము

*"నిజముగా దుఃఖమునకు కారణము జన్మ. జన్మకు కారణము కర్మ. కర్మకు కారణము రాగద్వేషములు. రాగద్వేషములకు కారణము పరిస్థితుల ప్రభావము. పరిస్థితుల ప్రభావమునకు కారణము బుద్ధి. బుద్ధికి కారణము ద్వైతము. ద్వైతమునకు కారణము అజ్ఞానము. అజ్ఞానమే దుఃఖమునకు కారణము."*

**- బాబా**

# మహోన్నతుడైన స్వర్ణాభరణ శిల్పి

- డా॥ యం.యస్. రావు, పుట్టపర్తి

ఒక ఆభరణాన్ని చేయటం అంత సులభమైన పని కాదు. దానికి సుదీర్ఘమైన శ్రమ అవసరం. బంగారాన్ని లోతైన గనుల్లోంచి రాతిముక్కల రూపంతో బయటకు లాగాలి. దానిని కొలిమిలో కాల్చి శుద్ధి చేయాలి. అలా వచ్చిన 24 కారెట్ల పరిశుద్ధమైన బంగారాన్ని మన స్వర్ణకారులు ఉపయోగిస్తూ ఉంటారు. అయితే ఆ శుద్ధమైన బంగారాన్ని కావలసిన రూపంలోనికి మలిచేందుకు కొద్దిపాటి రాగిని కూడా దానికి చేర్చుతూ ఉంటారు. ఒక శిల్పిగా ఆ బంగారానికి, అనేక రంగులు కల్గిన వజ్రవైఢూర్యాలు చేర్చి అందంగా మలుచుతారు. అది ఒక ఆభరణమౌతుంది. ధనికులైన స్త్రీలను ఆకర్షింపచేస్తుంది.

బ్రిటిష్‌రాణి ధరించే ప్రత్యేకమైన ఎంతో విలువైన ఆభరణాల్ని లండన్ టవర్ ఖజానాలో భద్రపరచి ముఖ్యావసరములకు వెలికిదీసి వాడుతూ ఉంటారు. భారతదేశంలో ఎంతో ధనం కలిగిన దేవుడు తిరుపతి వేంకటేశ్వరుడు. ప్రత్యేక ఉత్సవ సందర్భాలలో స్వామివారిని ఈ విలువైన ఆభరణాలచే అలంకరింపచేస్తారు. ఈ ఆభరణాలు అన్నీ ఎన్నో శతాబ్దముల నుండి సేకరింపగా వచ్చిన ఆభరణాలు ఎందరో మహనీయులైన ప్రాచీన శిల్పులు చేసిన మహోన్నత కళాసృష్టి సంపదయే ఇది.

కాని భగవాన్ బాబా నాడూ నేడూ ఎవరితోనూ పోల్చబడలేని విధమైన మహోన్నతుడైన స్వర్ణాభరణ శిల్పి. ఆయన తన సంకల్ప మాత్రముననే అరుదైన, విలువైన ఆభరణం మరుక్షణంలో తన చేతిలోనికి వచ్చి చేరుతుంది. ప్రతి దినము ఇటువంటి సంఘటనలు అనేకం ప్రత్యక్షంగా జరుగుతూనే ఉంటాయి.

స్వామివారిని ఒక భారతీయ యువదంపతులు కాలిఫోర్నియా నుండి వచ్చి సందర్శించేవారు. ఆ దినము ఆ భారతీయ యువ దంపతుల వివాహ వార్షికోత్సవము. స్వామివారిని ఇంటర్వ్యూకు రమ్మనమని ఆహ్వానించారు. వారికి ధగధగమెరిసే ముత్యాల హారాన్ని సృష్టించి ఇచ్చారు. అటువంటి ముత్యాలహారం ప్రపంచంలో నేనెక్కడా చూడలేదు. ఒక పెద్దావిడ నేను వసించుచున్న నిలయానికి సంబంధించిన ఆశ్రమంలో ఉండేది. ఆమె అనుదినం ఉదయం, సాయంత్రం స్వామివారి దర్శనం చేసికొని వస్తూ ఉండేది. పాద నమస్కారానికి తోసుకుని ముందుకు వెళ్ళటానికి, మరీ పెద్దది కాబట్టి వెళ్ళలేకపోయేది. ఒక రోజు స్వామి భక్తుల బారులగుండా వెళ్ళేప్పడు, ఒక ఉంగరం దానిపైన బంగారు పాదాలు చెక్కబడి ధగధగ మెరిసే చిన్నిచిన్ని వజ్రములు పొదిగిన దానిని ఎంతో ఆశ్చర్యజనకంగా

సృష్టించి ఇచ్చారు. ఆమె చేసిన ప్రార్థనల ఫలితమే ఆమెకు భగవాన్ పాదములు కల్గిన ఉంగరం లభింపచేసి ఉంటుంది. ఆమె అనతికాలంలోనే ఆ ఉంగరంతోనే కన్నుమూసింది. ఎన్నో ఏళ్ళతరబడి స్వామి భక్తురాలుగా ఉంటున్న అమెరికా మహిళ డయనే, క్రిస్మసు సందర్భమున స్వామి ఆమెను పిలిచి విదేశభక్తుల బృందానికి భజనలో నాయకత్వం వహించమని కోరేవారు. ఆమెకు ఈ మధ్య ఒక విలువైన రంగు కలిగిన రాయితో పొదగబడిన ఉంగరాన్ని సృష్టించి ఇచ్చారు. ఆమె సంతోషించింది. కాని ఇంకా పూర్తి సంతోషం రాలేదేమో అనిపించింది, స్వామి ప్రశ్నించారు. అయితే ఆమె చెప్పేలోపుగనే "అదా, తెలుపురంగు నిర్మలత్వాన్ని సూచిస్తుందికదూ!" అని స్వామి అంటూ ఆ రంగు ఉంగరాన్ని తిరిగి తీసికొని, అదే సమయంలో మరల ఆ ఉంగరాన్ని తిరిగి ఆమెకు ఇచ్చారు. కాని, చూడండి, ఆశ్చర్యం. ఆ ఉంగరం రాయి తెల్లగా మారింది. బహుశః ఇంతకంటే విడ్డూరమైన విషయం ప్రఖ్యాత దక్షిణాత్య వయోలిన్ విద్వాంసుడు చౌడయ్య సందర్భంలో జరిగింది. ఒక పర్యాయం స్వామి చౌడయ్యగార్ని ప్రశంసిస్తూ ఒక మంచి, పెద్దదిగా ఉన్న ఒక బంగారు మెడలు సృష్టించి ఇచ్చారు. చౌడయ్యగారి ముఖం చూచి, వారి భావాలను గ్రహించి ఆ మెడలును స్వామి తిరిగి తీసికొని తన గుప్పెటలో పెట్టుకొని ఒక క్షణంలో తిరిగి ఆయనకు ఇచ్చేశారు. అదే మెడలు మీద స్వామి పేరు గ్రహించిన చౌడయ్య నామం, తేది, స్థలం చెక్కబడి ఉండటం ఎంతో విశేషం. అంతా సెకండ్లలో జరిగింది.

అవును. స్వామి సంకల్పిస్తారు. అలా జరుగుతుంది. అవును స్వామి మానవుల విషయంలో కూడా ఎలా సంకల్పిస్తే అలా జరుగుతూ ఉంటుంది. అది స్వామివారి అద్భుత విశేషం.

**ఒక ఉదాహరణ :**

కల్పగిరి ఒక ఘోరమైన హత్యచేసి న్యాయచట్టపు బారినుండి, పోలీసుల నుండి తప్పించుకొని హిమాలయాలకు పారిపోతాడు. అతని పరోక్షంగా అతనికి శిక్ష విధింపబడింది. కొంతకాలం పిదప కాషాయాంబరాలు ధరించి ఒక యతీంద్రునిగా చలామణి అవుతూ భారతదేశంలోగల పుణ్యస్థలాల్ని సందర్శించాడు. అతని స్వగ్రామం కూడా సందర్శించాడు. అచటనే అతడు ఘోరహత్యచేసిన స్థలం ఉంది. హాయిగా పుణ్యక్షేత్ర సందర్శనంలో భాగముగ పుట్టపర్తి చేరుకున్నాడు. బాబా ఈయనకు బారులనుండి పిలిచి ఇంటర్వ్యూకు రమ్మన్నారు. చెప్పలేని అద్భుతం జరిగింది.

ఒక గంట అయిందో ఏమో ఆ సన్యాసి స్వామివారు ఇచ్చిన మామూలు దుస్తులు ధరించి బయటకు వచ్చాడు. అతనిలో గొప్ప మానసిక పరివర్తన వచ్చింది.

స్వామి అతనికి హితబోధచేసి ఒప్పించారు. 'వెళ్ళు. ఒప్పేసుకో, నీకు మరణదండన విధించరు. నేను మాట ఇస్తున్నాను. శిక్షణ చిరునవ్వుతో అనుభవించు. మరల నీవు తిరిగి ఇచ్చటకు వచ్చినప్పుడు నీకొక బహుమతి ఇస్తాను' అని పంపించారు. కల్పగిరి స్వామి మాటలు సంపూర్ణంగా అంగీకరించి వెళ్ళాడు. స్వామివారు తన సిద్ధాంతాన్ని కల్పగిరికి ఇలా తెల్పారు. 'వారు నీ శరీరాన్ని మాత్రమే బాధిస్తారు. దాని వలన నీ మనస్సు మెరుగులు దిద్దుకుంటుంది.'

ఆయన పోలీస్‌స్టేషన్‌కు వెళ్లి లొంగిపోయాడు. అతనికి మరణదండన విధింపబడింది. కాని బాబా వాగ్దానం చేసిన రీతిని భారతదేశాధ్యక్షుడు కనికరించి శిక్షను యావజ్జీవకారాగార శిక్షకు తగ్గిస్తాడు. ఇంకా అవలేదు.

కల్పగిరి చాలా మారిపోయి, తన యావజ్జీవ కారాగార శిక్షను ఒక వరముగా భావించి తాను బాబా సందేశాన్ని తన తోటి ఖైదీలకు అందజేస్తూ, భజనలు, సత్సంగము, సర్వమత ప్రేమ మొదలైనవి ఆచరిస్తూ తాను ఎచట ఉన్నా అది బాబా మందిరముగా మార్చి జైలు జీవితం కొనసాగిస్తున్నాడు.

మానవులను బాబా తన కార్యకర్తలుగ రూపొందించుటకు ఎన్నెన్ని ఆశ్చర్యజనకములగు పనులు చేస్తారు! ఇది అంతా మానవాళి శ్రేయస్సునకేకదా! మరి స్వామి ఆ స్వర్ణకళాకారుడు తన ప్రవచనాల్లో ప్రజలనుద్దేశించి 'దివ్యాత్మస్వరూపులారా' అని సంబోధిస్తు ఉంటారు. భగవత్స్వరూపులైన మానవులారా! నా ఆధ్యాత్మిక ఆభరణములారా!' అంటారు.

*నవంబరు - 1995*



*"ముఖము సుఖము, కాళ్లు దుఃఖము. ఇంటికి వచ్చిన అతిధికి స్వాగత మీయదలచినచో, ముఖమును మాత్రం లోపలికి రానిచ్చి, కాళ్లను గడప వెలుపల నుంచోమనుట కుదరదు. స్వాగత మీయదలచుకొన్నచో, సుఖదుఃఖములను రెండిటిని సమానముగా స్వీకరించవలెను. వలదనుకున్నచో, రెంటిని నిరాకరించ వలెను."*

**- బాబా**

# జోయల్ రియోర్‌డన్ (Joel Riordan)

కె. వెంకటేశ్వరరావు, విజయవాడ

భగవంతుడు భక్తులను అనుగ్రహించేముందు పరీక్షలకు గురిచేస్తాడనేది అనేక పురాణగాధల ద్వారా మనకు తెలుసు. భక్తులుకాని వారిని భక్తిమార్గంలో ప్రవేశపెట్టడానికి వాళ్ళు పెట్టే పరీక్షలను భగవంతుడు ఆమోదిస్తాడని ఈ క్రింది సంఘటన ఋజువు చేస్తుంది.

జోయల్ రియోర్‌డన్ అమెరికాలోవున్న హాలీవుడ్‌లో చలనచిత్ర దర్శకుడు, హాలివుడ్ అమెరికాకేకాక ప్రపంచానికే ముఖ్య చలనచిత్ర పరిశ్రమ కేంద్రం. హాలీవుడ్‌లో ఇద్దరు దేవతల కృపకు పాత్రులవటానికి అనుక్షణం ప్రయత్నాలు జరుగుతుంటాయి. ఒక దేవత పేరు ధనం, రెండవ దేవత పేరు కీర్తి. అటువంటి వాతావరణంలో పనిచేయటానికి అలవాటుపడ్డ జోయల్‌కి ఆధ్యాత్మిక చింతన అంటే ఏమిటో తెలియదు.

జోయల్ భార్య డయానా, అత్తగారు అనలైస్, కాలిఫోర్నియాలో భగవాన్ సత్యసాయి భక్తులయ్యారు. రెండుసార్లు భారతదేశం వచ్చి స్వామి దర్శనం చేసుకున్నారు. వారిద్దరూ ఎవరితో మాట్లాడినా స్వామి చేసిన అద్భుతాల గురించి, స్వామి ప్రేమ గురించి చెప్పేవారు. స్వామి సాక్షాత్తు భగవంతుడేనని నొక్కి చెప్పేవారు.

వీరిద్దరి మాటలు, ప్రవర్తన చూసిన తర్వాత వీళ్ళకు పిచ్చి పట్టయినా ఉండాలి, లేదా త్వరలోనే పిచ్చి పట్టబోతోందని అనిపించింది జోయల్‌కి. ఈ పిచ్చి మనిషితో కాపురం చేయటం కంటే విడాకులివ్వడమే మేలనుకున్నాడు జోయల్. జోయల్‌కి క్రిస్టి అనే నాలుగయిదు సంవత్సరాల కూతురు ఉంది. ఆ పిల్లంటే అతనికి ప్రాణం. విడాకులు తీసుకుంటే ఆ పిల్ల తనకు దూరమవుతుందని భయపడ్డాడు. అందుచేత ఏమి చేయాలో నిర్ణయించే ముందు భారతదేశం వెళ్ళి తన భార్య దేవునిగా కొలిచే ఆ సత్యసాయిబాబా అనే 'పెద్దమనిషి' ని చూడాలనుకున్నాడు.

భారతదేశం వెళ్ళేముందురోజున ముఖ్య స్నేహితుని కలుసుకొని తనెందుకు భారతదేశం వెళుతున్నాడో చెప్పాడు. ఆ స్నేహితుడు స్వామిని గురించి ఏదో పుస్తకంలో చదివాడు. అతనుజోయల్‌ని ఇలా అడిగాడు "మరి అక్కడకు వెళ్ళిన తర్వాత సత్యసాయి బాబాగారిని ఏమి అడుగుతావు?' అపుడు జోయల్‌కి మెరుపు లాంటి ఒక ఆలోచన వచ్చింది, తన స్నేహితునికి ఇలా సమాధానం చెప్పాడు. 'ఆ పెద్దమనిషి' ని వీళ్ళంతా దేవుడంటున్నారుగదా, అందుకని దేవుడు మాత్రమే సృష్టించగలిగిన ఇంద్రధనుస్సును సృష్టించి చూపమని అడుగుతాను. అది ఆ

పెద్దమనిషి చేయలేకపోతే ఆయన పచ్చి మోసగాడని, విభూతి, లాకెట్లు, ఉంగరాలు, ఫొటోలు తన అంగీలో దాచి అందరికీ ఇచ్చి తను సృష్టించానని చెప్పకుంటున్నాడని ప్రపంచానికంతా చాటి చెప్తాను' ఈ మాటయిన తర్వాత స్నేహితులిద్దరూ నవ్వుకుని వేరే విషయాలు మాట్లాడుకున్నారు.

జోయల్ తన భార్య డయానాతోను, కూతురు క్రిస్టితోను ఒక మధ్యాహ్నం వేళ పుట్టపర్తి చేరుకున్నాడు. బాగా వేడిగా ఉంది, గాలి స్థంభించి, ఒక ఆకు కూడా కదలటం లేదు. ప్రశాంతి నిలయంలో తమకు కేటాయించిన గదిలో సామాన్లు సర్దుకుని, గాలికోసం నిలయం వెనుక ఉన్న కొండ (ఇపుడు యూనివర్సిటీ బిల్డింగ్ ఉన్న కొండ) పైకెళ్ళి ఒక రాయిమీద కూర్చున్నారు భార్యాభర్తలు. వేడిగా ఉండటమే కాకుండా, ఆకాశంలో ఎక్కడా ఒక్క మబ్బుతునక కూడా లేదు. జోయల్ సిగరెట్టు వెలిగించి పొగ పీలుస్తుండగా తన ఎదురుగా ఆకాశంలో అన్ని రంగులతో స్పష్టంగా ఉన్న ఇంద్రధనుస్సు ప్రత్యక్షమైంది. జోయల్ ఆశ్చర్యంతో నోరు తెరచి (సిగరెట్ క్రింద పడిపోయిందని కూడా గమనించకుండా) అలానే ఆ ఇంద్రధనుస్సు వంక చూస్తున్నాడు. అపుడు డయానా మీరు స్వామిని ఆ ఇంద్రధనుస్సు చూపమని అడుగుదామనుకున్నారు గదా, అదిగోండి స్వామి మీకోసం సృష్టించిన ఇంద్రధనుస్సు' అన్నది. గాలిలో కొంచమైనా తేమ లేదు. ఎక్కడా ఒక చిన్న మబ్బు తునక కూడా లేదు. ఇంద్రధనుస్సు ఆకాశంలో ఎలా ప్రత్యక్షమైందో అర్థం కాలేదు జోయల్‌కి. పైగా ఈ ఇంద్రధనుస్సు మామూలుగా లేదు, నిటారుగా ఆకాశంలో నిలబెట్టిన రంగుల స్థంభంలాగా ఉంది. కొంచెంసేపటికి ఆ ఇంద్రధనుస్సు క్రమ క్రమంగా మాయమై పోయింది. జోయల్, డయానా క్రిందకి దిగి తమ గదికి చేరుకోగానే స్వామి పిలుస్తున్నారని కబురొచ్చింది. డయానాకి చాలా ఆనందం కలిగింది. స్వామి సృష్టించిన ఇంద్రధనుస్సును చూచినదానికంటే, స్వామి తమను ఇంటర్వ్యూకి పిలవడమే చాలా గొప్ప విషయంగా భావించింది. జోయల్‌కి మాత్రం ఇది సామాన్య విషయంగా తోచింది.

ఇంటర్వ్యూ గదిలో జోయల్, డయానాలేగాక మరి కొంతమందికూడా ఉన్నారు. స్వామి నేరుగా జోయల్ దగ్గరకు వచ్చి 'ఏమి పెద్దమనిషీ నీవు కావాలను కొన్న ఇంద్రధనుస్సు నీకు నచ్చిందా?' అని అడిగారు. జోయల్‌కి మతి పోయినంత పనైంది. ఎక్కడో అమెరికాలో తన స్నేహితునితో అన్నమాటలు స్వామికి తెలిసి, తను కావాలనుకున్న ఇంద్రధనుస్సును సృష్టించటమే కాకుండా, తను స్వామిని వ్యంగ్యంగా 'ఆ పెద్దమనిషి' అని సంబోధించిన విధానం కూడా స్వామికి ఎలా తెలిసిందో అర్థం కాలేదు. ఇది హిప్నటిజమా? కనికట్టా? మరింకేదైనా మాయా? జోయల్

మనసు పరిపరివిధాలుగా పోయింది. ఈ పెద్దమనిషి దేవుడనటానికి తన మనస్సు ఒప్పుకోవటం లేదు. స్వామికి మరో పరీక్ష పెట్టాలనుకొన్నాడు. ఈ మాయగాడు నిజంగా దేవుడైతే ఈ చుట్టుప్రక్కల ఎక్కడా ఈ కాలంలో పండని ఒక పండుని సృష్టించి ఈ గదిలో ఇప్పుడే తనకు ఇవ్వాలని మనసులో అనుకొన్నాడు. జోయల్‌కి [illegible] రాగానే మరెవరితోనో మాట్లాడుతున్న స్వామి సంభాషణ ఆపి, తన చేతిని త్రిప్పి అత్తిపండుని సృష్టించి జోయల్ చేతిలో పెట్టారు. అది అత్తి పండ్లు పండే [illegible] కాదు. పైగా రాయలసీమలో ఎక్కడా అత్తిపండ్ల చెట్లు లేవు. జోయల్‌కి ఉన్న అనుమానాలన్నీ తీరిపోయాయి. స్వామి 'మాయగాడి' కాదని, నిజమైన ప్రేమమూర్తి అని [illegible]యింది. డయానాకి పిచ్చి పట్టిందనే అనుమానం కూడా పటాపంచలై[illegible]

ఆరోజే ఒక దృఢనిశ్చయానికి వచ్చాడు జోయల్. హాలీవుడ్‌లో ఉన్న [illegible] వాతావరణం వదిలివేసి భారతదేశంలో స్వామిదగ్గరే ప్రేమపూరిత వాతావరణంలో తన జీవితం గడపాలనే నిర్ణయానికొచ్చాడు.

ఇప్పటికీ ఎవరైనా జోయల్‌ని 'స్వామి దేవుడని నమ్మకం కుదిరిందా?' అని అడిగితే జోయల్ ఇలా సమాధానమిస్తాడు. దేవుడంటే ఎవరో నాకు తెలియదు. స్వామిని నా సన్నిహితునిగా భావిస్తాను. స్వామి కోసం ఏమైనా చేస్తాను

జోయల్ పెట్టిన పరీక్షలకు ఒప్పుకొని జోయల్‌కి నూతన జీవితం ప్రసాదించారు స్వామి.

# అజ్ఞానమ్ము

"అజ్ఞానమును మొదట రూపుమాపవలెను. ఆ అజ్ఞానమునకు [illegible] కుమారుడు కూడా కలడు. వాడే అహంకారి. అట్టి అసుర అహంకారునకు ఇద్దరు బిడ్డలు. అవియే రాగము, వాసన. కనుక రాగమునకు, వాసనకు దగ్గర సంబంధం కలదు. రాగమెచ్చట వుండునో, వాసనా అచ్చటనే యుండును. రాగము వల్లనే మానవునకు మమత కలుగుచున్నది."

- బాబా

పెద్దమనిషి చేయలేకపోతే ఆయన పచ్చి మోసగాడని, విభూతి, లాకెట్లు, ఉంగరాలు, ఫొటోలు తన అంగీలో దాచి అందరికీ ఇచ్చి తను సృష్టించానని చెప్పకుంటున్నాడని ప్రపంచానికంతా చాటి చెప్తాను' ఈ మాటయిన తర్వాత స్నేహితులిద్దరూ నవ్వుకుని వేరే విషయాలు మాట్లాడుకున్నారు.

జోయల్ తన భార్య డయానాతోను, కూతురు క్రిస్టీతోను ఒక మధ్యాహ్నం వేళ పుట్టపర్తి చేరుకున్నాడు. బాగా వేడిగా ఉంది, గాలి స్థంభించి, ఒక ఆకు కూడా కదలటం లేదు. ప్రశాంతి నిలయంలో తమకు కేటాయించిన గదిలో సామాన్లు సర్దుకుని, గాలికోసం నిలయం వెనుక ఉన్న కొండ (ఇపుడు యూనివర్సిటీ బిల్డింగ్ ఉన్న కొండ) పైకెక్కి ఒక రాయిమీద కూర్చున్నారు భార్యాభర్తలు. వేడిగా ఉండటమే కాకుండా, ఆకాశంలో ఎక్కడా ఒక్క మబ్బుతునక కూడా లేదు. జోయల్ సిగరెట్టు వెలిగించి పొగ పీలుస్తుండగా తన ఎదురుగా ఆకాశంలో అన్ని రంగులతో స్పష్టంగా ఉన్న ఇంద్రధనుస్సు ప్రత్యక్షమైంది. జోయల్ ఆశ్చర్యంతో నోరు తెరచి (సిగరెట్ క్రింద పడిపోయిందని కూడా గమనించకుండా) అలానే ఆ ఇంద్రధనుస్సు వంక చూస్తున్నాడు. అపుడు డయానా మీరు స్వామిని ఆ ఇంద్రధనుస్సు చూపమని అడుగుదామనుకున్నారు గదా, అదిగోండి స్వామి మీకోసం సృష్టించిన ఇంద్రధనుస్సు' అన్నది. గాలిలో కొంచమైనా తేమ లేదు. ఎక్కడా ఒక చిన్న మబ్బు తునక కూడా లేదు. ఇంద్రధనుస్సు ఆకాశంలో ఎలా ప్రత్యక్షమైందో అర్థం కాలేదు జోయల్‌కి. పైగా ఈ ఇంద్రధనుస్సు మామూలుగా లేదు, నిటారుగా ఆకాశంలో నిలబెట్టిన రంగుల స్థంభంలాగా ఉంది. కొంచెంసేపటికి ఆ ఇంద్రధనుస్సు క్రమ క్రమంగా మాయమై పోయింది. జోయల్, డయానా క్రిందకి దిగి తమ గదికి చేరుకోగానే స్వామి పిలుస్తున్నారని కబురొచ్చింది. డయానాకి చాలా ఆనందం కలిగింది. స్వామి సృష్టించిన ఇంద్రధనుస్సును చూచినదానికంటే, స్వామి తమను ఇంటర్వ్యూకి పిలవడమే చాలా గొప్ప విషయంగా భావించింది. జోయల్‌కి మాత్రం ఇది సామాన్య విషయంగా తోచింది.

ఇంటర్వ్యూ గదిలో జోయల్, డయానాలేగాక మరి కొంతమందికూడా ఉన్నారు. స్వామి నేరుగా జోయల్ దగ్గరకు వచ్చి 'ఏమి పెద్దమనిషీ నీవు కావాలను కొన్న ఇంద్రధనుస్సు నీకు నచ్చిందా?' అని అడిగారు. జోయల్‌కి మతి పోయినంత పనైంది. ఎక్కడో అమెరికాలో తన స్నేహితునితో అన్నమాటలు స్వామికి తెలిసి, తను కావాలనుకున్న ఇంద్రధనుస్సును సృష్టించటమే కాకుండా, తను స్వామిని వ్యంగ్యంగా 'ఆ పెద్దమనిషి' అని సంబోధించిన విధానం కూడా స్వామికి ఎలా తెలిసిందో అర్థం కాలేదు. ఇది హిప్నటిజమా? కనికట్టా? మరింకేదైనా మాయా? జోయల్

మనసు పరిపరివిధాలుగా పోయింది. ఈ పెద్దమనిషి దేవుడనటానికి తన మనస్సు ఒప్పుకోవటం లేదు. స్వామికి మరో పరీక్ష పెట్టాలనుకొన్నాడు. ఈ మాయావి నిజంగా దేవుడైతే ఈ చుట్టుప్రక్కల ఎక్కడా ఈ కాలంలో పండని ఒక పండుని సృష్టించి, ఈ గదిలో ఇప్పుడే తనకు ఇవ్వాలని మనసులో అనుకొన్నాడు. జోయల్‌కి ఈ ఆలోచన రాగానే మరెవరితోనో మాట్లాడుతున్న స్వామి సంభాషణ ఆపి, తన చేతిని తిప్పి ఒక అత్తిపండుని సృష్టించి జోయల్ చేతిలో పెట్టారు. అది అత్తి పండ్లు పండే కాలం కాదు. పైగా రాయలసీమలో ఎక్కడా అత్తిపండ్లచెట్లు లేవు. జోయల్‌కి ఉన్న అనుమానా లన్నీ తీరిపోయాయి. స్వామి 'మాయావి' కాదనీ, నిజమైన ప్రేమమూర్తి అనీ అర్థమ యింది. డయానాకి పిచ్చి పట్టిందనే అనుమానం కూడా పటాపంచలయింది.

ఆరోజే ఒక దృఢనిశ్చయానికి వచ్చాడు జోయల్. హాలీవుడ్‌లో ఉన్న కృత్రిమ వాతావరణం వదిలివేసి భారతదేశంలో స్వామిదగ్గరే ప్రేమపూరిత వాతావరణంలో తన జీవితం గడపాలనే నిర్ణయానికొచ్చాడు.

ఇప్పటికీ ఎవరైనా జోయల్‌ని 'స్వామి దేవుడని నమ్మకం కుదిరిందా?' అని అడిగితే జోయల్ ఇలా సమాధానమిస్తాడు. దేవుడంటే ఎవరో నాకు తెలియదు. స్వామిని నా సన్నిహితునిగా భావిస్తాను. స్వామి కోసం ఏమైనా చేస్తాను.

జోయల్ పెట్టిన పరీక్షలకు ఒప్పుకొని జోయల్‌కి నూతన జీవితం ప్రసాదించారు స్వామి.

జూలై - 1995



## అజ్ఞానము

*"అజ్ఞానమును మొదట రూపుమాపవలెను. ఆ అజ్ఞానమునకు ఒక అసుర కుమారుడు కూడా కలడు. వాడే అహంకారి. అట్టి అసుర అహంకారికి ఇద్దరు బిడ్డలు. అవియే రాగము, వాసన. కనుక రాగమునకు, వాసనకూ దగ్గర సంబంధం కలదు. రాగమెచ్చట వుండునో, వాసనా అచ్చటనే యుండును. రాగము వల్లనే మానవునకు మమత కలుగుచున్నది."*

- బాబా

# శ్రీ సత్యసాయిబాబావారి దైవతేజస్సు

డా॥ ఫ్రేంక్ జి. బరనౌస్కీ

(అనువాదము : యన్.బి.యస్. రామారావు)

(డా॥ ఫ్రేంకు జి బరనౌస్కీ 'అరిజోనా' యూనివర్సిటీలో ప్రొఫెసరు. ఆయన 1978 సం॥ మే నెలలో భారతదేశము వచ్చి శ్రీ సత్యసాయిబాబావారిని తొలిసారిగ దర్శించెను. ఈయన మనుష్యుల శిరస్సు చుట్టూ వుండు కాంతిపుంజము (Aura) 'తేజస్సు'ను కనుగొనుటలో ప్రత్యేక నిపుణుడు. విద్యుదయస్కాంత తరంగములను ఫోటో తీయు 'కిర్లియన్' ఫొటో గ్రఫి ద్వారా ఈయన అనేక ప్రఖ్యాత వ్యక్తులకు అనేక దేశములలో ఫొటోలు తీసి వారి వారి తేజస్సులను (Aura) రికార్డు చేసెను. బాగా ఎక్కువ దివ్యశక్తిగల మానవులకు ఈ కాంతిపుంజము శిరస్సు చుట్టూ మూడు నుంచి ఐదు అడుగుల మేర వ్యాపించి ఉండునట. కానీ శ్రీ సత్యసాయి బాబావారి తేజస్సు వారి శిరస్సు నుండి అనంతదూరం వ్యాపించియున్నట్టు రికార్డు చేయబడుటచే సత్యసాయిబాబావారితో సమానమగు దైవము మరి లేడని నిర్ధారణమొనర్చెను. స్వామి శిరస్సు చుట్టు ఏర్పడిన దైవ తేజస్సును కిర్లియన్ ఫోటో గ్రఫీ ద్వారా చూడగానే 'బరనౌస్కీ' దిగ్భ్రాంతుడయ్యెను. తన అనుభవాలు ఇలా వివరించారు. - సం)

బంగారు రంగు తేజస్సు బాబావారు కదిలితే - ఆయన చుట్టు ఆ తేజస్సు కూడా కదులుచున్నట్లుగా యున్నటువంటి దివ్యపురుషుని నేనిదే మొదటిసారి చూచుట. నేను హిందూ నమ్మకములో పెరిగిన వ్యక్తిని కాను. నేను కేథలిక్ క్రిష్టియన్‌ను, మరియు సైంటిస్టుగా శాస్త్ర విజ్ఞానములో పెరిగినవాడిని. నేను లైసెన్సు పొందిన హిప్నటిస్టుని. నన్నెవ్వరూ హిప్నటైజు చేయలేరు. మా దేశములో ఏ ఒక్క మనిషినీ, అతడెంత గొప్పవాడైన 'భగవంతుడని' అంగీకరించుటకు వీలుకాదు. అది విజ్ఞానశాస్త్రము ప్రకారము కూడా కుదరదు. కానీ నేను సత్యసాయిబాబావారి ముఖములోకి చూసినప్పుడు వారి కళ్లు దైవతేజస్సుతో మిలమిల మెరిసినవి. నా శాస్త్ర విజ్ఞానమును ఆయన ముందు పందెము పెట్టి ఓడిపోయితిని. నేనిట్లు మాట్లాడుటవిని, నా స్నేహితులు నేను పిచ్చివాడినైతినని అనుకొందురు. ఐనా ఫరవా లేదు. శ్రీ సత్యసాయిబాబావారు మాత్రము ఆ దివ్య తేజస్సును కల్గియే వున్నారు. 'నేను భగవంతుడిని నీవు కూడ భగవంతుడివే' కానీ నన్ను నే నెరుగుదును, నిన్ను నీ వెరుగవు' అని ఆయన చెప్పినది నిజము. 'ఆయన కేవలము రెండు కాళ్లపై నడుచు ప్రేమ స్వరూపియే, ఆయన భగవంతుడే, అట్టి నిస్వార్ధ ప్రేమనే భగవంతుడందురు.'

నా స్వానుభవమునిపుడు విపులముగా పేర్కొందును. సత్యసాయిబాబావారి గురించి నేను విన్నాను కానీ రకరకముల మనోభావములు సాయిని గురించి

నేను విన్న కథలు నమ్మశక్యము గాకుండా వున్నవి. నేను శాస్త్ర విజ్ఞానములో ఆరితేరినవాడి నగుటచే, ఆధ్యాత్మిక అతీత మానసిక శక్తులతో రోగనివారణ చేయగల్గినవారి గురించి నాకు కొంత తెలుసు. వొరేల్‌లోని ఓల్గా (Olga in worell) లోర్డ్స్ (Lourdes) మొ॥ చోట్ల ఇట్టి హీలర్సు కలరు కానీ తమ చెయ్యి ఒకసారి రోగికి తగిలితే చాలు, రోగము నయమవుతుంది అన్నచో నమ్మశక్యము కాకుండా వుండి, ఒకసారి భౌతికముగా వెళ్ళి సాయిబాబావారిని దర్శించాలనుకున్నాను.

1978 సం॥ జూలై నెలలో మొట్టమొదటి ప్రపంచ శాంతి మహా సభలలో పాల్గొనుటకు నేను బెంగుళూరు వచ్చితిని. ఈ శాంతి సమావేశమును బెంగుళూరులో ఒక పవిత్ర వ్యక్తి ఏర్పాటు చేసాడు. కానీ ఆయన సభలో మాట్లాడిన తీరు 'నేను ఏర్పాటు చేశాను - నేను ఏర్పాటు చేశాను' అని అహంభావంతో మాట్లాడడం చూస్తే ఇతడు పవిత్రుడేనా అని నాకనిపించింది. అప్పుడు శ్రీ సత్యసాయిబాబావారు బెంగుళూరులోని వైట్‌ఫీల్డ్‌లోనే వున్నారని తెలిసినది. నేను టాక్సీలో వైట్‌ఫీల్ట్ చేరాను. వేలాదిమంది స్వామి దర్శనానికై కూర్చున్నారు. వారితోపాటు నేనూ కూర్చున్నాను. స్వామి దర్శనం ఇచ్చారు. ఆయన ఎవరికేసి కూడా క్షణంకంటే ఎక్కువసేపు చూచుటలేదు. అంతలోనే ప్రక్కన ఎవరినో వెతుకుచున్నట్లుగా కదలి పోయేవారు. పొట్టిగ, పెద్ద జుట్టున్న వ్యక్తి, ఆయన్ని చూసిన నా తొలి మధ్యాహ్న దర్శనంలో నాకు ఆయనలో ఏమీ ప్రత్యేకత కనబడలేదు. ఆ పూటే వెళ్ళిపోదామా అనుకున్నాను.

కానీ, నేను మర్నాడువరకూ అచట వేచియున్నాను. నేనలా వేచియుండటంలో నేనొక మహాశక్తిసంపన్నుడిని చూడగల్గుతానని నా అంతర్వాణి పలికినట్లయింది. మరునాడు ఉదయం 5 గం॥లకు సుప్రభాతము తరువాత అందరూ నగర సంకీర్తన చేస్తున్నారు. నేను మటుకు నిలబడి చూస్తున్నాను. అంతలో స్వామి త్రయీ బృందావన్ నుంచి బయటకు వచ్చారు. ఆయన దివ్య తేజస్సు (ఉదయిస్తున్న సూర్యుడిలా) బంగారుకాంతులను ఆయన నివసించు భవంతి అంచులను దాటి పైవరకూ వెదజిమ్మింది. మానవులలో బాగా ఎక్కువ దివ్యతేజస్సు కల్గినవారికి సాధారణంగా మూడు నుంచి ఐదు అడుగుల కాంతి వలయమే ఉంటుంది. కానీ స్వామిలో నేనిది అపారంగా చూశాను. ఈ వలయాలు మానవుని మనోభావాలను బట్టి రంగులు మారుతూ వుంటాయి.

నీలిరంగు కాంతివలయం - లోతైన ఆధ్యాత్మికతను ప్రేమస్వభావమును సూచిస్తుంది.

ఆకుపచ్చరంగు - రోగములను నయముచేయు హీలింగుశక్తిని సూచిస్తుంది.

పసుపుపచ్చ, బంగారురంగు- దైవశక్తిని-ఎక్కువ తెలివితేటలను సూచిస్తుంది.

ఎరుపురంగు-కోపమును, రజోగుణములను సూచిస్తుంది. నలుపు చెడు, భయం సూచిస్తుంది. పింక్ రంగు (చంద్రకాంతపువ్వు రంగు) త్యాగముతో కూడిన నిస్వార్థ ప్రేమను సూచిస్తుంది. ఇది మానవులలో చాలా అరుదు కానీ సాయిబాబా వారి చుట్టూ ఈ పింకు రంగు వలయమే నాకు గోచరించింది.

స్వామి శరీరం నుండి వెలువడిన దైవ తేజోపుంజము, స్వామి నిలబడిన భవంతిని దాటి సుదూరము వరకూ సుమారు 30 అడుగుల నుండి 40 అడుగుల పరిధిలో ఈ కాంతివలయం ప్రసరించింది, నేను మొదట చూడగనే, అచటగల 'ఫ్లోరసెటు' లైట్లు తమ దీపపుకాంతులను ఆయన మీద వెదజల్లుతున్నాయా అని క్షణం పరకాయించాను. అలా పరీక్షగా చూస్తునప్పడు స్వామి కదలగానే, 'పింక్' రంగు కాంతివలయంకూడా స్వామితో బాటు కదలడం చూసి నివ్వెరబోయాను.

నేనిదివరలోని నా అనుభవాలు జ్ఞాపకం చేసికొంటే, మాజీ ప్రెసిడెంటు 'గెరాల్డ్ షోర్డు', నెదర్‌లాండ్స్ రాణి జూలియానా, పోపు జాన్‌పాల్ మొ॥ వారి కాంతివలయాలు నా మనసులో మెదిలాయి. కానీ ముఖ్య విశేషం ఏమిటంటే, పైవారినే కాకుండా ఇంకా ఎందరో వేలాది మందికి గల కాంతివలయాలను నేను స్టడీ చేసాను. కానీ, సత్యసాయిబాబావారి దివ్యకాంతి పుంజముతో మరి ఎవ్వరిదీ సరిపోల్చడానికి వీలుకాదు. ఈ దివ్యదృశ్యం చూస్తూ నేను అచట నగర సంకీర్తన చేస్తున్న భక్తులు పాడే పాటలు ఒకటి కూడా వినలేదు. నగర సంకీర్తన జరుగుతోంది. అనుకునే లోపల స్వామి లోపలికి వెళ్ళిపోయారు. నాలుగు గంటల తరువాత (అంటే ఉదయం 9 గం॥లకు) తిరిగివచ్చి స్వామి ఇచ్చే ఉదయపు దర్శనం కోసం ఈ భక్త సమూహం అందరూ నగర సంకీర్తన అనంతరం అక్కడే మఠం వేసికొని (Cross legged) కూర్చుండిపోయేరు.

వాతావరణం లేజీగా వుంది. ఉక్కపోస్తోంది. చమటలు కారుతున్నాయి, గాలిలో తేమ ఏ క్షణం అయినా వర్షింపవచ్చుననట్లుగా మబ్బులు క్రమ్మింది కొందరు భక్తులు నామస్మరణ చేస్తున్నారు. వర్షం వచ్చేలా కనిపిస్తోంది. మబ్బులు చూసి, "సత్య సాయిబాబావారు వర్షం రానివ్వరు" అని భక్తులు ఒకరితోనొకరు చెప్పకొంటున్నారు.

అంతట్లో స్వామి మళ్ళీ దర్శనం యివ్వడానికి వచ్చేరు. ఆయన నావైపే వస్తున్నారనగానే నా గుండె వేగంగా కొట్టుకోసాగింది. అంతట్లో స్వామి వచ్చి నా ముందు నిలబడ్డారు. నాకేసి చూసి, స్వామి వెంటనే ఆ ప్రక్కనున్న వారికేసి తిరిగి, గాలిలో తమ చేతిని కదల్చగానే వారి చేతిలోంచి ఎన్నో లిల్లీ పుష్పాలు జలజలా

రాలాయి. నా ప్రక్కనే వున్న వ్యక్తి తన దోసిలి పట్టాడు. ఆ దోసిలి నిండా లిల్లీ పుష్పాలు స్వామి చేతినుండి జలజలరాలాయి. అంతటితో ఆ పుష్పరేకులు ఆగిపోలేదు. అతని ప్రక్కనున్న రెండవ వ్యక్తి, ఆ ప్రక్కనున్న మూడవ వ్యక్తి చేతులలో కూడా తమ చేతితో సృష్టించిన లిల్లీ పుష్పాలను రాల్చేరు. అచటనుండి స్వామి, నాకేసి, "నేనేమి చేసానో చూసావా?" అన్నట్టుగా ఓ చూపు చూసి కదలిపోయేరు.

నేను ఏమీ చెయ్యలేక అలా చూస్తూ వుండిపోయాను. ఆయన చేతి లాల్చీ కొనలు చాలా పైకి ఎత్తిపెట్టి వున్నాయి. ఇది 'మేజిక్ ట్రిక్కు' కాదని తెలుస్తూనే వుంది. నేను హిప్నటైజు చెయ్యబడలేదు. నేను వారందరినీ చూస్తూనే వున్నాను. నేను లైసెన్సు పొందిన హిప్నటైజరుని. నన్ను హిప్నటైజు చెయ్యడం అంటే అది చాలా కష్టమైన పని. నా మనోస్థితి బట్టి నేనొక (Miracle) అద్భుతమును చూసానని తలపోసాను. నేను చూసిన దానికి ఆశ్చర్యపడి, చాలా సేపు అక్కడే అలాగే కూర్చుండి పోయాను.

ఆ మరునాడు ఉదయం, స్వామి ముందురోజు వచ్చి దర్శనమిచ్చిన కాంపౌండు దగ్గిర చేరి మఠం వేసికొని కూర్చుని మళ్ళీ స్వామిని మరోసారి దర్శించాలని నిరీక్షిస్తున్నాను. నేనలా కూర్చున్నప్పుడు, నా అంతర్వాణి నాలోంచి ఏదో చెప్పదొడగింది. 'ప్రక్కన నిలబడ్డ స్త్రీలను దాటివెళ్ళి కొంతదూరం నడచి ఆ ఎదురుగా గోడకానుకొని వున్న వ్యక్తితో మాట్లాడు' అని నా అంతర్వాణి చెప్పుతున్నట్లనిపించింది. కొత్తవారిని, నన్ను ఎరుగని వానితోనూ, భాషరాని ఈ ప్రదేశంలో నేను స్త్రీలను దాటుకొని వెళ్ళి ఎలా మాట్లాడుట అని వూరుకున్నాను. కానీ మళ్ళీ నా అంతర్వాణి అదే విషయం చెప్పినట్లయ్యేసరికి ధైర్యం చెయ్యక తప్పలేదు.

నేను లేచి స్త్రీలను దాటుకొని, కొంతఖాళీ ప్రదేశం దాటి, అచట గోడకాను కొని నిలబడ్డ ఒక అపరిచిత వ్యక్తి దగ్గఱకు వెళ్లాను.

'నీకు ఇంగ్లీషు వచ్చుననుకొంటాను! నీతో మాట్లాడమని నా మనస్సులో అనిపిస్తే నీ దగ్గరకు వచ్చాను' అన్నాను.

ఆయన తన పేరు ప్రొ॥ నరేంద్ర అని పరిచయం చేసికొని, 'ఈ రోజు ఉపన్యాసం చెప్పే స్పీకరు నీవేనని స్వామి నాతో చెప్పారు. నీవు లెక్చరరు అనుకొంటాను కదూ' అన్నాడు.

నిజమే నేను లెక్చరరునే. సుమారు తొమ్మిదివేల లెక్చర్సు నేనీపాటికి ఇచ్చి వుంటాను. ఐనా ఈ సంగతి ఇతనికెలా తెలుసు? అని ఆశ్చర్యపడ్డాను. ఆ ఉదయం మళ్లీ బాబావారిని గమనిస్తూ వున్నాను. అనేకమంది జనసమూహాన్ని బాబా దీవిస్తున్నారు. వారికి ధైర్యం ప్రసాదిస్తున్నారు. వారి శరీరం నుండి జనించిన విశేషమైన పింక్ రంగు కాంతి సముదాయంతో జనులలో పుట్టిన ఎర్రని

కోపోద్రేకమైన, నల్లని చెడుపనుల ఫలితమైన కాంతి వలయాలను తుడిచి పారేస్తున్నారు. ఈ విధంగా స్వామి ఎంతోమంది మనస్సులు మారుస్తున్నారు. వారి భయాలను, బాధలను తమ దివ్య తేజస్సుతో నివారణ చేస్తున్నారు. ప్రపంచ నలు మూలలనుంచీ స్వామిని ప్రార్థించేవారికి సాయిబాబా తనను తానే సమర్పించు కొంటున్నారు.

ప్రొ॥ నరేంద్ర నాకిచ్చిన సందేశాన్ని బట్టి నేను సత్యసాయిబాబావారి కాలేజీలో ఆ మధ్యాహ్నం మాట్లాడవలసియున్నది. ఎనిమిది వందలమంది విద్యార్థులు, వంద మంది ఉపాధ్యాయ బృందం నా లెక్చరు విన్నారు. నేను సత్యసాయిబాబావారి ప్రక్కన ఆడిటోరియం వేదికపై నున్నపుడు వారి దైవతేజస్సు ఆ ప్లాట్‌ఫారం దాటిపోయి ప్రసరించి ఆ హాలులోనున్న వారందరినీ ఆవరించడం గమనించాను. వెంటనే సాయిబాబా వారి ప్రేమ అచట నున్న వారందరికీ అందింది. ఆ ప్రేమ అందగానే హాలులోనున్న వారందరూ ఆనందంతో పొంగిన హృదయావేశంలో స్వామిపై భక్తిగీతాలు ఆలపించారు.

'అవతార్' అన్న పదం ఏసు క్రీస్తువంటి దివ్యశక్తులున్న వారికే ఉపయోగించాలి. కానీ అంతకంటే ఎక్కువ శక్తులున్న వీరికి భగవంతుడనే పదం ఉపయోగించాలి. కేథలిక్‌నైనా నేనీయన్ని గుర్తించలేకపోతే నా జన్మ వ్యర్థమే అనుకొన్నాను.

ఈ హాలులో అందరూ అలా భజనగీతాలు పాడుతుంటే స్వామి నాకేసి తిరిగి

"నీవు ఎక్కువ ప్రేమగలవాడవు కనుక", అని తమ ఖాళీ చేతిని నాకు చూపించి, గాలిలో తమ చెయ్యి గిరగిర త్రిప్పి నవరత్నాలు పొదిగిన బంగారపు ఉంగరం సృష్టించి... 'ఇది నీ చేతి మొదటి చూపుడు వేలికి మాత్రమే సరిపోతుంది.' అంటూ, స్వామి నా చూపుడు వేలికి పెట్టారు. అది సరిగా సరిపోయింది. (తరువాత నేనీ వుంగరాన్ని అనేక విదేశాలలో నగల వర్తకుల వద్ద పరీక్ష చేయించాను. 900 నుండి 1100 డాలర్ల విలువ చేస్తుందన్నారు)

ఆ మరునాడు నాకు స్వామి ప్రైవేటు ఇంటర్వ్యూ ఇచ్చారు. నేనాయనతో 'జీసస్' తిరిగి పుట్టుట 'అవతార పురుషుడిగ' అనే విషయం మరియు నా మనుమడి అనారోగ్యం గురించి చర్చించాలనుకొన్నాను. నా మనుమడికి గుండె వ్యాధి వుంది. పుట్టిన తరువాత ఏడాదిన్నర వయసులోపల వాడికి ఎన్నో ఆపరేషన్లు జరిగాయి. వాడు బ్రతుకుతాడన్న ఆశలేదు. నేను వాడిని మా దేశంలో విడిచి వచ్చాను. అసలిప్పటికి వాడు బ్రతికి ఉన్నాడో లేదో.. అని మనస్సులో అనుకున్నాను.

అసలీ విషయాలు ఏవీ కూడా స్వామితో చెప్పకుండానే ఇంటర్వ్యూలో స్వామి నాతో ఇలా అన్నారు. 'నీవు ఏరోజైతే "అరిజోనా" చేరుతావో ఆరోజే మీ మనవడికి

ఆపరేషను జరుగుతుంది, వాడు బావుంటాడు. అన్నారు స్వామి. అది సరిగాదనీ, వాడికి రెండేళ్ళు దాటితే కానీ ఆపరేషను చెయ్యనన్నారు సర్జన్లు అని వాదించ బోయాను. కానీ స్వామి చిరునవ్వుతో మళ్ళీ చెప్పారు.

స్వామి చెప్పినట్లే నేను అరిజోనా చేరిననాడు నా మనవడికి ఒక భారతీయ డాక్టరు ఆపరేషను చేసి ప్రాణం పోసాడు, వాడు బావున్నాడు. ఇంతటి దివ్య తేజస్సు కల సాయిబాబావారు "అవతార్" కాదు, భగవంతుడే.

జూన్ - 1995

తెనుగుసేత : **యన్.బి.యస్. రామారావు**



# హృదయమే హిమాచలం

*"మనసులో ఆనందాన్ని అభివృద్ధి పరచుకుంటే అదే కైలాసం. కైలాసమును హిమాచల పర్వతమన్నారు. 'హిమ' అంటే మంచుగడ్డ. చల్లదనం మంచు స్వభావం. తెల్లగా వుంటుంది మంచు. తెలుపు పవిత్రతకు చిహ్నం. 'అచలము' అనగా స్థిరంగా ఉండేది. చల్లదన మంటే ప్రశాంతము. అనగా పరిశుద్ధము. ప్రశాంతము, నిశ్చలము అయిన హృదయమే హిమాచలము. మనలో ఎప్పుడు ప్రశాంతత ఏర్పడుతుందో, ఎప్పుడు నిశ్చలత్వం కలుగుతుందో, అప్పుడే మన హృదయం ఈశ్వరుని నివాసమైన హిమాచల పర్వతమవుతుంది."*

**- బాబా**

# "సుప్రీం డాక్టర్" భగవాన్ శ్రీ సత్యసాయిబాబా

మాదిరాజు రామచంద్రరావు, ఖమ్మం

అది 1989వ సంవత్సరం, డిసెంబరు నెల. ఖమ్మం పట్టణంలో ప్రభుత్వ వ్యవసాయశాఖ (Agricultural Dept.) లో ఉద్యోగిగా వున్న సాయి భక్తులు శ్రీ టి. రామచంద్రరాజుగారు, వారి భార్య శ్రీమతి రాజేశ్వరిగారితో కలిసి లూనా (Luna) పై ఒక వివాహానికి వెళ్తుండగా ఎక్సిడెంట్ అయింది. ఆమె తలకు బలమైన దెబ్బతగిలింది, స్పృహ కోల్పోయింది, కొంతసేపటికి స్పృహ వచ్చిందిగాని నెప్పి ఎక్కువగా వుంది. ఖమ్మంలోనేవున్న మరో సాయిభక్తుడైన డా॥ పి. రంగయ్య ఎమ్.ఎస్. ఆమెను పరీక్షించి వైద్యం ఆరంభించారు. ఆ డాక్టరుగారు సలహా మేరకు గుంటూరు వైద్య కళాశాలలో పనిచేస్తున్న ప్రొఫెసర్‌ని గోపాలరావు, ఎమ్.డి. న్యూరాలజి ప్రొఫెసరుగార్ని సంప్రదించారు. ప్రొఫెసరుగారి సూచనల మేరకు ఖమ్మం లోని డా॥ రంగయ్యగారు వైద్యం కొనసాగిస్తున్నారు. కాని గుణం కన్పించలేదు నొప్పి తగ్గుతూ, పెరుగుతూ వుంది. తల బాధకు తోడు క్రమంగా మానసికరుగ్మత ఆరంభమైంది. అతిగా, అనవసరంగా నవ్వటం, అసందర్భంగా మాట్లాడటం చేయసాగారు తలకు తగిలిన బలమైన దెబ్బ కారణంగా ఈ పరిణామం సంభవించినట్లు వైద్యులు భావించారు. ఔషధసేవనం వల్ల శిరోవేదన కొద్దిగా ఉపశమించింది.

కాని సెప్టెంబరు 1990 నుంచి తిరిగి తల బాధ తీవ్రమైంది మానసిక కలవరం అధికమైంది ఎదుటి వారిని సరిగా గుర్తించలేక పోయేది. భోజనం చేయాలనే ధ్యాస వుండేది కాదు బలవంతంగా తినిపించవలసి వచ్చేది అర్ధరాత్రి కూడా తలుపులు తీసుకొని రోడ్డుకు వెళ్లేవారు. ఎందుకు వెళ్తున్నావని ప్రశ్నిస్తే సమాధానం వుండేదిగాదు. భర్త ఆఫీసుకు వెళ్లేటపుడు ఆమెను ఒక గదిలో వుంచి తాళం వేసుకొని వెళ్లవలసిన స్థితి వచ్చింది. దెబ్బ తగిలిన తర్వాత స్వామి భక్తురాల ననే భావన కూడ ఆమెకు లేకుండాపోయింది. స్వామి విభూతి వాడమంటే వాడేది కాదు. ఎందుకో ఆమె తన తలను Motor Mechanic మాత్రమే బాగుచేయగలడని ఆ స్థితిలో ఆమెకు విశ్వాసం. 'మీ లూనా చెడిపోతే మెకానిక్‌తో వెంటనే బాగు చేయిస్తారు గదా! నా తల చెడిపోతే మెకానిక్‌ను పిలువరేమిటి? ఈ రోజైనా మెకానిక్ దగ్గరకు వెళ్దాండి' అంటూ భర్తను అడుగుతుండేవారు. పైకి అల్లాగే అంటూ లోలోన ఈమె స్థితికి రాజుగారు వ్యధ చెందసాగారు. క్రమంగా ఆమె ఆరోగ్య స్థితి దిగజారసాగింది. భోజనం తినిపించటం కష్టం అయ్యేది. భర్తను గుర్తించలేని స్థితి. 1990 నవంబరు 26వ తేదీన గుంటూరు వైద్య నిపుణుల సలహా కొరకు మరోసారి వెళ్లారు సాయి భక్తులు, రాజుగారి కుటుంబానికి సన్నిహిత మిత్రులు. ప్రసాదరావు లెక్చరర్ (Lecturer) గారింట్లో బసచేశారు. 27వ తేదీన డాక్టరుగారిని

కలిశారు. Brain Scan చేయించాలనీ, అది జరగనిదే అసలు సమస్య ఏమిటో అర్థంగాకుండా వుందనీ, Scaning report చూసి న్యూరలాజికల్ సమస్య, సైకలాజికల్ సమస్యా నివారణకు లోబడే స్థితిలో వుందా, ఆపరేషన్ అవసరమా వంటి కీలక అంశాలు నిర్ణయిస్తామని డాక్టరు అన్నారు. ఒక సంవత్సర కాలంగా ఆ డాక్టరే వైద్యం చేస్తున్నా ఆయన Scaning సిఫారసు చేయలేదు. రాజుగారు Suggest చేసినా అవసరం లేదని తిరస్కరించారు. సమస్య జటిలం గావటంవల్ల ఆయనే Scaning advice చేశారు. Lab technicianతో మాట్లాడి 28వ తేదీ ఉదయం Scan చేయించటానికి నిర్ణయించారు. సహజంగానే రాజుగారు ఆందోళన చెందసాగారు. Scaning report ఎల్లా ఉంటుందో! డాక్టరుగారు ఏమంటారో! అసలు నివారణ సాధ్యమౌతుందో కాదో అనుకుంటూ వేదన చెందుతున్నారు. మిత్రులు ప్రసాద్‌గారింట్లోనే ఆ రాత్రి విశ్రమించారు. స్వామి పుట్టిన రోజు పండుగ ఉత్సవాల సందర్భంగా ప్రసాద్‌గారు సేవాకార్యక్రమాలలో నిమగ్నమై పుట్టపర్తిలోనే వున్నారు. ఆ రాత్రి ప్రసాద్‌గారి శ్రీమతి భోజనం వడ్డించినా రాజేశ్వరి (పేషంటు) భోజనం చేసే స్థితిలో లేరు.. అట్లాగే పడుకున్నారు.

సరిగా రాత్రి 12-00 గంటలకు రాజేశ్వరిగార్కి నిద్ర-మెలకువగాని స్థితిలో ప్రేమమూర్తి భగవాన్ బాబా దర్శనం అనుగ్రహించారు. అప్పటివరకు ఎవరినీ గుర్తించలేని ఆమె స్వామిని గుర్తించగలిగింది. మనోహరమైన అనేక అపురూప దృశ్యాలను స్వామి ఆమెకు సాక్షాత్కరింపజేశారు. అంతటా ప్రజ్వరిల్లుతున్న అగ్ని మధ్యలో శోభాయమానంగా, చిరునవ్వు చిందిస్తూ బాబా-ఆ తర్వాత తన చుట్టూ తాను పరిభ్రమించే భూగోళం భూగోళ శిఖరాన బాబా దర్శనం అనంతమైన ఆకాశం మధ్యలో సర్వవ్యాప్తియైన బాబా తెరలు తెరలుగా వీస్తున్న మలయమారుతం, మలయపవనాల్లో తేలియాడుతూ బాబా, ఆ పిమ్మట అనంత జలరాశి, ఎగిసిపడే కెరటాలు, కెరటాల ఊయలపై భగవాన్‌బాబా బహుశా పంచభూతాలూ తానేనని, లేక అవి తన అధీనంలోనే వుంటాయనీ, సాధ్యాసాధ్యాలు ఆయనకు వుండవని రాజేశ్వరికి, ఆమె ద్వారా మానవాళికి తెలియజెప్పడమేమో!

తరువాత ఒక యినుప మేకులాంటి వస్తువు స్వామి చేతిలో ఆమెకు కన్పించింది. ఆ మేకుతో ఆమె శిరస్సును స్వామి రెండుగా విభజించారు. మెదడులోని రక్తనాళాలను తలనుంచి బయటకు తీశారు. తన శరీరానికి సంబంధించి జరుగుతున్న ఈ విషయాలనన్నింటినీ బయటనుంచి మరొక వ్యక్తి చూడగల్గినట్టుగా ఆమె చూస్తున్నది. రక్తనాళాలను ఆమె చూస్తుండగానే సరిచేశారు. తిరిగి తల లోపల బ్రెయిను, నాళాలు అమర్చారు. స్వామి చేతులు రక్తంతో తడిసి వున్నాయి. గది అంతా ఆమెకు క్లోరోఫామ్ వాసన వస్తున్నది. "నీ తలకు ఎందుకు

# "సుప్రీం డాక్టర్" భగవాన్ శ్రీ సత్యసాయిబాబా

## మాదిరాజు రామచంద్రరావు, ఖమ్మం

అది 1989వ సంవత్సరం, డిసెంబరు నెల. ఖమ్మం పట్టణంలో ప్రభుత్వ వ్యవసాయశాఖ (Agricultural Dept.) లో ఉద్యోగిగా వున్న సాయి భక్తులు శ్రీ టి. రామచంద్రరాజుగారు, వారి భార్య శ్రీమతి రాజేశ్వరిగారితో కలిసి లూనా (Luna) పై ఒక వివాహానికి వెళ్తుండగా ఎక్సిడెంట్ అయింది. ఆమె తలకు బలమైన దెబ్బతగిలింది, స్పృహ కోల్పోయింది, కొంతసేపటికి స్పృహ వచ్చిందిగాని నెప్పి ఎక్కువగా వుంది. ఖమ్మంలోనేవున్న మరో సాయిభక్తుడైన డా॥ పి. రంగయ్య ఎమ్.ఎస్. ఆమెను పరీక్షించి వైద్యం ఆరంభించారు. ఆ డాక్టరుగారు సలహా మేరకు గుంటూరు వైద్య కళాశాలలో పనిచేస్తున్న ప్రొఫెసర్‌ని గోపాలరావు, ఎమ్.డి. న్యూరాలజి ప్రొఫెసరుగార్ని సంప్రదించారు. ప్రొఫెసరుగారి సూచనల మేరకు ఖమ్మం లోని డా॥ రంగయ్యగారు వైద్యం కొనసాగిస్తున్నారు. కాని గుణం కన్పించలేదు నొప్పి తగ్గుతూ, పెరుగుతూ వుంది. తల బాధకు తోడు క్రమంగా మానసికరుగ్మత ఆరంభమైంది. అతిగా, అనవసరంగా నవ్వటం, అసందర్భంగా మాట్లాడటం చేయసాగారు తలకు తగిలిన బలమైన దెబ్బ కారణంగా ఈ పరిణామం సంభవించినట్లు వైద్యులు భావించారు. ఔషధసేవనం వల్ల శిరోవేదన కొద్దిగా ఉపశమించింది.

కాని సెప్టెంబరు 1990 నుంచి తిరిగి తల బాధ తీవ్రమైంది మానసిక కలవరం అధికమైంది ఎదుటి వారిని సరిగా గుర్తించలేక పోయేది. భోజనం చేయాలనే ధ్యాస వుండేది కాదు బలవంతంగా తినిపించవలసి వచ్చేది అర్ధరాత్రి కూడా తలుపులు తీసుకొని రోడ్డుకు వెళ్లేవారు. ఎందుకు వెళ్తున్నావని ప్రశ్నిస్తే సమాధానం వుండేదిగాదు. భర్త ఆఫీసుకు వెళ్లేటపుడు ఆమెను ఒక గదిలో వుంచి తాళం వేసుకొని వెళ్లవలసిన స్థితి వచ్చింది. దెబ్బ తగిలిన తర్వాత స్వామి భక్తురాల ననే భావన కూడ ఆమెకు లేకుండాపోయింది. స్వామి విభూతి వాడమంటే వాడేది కాదు. ఎందుకో ఆమె తన తలను Motor Mechanic మాత్రమే బాగుచేయగలడని ఆ స్థితిలో ఆమెకు విశ్వాసం. 'మీ లూనా చెడిపోతే మెకానిక్‌తో వెంటనే బాగు చేయిస్తారు గదా! నా తల చెడిపోతే మెకానిక్‌ను పిలువరేమిటి? ఈ రోజైనా మెకానిక్ దగ్గరకు వెళ్దాండి' అంటూ భర్తను అడుగుతుండేవారు. పైకి అల్లాగే అంటూ లోలోన ఈమె స్థితికి రాజుగారు వ్యధ చెందసాగారు. క్రమంగా ఆమె ఆరోగ్య స్థితి దిగజారసాగింది. భోజనం తినిపించటం కష్టం అయ్యేది. భర్తను గుర్తించలేని స్థితి. 1990 నవంబరు 26వ తేదీన గుంటూరు వైద్య నిపుణుల సలహా కొరకు మరోసారి వెళ్లారు సాయి భక్తులు, రాజుగారి కుటుంబానికి సన్నిహిత మిత్రులు. ప్రసాదరావు లెక్చరర్ (Lecturer) గారింట్లో బసచేశారు. 27వ తేదీన డాక్టరుగారిని

కాని ఎంతకాలం దాచగలరు? మెల్లగా ఆ విషయం ఆమెకు తెలియజేశారు. కుటుంబ సభ్యులు, బంధువులు భయపడినట్లుగానే ఆమె ఆ వార్త విని మానసికంగా క్రుంగిపోయింది. ఈ షాక్ నుంచి ఆమెను త్వరలో కోలుకొనేలా అనుగ్రహించమని తిరిగి స్వామిని కుటుంబ సభ్యులు ప్రార్థించసాగారు. ప్రేమమూర్తి అయిన బాబా వీరి ప్రార్థనను మన్నించారు. ఆమెకు తిరిగి మరొక వినూత్న స్వప్న దృశ్యం అనుగ్రహించారు. ఆమె ప్రశాంతినిలయ ఆవరణలో వున్నారు. స్వామి నవ్వుతూ భజన హాలు దగ్గర నుంచున్నారు. భజన హాలులో ఈమె నాన్నగారు కుర్చీలో ఆసీనులైనారు. ఈమె భజన మందిరం లోకి వెళ్ళింది. నాన్నగార్ని చూసి ఉప్పొంగిన ప్రేమాభిమానాలతో "నాన్నా!" అంటూ ఆయన వద్దకు వెళ్ళింది. కాని ఆయన మరొక వైపుకు వెళ్ళి తల త్రిప్పకుంటున్నారు. ఆయన తల త్రిప్పకున్న వైపుకు వెళ్ళి మరలా నాన్నా! అంటూ పలుకరించగా ఆయన తల ఇంకోవైపు త్రిప్పకొని ఈమెను గమనించనట్లే, ఈమె అక్కడ లేనట్లే, శూన్యంలోకి చూస్తూ ఉన్నారు. ఆమె నివ్వెరపోయింది. ఏమైంది నాన్నకు? నేను అంతగా ప్రేమించేనాన్న, నన్ను పట్టించుకోవటంలేదు. పిలిచినా కంట నీరు పెట్టినా ఏమీ జరగనట్లే తామిద్దరకు ఏ బాంధవ్యం లేనట్లే, పరాయివాడిలా, అపరిచితుడులా తల త్రిప్పకున్నారు. ఏమిటి కారణం ఈ రక్త సంబంధమైన బంధుత్వాలు ఎంతవరకు శాశ్వతం? మమతానురాగాలు ఎంత వరకు నిశ్చలం? నిజానికి ఎవరికి ఎవరు బంధువులు? అనే మీమాంస ఆమెలో జనించింది. వైరాగ్యభావం పొడసూపింది. కొద్ది క్షణాల్లోనే జ్ఞానోదయం అయ్యింది. నాన్నగార్ని తిరిగి పలుకరించే ప్రయత్నం చేయకుండానే సంతృప్తిగా భజన మందిరం నుండి బయటకు వచ్చింది. కల చెదిరి మెలకువ స్వప్న దృశ్యాన్ని మరోసారి పునశ్చరణ చేసుకున్నది. ఆ క్షణం నుంచి ఆమెకు తండ్రిగారిని గురించిన వ్యధ మాయం అయ్యింది. అంతా మరచిపోయి క్రమంగా మామూలు మనిషి అయింది.

రాజుగారి కుటుంబానికి సంబంధించి స్వామి అనుగ్రహించిన మరో లీలావైభవం, వీరి కుమారుడు సాయికి వయస్సు 12 సంవత్సరాలు. జ్వరం, పొత్తి కడుపులో నెప్పి ఆరంభమైనాయి. ఎన్ని మందులు వాడినా అవి తగ్గటం లేదు. మూత్రపిండాలకు సంబంధించిన సమస్యగా గుర్తించి ఖమ్మంలో వైద్యులు Treatment యిస్తున్నారు. కాని సుగుణం కన్పించలేదు. 3,4 నెలలు ఇట్లా ఖమ్మంలోనే వైద్యం జరిగింది. పిల్లవాడు బాధ తట్టుకోలేకుండా వున్నాడు. క్రమంగా నీరసిస్తున్నాడు. ఖమ్మం డాక్టర్ల సలహా మేరకు గుంటూరు మెడికల్ కాలేజీలో పనిచేస్తున్న యూరాలజీ విభాగ అధినేత డా॥ చారిగారిని సంప్రదించారు. ఖమ్మంలో తీసిన ఎక్స్‌రే, చేసిన బ్లడ్ టెస్ట్, రిపోర్టు వాడిన మందుల వివరాలు ఆయనకు చూపించారు. కాని ఆయన తిరిగి గుంటూరులో అనేక పరీక్షలు

జరిపించారు. ఎక్స్‌రే తీయించారు. రిపోర్ట్సు వచ్చాయి కాని వాటిలో మూత్ర పిండాలకు సంబంధించిన వ్యాధి లక్షణాలు లేవు. కాని పేషెంటు పడుతున్న బాధ, చెబుతున్న లక్షణాలు ఖమ్మంలో వాడిన మందులూ అన్నీ Kidney Problem కు సంబంధించినవే. వాస్తవాలకు Reportsకు పొంతన లేకుండా వుంది. ఏమి మందులు వ్రాయాలో డాక్టరుగారికి పాలుపోలేదు. కనుక ఆయన మందులు వ్రాయ నిరాకరించారు. ఇప్పటికే చాలా Powerful మందులు వాడారు. ఇంకా మందులు వాడితే శరీరానికి మంచికంటే చెడు జరిగే అవకాశం ఎక్కువ. ప్రస్తుతానికి యింటికి తీసుకొని వెళ్ళి, అన్ని మందులు ఆపివేసి పిల్లవాడిని విశ్రాంతిగా వుండనివ్వండి. బాధ అట్లాగే కొనసాగితే 2 వారాల తర్వాత రండి. మరలా పరీక్షలు జరిపిద్దాం అన్నారు.

తండ్రిగారైన రాజుగారికి ఏమిచేయాలో పాలుపోవటం లేదు. పిల్లవాడి బాధ చూసేట్లుగా లేదు. డాక్టరు వైద్యం వద్దంటున్నారు. కిం కర్తవ్యం? ఏమి చేయటం? ఆయనకు మనసులో ఆశాకిరణంగా ఒక ఆలోచన వచ్చింది? ఇక డాక్టర్లును నమ్ముకొని లాభంలేదు. అసలు ఇది ఏ వ్యాధో వారికి అంతుబట్టటం లేదు. డాక్టర్లుకు డాక్టరైన సుప్రీం డాక్టర్ భగవాన్ బాబా దగ్గరకు వెళ్దాం పూర్తి బాధ్యత ఆయనకే వదలి వెళ్దాం నీట ముంచినా పాలముంచినా ఆయనే చేయాలి అనే స్థిర నిర్ణయానికి వచ్చారు. మరునాడు ఉదయం ఖమ్మం వెళ్ళి పర్తి ప్రయాణానికి ఏర్పాట్లు చేసుకుందామనుకున్నారు. ఆ రాత్రే ఖమ్మంలో వున్న పిల్లవాడి తల్లి రాజేశ్వరిగారికి స్వామి స్వప్న దర్శనం యిచ్చారు. స్వప్నంలో ఈ పిల్లవాడిని స్వామి పరీక్షించి, పొట్టమీద బలంగా నొక్కగా కొన్ని చిన్ని చిన్న రాళ్ళు స్వామి చేతిలోకి వచ్చాయి. ఆ రాళ్ళను ఆమె చేతిలో వుంచుతూ 'పిల్లవాడి కడుపులో ఇన్ని రాళ్ళు వుంటే బాధపడడూ? అన్నారు. ఉదయాన్నే గుంటూరు నుంచి రాజుగారు, పిల్లవాడు ఖమ్మంనుంచి వచ్చారు. ఆమె స్వప్న వృత్తాంతం విని స్వామి అనుగ్రహించారని అంతా సంతోషించారు. నిజంగానే ఆనాటి నుండి పిల్లవాడికి జ్వరం, కడుపులో నొప్పి పూర్తిగా తగ్గిపోయి సంపూర్ణ ఆరోగ్యవంతుడైనాడు. ఈ కుటుంబం వారిని అనుగ్రహించినట్లుగానే స్వామి అనేకమంది భక్తులను సంకల్ప మాత్రంచేత దీర్ఘ, మొండి, ప్రమాదకర వ్యాధుల నివారణ చేస్తున్నారు. రాజుగారు అన్నట్లు డాక్టర్లకు డాక్టర్, సుప్రీం డాక్టర్ భగవాన్ బాబా.

*జనవరి - 1995*

# మనుష్యుల మనస్సులను కూడా మంచిగ తీర్చిదిద్దగల శిల్పి శ్రీ సాయిబాబా

సర్ ఐజాక్ టైగ్రెట్, అమెరికా

నాకు అప్పుడప్పుడు ప్రయాణాలలో ఉన్నపుడు సహితము, సత్యసాయిబాబా వారు కొన్ని దూరదేశాలలో కూడా దర్శనమిస్తుండేవారు. మెంఫిసులోని 'టెన్నిసీ' నా జన్మస్థలము. నేనొకసారి మోనిట్రేల్ దేశం వెళ్లినపుడు ఒక సుందరాంగి ప్రేమలో చిక్కాను. ఆ క్షణిక సుఖం తరువాత ఈ చెడ్డపని ఎందుకు చేసానా అని చాలా విచారించి, బాధను మరచిపోవాలని తలచి విపరీతంగా వైన్ త్రాగాను. ఇది 1977 సం॥లో జరిగింది. చాలా సంవత్సరాలు సరళజీవనం తరువాత నా ప్రవర్తన ఇలా దిగజారినందుకు విచారించాను. నాకు అప్పటికి 25 సం॥ల వయస్సు. నేను నా 15వ ఏటనుంచి కూడా హిప్పీజుట్టుతోనే వుండేవాడిని. నాకు నల్లమందు వంటి మత్తుపదార్థ సేవ అప్పటికే అలవడింది. నేనీ త్రాగుడుకి అలవాటుపడిన తరువాత 'క్వాలుడ్స్' అనే ప్రేమోద్రేకం కల్గించే మాత్రలు మ్రింగడంకూడా మొదలెట్టాను. ఇది ఒకరకం మత్తమందు మాత్రలు. ఇవి నేను ఎక్కడికి వెడితే అక్కడే దొరికేవి. నేను 'మోనిట్రేలు' లో ఆరు, ఏడు రోజులున్నపుడు వీటిని నాకు రోజూ ఎవరో ఒకరు తీసికొనివచ్చి ఇస్తూండేవారు. వాటిని నేను స్వాహా చేసేవాడిని. అచటనుండి సెంట్ లూయిస్‌లోని 'మిస్సోరీ' పట్టణం వెళ్ళాను. అక్కడకూడా నన్ను ఎవరో ఒకరు కలిసి ఈ మాత్రలందజేసేవారు. వాటిని నేను సేవించకుండా ఉండలేకపోయే వాడను. ఛీఛీ! నేను వెళ్లి శ్రీ సత్యసాయి బాబావారి దర్శనం చేసుకోవాలి. నాకీ అలవాట్లేమిటి? అనుకొనేవాడిని. ఏడాది నుంచి నేను స్వామిని చూడలేదు కదా. అందుకే నాకీ పరిస్థితి ఇలావుంది అనుకుంటూ వుండేవాడిని ఏది ఏమైనా ఈ పాడు అలవాట్లు నన్ను వదిలి, పరిశుద్ధ మనస్కుడనైతే కానీ స్వామిని దర్శించడం మంచిది కాదనుకొనేవాణ్ణి.

అపుడు నేను 'మెంఫీస్' లోని నా స్వగ్రామమైన 'టెన్నిసీ' నగరానికి వెళ్లి మూడు వారాలు నిర్మలంగా గడిపి, తిరిగి 'ఏస్పెన్' 'కొలరెడో' ప్రదేశాలు దర్శించడానికి వెళ్ళాను. ఈ ప్రదేశాలలో నా ప్రవర్తన చాలా నీచంగా దిగజారి పోయింది. ఆ ప్రదేశాలలో నేను రోజుకి 15 నుండి 20 మత్తు మాత్రలను సేవిస్తూ ఉండేవాడిని. ఒక సినిమా నటి నాకొక ఘనమైన పార్టీని ఏర్పాటు చేసిన దినం వచ్చింది. ఆ ముందురోజు రాత్రి నేను ఏదో పెద్ద ప్రమాదం లేదా విపత్తు నాకు సంభవించబోతోందన్న ఆందోళనతో నిద్రనుండి ఉలిక్కిపడి మేల్కొన్నాను. ఇక ఈ మాత్రలు సేవించడం చాలా ప్రమాదం అని తలచి వాటిని మ్రింగడం పూర్తిగా విరమించాను. త్రాగడం కూడా మానివేసాను.

వెంటనే నా స్నేహితుడిని చేరి, నేనిక్కడనుంచి వెంటనే వెళ్లిపోదలచు కున్నానని చెప్పాను. కానీ 'ఏస్పెన్' నగరంనుంచి బయటకు వెళ్లేం విమాన ప్రయాణం వాతావరణం సరిగా లేనందున బాగా ఆలస్యమైంది. అట్టి ఆలస్యం వలన, 'డెన్‌వర్' 'కొలరెడో' లలో కాలిఫోర్నియా చేరడానికి దొరకవలసిన విమానాలు దొరక్క ఆలస్యంగా కాలిఫోర్నియా చేరాను. కాలిఫోర్నియాలో 'మలిబూబీచ్'లో నాకో ఇల్లు ఉన్నది. నా ప్రయాణాన్ని 'ఏస్పెన్' ఎయిర్‌పోర్టులో వివరించి, 'లాస్ ఏంజిల్స్' త్వరలో చేరేలా ఏర్పాట్లు చేసి కొన్నాను.

మార్గమధ్యంలో ఒక హోటలు రూములో బస చేసి యున్నపుడు రూములో టెలివిజన్ సెట్ ఆన్ చేసాను. అంతట్లో 'క్వాలూడ్' మాత్రలు మానివేసినందున నా శరీరంలో కల్గిన తీవ్రతరమైన మార్పు భయంకర రూపం దాల్చింది. ఆ మాత్రలు సేవించినవారు వాటిని సడెన్‌గా ఆపివేస్తే చాలా ప్రమాదానికి గురౌతారని నాకు అప్పటికి తెలియదు. నా శరీరంలోని ధాతువులన్నీ తీవ్రంగా కుంచించుకుపోయాయి. మూర్ఛ వచ్చేసింది. నా చూపు సన్నగిల్లింది. నోటినుంచి నురగలు వచ్చేసాయి. కళ్లు తిరిగి పడిపోయాను. ఆ పరిస్థితిలో నా నోటిలోని నాలుక లోపలికి లాగేసింది. విపరీతమైన బాధతో నాలుక లోనికి తోడేసింది. నేను చచ్చిపోతున్నా ననిపించింది. నా నోట్లో చెయ్యి పెట్టుకొని, నాలుకను లోపలికి తోడెయ్యకుండా బయటకు లాగలేక పోయాను అంతట్లోనే నాకు వేరొక అనుభూతి కలిగింది. క్షణం ముందున్న భయాందోళనలు పోయి, నేనెచ్చటికో తేలిపోతున్నట్లనిపించింది. నేను ఆకాశంలో నా తల పైనగల ఆకాశంలోకి నెమ్మదిగా ఎగిరిపోతున్నానా అనిపించింది. నేనొక విద్యుత్‌శక్తితో కదల్చబడుతున్నానా అనిపించింది. కానీ నా కళ్లకు చూపులేనందు వల్ల ఏమీ చూడలేకపోయాను అంతలో

"ఈ శరీరంలో నీవు మరికొంతకాలం వుండదల్చుకున్నావా లేదా తేల్చుకో?" అని ఎవరో అన్నట్లనిపించింది. నేను వెంటనే సాయిబాబా 'నాకు సహాయం చెయ్యి' అని మనస్సులోనే అనుకున్నాను.

ఇలా అనుకొన్న కొంతసేపటికి ఎవరో ఒక వ్యక్తి నా శరీరంపై గాలిలో ఎగురుతూ, నా నోట్లో బొడ్డు వరకూ చెయ్యిని చొప్పించి నా నాలుకను పట్టుకొని బయటకు లాగినట్లు తెలిసింది. అతడు నా గుండెలపై రుద్ది నాకు శ్వాస కల్పిస్తున్నట్లుగా తోచింది. మరొకసారి అతడు నాలుక పట్టుకొని బయటకులాగి, నన్ను లేవదీసి నిలబెట్టినట్లయింది. నన్ను అతడి మంచం పై పడుకోబెట్టాడు. నాకు శ్వాస ఆడి తెలివి వచ్చేసరికి నా కళ్లు కనిపించాయి. నా శరీరంపై, గాలిలో ఒక పొట్టరు నిల్చియున్నట్లుగా మసక మసకగా కనిపించింది. అతడి కాషాయాంబరం

రంగు లాల్చీ ధరించి, బంగారపు రెండు గుండీలు పెట్టుకొని, ఆఫ్రికన్ స్టయిలు జుట్టుతో ఉన్నాడు. ఆ వ్యక్తి వెంటనే ఫోను రిసీవరు ఎత్తి "ఈ నెంబరు గల రూములో వున్న వ్యక్తి చచ్చిపోతున్నాడు" అని గట్టిగ అమెరికను ఇంగ్లీషులో ఎవరికో చెప్పాడు. ఆ తరువాత నేను అంబులెన్సులో హాస్పిటలుకు చేర్చబడినట్లుగా మాత్రమే నాకు గుర్తుంది. నా కడుపులోవున్న మత్తుపదార్థ ద్రావణాలన్నీ వెళ్ళగ్రక్కించాక నన్ను హాస్పిటలునుండి విడుదల చేసారు. ఆ తరువాత 3 గం॥లకు నాకు జ్ఞాపకశక్తి కలిగి జరిగిన సంఘటనలు ఒక్కొక్కటే జ్ఞాపకం వచ్చి నన్ను శ్రీ సత్యసాయి బాబాయే రక్షించారేమోననిపించింది. సాయిబాబావారిచటికి ఒక మానవరూపంలో ముఖ్యంగా ఒక 'పోర్టరు'లా ఎలా రాగలరు? కనుక, ఆ హోటలులోవున్న పోర్టరే ఎవరో ఒకరు నన్ను రక్షించి వుంటారని తలచి నేను తిరిగి ఆ హోటలుచేరి హోటలు మేనేజరుతో ఇలా అన్నాను. "నా దగ్గఱ చాలా డాలర్ల ధనం ఉంది. కొద్ది గంటలు క్రితం నన్ను రక్షించి సహాయం చేసిన నల్ల పోర్టరు (నల్లని శరీరచ్ఛాయగల వ్యక్తి)కి ఈ ధనం ఇవ్వాలను కుంటున్నాను" అనగానే ఆ హోటలు యజమాని "పనిచేసే స్టాఫు అందరూ హోటల్లోనే వున్నారు. ఇంకా వాళ్ళ దినచర్య, పని సమయం పూర్తి కాలేదు కనుక ఎవరూ ఇంటికి వెళ్ళిపోలేదు మేము నల్లవారిని ఎవరినీ పనిలో పెట్టము. ఇక్కడ పనిచేసే వారందరూ తెల్లవారే" అన్నాడు అపుడు నాకు 'నన్ను రక్షించినది తప్పనిసరిగా శ్రీ సత్యసాయిబాబాయే ఐవుండొచ్చు" అనిపించింది.

ఆ మర్నాడు నేను తిరిగి విమానంలో 'కాలిఫోర్నియా' చేరినా 'బీచ్ హౌస్' లో చనిపోతానేమో నన్న భయంతో రెండురోజులు గడిపాను. నన్ను సాయిబాబా యిండియా రమ్మని పిలుస్తున్నట్లనిపించింది. కానీ ఈ నా దిగజారిపోయిన ప్రవర్తనతో, ఈ పరిస్థితిలో వెళ్ళడం కంటే కొద్ది రోజులైనా పవిత్ర సాధనలో గడిపి వెళ్ళి స్వామిని దర్శించడం మంచిదనిపించింది. నా ప్రవర్తన మెరుగుపడి, నేను చెప్పకో దగ్గ మంచి భక్తుడనయ్యేవరకూ పుట్టపర్తి వెళ్ళకూడదనిపించింది.

ఈ నిర్ణయం తీసికొన్న తరువాత, నా మనోపరిస్థితిని కొంత కూడబెట్టుకొని కొన్నాళైనా మంచి ప్రవర్తనతో సాధన చెయ్యాలనుకున్నాను. రెండు రోజుల తరువాత నా స్నేహితుడొకతను వచ్చి ఈ సాయంత్రం అలా బయటకు వెడదామా? అన్నాడు. మేమిద్దరం కలసి బీచ్‌లో ఇద్దరు సుందరాంగులను తీసుకొని, 'హాలివుడ్'లో విందు భోజనానికి వెళ్ళాము. నాతో వున్న సుందరాంగి 'క్వాలూడ్' మందుమాత్ర నాకందించింది. నేను దానిని స్వీకరించకుండా వుండలేకపోయాను. చావు తప్పి బ్రతికిన తరువాత నా మనస్సు ఎంతభక్తిలో స్థిరపడిందో చెప్పడానికి ఇంకేమి కావాలి? ఆ రాత్రి త్రాగుడు త్రాగడం కూడా జరిగి నేను చాలా చిన్నబుచ్చుకున్నాను. నా ప్రవర్తనకు నేనే సిగ్గుపడ్డాను నాకింకా ఆ మాత్రమైకంలో వుండి ఇంటికి కారు

నడపడం మంచిది కాదనుకొని బీచ్‌లోనే కారు పార్కు చేసి, కారులోనే కొంత సేపు పడుకోవటం మంచిదని, అలా చేస్తే మత్తు పూర్తిగ వదిలిన తరువాత జాగ్రత్తగా ఇల్లు చేరవచ్చుననిపించింది. కారుని పార్క్‌చేసి రాత్రి కారులోనే పడుకున్నాను. తెల్లవారుఝూమున గం॥ 5-00లకు నిద్రవదిలింది. కారు స్టార్టుచేశాను. 'పోర్షీ టార్గెట్' అనే సరిక్రొత్త కారది. దానిని నడుపుతూ 'సన్‌సెట్ బొలివాడ్' అనే ఘాట్ రోడ్ ప్రాంతంలో కారు చాలా వేగంగా నడుపుతూ, గం॥కు 70 మైళ్ళ వేగంతో లోయలో పడిపోయాను. కొండ శిఖరం పై నుంచి లోయలో క్రిందగల రోడ్డు వంకరల పై దొర్లుతూ క్రికెట్ స్పిన్ బంతిలా కారు తునాతునకలైపోతూండగా నా మత్తు వదిలింది.

నా ఛాతీని గట్టిగా సాయిబాబావారి చేతులు చుట్టబెట్టి పట్టుకుని ఆ కారు నుండి బయట పడవేశాయి. నా కళ్ళ ముందే కారు భస్మమై క్షణంలో నామ రూపాలు లేకుండా మండిపోయింది. మూడు రోజుల లోపల రెండు సార్లు నన్ను బాబా రక్షించినందుకు నా శరీరం వణికిపోయింది. నేను తప్ప ఏమీ మిగలకుండా నా కారు మండి బూడిద అయింది. నేను ఇంటికి చేరిన వెంటనే ఏమీ ఆలస్యం చెయ్యకుండా ఏ విమానం దొరికితే ఆ విమానంలో బయలుదేరి ఇండియా వచ్చి శ్రీ సత్యసాయిబాబావారిని దర్శించాను. కానీ స్వామి నాతో మాట్లాడలేదు. ఆయన మాట్లాడకపోయినా, సాయి సర్వజ్ఞుడని, సర్వవ్యాపి అని నాకు తెలుసు. ఇంతకు ముందు కూడా స్వామితో నాకు చాలా అనుభవాలున్నాయి. అసలు నా జీవితంలో వ్యాపారం, సాయి భక్తి ఎలా ప్రవేశించాయో చెబుతాను వినండి.

1973 - 74 సం॥ ప్రాంతాలలో (The Secret of the Planets) (గ్రహముల రహస్యం) అనే పుస్తకాన్ని 'పీటర్ టామ్‌కిన్స్' అనే వ్యక్తి వ్రాసి ప్రచురించాడు. ఈ పుస్తకంలోని విషయంపై ఒక సినిమా తియ్యాలని నేనా రచయితని పుస్తకం తాలూకు హక్కులు అమ్మమని అడిగాను. ఆ పుస్తకానికి బజారులో గిరాకీ లేదనీ, వెయ్యి కాపీలు కూడా గత నెలనుంచి అమ్ముడు పోలేదనీ, ఆ పుస్తక హక్కులకు ఆయన ధర చెప్పడానికి సందేహించాడు. ఎంతో కొంత ధనమైనా తీసికోమని నేను పట్టుబట్టగా అతడు 2500 డాలర్లు ఇస్తే చాలన్నాడు. అది నిజానికి చాలా హీనక్రయం నేనా ధనం ఇచ్చి హక్కులు కొన్నాను. మరి నెల్లాళ్ళుకు ఆ పుస్తకం బజారులో గిరాకీ పుంజుకుని 32 వారాలు మిక్కిలి ఎక్కువగా అమ్ముడుపోయే పుస్తకాలలో మొట్టమొదటి స్థానం ఆక్రమించింది. ఆ తరువాత 'ఫ్రేంక్ వెల్స్' అనే ఆయన వచ్చి 25 వేల డాలర్లు ఇస్తాను పుస్తకం హక్కులు తనకు అమ్మివేయమన్నాడు. ఆ పుస్తకం కొని ఏమిచేస్తావని అడిగాను. ఆ పుస్తకంలోని విషయంపై సినిమా తీస్తానన్నాడు. నేనూ ఆ సినిమా తియ్యదలచుకొని హక్కులు అమ్ముటకు నిరాకరించాను. సినిమా డైరెక్టరు కథ వ్రాసిన వారితో నేను సుమారు ఏడాదిన్నర గడిపాను.

ఆ కథలో వాళ్లు కొంతమంది ఆధ్యాత్మిక ప్రాముఖ్యంగల వ్యక్తులను ఏక్టర్లుగ పెట్టారు. వారితో నాకు కొంత పరిచయం ఏర్పడింది. ఈ సినిమా ప్రొడ్యూసరుగా ఈ ఏడాదిన్నర సమయంలోనూ నేను చాలా డబ్బు వ్యయం చేసాను. ఇది గ్రహములకు సంబంధించిన కథ కనుక, ఈ సినిమాలో పాత్రలను పోషించే వ్యక్తులు చిత్రవిచిత్ర మైన లీలలు చేస్తుంటారు. ఆ కథ అలా వున్నది. నిజజీవితంలో అట్టి శక్తులుగల వ్యక్తులను మా డైరెక్టరు నాకు పరిచయం చేసారు.

నేనా వ్యక్తులను ఇంటర్వ్యూ చేసాను. 'మెక్సికో'లో ఒక వ్యక్తి ఉన్నాడు. అతడు పొలిరాయిడ్ కేమేరా ఫిల్ముని తన నుదుటిమీద పెట్టుకొని (కెమేరా లేకుండా) నీకే ఫోటో కావాలని ఎదుటి వ్యక్తి నడుగుతాడు. "మెక్సికొ సిటీ అవుటర్ వ్యూ' అని అడుగగానే అతడు ఆ ఫిల్ము తీసి మనకిస్తాడు. కెమేరా లేకుండానే ఆ ఫిల్ములో ఎదుటి వ్యక్తి అడిగిన బొమ్మ వస్తుంది. ఇటు వంటి శక్తులుగల వ్యక్తులనెందరినో డైరెక్టరు నా సినిమాలో పాత్రధారులుగా ప్రవేశపెట్టడం ద్వారా, నాకు వారి ఇంటర్వ్యూలలో తేలిన విషయం ఏమనగా ఇటువంటి అద్భుతశక్తిగల యోగులు చాలామంది భారత దేశంలో ఉన్నారని, అటువంటి వారిని ఏభై పేర్లు నేను సేకరించుకొని, భారతదేశం దర్శించాలనే ఆకాంక్షతో ఇండియా చేరాను.

నాతోకూడా నా సినిమా బృందం వచ్చింది. వారందరూ ఒక హోటలులోనూ, నేనింకా ఖరీదైన పెద్ద మరో హోటలులోనూ బస చేసాము. అది ఔరంగాబాదు పట్టణము. ఆ హోటలు లాబీలో 'సాయిబాబా' వారి లైఫ్ సైజు ఫోటో వుంది. ఆ ప్రదేశంలో నేను తిరుగుతుండగ నాలోంచి అంతర్వాణి 'వచ్చావా బంగారూ? నీవు వస్తావని నాకు తెలుసు నీకోసం ఎంతగానో ఎదురుచూస్తున్నాను' అని వినవచ్చింది. నాలోంచి వినవచ్చిన అంతర్వాణికి నేనాశ్చర్యంపొంది, ఆ ఫోటో ఎవరిదని హోటలు వారినడిగాను. అది సాయిబాబా వారిదనీ, ఆయన అవతార పురుషుడని హోటలు మేనేజరు వివరించాడు 'అవతార్' అంటే ఏమిటని ప్రశ్నించాను. ఆయన 'దైవం' అని వివరించాడు. అంతటితో నేను నా సినిమా ప్రయత్నం కట్టిపెట్టేసి, నా గ్రూపు వారందరినీ తరువాత కలుస్తానని చెప్పి వెంటనే విమానంలో బెంగుళూరు చేరాను.

అది మార్చి నెల. 1974 సం॥ వైట్‌ఫీల్డ్‌లో బాబా వారిని దర్శించాను. ప్రథమ దర్శనంలోనే స్వామి తిన్నగా నా దగ్గరకొచ్చి సుమారు, 5-6 గ్రాముల విభూతి, కొంచెం ఎక్కువ విభూతి సృష్టించి ఇచ్చారు. స్వామి వెనుదిరిగి వెళ్లిపోతున్నారు. నేను ఆశ్చర్యంతో అలాగే నిలబడి వున్నాను. బాబా వెను దిరిగి, "తినెయ్యి! అది మనసుకు చాలా మంచిది" అన్నారు. వెంటనే ఆ విభూతి మొత్తం తినేశాను. నాకు గొంతులో ఉక్కిరిబిక్కిరయ్యింది. శ్వాస ఆడలేదు. కళ్ళు తిరిగి పడిపోయాను. అంతకు ముందు సుమారు వెయ్యిమంది భక్తులున్నారు. కానీ నాకు స్పృహ వచ్చేసరికి

నన్ను కనిపెట్టి చూస్తోన్న ఒక్క ఇంగ్లీషు వ్యక్తి తప్ప మరెవ్వరూ లేరు. దీని అర్థం ఏమిటో నాకు తెలియదు. "అవతార" మేమిటి? సర్వవ్యాపకత్వమేమిటి? సాయిబాబా ఎవరు? అనే సందేహాలతో సతమతమవుతూనే అక్కడినుండి బయలుదేరాను. విమానంలో మహాబలిపురం చేరాను. అక్కడొక మూడురోజులుండి, నా మనసులో మారు మ్రోగుతున్న సాయిని గూర్చిన సందేహాలతో ఇంగ్లండు వెళ్ళిపోదలచి మద్రాసు నుంచి ఢిల్లీ విమానమెక్కాను.

నాకా విమానంలో ఖాళీ సీట్లు గల వరుసలో సీటు ఇచ్చారు. కానీ నేనచట కూర్చోలేక, వెనుక వరుసలో ఒక ఖద్దరు బట్టలు కట్టుకొని, ఖద్దరు టోపి పెట్టుకొని కూర్చున్న 90 ఏళ్ళ వయసుగల వ్యక్తి ప్రక్కకిచేరాను. ఆయన బాగా దగ్గుతున్నాడు నా మనసులోని సందేహాలను ఆయన్ని అడగాలనిపించింది. బృందావనంలో కొనుక్కున్న సాయిబాబావారి చిన్నసైజు ఫోటో చేత్తో పట్టుకున్నాను.

నా ప్రక్కన గల ముసలాయన, నాచేతిలో గల ఫోటోను వంగి చూసి, 'ఓహో! సాయిబాబాయా! ఆయన గొప్ప గురువు!' అన్నారు అని నా గురువుని కూడా నీకు చూపిస్తాను అంటూ ఒక చిన్న జిప్పు బ్యాగ్‌లోంచి పాతది అద్దం కట్టిన చిన్న ఫోటో ఒకటి తీశాడు. అది ఒక గ్రూపు ఫోటో. 'ఇదుగో ఈ ఫోటోలోని మధ్య వ్యక్తి నా గురువు రామకృష్ణ పరమహంస ఆయన ప్రక్కన నిలబడిన వ్యక్తి నా తండ్రి' అన్నాడు. 'రామకృష్ణ పరమహంస అంటే ఎవరు? అని ప్రశ్నించాను ఆయన అవతార పురుషుడని వివరించాడు. ఆయన మాటలు కొన్ని నా సందేహాలకు జవాబునిచ్చాయి. నేను హాయిగా సీట్లో వెనక్కి జార్లపడి, ఆయన మాటలు వింటూ వున్నాను. అంతలో ఆయన ధ్యానం చేస్తూ నడుము నిటారుగా నిలబెట్టి కళ్ళు మూసుకొన్నాడు. అలా కొంతసేపు జరిగాక ఆయన తటాలున నా భుజంపై తట్టి 'నీకోవస్తువివ్వాలి' అంటూ తన జిప్పు బ్యాగ్ నుంచి ఒక పాత వక్కపొడి భరిణ వంటిది తీశాడు. నేను చాలా ఆశ్చర్యంగా ఆయన చర్యను గమనిస్తున్నాను. బహుశా ఆయన ఆ భరిణను పాతికేళ్ళుగా ఎప్పుడూ తెరవలేదేమో అనిపించింది. అందులో వున్న తమలపాకులు వంటివి ఎండిపోయి పొట్టుపొట్టు అవుతున్నాయి. వాటి అడుగున పాత సిల్కు గుడ్డలో చుట్టిన 'విభూతి' పొట్లం ఉన్నది. ఆ విభూతి రామకృష్ణ పరమహంస చేతితో తాకి ఆశీర్వదించిన విభూతిట. ఈ విభూతిని నా తండ్రి ఎప్పుడూ దగ్గర వుంచుకున్నాడు. ఆయన జీవితం చాలించాక నేను దానిని దగ్గఱ వుంచుకొన్నాను దానిని నీకిపుడు ఇవ్వదలచుకున్నాను" అన్నాడాయన. అది సాయిబాబా వారు సృష్టించిన విభూతిలాగే వుంది. విడచి పెట్టడం ఆయనకు ఇష్టం లేనట్లే కనపడినా, నాకెంతో ప్రేమతో ఇస్తున్నట్లనిపించింది.

నేను కొంత విభూతి ఆ పాత సిల్కుగుడ్డ మూటలోంచి తీసి నుదుటపై పెట్టుకొని కొంత నోట్లో వేసి కొన్నాను. ఆయనకు చాలా కృతజ్ఞతలు చెప్పకున్నాను. మా యిద్దరితోనూ కలసి ఎవరో అదృశ్యశక్తి మా మధ్య కూర్చున్న భావన ప్రశాంతత నాలో కలిగాయి. ఆయన నేను చేత్తో తీసికోగా మిగిలిన విభూతి మూట గడుతుంటే, ముసలాయన కదా, ఆయన చేతులు వణికాయి. అలా వణకడంచే కొంత విభూతి త్రుళ్ళి కిందపడిపోతుందేమోనని, నేను ఒక లెటర్‌హెడ్ కాగితమును ఆ పొట్లానికి క్రిందుగా పెట్టాను. అనుకున్నట్లే కొంత విభూతి క్రిందకు త్రుళ్ళింది. ఆ విభూతి క్రిందపడుతూ మధ్య గాలిలో ఎఱ్ఱని కుంకుమగా మారి కాగితముపై పడింది. అది చూసి మేమిద్దరమూ చాలా ఆశ్చర్యపడ్డాము. 'ఓహో! ఈ లీల నీ గురువు చేసిన పని. మా గురువు లీలలు చేయడు. నీ గురువైన సాయిబాబాయే నీ మంచి కోరి ఇలా విభూతిని కుంకుమగా మార్చాడు. కనుక నీవు తప్పనిసరిగా ఈ విభూతి పొట్లాన్ని ఎల్లప్పడూ నీ జీవితకాలం అంతా నీతో కూడా వుంచుకోవాలి' అంటూ ఆయన ఆ పొట్లం నాకిచ్చాడు. ఆ కుంకుమగా మారిన విభూతి పొట్లాన్ని నేను నా మనీపర్సులో పెట్టుకున్నాను.

1974వ సం॥ నుంచీ ఆ పొట్లాన్ని నేను పర్సులో నా టెన్నిస్ డ్రైవింగ్ లైసెన్సుతో కలిపి ఎప్పడూ పర్సులో వుంచుకుంటూ రాత్రిళ్ళు తీసి పూజ గదిలో పెడుతూ తిరిగి ఉదయమే జేబులో పెట్టుకుంటూ వుండే వాడిని. ఆ రోజుల్లో సాధారణంగా నేను ఇంగ్లండులో నివసిస్తూ వుండేవాడిని. నా వ్యాపారం అక్కడే సాగుతుండేది. లండన్‌కి సుమారు 25 మైళ్ళ దూరంలో వున్న 'ఏస్కాట్' నగరంలో కొన్నాళ్లు నివసించాను. సాయిబాబావారి దయ వలన నా 'హార్డ్‌రాక్' కేఫ్ అండ్ రెస్టారెంటు హైడ్‌పార్కు కార్నరులో చాలా జయప్రదంగా నడుస్తూండేది, నేను ఏస్కాట్ నుంచి రోజూ నా రెస్టారెంట్‌కి (యూరప్) వచ్చి వెడుతుండేవాడిని.

తెనుగుసేత : **ఎన్.బి.ఎస్. రామారావు** *జనవరి - 1995*



# భక్తవత్సలుడు - బింబం

**టి. లలితాంబ, అనంతపురం**

నవంబరు 23వ తేదీ ప్రపంచవ్యాప్తంగా జరుపుకునే మహా పర్వదినం. అది భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారి జన్మదినం. అశేష జనవాహిని పుట్టపర్తికి తరలివచ్చే పండుగ దినం. మనం చేసుకునే ప్రతి పండుగకు ఒక దేవతయొక్క ఆరాధన ముడిపెట్టబడి ఉంటుంది. ఈనాడు మనం జరుపుకునే పండుగకు అధి దేవత శ్రీ సత్యసాయీశ్వరుడే.

"పరమాత్మని సన్నిధికి జీవాత్మని చేర్చుటకే భారతీయులు పర్వదినములను ఆచరించుట. పరమాత్మని స్మరించి, ఆ తత్త్వమును మననం చేసి ఆనందము నందుకొనుటయే ఇందలి పరమోద్దేశము" అంటారు బాబా. "యోమద్భక్తః సమేప్రియః"; "యోగ క్షేమం వహామ్యహం" అనేది భగవద్వాణి "సాయీ! అని పిలిస్తే ఓయీ! అని పలుకుతాను" అనేది శ్రీ సత్యసాయి వాత్సల్యవాణి.

భగవంతుడు సర్వసాక్షీభూతుడు - సర్వాంతర్యామి. అట్టి అనుభూతి భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు భక్తులకు కలిగించుట సర్వసాధారణమైన విషయం. దీనికి నా అనుభవాలలో ఒక నిదర్శనం.

ఒకరోజు సాయంత్రం భగవాన్ బాబావారి దర్శనార్థం పుట్టపర్తిలోని భజనమందిరం వరండాలో కూర్చున్నాను. భక్తులను లైనులోనికి పంపే సమయంలో లైనులోనికి పోవటానికి గబుక్కున లేచాను. ఆ తొందరలో నా చేతిలో ఉన్న పుస్తకంలో నుండి స్వామి వారి ఫోటో ఒకటి జారి క్రిందపడింది. అప్పుడు నేను 'అయ్యో! ఫోటో పడిపోయిందే' అని బాధపడి ఫోటోను కళ్ళకు అద్దుకుని దాన్ని మరల పుస్తకంలో పెట్టి, త్వరగా వెళ్ళి లైనులో కూర్చున్నాను. దర్శనం వేళకు బాబా వారు మామూలుగా వస్తూ మేము కూర్చున్న లైనుకి వచ్చి "ఏమి లలితాంబ! నన్ను క్రిందపడవేశావేమి" అని అడిగారు. నేను తెల్లబోయాను. ఫోటోలు పడిపోవటం విషయం మరచిపోయినాను, మరల స్వామివారే "పడేసి మ్రొక్కుకున్నావు కదా" అన్నారు. వెంటనే నాకు క్షణం క్రితం జరిగిన సంగతి అంతా గుర్తుకువచ్చి "పొరపాటున పడింది స్వామీ" అన్నాను. అప్పుడు బాబావారు I know.... I know every thing" అని నవ్వుకుంటూ వెళ్ళినారు. బాబావారి సర్వజ్ఞత్వానికి మనసులోనే నమస్కరించాను.

భగవంతుడు భక్తులకు అనేక రూపాలలో దర్శనమిస్తాడు. మన బాబావారి విషయంలో ఈ సాక్షాత్కార పద్ధతి నా అనుభవంలో జరిగింది వివరిస్తాను. ఇక్కడ

ఒక అంశం మనం గమనించాలి. భగవంతుడు భక్తసులభుడేయైనను ఒక్కొక్క సమయంలో మనం ఎంత వేడుకున్నా మనల్ని పరీక్షలకు గురిచేస్తాడు. అట్లే కూడా ఒక సమస్యను గూర్చి స్వామివారికి మనవి చేసుకోవాలని అనేక విధాల ప్రయత్నం చేశాను. ఎప్పుడూ పలకరించే స్వామి - నేను చెప్పాలని చూచినప్పుడల్లా ముఖం ప్రక్కకు పెట్టుకొని వెళ్లటం జరిగేది. "ఎందుకు స్వామి ఇలా చేస్తున్నారు?' ' అని నేను చాలా బాధపడ్డాను. అట్టి సమయంలో ఒకరోజు రాత్రి నాకు స్వప్నములో దర్శనమిచ్చారు. అదీ - క్షీరసాగరమున అనంతశయనము లో శ్రీ మహావిష్ణువుగా సాక్షాత్కరించారు. శిరస్సు మాత్రం ఇప్పుడు మనం చూస్తున్న మాదిరిగా స్వామి శిరస్సే. శ్రీమహాలక్ష్మి మాత్రం పాదాల దగ్గరలేదు.

ఆ పాల సముద్రం ఒడ్డున నిలబడి చూస్తున్నాను. స్వామివారు నన్ను దగ్గరకు పిలిచి "ఎందుకు అంత ఆలోచిస్తావు? నా చేతల్లో, మాటల్లో ఎంతో అర్థం, అంతరార్థం ఉంటుంది. నీవు అనవసరంగా ఆలోచించకు. అన్నీ కాలమే తీరుస్తుంది" అని శలవిచ్చారు. ఇది మా స్వామి దర్శనమేనా, అని సంబరపడ్డాను. ఇది జరిగిన కొద్ది రోజులకు పుట్టపర్తి వెళ్ళాను. మా College Teacher కి స్వామివారు Interview ఇచ్చారు. అప్పుడు నేను 'స్వామీ మీరు కలలో దర్శనమివ్వటం ఏమైనా బోధించటం... చేస్తారుకదా! అది నేను నమ్ముకోవచ్చునా' అని అడిగాను.

వెంటనే బాబావారు 'తప్పక. నా సంకల్పంలేనిదే అట్లా జరగదు' అని సెలవిచ్చారు. విభూతి ప్రసాదము, ఒక రజిత పతకము సృష్టించి నాకు ఇచ్చారు. ఆనాటి నుండి స్వామివారే నా సమస్యలన్నీ పరిష్కరిస్తున్నారు. నా వెంట, జంట ఉండి, నా శారీరక, మానసిక ఆరోగ్య విషయాలన్నీ చూచుకుంటున్నారు. కనుక భక్తవత్సలుడు బాబా - "త్వమేవ శరణం మమ" అని భావనగల వారికి కొంగు బంగారమే.

*నవంబరు 1994*



# శ్రీ సత్యసాయి సూపర్ స్పెషలిటీస్ హాస్పిటలు

డా॥ క్రీత్, అమెరికా

"The Satya Sai Baba Council of united Kingdom" అను ఆధ్యాత్మిక సాయి మాసపత్రికలో ప్రచురింపబడిన 1992 సం॥ గురుపూర్ణిమనాడు (27th June 92) Dr. Keith Critchlow (Architect of Sri Satya Sai Super Specialities Hospital - and Director of Prince of Wales Institute of Architecture వారి ఆంగ్ల ఉపన్యాసమునకు తెలుగు అనువాదము.

సాయిరామ్! సలామ్! మరియు షలోమ్!

ఇది చాలా ఆనందకరమైన, మనోహరమైన సమావేశ సందర్భము. కేవలము, శ్రీ సత్యసాయి బాబావారి అనుగ్రహమువలననే, నేనీనాడు మీ భారత దేశములో, ఇచట ప్రశాంతి నిలయములో నిలువగల్గితిని, మీ అందరిముందు మాట్లాడగల్గుచుంటిని. ప్రాపంచిక విషయ వాసనలలో మునిగి తేలు పాశ్చాత్య దేశీయుడు భగవాన్ బాబావారితో సమావేశమగుట చాలా కుతూహలముగా (Interesting) తెలిసికొనవలసిన విషయము.

సుమారు ఆరు సంవత్సరములకు (1984) ముందు ఒక సాయి భక్తురాలు భారతదేశము నుండి అమెరికాలోని ఇంద్రాదేవిగారి ఆశ్రయమునకు వెళ్ళుచూ, లండన్‌లో మా యింటికి వచ్చి నన్ను కలిసికొని, స్వామి ఇచ్చిన విభూతి పేకెట్ నాకు ఇచ్చినది. నేనా విభూతి ప్రసాదమును స్వీకరించితిని కానీ వెంటనే దాని ప్రభావమేమీ నాకు తెలియరాలేదు.

ఆ తరువాత కొన్ని సంవత్సరములకు ఒక పెద్ద తరహా వ్యక్తి ఇజాక్ టిగ్రెట్ (Issaac Tigret) అను వ్యక్తి "రాయల్ కాలేజ్ ఆఫ్ ఆర్ట్" లోని నా ఆఫీసుకి వచ్చి, నేను 'ఇజాక్ టిగ్రెట్' ని అన్నాడు. ఆయనెవరో నేనెరుగను. నీలిరంగు నేత్రములతో ఆయన చాలా ఆకర్షణీయమైన చూపులు కల్గి ఉన్నాడు. మా ఆఫీసులో రీసెర్చి చేయుచున్న నా స్నేహితుడు ఆయనను చూసి లేచివచ్చి "టిగ్రెట్"కు వెనకనుంచి ఆయన చాలా పెద్దవాడు "ముఖ్యమైన వ్యక్తి" అని నాకు తెలిసేలా సంజ్ఞచేసాడు. నేను వారిని కూర్చోమని గౌరవించాను. ఆయన నాతో ప్రసంగం ప్రారంభిస్తూ, నేను "హార్డ్ రాక్ కేఫ్స్"ని (Hard Rock Cafes) నిర్మాణము ప్రారంభించాను అన్నాడు. "హార్డు రాక్ కేఫ్స్" అనగా నేమి? అని నేను ఆయనను తిరిగి ప్రశ్నించాను.

(అమెరికాలో "హార్డు రాక్ కేఫ్స్" అనునవి ఇజాక్ టిగ్రెట్‌చే నిర్మించబడిన అంతర్జాతీయ హోటల్సు సముదాయము. వీటి నిర్మాణము పూర్తగుచుండగనే

ఇజాక్ టిగ్రెట్ వాటిని 400 కోట్లకు అమ్మివేసి ఆ ధనము మొత్తమంతయూ శ్రీ సత్యసాయి బాబాగారికి సూపర్ స్పెషాలిటిస్ హాస్పిటలు నిర్మాణమునకై విరాళముగా నొసంగివేసెను.

ఆయన నా ప్రశ్నకు సమాధానము చెప్పకుండానే, భారతదేశములో ఒక అవతారపురుషుడు 'సూపర్ స్పెషాలిటీస్' హాస్పిటలును నిర్మించదలచుకున్నారు. నీవు ఆ హాస్పిటలుకు ఆర్కిటెక్ట్‌గా పనిచేయు నిమిత్తమై ఇండియాకు వచ్చి వారిని సందర్శించెదవా? అన్నాడు.

అపుడు నేను, సరే నా భార్య రాగలిగినంత దూరము ఏ దేశమైనాసరే వస్తాను అన్నాను. ఆయన నావైపు అదోలా చూసాడు. అపుడు నేను, Yes నేను వివాహితుడను. మేమిద్దరమూ కలిసే వస్తాము అని రెట్టించాను. ఆయన సరేనన్నాడు. మా భారతదేశ ప్రయాణానికి 'సర్ ఇజాక్ టిగ్రెట్' అన్నీ సిద్ధం చేసారు.

నేను భార్య సహితంగా ఇండియా చేరాను. ప్రప్రథమంగా మనోహ్లాదకరమైన ప్రదేశాలు, జనము, ఈ సుందర దృశ్యాలు సందర్శిస్తూ, బెంగుళూరులో విమానము దిగి టాక్సిలో పుట్టపర్తి చేరాము. మేము పుట్టపర్తి చేరిన వెంటనే అతి త్వరగా ఒక పెద్ద విమానపు హేంగర్ వంటి పెద్ద విశాలమైన హాలులోకి (పూర్ణచంద్ర ఆడిటోరియములోకి) పాతిక వేల జనాభాతో కిటకిటలాడుచున్న హాలులోనికి తీసుకొనిపోబడ్డాము. నేను అంత పెద్ద సువిశాలమైన హాలు అందులో పాతిక వేలుకి పైబడ్డ జనాభా ఎప్పడూ చూడలేదు. ఆ హాలులోగల వ్యక్తులందరూ తెల్లని దుస్తులే ధరించియుండుట చూసి నేను చాలా సిగ్గుపడ్డాను. వారందరిలో నేనొక్కడినే 'బ్లూ' (నీలి) రంగుబట్టలు ధరించియుంటిని. అక్కడగల మొత్తం జనాభాలో నేను తప్ప ఇతర రంగుబట్టలు ధరించిన రెండవ వ్యక్తి ఒక్క సత్యసాయి బాబాయే. (స్వామిది కనకాంబరం రంగు) మిగతా వారందరూ తెల్లబట్టలలోనే ఉన్నారు. నేనా హాలులో జరిగే పురుషుల మధ్య ఒకచోట కూర్చున్నాను. నాకా హాలులో జరిగే సమావేశపు సందర్భమేమిటో తెలియదు. అంతలో భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారు, జనముల మధ్య నడచుచూ తిన్నగా నా దగ్గఱకి వచ్చి So this is the architect ఓహో, ఇతనే ఆర్కిటెక్ట్ అన్నారు. బాగా చదువుకొని సభ్యతగల కుటుంబంలో పెరిగిన వాడినవుటచే వెంటనే వారి ముందు నేను గౌరవార్థం లేచి నుంచున్నాను, కానీ మిగతా వారందరూ కూర్చునే యుండుటచేత నాకు ఏమి చేయాలో తెలియక తిరిగి కూర్చున్నాను. స్వామి వెళ్ళిపోయారు.

ఆ మర్నాడు స్వామి నన్ను ఇంటర్వ్యూకు పిలిచారు. నా భార్యను కూడా తీసికొనిరావచ్చా అని స్వామిని అడిగాను. తీసికొనిరమ్మన్నారు. అక్కడ క్రమశిక్షణా

వివరములేవీ నాకు తెలియవు. స్వామి గదిలోకి మేమిద్దరమూ పోగానే నా భార్యను నా ప్రక్కనే కూర్చోమన్నాను.

'నీవిపుడు అమెరికాలో లేవు' అన్నారు స్వామి. అపుడు వెంటనే నా భార్య లేచి ఆ గదిలో కుడిప్రక్క దూరముగానూ, నేను ఎడమ ప్రక్కన స్వామికి దూరముగానూ కూర్చున్నాము. వెంటనే స్వామి నన్ను నీవు వచ్చి నా దగ్గరగా కూర్చోమని ఆదేశించారు. ఆయన నాకేసి చూసి 'నీకేమి కావాలి' అని ప్రశ్నించారు. ఇది ఒక ప్రత్యేక సంభాషణ అని నేను గ్రహించి, 'స్వామి! మీరు నన్ను మీ ఆర్కిటెక్టుగా నియమించు కోవాలని కోరుతున్నారా?' అన్నాను. స్వామి, ఓ, అది కాదు! అదికాదు. నీకేమికావాలి? అని మళ్ళీ అడిగారు. ఇపుడు వారి దివ్య నేత్రాలు సూటిగా నా వైపు దృష్టి ప్రసరించగనే నేను కరిగిపోయి, 'స్వామీ! నేను మీ సేవ చేయాలని కోరుకుంటున్నాను అనుగ్రహించండి' అన్నాను. అది చాలు స్వామీ! అన్నాను. అపుడు నాకొక్క క్షణం మనసులో ఇలా అనిపించింది. నీవు ఎంత ప్రజ్ఞాపాటవం ఉన్న ఆర్కిటెక్టువైనా కాని, నిన్నెవరైనా ఉపయోగించుకోవాలనుకుంటే నీవు వారికి సేవ చేయాలి' అనే సేవాభావం స్వామి చూపులో నాకు గోచరించి నేను చాలా స్వామిని అర్థించాను.

వెంటనే స్వామి తమ చేతిని గాలిలో త్రిప్పి చెయ్యి మూసినది తెరచారు. తెరచిన గుప్పిట్లో ఒక ఉంగరము ఉన్నది. స్వామి ఉంగరాన్ని నాకు చూపించి, "దీనిపై ఏమి ఉన్నది?" అన్నారు. నేనా ఇంటర్వ్యూ గదిలోకి నా కళ్ళజోడును తీసికొని వెళ్ళుట మరిచాను. ఉంగరంపై ఉన్న బొమ్మను చూడలేక, "అది స్వామి బొమ్మయే కావచ్చు అని ఊహించి అన్నాను. వెంటనే స్వామి, 'చూడలేని ఆర్కిటెక్టు యొక్క ఉపయోగము ఏమిటి?' అన్నారు. (What is the use of the Architect who cannot see) నిజానికి ఆ ఉంగరంపై పవిత్రమైన ఓంకారము ఉన్నదట. స్వామి ఇంటర్వ్యూ గదిలో ఉన్న జనులందరికీ ఆ ఉంగరాన్ని ఇచ్చి చూడమని తిరిగి తీసికొని తమ గుప్పెట్లో పెట్టి మూడుసార్లు గాలి ఊదారు. ఆ బంగారపు పెద్ద ఉంగరం మాయమై నా ముందే ఒక చిన్న వెండితో చేసిన క్రాస్ (+) గా మారిపోయింది. ఆశ్చర్యం! అద్భుతం! ఆనందం! నాకు తప్ప స్వామి దానిని తిరిగి అందరికీ ఇచ్చి, చూపించి, తిరిగి తీసికొని, దీనిపై ఇప్పడేమి ఉందని నన్నడిగారు. అది 'క్రిష్టియన్ క్రాస్' స్వామీ అన్నాను. అంతలో అది మారిపోయి 'నక్షత్రము చంద్రవంక' గుర్తుగా మారిపోయింది. అపుడు స్వామి నన్ను ఇంటర్వ్యూ రూములో గల తెర వెనుకకు రమ్మని ఆంతరంగికంగా ఆ ఉంగరం నా వేలుకు తొడిగారు. అది నా వేలుకు చాలా బాగా సరిపోయింది. ఆయన ఆ ఉంగరాన్ని నా చేతికి పెట్టగానే తిరిగి

దానిపై గుర్తు 'ఓం'గా మారిపోయింది. ఈ ఉంగరంపై గల గుర్తులు ఇలా మార్చడంలో స్వామి నాకొక సందేశాన్నిచ్చారని తెలిసిపోయింది.

నేను రాయల్ ఆర్ట్స్ కాలేజిలో ఉన్నప్పుడు 'Visual Islamic Arts' అనే డిపార్టుమెంటును నడిపాను. నేను ఇస్లాము చదువుకొని, క్రిష్టియన్‌గా పెరిగాను. ప్రస్తుతం నేను 'భగవంతుడు' అనే నామరూపాల కతీతమైన భగవశ్శక్తిపై నమ్మకం ఉన్నవాడను ఈ సందేశాన్ని నాకు స్వామి తెలిపారు.

అయితే నేను సాయిబాబావారిని ఏ విధంగా సేవించగలను? అన్న ఆకాంక్ష నాలో పెచ్చుపెరిగిపోయింది. స్వామితో నిత్యం రెండేసిసార్లు - ఎన్నో ఎన్నో సమావేశాలు. స్వామి నాకు ఎంత చనువు - స్వతంత్రం ఇచ్చారో నేను ఇంగ్లండుకి తిరిగివెళ్ళాక అర్థం అయ్యింది. ఆరు రోజులు వరుసగా రోజుకి రెండేసి సమావేశాలు - ఇండియాలో సుప్రసిద్ధులైన డాక్టర్లని కలుసుకొని మాట్లాడటం - సూపర్ స్పెషాలిటీస్ హాస్పిటల్ ఎలా వుండాలి అని - ఏయే సౌకర్యాలు అది కలిగివుండాలని ఆలోచనలు! స్వామి బోధపరచిన - సువిశాల (Immense Range of things) పరిజ్ఞానం నా మెదడొక టేపురికార్డరైపోతే ఎంత బావుండును! అనిపించింది. సంఖ్యాశాస్త్రం, వాస్తుశాస్త్రం, ఆరోగ్యశాస్త్రం, భవన నిర్మాణంలో వాస్తు కొలతలు, ఆయువు, గర్భము, ఎత్తు , పొడవు, వెడల్పు, గణితశాస్త్రం ఇంకా ఎన్నెన్నో విషయాలు వాటి ప్రభావం - మానవాళిపై, ఇంకా ఎన్నెన్నో విషయాలు స్వామి విశదపరచారు. అనేక దేవతల గురించి వాటి అధిదేవతలు, సంఖ్యాశాస్త్రంతో వాటికిగల సంబంధం మొ॥ అనేక విషయాలు స్వామి ఒక రోజు సుదీర్ఘంగా చర్చించారు. కాని వాటన్నింటినీ తెలిసికొని అర్థం చేసికొనే లోతైన హృదయం నాకు లేదనిపించింది. స్వామి చిట్టచివరగా ఇలా అన్నారు. 'ఈ విషయాలతో, వాస్తుతో కూడిన హాస్పిటలు చిత్రాలు నీగుండా ప్రవహించడం మంచిది. నీవు భగవంతుని చేతిలో ఒక పనిముట్టునని మాత్రమే భావించు. నీ మేధాశ్శక్తితో నీవా విషయాలన్నీ గణించి, Plan and elevation గీయలేవు. ఈ శాస్త్రాలు మానవ హృదయ శక్తిని మించినవి. కనుక భగవంతుని నుండి అవే నీ ద్వారా ప్రవహిస్తాయి'. అక్కడ - అంటే పుట్టపర్తిలో ఉండగనే నేను స్వామికి ఒకటి రెండు హాస్పిటల్ డ్రాయింగ్సు గీసి చూపించాను. స్వామి పైన ఉన్న 'Domes' గుమ్మటముల వంటివి. ఇంకా బౌద్ధ విహారాలవలె 'Buddist' స్థూపాలను పోలివుండాలి అని సూచించారు. తిరిగి మా దేశం వెళ్ళిపోయి, మళ్ళీ వచ్చాను. రెండవసారి 'లండన్' తిరిగి వెళ్ళాక - సూపర్ స్పెషాలిటీస్ హాస్పిటలు చిత్రం (Plan & Elevations) ఎలా వుండాలో ఆ భావం నాలో కల్గించమని స్వామిని ప్రార్థించాను. సర్ జార్జి అనే ఆయన నాకు సహకరిం

# స్వామి అనుగ్రహామృతవర్షం

ఎమ్. విజయలక్ష్మి

ఒక ప్రమిద దీపమును గాలి నుండి ఏ విధంగా చేతులు అడ్డం పెట్టి దీపం ఆరిపోకుండా కాపాడుకుంటామో స్వామి తనను నమ్మిన భక్తులను ప్రేమ అనుగ్రహములనే కవచము కప్పి సంసారములో వచ్చే తీవ్ర కష్టములనే ఈదురు గాలుల నుండి భద్రముగా కాపాడుకుంటారు. స్వామి ఒకసారి చక్కని కథనొక దానిని చెప్పారు. ఒక భక్తుడు దేవుణ్ణి తీవ్రంగా ప్రార్థించగా దేవుడు కనపడి వరం కోరుకొమ్మన్నాడు. ఆ భక్తుడు స్వామీ! నన్ను విడవకుండా తప్పకుండా కాపాడు అని కోరాడు. భగవంతుడు ఆ భక్తునితో అట్లానే నాయనా! నీడవలె నీ వెంట ఉండి ఎల్లప్పుడు కాపాడుకుంటాను అని వరం ఇచ్చాడు. ఆ తరువాత నుంచి ఆ భక్తుడు ఎక్కడకు వెళుతున్నా భగవంతుని పాద ముద్రలు తన వెంటనే కనిపిస్తుండేవి. ఆ భక్తుడు భగవంతుడు తన వెంట జంట ఉన్నందుకు చాలా సంతోషంగా గడపసాగాడు. కాని కాలక్రమంలో ఆ భక్తుడు తీవ్రమయిన కష్టముల పాలయ్యాడు. ఆశ్చర్యకరముగా భగవంతుని పాదముద్రలు కనిపించడం మానివేశాయి. ఆ భక్తుడు చాలా నిరాశ నిస్పృహలకు లోనయ్యాడు. భగవంతుడు తను తీవ్రమయిన కష్టాలలో మునిగి ఉన్నపుడు తనను ఒంటరిగా వదలివేశాడని అపోహపడ్డాడు. కొన్నాళ్ళకు ఆ భక్తుని పరిస్థితి మెరుగయ్యింది. జీవితంలో సంతోషం చోటుచేసుకుంది. తిరిగి భగవంతుని పాద ముద్రలు కనిపించటం ప్రారంభించాయి. కొన్నాళ్ళకు భగవంతుడు ఆ భక్తునికి దర్శనమిచ్చినపుడు భక్తడు భగవంతుని ప్రశ్నించాడు. 'స్వామీ! నేను తీవ్రమయిన కష్టాలలో ఉన్నపుడు ఒంటరిగా నన్ను వదలివేయటం నీకు ధర్మమేనా? ఎందుకు ఇలా చేశావు స్వామీ?' అని అడిగాడు. భగవంతుడు ఆ భక్తునితో ఎంతో ప్రేమగా బంగారూ! నీవు పొరబడుతున్నావు. నేను ఎల్లవేళలా నీవెంట జంట ఉండి కాపాడుకుంటున్నాను అన్నారు. భక్తునికి ఎంతో ఆశ్చర్యం కలిగింది. భగవంతునితో తన సందేహం ఈ విధంగా వివరించాడు. స్వామి! ఎల్లవేళలా మీ పాద ముద్రలు నా వెంట ఉండేవి కాని నేను కష్టాల ఊబిలో ఉన్నపుడు కేవలం రెండు పాదముద్రలే కనిపించాయి. మీ పాదముద్రలు లేవుకదా? అని అడిగాడు. దానికి భగవంతుడు ఓ భక్తా! నీవు కష్టాలసమయంలో గమనించిన రెండు పాద ముద్రలు నావే సుమా ఆ సమయంలో నిన్ను అతి జాగ్రత్తగా నా రెండు చేతులమీద మోశాను అని చెప్పారు. సహజంగా మనందరికి ఎప్పడో ఒకప్పడు అనిపించక మానదు. స్వామి మనల్ని కష్టాలలో వదలివేశారే మనల్ని పట్టించుకోవటం మానేశారే అని. కాని వాస్తవానికి స్వామి ఆ సమయంలో మనకి మరింత దగ్గిరగా ప్రేమతో

కాపాడుకుంటానికి ఉంటారు కాని స్వామిని మనమే మనసారా ప్రార్థించం. కష్టాలనుండి బయట పడాలని అనేక యత్న ప్రయత్నాలు చేస్తూ అలసి సొలసి విసిగిపోతున్నాం. విశ్వాసము, నమ్మకము అనే దుప్పటిని దట్టంగా కప్పుకుంటే మన జీవితాలలో వీచే కష్టాలనే చల్లని తీవ్ర గాలుల నుండి రక్షింపబడుతాము. ఏ మాత్రం మన విశ్వాస నమ్మకాలు సడలినా కష్టాల సమయంలోనే మన మనస్సు మరింత బలహీనమయి స్వామి మనలను కాపాడలేరేమో అని తీవ్ర సందేహములకు లోనవుతాము. మన మనస్సు విశ్వాస అవిశ్వాసాల మధ్య తీవ్రంగా ఊగిస లాడుతుంటుంది.

సాయిమాత తన కరుణాకటాక్షవీక్షణాలను ప్రతి క్షణం మాకుటుంబ సభ్యులందరిపైన ప్రసరింపచేస్తూ ఏ విధంగా మమ్మల్ని కాపాడుకుంటున్నదో మా ఈ స్వీయ అనుభవాన్ని సోదర సోదరిణీ భక్తులతో మా ఆనందాన్ని పంచుకుందామనే ఉద్దేశ్యంతోనే ఈ వ్యాసాన్ని మీ ముందర వినమ్రంగా ముకుళిత హస్తాలతో మా తల్లి, గురువు, దైవము అయిన సాయిభగవానునికి నమస్కరిస్తూ ఉంచుతున్నాను. స్వామి అందించే ఆనందాన్ని సహృదయంతో ఆస్వాదించండి.

మా అత్తగారికి తొమ్మిదిమంది పిల్లలు కలిగినప్పటికి చాలా చిన్న వయస్సులో పిల్లలుపోగా చివరకు ముగ్గురు మగపిల్లలు మాత్రం మిగిలారు. ముగ్గురిలో చివరి ఆయన మా శ్రీవారు. వీరిలో పెద్దాయనకు పుట్టుకనుండే మాటలు రాక పిచ్చివానివలె ఉండేవారు. ఆయన గురించి వీరు అన్ని రకాల వైద్యులకు చూపించారు. అనేక దేవాలయాలు దర్శించారు. వైద్యులు పిచ్చికాదన్నారు. కాని రోగనిర్ధారణ చేయలేకపోయారు. 36 సంవత్సరాల క్రితం మొట్టమొదటిసారిగా మా అత్తగారి దగ్గర బంధువు ద్వారా స్వామి గురించి తెలుసుకున్నారు. ఆవిడ తండ్రిగారిని (గొప్ప వైశ్వదేవపరులు) తోడు తీసుకొని పిల్లవానితో స్వామి దగ్గరకు వెళ్ళటానికి నిర్ణయించుకున్నారు. ఆ తెల్లవారుఝామున మా అత్తగారికి కలలో సూర్యుడు ఉదయిస్తున్నట్లు కనిపించాడు. దానికి మా అత్తగారి తండ్రి అది జ్ఞానోదయానికి గుర్తు అని తెలిపారు. ఆ మర్నాడు మా అత్తగారు వారి తండ్రిని తోడు తీసుకొని మా పెద్ద బావగారిని తీసుకొని స్వామి దగ్గరకు పుట్టపర్తి వెళ్ళారు.

స్వామి మా అత్తగారికి ఇంటర్వ్యూ ఇచ్చారు. ఆ ఇంటర్వ్యూలో ఆ పిల్లవానిని చిన్నప్పటి నుంచి ఏఏ దేవాలయాలకు తీసుకువెళ్ళింది, ఏఏ ఆసుపత్రులకు తీసుకువెళ్ళింది, అక్కడి డాక్టర్లు ఏమేమి చెప్పింది, పూసగుచ్చినట్లుగా మా అత్తగారు పెదవి విప్పి ఏమీ మాట్లాడకుండానే సర్వమూ చెప్పారు. అదీ స్వామి యొక్క సర్వజ్ఞత్వము. అదే కాక ఆ పిల్లవాడికి పుట్టుకలోనే దయ్యం పట్టిందని ఆ పిల్లవాడు

ఆవిడ కడుపున పుట్టడానికి గల పూర్వజన్మ బంధం వివరంగా చెప్పారు. ఆ దయ్యం వదలిపోవటానికి సమయంకోసం వేచిఉండాలని, ఆ పిల్లవానితో తన దగ్గర ఉంటుండమని చెప్పారు. ఇంకా ఆశ్చర్యకరమయిన విషయం మా అత్తగారికి 8,9 ఏళ్ళ వయస్సులో ఒక సాధువు ఒక విషయం చెప్పారు. వాస్తవానికి స్వామి అప్పటికి ఈ అవతారంలోకి వచ్చి ఉండలేదు. ఆ విషయం మా అత్తగారు పూర్తిగా మరచిపోయినప్పటికి ఆ సంఘటనని గుర్తు చేశారు. ఇక ఆ తరువాత మా అత్తగారు పిల్లవానిని పెట్టుకొని నెలల తరబడి అక్కడ ఉండేవారు. కారణం ఆ పిల్లవానిని ఎవరూ పట్టుకొని ఉండలేకపోయేవారు. విపరీతంగా అల్లరి చేసేవాడు. కానీ స్వామి సన్నిధిలో నిశ్శబ్దంగా ఉండేవారు. కనుక స్వామి చాలా తరచుగా మా అత్తగారికి ఆ పిల్లవాని సన్నిధిలో అనేక వేదాంత విషయాలు బోధించేవారు. కొన్ని సంవత్సరాలు గడిచాయి. ఒక దసరాఉత్సవాల సమయానికి మా అత్తగారు మా పెద్దబావగారిని పెట్టుకొని అక్కడ ఉన్నారు. స్వామి మా అత్తగారిని పిలిచి అమ్మాయీ! ఇక్కడ ఉత్సవాలకి చాలామంది జనం వస్తారు, మీకు చాలా అననుకూలంగా ఉంటుంది. వీడికి పట్టిన దయ్యం వెడలిపోయే సమయం దగ్గిరపడింది, ఇంటికి తీసుకెళ్ళు. దసరా అయిన తరువాత తీసుకురాగలిగితే తప్పక వాణ్ణి సరిచేస్తాను చూడమ్మా! వాడు పుటుకనుండి మీరు చాలా బాధలు కష్టాలు అనుభవించారు, కాని అదంతా ఒక ఎత్తు. ఈ పదిరోజుల్లో వాడు చేసే అల్లరి విపరీతంగా ఉంటుంది. మరి అది వెళ్ళిపోతోంది కదా! ఉధృతంగా ఉంటుంది. ఇప్పుడే ఓర్చుకోవాలి మరి, అని స్వామి ఒక వెండి లాకెట్ సృష్టించి స్వయంగా మా పెద్ద బావగారి మెళ్ళో కట్టి ఇది కొద్దిగా ఉధృతం తగ్గిస్తుంది, పూర్తిగా కాదు వెళ్ళిరా అమ్మా! అని పంపారు. స్వామి చెప్పినట్లు మా పెద్ద బావగారి అల్లరి విపరీతమవటం ఇక రెండు రోజులలో ముగుస్తుందనగా మా మావగారు మా అత్తగారి ప్రమేయం లేకుండానే విశాఖపట్నం తీసుకెళ్ళి బలవంతంగా అక్కడి ఆసుపత్రిలో చేర్పించి వచ్చారు.

మా అత్తగారు దసరా వెళ్ళిన వెంటనే పుట్టపర్తి వెళ్ళారు. స్వామి ఇంటర్వ్యూ ఇచ్చి అమ్మాయి నీవు నిమిత్తమాత్రురాలవు, భగవత్ నిర్ణయం ప్రకారం జరుగుతుంది అని ఊరడించారు. కొన్ని నెలల తరువాత మా పెద్దబావగారు 23 ఏళ్ళ వయస్సులో విశాఖపట్నం ఆసుపత్రిలో మరణించారు. ఆ విషయం మా అత్తగారికి మావగారు ఉత్తరం రాశారు. ఆ ఉత్తరం అవిడకు చేరటానికి ఒక రోజు ముందర స్వామి మా అత్తగారికి ఇంటర్వ్యూ యిచ్చారు. ఆ రోజున ఇంటర్వ్యూలో పూర్తి వేదాంతము మరణము గురించి మాట్లాడుతున్నారు. మా అత్తగారి మనస్సు శంకించింది. ఏమిటి స్వామి ఇలా మాట్లాడుతున్నారు? ఏమి జరిగిందో, అని భయపడుతుండగా స్వామి అన్నారు అమ్మాయి నీ పెద్దకొడుకు విశాఖపట్నంలో రెండు రోజుల క్రిందట

మరణించాడు వాడు మరణించే సమయంలో వాడి ప్రక్కనే ఉన్నాను, చూడు నేను వాడికి కట్టిన లాకెట్టు అని స్వామి తన గుప్పిట తెరచి చూపించారు, చేతిలో లాకెట్టు ఉంది. ఇంకా స్వామి ఇలా అన్నారు. అమ్మాయీ! నీ మనస్సుకు చాలా బాధగా ఉంటుంది స్వామి ఎందుకు యిలాచేశారు. స్వామి భగవంతుడు కదా! నా కొడుకు ఎందుకు మరణించాడు అని, అమ్మాయి వాడి గడువు అయిపోయింది. వాడు చేసుకున్న సుకృతం ఏమీ లేదు, వాడు మరణించి రెండురోజులయింది. శరీరం శిధిలమయి, వాసన వస్తోంది, కాని ఈ క్షణంలో అయినా వాణ్ణి బ్రతికిస్తాను, వాడికంటూ ఏమీ సుకృతం లేదు. కనుక ఈ జన్మలో నీ యొక్క పూర్తి పుణ్యాన్ని వాడికి ధారపొయ్యాలి. ఈ క్షణంలో వాడు బ్రతుకుతాడు, ఇదివరకటిలా ఉండడు, చాలా తెలివిగా ఉంటాడు, మాటలు వస్తాయి. గొప్ప జ్ఞానము కలుగుతుంది. కానీ గుర్తుంచుకో. ఇంకొక్క ఐదు సంవత్సరాలు మాత్రమే బ్రతుకుతాడు. పుట్టినప్పటి నుండి వాడితో అనేక బాధలు కష్టాలు పడినప్పటికి ఇపుడు వాడి మరణానికి ఇంత బాధపడుతున్నావు, రేపు ఐదు సంవత్సరముల తరువాత తిరిగి వాడు మరణిస్తే నీవు తట్టుకోగలవా? గుండె నిబ్బరంగా ఉంచుకోగలవా? ఆలోచించుకొని మరీ చెప్పు. ఒక పాత్ర ఉంది చాలా పాతదయి సొట్టలు పడి, చిల్లులుపడింది. మాట్లవానికి ఇచ్చావనుకో బాగు చేసి ఇస్తాడనుకో, ఎంతకాలం ఉంటుంది? అది ఓడుదే కదా! ఆలోచించుకో అన్నారు. మా అత్తగారు వెంటనే అన్నారు. స్వామి ఇప్పటికి అనుభవించిన ఈ గర్భశోకం చాలు అన్నారు. స్వామి వెంటనే నీకు కుమారుణ్ణి ఒకసారి చూడాలనుందా? అటు చూడు అన్నారు. స్వామి పక్కనే మా బావగారు తెల్లగా నుంచొని కనిపించారు. స్వామి అన్నారు చూశావా ఇప్పుడు వాడికి నాకు బేధంలేదు. ఇక నుండి మీ కుటుంబ బాధ్యతంతా నాదే, మిగిలిన నీ ఇద్దరి కొడుకులను చూసుకుంటాను అన్నారు. మా అత్తగారికి సృష్టించి స్వామి తన B/w ఫోటోను ఇచ్చారు. ఆ ఫోటో ఇచ్చినప్పుడు Photo Press నుండి అప్పడే వచ్చినట్లు తడిగా ఉంది.

పుట్టపర్తి నుండి మా అత్తగారు తిరిగి మా ఊరు వచ్చారు. మా పెద్ద బావగారు పోవటంచేత విచారంగా ఉండేవారు. అయినా స్వామిని నిరంతరం స్మరించుకుంటుండేవారు. మధ్యాహ్న సమయంలో మాగన్నుగా నిద్ర పట్టినాసరే మా ఇంటి వరండా ఎదురు స్తంభం దగ్గర ఒక వికృతరూపంగా స్త్రీ కనిపించేది. ఇది ప్రతి రోజు జరిగేది. తెల్లవారుఝామున జపం చేసుకుంటానికి మొదలుపెట్టగానే ఒక స్వరం వినిపించేది. “నా సంగతేమిటి, నీ కుమారునికి ముక్తి వచ్చింది, నాకూ విముక్తి ఇవ్వమని ఆయనకు చెప్పు” (స్వామి) ఇలా కొన్ని నెలలపాటు బాధపడ్డారు. ఒక సాయంత్రం స్వామికి సవివరంగా తన బాధ

జాబురాసి పోస్టులో పడేశారు. అంతే! ఆ క్షణంనుంచి ఆ రూపం కనపడలేదు, శబ్దం వినపడలేదు. తరువాత స్వామి దగ్గిరకు వెళ్లినపుడు స్వామి చెప్పారు. 'అమ్మాయి నీవు ఉత్తరం రాస్తున్నపుడే అంతా గమనించాను. నీవు ఉత్తరం పోస్టుచేసే లోపలే ఆ దయ్యాన్ని మీ ఊళ్లోనే ఒక ప్రదేశం చెప్పారు. అక్కడ భూస్థాపితం చేశాను. ఇక దానివలన ఎవరికీ బాధ లేదు. నాకు మొదటినుంచి అంతా తెలుసు. అయినా నీవు నా సహాయం కోరలేదు కదా! అందుకు ఆగాను, అన్నారు. ఆ తరువాత మా మామగారికి రెండుసార్లు హార్టుఎటాక్ వచ్చి బయటపడ్డారు. స్వామి చెప్పారు మా అత్తగారితో ఆయనకు రెండుసార్లు Life extend చేశాను అని. స్వామి భక్తులను బదరీ మొ॥ క్షేత్రాలకు యాత్రలకు తీసుకెళ్లిన సమయంలో మా అత్తగారు స్వామితో వస్తాననగా స్వామి "ఇప్పుడు కాదు అమ్మాయి తరువాత అన్ని యాత్రలు దగ్గర ఉండి నేను చేయిస్తాను" అన్నారు. మా మామగారు పోయిం తర్వాత మా అత్తగారు మొత్తం యాత్రలు ఒంటరిగానే వెళ్లారు. కానీ అనుక్షణం స్వామి అనుభూతిని పొందారు, స్వామి సహాయ సహకారాలు లభించాయి. ఎటువంటి బాధలు లేకుండా అన్ని యాత్రలు చేశారు.

ఇప్పుడున్న మా బావగారికి స్వామి అనేకసార్లు ఇంటర్వ్యూలు ఇచ్చి సలహాలు ఇచ్చారు. ఆయన ఎప్పుడు పుట్టపర్తి వెళ్లినా వెంటనే పిలిచి మాట్లాడి పంపేవారు. ఇక మావారికి స్వామి మూడుసార్లు ఇంటర్వ్యూ ఇచ్చి మాట్లాడారు. ఆయనకిచ్చిన చివరి ఇంటర్వ్యూలో స్వామి 'నీకు పరిపూర్ణంగా భగవదనుగ్రహం ఉంది, స్వామి సహాయం నీవు ఎప్పుడు, ఎక్కడ ఉండి కోరినా తక్షణం లభిస్తుంది, అని అభయ ప్రధానం చేశారు. ఇది జరిగి 25 సంవత్సరాలు అయింది, ప్రత్యక్షంగా ఆయనకి ఇంటర్వ్యూ ఇవ్వకపోయినా స్వామి అనుక్షణం ఆయనను కనిపెట్టే ఉన్నారు. ఏ సమస్య వచ్చినా కలలో దర్శనం యిచ్చి పరిష్కారం చెప్పటం, పాదనమస్కారం ఇవ్వడం చేస్తున్నారు.

సాయిమాత తన అనుగ్రహాశీస్సులను ఈ విధంగా మా కుటుంబ సభ్యులందరి మీద ప్రసరింపచేస్తూ కాపాడుకుంటున్నారు. స్వామి మనందరకు తన దివ్యానుగ్రహాశీస్సులందిస్తూ సర్వదా మనలను కాపాడాలని సాయి మాతకు ప్రణమిల్లుతూ ప్రార్థిస్తున్నాను.

*జూలై - 1994*



# సత్యసాయి సన్నిధిలో

దెందుకూరి దుర్గాప్రసాద్, చాట్రాయి

1985లో 'శ్రీవాణి' ప్రత్యేక సంచికలో ఆయన తత్త్వం ఏమిటో అవతార లీలలేమిటో అవగాహన లేకుండా 'ఓ సత్యసాయీ, ఓశేషసాయీ నిత్యమై నిఖిలమై నిలువవయ్యా, శాంతివై ప్రేమవై వెలుగవయ్యా' అనే గేయాన్ని సాయి వ్రాయించారు. ఆ తరువాత మళ్ళీ 6 సం॥లు స్వామిని గురించి విశేషించి తలుచుకున్నదేమీలేదు. ఆగిరిపల్లి వచ్చిన దగ్గరనుండి 'సత్యసాయి సేవాసమితి'తో సంబంధాలు ఏర్పడ్డాయి. నాకు రుద్రాభిషేకం, చేయడం వగైరా స్మార్త మంత్ర భాగం తెలిసినా రోజూ ఆ రుద్రుణ్ణి రుద్రనమకంతో అర్చించుకునే భాగ్యం కలుగలేదు. 1991 ఆగస్టు నెలలో అనుకుంటాను స్థానిక సేవాసమితి అధ్యక్షులు శ్రీ చంద్రరావుగారు సత్యసాయి వెండి ప్రతిమను నాకిచ్చారు. ఏ సుముహూర్తాన ఇచ్చారో ఆ మరునాటి నుండి స్వామి ప్రతిమ, షిర్డీసాయి, రుద్రాక్షలు ఇంకా దేవతాప్రతిమలకు రోజూ రుద్రనమకంతో అభిషేకం చేసుకొనే భాగ్యం కలిగింది. 1991 నవంబరు, డిసెంబరు నుండి నా తల్లికి 'కాన్సరు' వ్యాధిసోకిందని వైద్యులు చెప్పారు. స్వామిని నమ్ముకుని హోమియో వైద్యం చేయిస్తున్నాము. నిత్యం విభూది వాడుతున్నాము. 1992 ఆగష్టు 9నుండి 13 వరకు 'ప్రశాంతి నిలయం'లో ఉండే భాగ్యం కలిగింది. మొదటిరోజు దర్శనం కాగానే ఆనందాశ్రువులు తెలియకుండానే కంటి నుండి ధారలైనాయి. 10 పూటలు స్వామి దర్శనం చేసికున్నాము. 9 పూటలు స్వామి నావైపు చూడలేదు. మొదటి వరుసలో దర్శనము కలుగలేదు. కొంత నిరాశ ఆవరించింది. పాదరక్షలు కూడా పోయాయి. ఇక నాకు అనుగ్రహం ఉండదనే అనుకున్నాను. స్వామికి ఏవో కోరికలతో వ్రాసుకున్న కాగితం కూడా ముక్కలు చేసాను, అటు దీనంగా ప్రతిరోజూ కాగితం తీసుకొనిపోతున్న మా అమ్మగారి కాగితము తీసుకోలేదు. 10వ పూట రేపు ఉదయం బయలుదేరుతామనగా ఆలస్యంగా వెళ్ళిన నాకు ఒక వరుసలో ఒక ఖాళీ కనిపించింది. చతికిలబడ్డాను. మరో నిమిషానికి అదే మొదటి వరుస అని తెలిసి ఆశ్చర్యం, ఆనందం చుట్టు ముట్టాయి. స్వామి నా దగ్గరకు వస్తున్నారు. నా వైపు ఏమీ చూడడంలేదు. ఏం జరుగుతుందో అనే ఉద్వేగంతో మోకాళ్ళమీద నిలబడ్డాను. దగ్గఱకు వచ్చి నా చేతిలోని పటం తాకారు, తీక్షణంగా చూసి విభూతిని చేతిలో పోసారు. పాద నమస్కారం లభించింది. ఏవేవో అడగాలని మాట్లాడాలని అంతకుముందు అనుకున్నా ఏమీ చేయలేకపోయాను. తలాకాస్త విభూతిని సాటివారికి ఇచ్చి బయటకు వచ్చేసరికి, అటు మా అమ్మగారి దగ్గర కాగితం తీసికున్నట్లు తెలిసింది.

ఆ ఐదురోజులు పరీక్షించి, పరీక్షించి చివరకు అనుగ్రహించారని సంతోషించి నాము. ఐదు రోజులు భజన, దర్శనంతో ప్రశాంతంగా గడిపాము. ప్రశాంతినిలయ సందర్శనం ఒక అనుభూతి. ఆ దివ్యానుభూతిని ఎవరికి, ఎప్పుడు, ఏ విధంగా అనుగ్రహిస్తారో ఆ స్వామికే తెలియాలి. మా తల్లిగారి ఒక కోరిక ఆరోగ్యం చేకూరుతున్నది. మరొకటి ఆ స్వామి అనుగ్రహంకోసం ఎదురుచూస్తున్నది. మనిషికి కావలసింది సంతృప్తి,. ఆ సంతృప్తి, సంయమనం, సన్మార్గం ఈ మూడు బాబాను కోరుకుంటూ సత్యసాయి సన్నిధిని హృదయమందిరంలో ప్రతిష్టించు కుంటున్నాను.

*ఏప్రియల్ - 1994*



# పునర్జన్మ

*"రాగతాళ సహితముగా గానము చేసే ప్రజ్ఞ కొందరికి పుట్టుకతోనే వస్తుంది. చేత కుంచె పట్టుకొని చిత్రములు వేస్తుంటే, జీవకళ ఉట్టిపడుతుంది. ఇట్టి ప్రతిభ, ప్రజ్ఞ కేవలం ప్రయత్నం ద్వారా సిద్ధించునది కాదు. ఇది నిజంగా భగవంతుని అనుగ్రహం, వారి జన్మాంతరముల ప్రాప్తి. ప్రయత్నములు కొంతవరకు మాత్రమే సహాయకారిగా ఉంటాయి. విత్తనమే లేకపోతే, ఫలించేదేముంది? విత్తనమనే ప్రాప్తి ఉన్నప్పడే ఫలములు అందుకోవటానికి అవకాశముంటుంది. రాక్షసగుణము, త్యాగభావములు కూడా జన్మాంతర ఫలములే. మన తలంపులననుసరించియే మరు జన్మమనేది ప్రాప్తిస్తుంది."*

**- బాబా**

# ప్రాణదాత భగవాన్ శ్రీ సత్యసాయి

సరోజా పట్నాయిక్, ఖరగ్‌పూర్

మీ యింట జంట వెంట నేను ఉన్నాను అనే సత్యాన్ని నిరూపించుకున్నారు శ్రీ సత్యసాయి. మా కుటుంబ సభ్యులందరికి మరపురాని సంఘటన అది. ఆ విషయాలు వివరించి వ్రాస్తున్నాను.

'92 మార్చి నెల 14వ తారీఖు శనివారం మా నాన్నగార్కి చాలా సీరియస్ చేసింది. ఆ రోజు మా ఫ్యామిలీ డాక్టర్ వచ్చి చెక్ చేసి ఇతనికి బ్లడ్ షుగర్ చాలా ఎక్కువయిపోయింది. రేపు అనగా (ఆదివారము 15 తారీఖు) డయబెటిస్ స్పెషలిస్ట్ వస్తారు. ఆ డాక్టరుకి చూపిస్తే మంచిది అని ఆ డాక్టర్‌కి ఒక లెటర్ వ్రాసి ఇచ్చారు. ఆ లెటర్ పట్టుకొని మా తమ్ముడు ఆ డాక్టర్ దగ్గరకు వెళ్లాడు. అతను వారంకి ఒక్క రోజే వస్తారు. (కలకత్తా నుండి) కాబట్టి విపరీతమైన రష్‌గా ఉంటుంది. కాని ఆ రోజు ఎవ్వరు లేరు. మా ఫ్యామిలీ డాక్టర్ వ్రాసిన లెటర్ చదివి ఆ డాక్టర్ మా తమ్ముడుతో వచ్చారు. నిజంగా ఆరోజు ఆదివారం కావడం మా అదృష్టం కదా!

ఆ డాక్టర్ అన్ని టెస్ట్‌లు చేసారు. ఇతని పరిస్థితి ఏమి బాగులేదు. ఎలా ఉంటుందో నాకేం తోచడం లేదు. ఇతన్ని వెంటనే హాస్పిటల్‌లో జాయిన్ చేస్తే మంచిది అన్నారు. మా నాన్నగారు లేవలేరు, కూచోనూలేరు, ఎవర్ని పోల్చుకోవడం లేదు. మాట్లాడటం లేదు. ఇటువంటి మనిషిని ఎలా తీసుకొని వెళ్తాం. ఎంబులెన్స్‌కి ఫోన్ చేసి మెల్లిగా స్నేహితుల సహాయంతో హాస్పిటల్లో జాయిన్ చేసినాం. హాస్పిటల్లో డాక్టర్ కూడా కండిషన్ చూసి చాల గాభరాపడిపోయి మా తమ్ముడ్ని ప్రక్కకు పిలిచి మీ వాళ్ళందరికి టెలిగ్రామ్స్ చేసేయండి. ఇతను ఏం తింటారో అన్నీ పెట్టేయండి అన్నారట. ఈ విషయం మా తమ్ముడు ఇంట్లో చెప్పకుండా (అంటే చెబితే మేము బెంగపడతామని చెప్పకుండా) వాడే మనసులో ఉంచుకొని బాధ పడుతుండేవాడు. ఆ రోజు రాత్రంతా అలాగే గడిచిపోయింది.

ఆ మరుసటి రోజు సోమవారం 16వ తారీఖు. మేము క్లస్టర్ భజనలు చేస్తుంటాం. సోమవారం మా యింట్లో భజన. మా యింటికి క్లస్టర్ వాళ్ళంతా వస్తారు. ఆరోజు మేము భజనలో ఎలా పాల్గొన్నామో మాకే తెలియదు. భజన మధ్యలో స్వామి మా ఇంటి గేటు దగ్గర నుండి మా నాన్నగారి పూర్తి పేరు పెట్టి "చంద్రశేఖర్" అని మూడు సార్లు పిలిచారట. భజనలో కన్నీళ్ళతో స్వామిని ప్రార్థిస్తూ పాటలు పాడామేమో మాకు తెలియదు. స్వామి ఫోటో మీద నుండి పువ్వులు పడ్డాయి. మా ఇంటికి వచ్చిన వాళ్ళు అన్నారు. మీ నాన్న గార్కి మరేం భయం

లేదు. మీ ఇంటికి స్వామి వచ్చి మీ నాన్నగార్ని పిలిచారు. ఫోటో మీద నుండి పువ్వులు పడ్డాయి అని మాకు ధైర్యం చెప్పారు. స్వామి మా నాన్నగార్ని తప్పక కాపాడతారని నమ్మకం మా అందరికి ఉంది. కాని మా నాన్నగారి పరిస్థితి డాక్టర్స్ మాటలు వింటుంటే భయం వేసేది.

మంగళవారం 17వ తారీఖు మా నాన్నగార్కి ఎక్స్‌రే తీసారు. బుధవారం 18వ తారీఖు రిపోర్టు వచ్చింది. గుండెలో చిన్న స్పాట్ ఉంది. తరువాత కిడ్నీ కూడా కొంచెం దెబ్బ తింది. కాబట్టి మా దగ్గర ఆ పరికరాలు లేవు. కనుక బరంపూర్ మెడికల్ కాలేజ్‌కి తీసుకు వెళ్ళిపొండి అని చెప్పినారు. మాకు మరీ భయం వేసింది. తెలియని ఊరిలో ఎలా ఉంటాం. ముఖ్యంగా నాన్నగార్ని ట్రైయిన్ ఎలా ఎక్కిస్తాం. స్వామి మీరు తప్ప మాకు ఇంక ఎవ్వరు లేరు అని స్వామిని ఎంతగానో ప్రార్థించే వాళ్ళం. ఇంకా రెండు రోజులు చూసుకొని మీరు బరంపూర్ వెళ్ళిపోండి అని డాక్టర్స్ చెప్పారు.

గురువారం 19వ తారీఖు సాయంత్రం గం॥ 6-00 లకు మా ఫ్యామిలీ మెంబర్స్ అంతా భజన చేసుకుంటున్నాం. మా అమ్మగారు నాన్నగారి దగ్గర హాస్పిటల్ లోనే ఉండేవారు. నేను, మా చెల్లీ, మా ఇద్దరు తమ్ముళ్ళు, మేము నలుగురు భజన చేస్తున్నాం అంటే, అదే టైమ్‌లో గం॥ 6-00లకి మా అమ్మ అనుకుంటున్నారట. స్వామి మేము నిన్ను నమ్ముకున్నాం. మీరు తప్ప మాకు ఇంకెవ్వరు లేరు. ఏం చేసినా మీరే చెయ్యాలి స్వామీ అని అనుకుంటుండగానే మా అమ్మ కళ్ళు మూతలు పడినట్లు అయ్యిందట. స్వామి తెల్లని డ్రెస్‌లో మా నాన్నగారి దగ్గరకి వచ్చి తల దగ్గర నుండి షర్ట్ గుండీలు విప్పేసి గుండె అంతా కాళ్ళ దగ్గర దుప్పటి తీసి పాదాలకి, పాదాల అడుగు బాగానికి పూర్తిగా విభూతి వ్రాసినారట. పరుపు అంతా విభూతి, అంతా విభూతి వాసన. మా అమ్మ ఇంకా స్టూలు మీద అలాగే కూర్చొని ఉన్నదట. మా అమ్మ కళ్ళు మూసుకుని కూచున్నదట. మా తమ్ముడు ఇంట్లో భజన చేసుకుని వెళ్ళాడు. వెళ్ళేసరికి మా నాన్నగారు పడుకొని ఉన్నారట. మా అమ్మ ఇంకా అలాగే కూచున్నారట. ఏంటమ్మా అలా ఉన్నావ్. నీవు నాన్న గార్కి బొట్టు పెట్టేవా ఏమిటి. నాన్నగారి మొహం అంతా విభూతి. ఒళ్ళంతా విభూతి. ఏంటమ్మా. అప్పడు మా అమ్మకి తెలివి వచ్చినట్లు అయ్యిందట. చూస్తే ఇంకేంటి. పరుపు మీద, చుట్టుప్రక్కల విభూతి. విభూతి వాసన. అప్పడు మా తమ్ముడు అన్నాడట. అమ్మా! మన నాన్నగార్కి మరేమి ఫర్వాలేదు. స్వామి వచ్చి బాగు చేసారు. మరే డాక్టర్ అక్కరలేదు నాన్నగార్కి. ఈ గొడవకి డాక్టర్స్ అందరు వచ్చి చూసేరట. ( మా నాన్నగార్కి సీరియస్ కండిషన్ కదా. డాక్టర్స్ తరచు వచ్చి చూచేవారు) మళ్ళీ మా నాన్నగార్కి ఎక్సరే తీసారు.

ఆశ్చర్యం డాక్టర్స్ అందరూ ఆశ్చర్యపోయారు. బ్లడ్ షుగర్, కిడ్నీ, గుండెలో స్పాట్ అన్నీ నిల్. రిపోర్టు ఎంతో బాగుంది. మా నాన్నగారు మామూలుగా అయిపోయారు. పదిరోజులు ఆహారం లేక నీరసం అయిపోయారు తప్పితే ఎప్పటిలా చక్కగా వున్నారు. డాక్టర్స్ అందరు భగవాన్ శ్రీ సత్యసాయి ఫోటో చూసి (అంటే మేము హాస్పిటల్ బీరువా మీద పెట్టుకున్నది) ఇతని మహోత్మ్యాన్ని మేము కళ్ళారా చూసాం అని వాళ్ళంతా ఆశ్చర్యపోయారు. మరి నాలుగు రోజులు పోయాక మా నాన్నగార్ని డిస్‌చార్జి చేసినారు. ఇప్పుడు మా నాన్నగారు ఆరోగ్యంగా, క్షేమముగా వున్నారు. దీనికి కారణం అంతా కరుణామూర్తి, ప్రేమమూర్తి అయిన శ్రీ సత్యసాయి కదా!

*ఏప్రియల్ - 1993*



# భాగవతము

*" 'ముక్తి' అనేది 'భాగవతము' అనే ఐదు అక్షరములలోనే లభిస్తుంది. 'భ' - భక్తి, 'గ' - విజ్ఞానము, 'వ' వైరాగ్యము 'త' - తత్త్వము. ఈ నాల్గింటి సమ్మేళనమే 'ము' - ముక్తి, భక్తి, వైరాగ్య, తత్త్వ విచారణలు 'ముక్తి'కి మార్గములని నిరూపించింది "భాగవతము'. ఇవి ప్రతి మానవుడిలో నిండి, నిబిడీకృతమై యున్నవి. కాని, వాటిని సరియైన మార్గంలో అనుభవించటం లేదు. అనుభవించిన వాడే 'భాగవతప్రియుడు' భగవంతుని పై ప్రేమే భక్తి. నిత్యా నిత్య పరిశీలనా తత్త్వమే జ్ఞానము. మనలో ఉన్న దుర్గుణాలను పరిత్యజించడమే వైరాగ్యము. తానెవరు? నేనెవరు? ఈ రెండింటిని తెలుసుకోవటమే తత్త్వ విచారణ. ఇవే 'ముక్తి' కి మార్గములు"*

- బాబా

# శ్రీ సత్యసాయి శకమునకు - వైతాళికులు

**ఎన్.బి.ఎస్. రామారావు**

భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారు "వసుధైక కుటుంబము" అను పేర ప్రపంచములో గల సమస్తదేశ ప్రజలను జాతి మత కుల భాషా విచక్షణ లేకుండా, సుఖశాంతులతో అందరూ కలిసిమెలసి జీవించునట్లు తన ప్రేమ ద్వారా "సత్యయుగ మును" మనకు ప్రసాదించుటకై అవతరించిరి. సమకాలికులెందరో, కోట్లాది ప్రజలు స్వామిని అవతార పురుషుడుగా అంగీకరించి వారి బోధనలను అనుసరించుచున్నారు. అవతార పురుషులు తాము ఈ జీవితములో సాధించవలసిన విషయములను ముందే నిర్ణయించుకుని, అందుకవసరమైన వ్యక్తులను సమకాలికులుగా తీసుకొని వచ్చే ఒక ప్రణాళిక ప్రకారము వారి కర్తవ్యమును నిర్వహించెదరు.

వచ్చే 2000 సం॥ నుంచీ "సత్యసాయి శకము" ఆరంభము కాబోవుచున్నది. సమస్త దేశములు స్వామి అడుగుజాడలలో సత్య ధర్మ శాంతి ప్రేమలను మానవతా విలువలుగల దివ్య జీవనము గడుపు కాలమాసన్నము కాబోవుచున్నది. స్వామి తన కార్యక్రమమును, అవతార లక్ష్యమును కొందరు సమకాలికులైన వ్యక్తుల ద్వారా ప్రపంచమునకు అందించెదరు. అట్టి వారిలో ముఖ్యులైనవారు, రాబోయే సత్యసాయి శకమునకు వైతాళికులు అనదగినవారు కొందరుగలరు. వారి అనుభవములను స్వామి వారి ద్వారా తన అవతార కార్యక్రమముల నెట్లు కొనసాగించుకొనుచున్నదీ వివరములు తెలిసికొందము. ఈ కలియుగములో మానవుల హృదయములలో గల చెడు బుద్ధులను త్రుంచి వారిలో ధర్మాచరణ పెంచుట ద్వారా, నేటి మానవులలో ఒక పెద్ద ఆధ్యాత్మికాభివృద్ధి మార్పును తీసికొని వచ్చుచున్నానని స్వామి అనేకసార్లు తమ ఉపన్యాసములలో కూడ పేర్కొనిరి. అట్లు స్వామిచే మార్పు చేయబడి, తదుపరి స్వామి యొక్క ప్రేమ వారి ద్వారా ఇతరుల కందింపబడుచు, స్వామి అవతార కార్యక్రమములలో పనిముట్లుగా వ్యవహరింపబడిన ఇద్దరు పాశ్చాత్య దేశములవారి గురించి ఇపుడు తెలిసికొందము.

1 శ్రీ ఆర్థాంగ్ జుమ్‌సాయి. 2. శ్రీ విక్టరు కానూ. శ్రీ ఆర్థాంగ్ జుమ్‌సాయిగారు లండన్ యూనివర్శిటీలో సైన్సులో డాక్టరేట్ పట్టా పొంది, థాయ్‌లాండులోని సైన్సు అండ్ టెక్నాలజీ రీసెర్చి సంస్థకు డైరక్టరుగా పని చేయుచూ ప్రస్తుతము 12 తూర్పు దేశము (బ్యాంకాక్, ఫిజీ మొ॥) లలో గల సత్యసాయి సంస్థలకు అధిపతిగా వ్యవహరించుచున్నారు.

1945 సం॥ ప్రాంతములో రెండవ ప్రపంచయుద్ధము జరుగుచుండగా బ్యాంకాక్‌లో గల మిలటరీ బ్యారెక్స్‌లో ఒక ఇంటియందు భగవాన్ శ్రీ సత్యసాయి

బాబావారు ప్రత్యక్షమై, ఆ యింటిలోని గృహిణిని పిలచి, కొంత విభూతి తమ దివ్య హస్తములతో సృష్టించి ఇచ్చి అది వారింటిపై జల్లుకొనమని వారి భాషలో చెప్పి అదృశ్యులైరి. ఆమె ఆ విభూతి చూసి (White Sand) తెల్లని ఇసుక అనుకొని, ఏమైననేమి అని ఇంటిపై జల్లెను. మరి కొద్ది నిముషములకే జపానువారి యుద్ధవిమానములు వచ్చి ఆ ప్రాంతముపై బాంబులదాడి చేయగా వీరిల్లు తప్ప మిగతా ఇండ్లన్నియు నాశనమయ్యెను. ఆ తరువాత ఆ యింటివారికి "ఆర్థంగ్ జుమ్‌సాయి" అను అబ్బాయి పుట్టెను. అతను చిన్నతనము నుంచి చాలా కొంటెవాడై, అల్లరిచిల్లరిగా సంచరించుచూ పాఠశాల లందు తోటి విద్యార్థులందరినీ చితకబాదుచుండెడివాడు.

మిగతా పిల్లలందరూ గొడవచేయుటచే అతని తల్లిదండ్రులు "ఆర్థాంగ్"ను ఒక (Residential School) హాస్టలు వసతి గల పాఠశాలలో జేర్చిరి. ఒకనాడు అతడు మిగతా పిల్లలతో కలిసి నిద్రించుచుండగా రాత్రి 12 గం॥ ప్రాంతములో అతనికి మెలకువ వచ్చి ఆ..ర్థాంగ్: ఆ-ర్థాంగ్: ఆ-ర్థాంగ్ ఎందుకిట్లు చేయుచుంటివి? "Why are you doing this? అని ఇంగ్లీషులో వినిపించెను అతను కళ్ళు తెరచి చూడగనే ఆ హాలు అంతయూ బంగారురంగు దివ్యకాంతులతో మెరయుచు కన్పించెను. ఇది చూసి అతడు ఇదేదో దెయ్యమై యుండునని తలచి భయపడి దుప్పటి ముసుగుపెట్టివేసి పరుండెను. మరునాడు రాత్రి, ఆ మరునాడు (3వ రోజు) కూడా అదే విధముగా జరిగెను. మూడవనాడతడు ధైర్యంచేసి మిత్రులను లేపి చెప్పగా వారిది గమనించి, ఇదేదో దైవశక్తియని, నీ గురువు మాటలే అయి వుండవచ్చని సలహానొసంగిరి. అంతే! ఆనాటినుండి అతనిలో గొప్ప మార్పువచ్చెను. తోటివారిని కొట్టుట మానివేసెను. దైవముపై మనస్సు మరలెను. చక్కని విద్యాబుద్ధులు గలవాడై భారతదేశములో అవతార పురుషులుద్భవించిరని తెలిసికొని, వివేకానంద, రామకృష్ణ పరమహంస మొ॥వారి జీవిత చరిత్రలు తెప్పించుకొని చదువుట మొదలిడెను. అతనిలో దైవమును తెలిసికొనవలెనని దృఢమైన సంకల్పము కలిగెను. ఆనాటినుండి అతడు సరళ, సాధు స్వభావముగలవాడై మంచి విద్యావంతుడయ్యెను. 26 సం॥ ప్రాయములోనే ఆయన ట్రినెట్ కాలేజి, క్రేమ్ బ్రిడ్జి యూనివర్శిటీ లండన్‌లో సైన్సులో డాక్టరేట్ పట్టా తీసికొని, థాయ్‌లెండ్‌లో మంత్రులకు సలహాదారుగా, విద్యాశాఖలో హౌస్ కమిటీ మెంబరుగా, స్పేస్ రీసెర్చ్ సెంటరుకి డైరెక్టరుగా నియమితుడయ్యెను.

ఇట్లుండగా 1983వ సం॥లో అమెరికాలోని 'NASA' రాకెట్లు ఉపగ్రహముల పైకి ప్రయోగించు సంస్థవారు తమరికి ఒక ప్రత్యేకమైన రాకెట్టును

తయారుజేయగల "సైంటిస్టు" కావలెనని అన్ని దేశములందు ప్రకటన విడుదల చేసిరి. ఆ ప్రకటనను నుసరించి ఈయన కూడా తన దరఖాస్తును దాఖలు చేసెను.

అమెరికన్లు "మార్సు' (కుజగ్రహము) పైకి మనుషులులేని ఒక రాకెట్‌ను ప్రయోగించదలచిరి. కానీ రాకెట్ కుజగ్రహ ఉపరితలముపై గల ఆకర్షణ శక్తియొక్క పరిధిలో ప్రవేశించగనే మండిపోవునని అనుమానించిరి. కుజగ్రహము భూమికి చాలాదూరమందు గలదు. భూమినుండి కుజగ్రహము వరకూ ఈ రాకెట్ చాలా వేగముగా వెళ్లవలెను. కుజగ్రహ ఆకర్షణ పరిధిలో ప్రవేశించగానే నెమ్మదిగా దిగి, అచటగల మట్టిని సేకరించి భూమికి తిరిగి తీసుకొని రావలెను. మనుష్యులు లేకుండగనే రాకెట్ యంత్ర శక్తితోనే పనిచేయవలయును. భూమ్యాకర్షణ కంటె, కుజగ్రహ ఆకర్షణశక్తి పది రెట్లధికమగుటచే ఇట్టి రాకెట్‌ను తయారుచేయుట అమెరికన్లకు కూడా సాధ్యపడలేదు. అట్టి రాకెట్ మోడల్‌ను ముందుగా లేబరేటరీ తయారుచేసి చూపవలసినదిగా, అందుకవసరమగు ఖర్చంతయూ భరించుననియూ ప్రకటనలో తెలియజేసిరి. అట్టి పరీక్షలో "శ్రీ ఆర్థాంగ్ జుమ్ సాయి" గారు సెలక్టు చేయబడిరి.

మోడలు రాకెట్‌ను తయారుచేసి లేబరేటరీలో కృత్రిమ కుజగ్రహ ఆకర్షణశక్తి పరిధిలో ప్రయోగించగనే ఆ రాకెట్ అమెరికన్లు అనుమానించినట్లే మండిపోయి బూడిదయైపోయెను. రెండు మూడు నెలల వ్యవధిలో ఇంజనులో కొన్ని మార్పులు చేసి తిరిగి ఆర్థాంగ్ జుమ్ సాయి సైంటిస్టు రెండవ మోడల్ రాకెట్‌ను ప్రయోగించెను. అదికూడా లేబరేటరీ కృత్రిమముగా కల్పించబడిన అధికమైన కుజగ్రహ ఆకర్షణ శక్తి పరిధిలో ప్రవేశించుచునే మండిపోయెను. అప్పటికి 400 లక్షల అమెరికను డాలర్లు ఖర్చుచేయబడినవి. ఆర్థాంగ్ జుమ్ సాయికి మానసిక విచార మెక్కువయ్యెను. ఏమిచేయుటకు తోచుటలేదు. ఆత్మహత్య చేసికొనుటకు నిర్ణయించుకొని, ఎవరికీ చెప్పకుండా దగ్గఱలోగల ఒక కొండ శిఖరము నధిరోహించి, అచటనుండి క్రింద లోయలోకి దూకి మరణించుటకు ఉద్యుక్తుడగుచుండగా ఆకాశములో ఒక తేజస్సు అతనికి సాక్షాత్కరించెను. చెవిలో ఎవరిదో మాట వినబడెను. ఆ తేజస్సులో సరైన పద్ధతిలో తయారుచేయవలసిన రాకెట్‌కు అవసరమైన ఇంజనుకు సంబంధించిన విజ్ఞాన శాస్త్ర (Scientific Equation for the Rocket Engine) సూత్రము సాక్షాత్కరించెను. విజ్ఞానవేత్త కంటె, విజ్ఞానవేత్తను సృష్టించిన దైవమే అధికమని, దైవశక్తి లేనిదే విజ్ఞానశాస్త్రమేమియూ సాధించలేదని Spirituality is greater than Science అను మాటలు ఆయనకు

వినపడెను. వెంటనే ఆయన లేబరేటరీకి తిరిగి వెళ్ళి, తనకు సాక్షాత్కరించిన "ఈక్వేషను" ప్రకారము 11వ రాకెట్ తయారుచేసెను. అది సరిగా ప్రయోగింపబడెను. ఆయన కృషికి అమెరికన్లు మెచ్చుకొని, ఆ 11వ రాకెట్ ఇంజను ప్రకారము 'Life Size' పెద్ద సైజు రాకెట్ (Un manned Space Craft "Viking") "వైకింగ్" అను పేరుతో ప్రయోగించి కుజగ్రహముపైగల మట్టిని భూమికి తీసికొని రాగలిగిరి. ఈ పని చేసినందుకు అమెరికావారు శ్రీ ఆర్థాంగ్ జుమ్ సాయిగారికి 1984వ సం॥లో ఇతనిని మించిన సైంటిస్టు లేడు అను (Award) అవార్డును బహూకరించిరి. ప్రపంచములోకల్లా అది మిక్కిలి అధికమైన అవార్డు.

అది గ్రహించి ఆయన ఇంక సైన్సును విడచి పెట్టి భగవంతుని వెదకవలెనను పట్టుదలతో తన తల్లిని తీసికొని భారతదేశమునకు వచ్చెను. ఢిల్లీలో కొందరు ఆయనకు బెంగుళూరు వెళ్ళి శ్రీ సత్యసాయి బాబావారిని దర్శించమని సలహా నొసంగిరి. ఆయన బృందావనములో స్వామి దర్శనమునకు కూర్చుండగా స్వామి వారికి ఇంటర్వ్యూ నొసగి, రెండవ ప్రపంచయుద్ధ సమయమున తాము బ్యాంకాక్ వచ్చి ఈతని తల్లికి విభూతి నొసగిన విషయము చెప్పి, ఆమె దానిని తెల్లని ఇసుక (White Sand) అనుకొనెనని కూడా చెప్పి, తన అవతార కార్యక్రమములో పాలుపంచుకొనవలసిన వ్యక్తులను కొన్ని జన్మలనుండి స్వామి వారిని తమ సమకాలికులుగా తీసుకొనవచ్చుచున్నానని చెప్పి, రాకెటు ఇంజనుకు అవసరమైన (Equation) శాస్త్ర విజ్ఞాన సూత్రము నెవరు ప్రసాదించిరని ప్రశ్నించిరి. అంత "ఆర్థాంగ్ జుమ్‌సాయి" స్వామిని అవతార పురుషులుగా గుర్తించి, వారిని భగవంతునిగా అంగీకరించి సంతసించెను. స్వామి వారిని 12 తూర్పు పాశ్చాత్య దేశములలో గల సత్యసాయి సంస్థలకు అధిపతిగా నిర్ణయించి ఆయా దేశములలో విద్యావిధానమును చక్కదిద్దుమని, సత్య, ధర్మ, శాంతి ప్రేమలుగల మానవతా విలువలలో విద్యాభివృద్ధి చేయమనియు, ఆర్థాంగ్ తన పని కొనసాగించిన, స్వామి వారి వ్యాపారములను తీర్చిదిద్దునని సెలవిచ్చిరి. (You do my work, I will look after your business).

ఆనాటి నుండి "ఆర్థాంగ్" ఆహోరాత్రులు EHV (Education in Human Values) మానవతా విలువలు గల సాయి విద్యావిధానమును 12 దేశములలో అమలు పరచుచూ స్వామి అవతార కార్యక్రమములో ముఖ్య పనిముట్టుగా పని చేయుచుండెను.

ఇట్లుండగా ఒకనాడు ఆర్థాంగ్ జుమ్‌సాయిగార్కి బ్యాంకాక్‌లో గల ఒక ఫ్యాక్టరీలో దొంగతనము జరుగుట ప్రారంభమయ్యెను. ఆయన స్వామి

కార్యక్రమములలో ఇతర దేశములందు తిరుగుచూ తన ఫ్యాక్టరీపై శ్రద్ధ వహింపలేకుండెను. ఆయన ఫ్యాక్టరీ గేటులోగల సెక్యూరిటీ వాచ్‌మెన్ రాత్రులందు సెక్యూరిటీ గార్డు రూములో అద్దములు గల తలుపులు వేసుకొని, డ్యూటీ చేయక నిద్రించుట మొదలిడెను. ఆ గదికి అద్దపు తలుపులు మూసినపుడు (Air Tight) లోపలికి గాలి కూడా చొరబడ వీలులేదు. ఒకనాడు 12 గం॥ ప్రాంతములో గార్డు నిద్రించుచుండగా భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారు ఆ గదిలో ప్రత్యక్షమై ఆతనిని, నిద్రనుండి లేపి, వారి భాషలో డ్యూటి చేయవలసిన విధానమిదియేనా? అని మందలించిరి. మరునాడు రాత్రి వాచ్‌మన్ తిరిగి అట్లే నిద్రించుచుండగా మళ్ళీ స్వామి అతనిని లేపి మందలించిరి. స్వామిని అతడెప్పడూ చూచియుండలేదు. స్వామి గురించి తెలియదు. గాలి కూడా దూరని ఈ గదిలోకి మనిషి ఎట్లా ప్రవేశించెను. ఈ ఎఱ్ఱని అంగరఖా ధరించిన వ్యక్తి ఎవరై యుండవచ్చునని అతడు పరిపరివిధముల ఆలోచించి, ఎట్టకేలకు మరునాడు తన యజమాని 'ఆర్థాంగ్' రాగానే వారికి తన తప్పను విన్నవించి రెండు రోజుల జీతమును మినహాయించు కోమని కోరెను.

వీరిద్దరూ ఒకరితో నొకరు మాట్లాడుకొనుచూ ఫ్యాక్టరీకి మేనేజింగ్ డైరెక్టరూ అయిన "ఆర్థాంగ్" గారి ఆఫీసు రూము ప్రవేశించిరి. ఆయన కూర్చుండు కుర్చీ వెనుకభాగములో భగవాన్ సాయిబాబా వారిది పెద్ద చిత్రపటమును సెక్యూరిటీ గార్డు చూడగనే ఆశ్చర్యపడి, ఆ ఫోటోలో గల వ్యక్తియే తనకు ప్రత్యక్షమై హెచ్చరించెనని తెలిపెను.

వెంటనే ఆర్థాంగ్ జుమ్ సాయిగారు విమానములో బయలుదేరి ఇండియాకు పయనమై ప్రశాంతి నిలయము చేరిరి. ఆ సమయములో పూర్ణచంద్ర హాలులో EHV సదస్సులో స్వామి ఉపన్యసించుచూ, ఇప్పడే 'ఆర్థాంగ్ జుమ్ సాయి' వచ్చినాడని తెలిపి, ఆయనను లోపలికి పిలిపించి, వారి అనుభవమునేదైనా మాట్లాడమని చెప్పిరి. ఆయన స్వామి థాయ్‌లాండ్‌లో తమ ఫ్యాక్టరీకిగల సెక్యూరిటీ గార్డు రూము తలుపులు మూసివుండగా, లోపల నిద్రించుచున్న గార్డును లేపి "సరిగా డ్యూటీ చేయుమని" మందలించిన సంగతి విన్నవించగానే స్వామి "అవును నీవు నా పని చేయుము, నేను నీ వ్యాపారమును తీర్చిదిద్దెదనని మాట ఇచ్చితిని గదా దొంగలు పడుచుండగా, సెక్యూరిటీ గార్డును మందలించ వలసి వచ్చుటనే నేను మీ దేశము వచ్చితిన"ని స్వామి ఈ సంఘటనను నిర్ధారణ చేసిరి. ఆనాటినుండి శ్రీ ఆర్థాంగ్ జుమ్ సాయి (Far Eastern Countries) 12 తూర్పు పాశ్చాత్య దేశములలో సత్య ధర్మ శాంతి ప్రేమలను మానవతా విలువలను మౌలిక సూత్రములుగా గల

విద్యావిధానమును చిన్న తరగతులనుండి పోస్టుగ్రాడ్యుయేట్ వరకూ వ్యాపింప జేయుచూ, స్వకార్యములను వదలి అహోరాత్రములు స్వామి కార్యక్రమమునే జేపట్టుచూ స్వామిచే అనుగ్రహింపబడిన పనిముట్టుగా జీవితమును సాగించు చున్నారు. రాబోయే సత్యసాయి శకమునకు ముఖ్యవైతాళికులలో పాశ్చాత్య దేశీ యులలో పేరెన్నికగన్న విజ్ఞాన వేత్త, వయస్సులో చిన్నవాడైననూ స్వామి భక్తిలో మిన్న "శ్రీ ఆర్తాంగ్ జుమ్ సాయి".

ఇక రెండవవారు శ్రీ విక్టర్‌కానూ. వీరు కూడనూ స్వామిచే వారి జీవిత సరళిలో మార్పు చేయబడి, ప్రస్తుతము పాశ్చాత్య దేశములలో జింబాబ్వే, లండన్ మొ॥ 12 పశ్చిమ దేశములలోగల (Far Western Countries) సత్యసాయి సంస్థలకు అధిపతులుగ రాత్రింబవళ్లు EHV స్వామి విధానమును కొనసాగించుచూ పేరెన్నికగన్న భక్తులు.

వీరు ఆఫ్రికాలో జన్మించిరి. ఆక్సుఫర్డు యూనివర్సిటీలో M.A. పట్టభద్రుడై 'సిర్రాలియోన్' దేశములో హైకమీషనరుగా నియమింపబడి ఆఫ్రికానుండి గ్రేట్ బ్రిటన్ వెళ్ళి, నార్వే, డెన్మార్క్ స్వీడన్ దేశములలో ఆధ్యాత్మిక సంఘ అధినేతగానూ లండన్‌లో 9 సం॥ మెజిస్ట్రేటుగా పనిచేసెను. ప్రస్తుతము ఆయన "నొడోలా"లో నివసించుచూ, జాంబియా, ఆఫ్రికా యునైటెడ్ నేషన్స్‌లోగల విద్యాసంస్థలలో EHV సత్యసాయి విద్యావిధానమును ప్రచారము గావించుచున్నారు. వీరికి కల్గిన స్వామి అనుగ్రహము, అనుభవములు చాలా అద్భుతములు.

1974సం॥ భగవంతుని తెలిసికొనుటకై ఈయన తీవ్ర ఆవేదనతోనుండగా, భగవాన్ సత్యసాయి బాబా వారిని గూర్చి ఏమాత్రమూ తెలియని స్థితిలో ఒకనాడు ఈయన ఆఫ్రికాలో 'సిర్రాలియోనా' నగరములో ఒక క్లబ్‌లో సాయం సంధ్యవేళ బాగా విపరీతముగా సీసాపై సీసా బ్రాంది త్రాగుతుండగా దూరమున చెట్టు క్రింద "స్వామి" నిలబడి తనను చూచుట గమనించెను. కానీ అప్పటికి సత్యసాయి బాబావారి గురించి, నామ రూపములైననూ తనకు తెలియకుండుటచే తనను గమనించిన వ్యక్తి ఎవరో తెలియక, తన పని తాను కానిచ్చెను. ఆ రాత్రి 10 గం॥ సమయములో అతని కొక స్వప్నమొచ్చెను. ఆ కలలో ఇద్దరు రెక్కలుగల బాలురు (యక్షులు) (Angels) ఈయనను ఆకాశములో 50 వేల అడుగుల ఎత్తులో ఆఫ్రికాకు తూర్పుగా ఎగరవేసికొని వెళ్ళి విమానము దిగినట్లుగా ప్రశాంతి నిలయములో తూర్పు గోపురము ముందు దింపి అదృశ్యులైరి. అది ప్రశాంతినిలయమని గాని, తాను వచ్చిన దేశము భారతదేశమనిగాని అతనికి తెలియదు. ప్రశాంత ప్రాంగణములో ప్రవేశింపగనే అక్కడ అన్ని దేశముల వారు

రకరకముల భాషలు మాట్లాడుచూ కన్పించిరి. ఇది ఒక చిన్న ప్రపంచ మహా సభయా అని అతడు తలపోసెను. బాబావారు కనపడలేదు. కాని ప్రశాంతి మందిరము కనబడెను. అంతలో చనిపోయిన తన తాత ముత్తాతలిద్దరూ ప్రత్యక్షమై తన స్వంత భాషయైన, ఆఫ్రికాలో మాట్లాడు "తమ్మే" అనబడు తన భాషలో "ఒరే మనవడూ వచ్చితివా! చాలా అదృష్టవంతుడివి. భగవంతుని నివాసమునకు చేరు కొంటివి" అని పల్కి మాయమైరి. అంతలో అతనికి మెలకువ వచ్చెను. అతడు ఆఫ్రికాలో తన మంచముపైననే యుండెను. కానీ ఆ స్వప్న మహాత్మ్యమేమిటో ఆనాటినుండి ఆయన త్రాగుడు, చుట్ట, సిగరెట్టు మొ॥ వ్యసనములను పూర్తిగా విడచిపెట్టి భగవంతునికై అన్వేషణ సాగించెను. రాబర్టు అనబడు క్రైస్తవ మతాధికారి ద్వారా 'యెహోవా ప్రభువే' తిరిగి సత్యసాయిగ జన్మించెనని తెలిసికొని ఆనందించి - సత్యసాయి బాబాగారిని తెలియజేయు పుస్తకములను 'రాబర్టు' గారి వద్ద సంగ్రహించెను. అందులో శ్రీ సత్యసాయి బాబావారి చిత్రము తిలకింపగనే, ఆ రోజు సాయంత్రము క్లబ్‌లో తాను బ్రాందీ త్రాగుచున్నపుడు చెట్టు క్రింద నిలబడి తనను గమనించిన వ్యక్తి ఈయనే యని - స్వామి చిత్రమును బట్టి గుర్తించి - తన తప్పకు చాలా విచారించెను.

1974వ సం॥ నుండి జీవనగతిలో ధనలేశముచే ఆయనకు చాలా ఇబ్బంది కల్గి, తన నివాసము ఆఫ్రికా నుండి లండన్ మార్చివేసెను. స్వామిని పుస్తకములలో చదివి అవతార పురుషుడుగా గుర్తించి, స్వయముగా భార్యతో కలిసి ఇండియా వచ్చి సత్యసాయి భగవాన్ వారిని దర్శించవలెనని తహతహలాడెను కానీ విమాన ప్రయాణమునకు అవసరమైన ధనమును సమ: ార్చుకొనలేక 1980 సం॥ వరకు బాధపడుచునే స్వామిని కొల్చుచుండెను. 1981వ సం॥ లో స్వామి ఇద్దరు ఇంగ్లీషువారి పేర్లతో 500 డాలర్ల చెక్కు ఒకటి, 250 డాలర్ల చెక్కు ఒకటి బహుమతిగా "ప్రత్యేకము ఈ ధనము ఇండియా వెళ్ళి సత్యసాయి అవతార్‌ను దర్శించుటకే ఉపయోగించవలెను" అని చెప్పి ఉత్తరము వ్రాసి వారికి పంపించిరి. వెంటనే ఆయన సతీమణి "గెనోవావా" అను ఆమెతో కలిసి ప్రశాంతి నిలయము చేరుకొని స్వామిని దర్శించెను. ప్రశాంతి చేరగానే నిలయము 1974 సం॥లో యక్షులు ఆయనను తీసికొని (ఆకాశమార్గము గుండా) వచ్చినదిక్కడికేయని గుర్తించి, ఆనందపరవశుడైపోయెను.

మొదటి ఇంటర్వ్యూలోనే స్వామి ఆయనను, "విక్టర్! నీ భార్య ఎక్కడ? ఓ, ఆయామ్ సారీ ఆమె నీ స్నేహితురాలు, భార్య కాదు. నేను మీ కిచట వివాహము జరిపించెదనని పలికెను," వెంటనే వారిద్దరూ లేచి, స్వామి! మేము పెండ్లి జరిగిన

కొద్ది గంటలకే విడాకులిచ్చుకొంటిమి. కోర్టులో కేసు నడచుచున్నది. మేము 10 సం॥లుగా స్నేహితులుగా ఒకే ఇంట్లో నివసించుచుంటిమిగానీ భార్యాభర్తలుగా కాదు ఈ సత్యము ప్రజలు, మా లండనులోని తోటి సహచరులకు కూడా తెలియదు. వారందరూ మేము భార్యాభర్తలమనే అనుకొనుచుంటిరి. కానీ నీవు సత్యమెరుగుటచే నీవు తప్పక భగవంతుడవే యని నేను దృఢముగా నమ్ముచున్నాను. Yes. You are God. You are God. You are God అని మూడు సార్లు పలికి సాష్టాంగ నమస్కారమొనర్చెను. స్వామి సర్వజ్ఞత, దైవశక్తికి ఇంతకన్న తార్కాణమేమి కావలయును? వారు ప్రశాంతినిలయంలో నెల రోజులు నివసించిరి. స్వామి వారము రోజులు తరువాత వారి వివాహము జరిపించి, గొప్ప అనుగ్రహమును ప్రసాదించి అనేక విషయములు వారికి ఇంటర్వ్యూలో తెలియజేసిరి. వారిపుడు 12 పాశ్చాత్య దేశములలోని సత్యసాయి సంస్థలకు అధిపతిగా EHV సాయి విద్యావిధానమును కొనసాగించుచున్నారు. EHV విద్య నేర్పుటకు 12 ఎకరముల నేలలో ఒక పాఠశాల భవనమును ఆయన ఆఫ్రికాలో కట్టించుచుండగా అచ్చటి సిమెంట్, ఇనుపతీగలు రాత్రిళ్లు దొంగలెత్తుకొనిపోవుట జరిగెను. ఆ సందర్భములో ఒకనాడు అచట నియమింపబడిన (Ex-Military man) వాచ్‌మన్ కానూగారితో ఇట్లనెను. అమ్మ నాకు తుపాకీ కలదు. కానీ గుళ్ళు లేవు రాత్రులందు దొంగలు వేటకుక్కలను (జాగిలములు) నాపైకి ఉసికొలిపి సరుకుల నెత్తికొనిపోవుచున్నారు. మీరు Bullets ఇచ్చినచో నేనా దొంగల పని పట్టెదననెను. విక్టరుకానూగారు కొంత సేపు ఆలోచించి, రెండు చిన్నసైజు సత్యసాయిబాబాగారి ఫోటోలనిచ్చి, "ఇవే Bullets, తుపాకిగుళ్ళు" నీ పైకి దొంగలుగాని, కుక్కలుగాని వచ్చినప్పుడు ఈ తుపాకి గుళ్ళను వారికి చూపించి, "సాయిరాం, సాయిరాం" అని శబ్దము చేయుమని ఉపదేశించెను. ఆతడు మిలటరీలో రిటైర్డైన వ్యక్తి అగుటచే ఇవి తుపాకి గుళ్ళేమిటని చాలా కోపించి, యజమాని ఇచ్చిన ఫోటోలను జేబులో పెట్టుకొని వెళ్ళిపోయెను.

ఆ రాత్రి అతడు స్కూలు బిల్డింగునకు కాపలా కాయుచుండగా దొంగలు వేటకుక్కలను అతనిపైకి ఉసిగొల్పిరి. అతడు చేయునదిలేక తన జేబులోని 'సత్యసాయి' ఫోటోలను తీసి ఆ కుక్కలకు చూపించి "సాయిరాం, సాయిరాం" అని అరచెను. వెంటనే ఆ కుక్కలు, అతనిని తరుముట మాని, ముందు కాళ్ళు అతని గుండెలపై వేసి మూతితో ఆ ఫోటోలను వాసన చూసి, నాకి, తోకాడించుచూ వెనుదిరిగి తమ యజమానులనే దూరముగా తరిమివేసింది. ఇది గమనించిన సెక్యూరిటీగార్డుకి ఆశ్చర్యము వేసెను. వెంటనే అతడు తన యజమాని 'విక్టర్‌కానూ' గారిని సమీపించి "పెద్ద బులెట్స్" (Big Size Bullets) ఇమ్మని ప్రార్థించెను.

ఆయనకు అర్థము కాలేదు. ఆతడు జరిగినదంతా వివరించి పెద్దసైజు సాయి ఫోటోలు కావలయునని కోరెను.

స్వామి సర్వవ్యాపకతకూ, సర్వశక్తివంతమునకూ, దైవశక్తికీ ఇంతకు మించిన తార్కాణమేమి కావలయును. విక్టర్‌కానూగారు వ్రాసిన The God in Carnate అన్న గ్రంథమును చదివిన ఇంతకు మించిన అద్భుతమైన స్వామి అనుగ్రహము లెన్నో మీకు బోధపడగలవు. భార్య ఆరోగ్యము సహితము విస్మరించి, నిస్వార్థతతో ఆయన అహోరాత్రములు EHV ప్రణాళికలలోనే కృషి చేయుచూ స్వామిచే త్వరలో 2000 సం॥ నుండి తీసికొనరాబడు శ్రీ సత్యసాయి శకమునకు ముఖ్య వైతాళికుడుగా పనిచేయుచూ ఆనందించుచున్న అదృష్టవంతుడు. ఇట్టి అవతార పురుషునికి సమకాలికులుగా పుట్టిన అదృష్టవంతులమైన మనమందరమూ కూడా నేటినుండి వారి చేతిలో పనిముట్లుగా ఉపయోగపడుచూ సంఘసేవకు నడుము కడదామా మరి! జై సాయిరాం!

*నవంబరు - 1993*



# సాయి శక్తి అనంతం

*"సాయి శక్తి అనంతము, అపారము. సర్వశక్తులూ సాయి అరచేతి యందున్నవి. 'తమకు అన్నియు తెలుసు' అనుకొనే పండితుడు, యోగులు, జ్ఞానులు - వీరందరూ ఆ మహాశక్తిలో అత్యల్పభాగాన్ని మాత్రమే అర్థం చేసుకోగలిగారు. అన్ని యుగములలోనూ ఇదే పరిస్థితి. శారీరకంగా అవతార పురుషునికి సన్నిహితముగా ఉండవచ్చును. కానీ, అట్టివారు తమకు దొరికిన లబ్ధిని గుర్తించి, వర్తించలేకున్నారు. పైగా నా మహిమలను గురించి అతిశయోక్తులుగా చెబుతారు. ఇవన్నీ నా విభూతితో పోల్చిన, ఏనుగుతో పోల్చిన దోమవంటిది. అందుచేత, నా నిజ తత్వమును మరచి, మీరు ఈ మహిమలనే పలుకుచుంటే, నాలో నేను నవ్వుకుంటుంటాను. మహిమలను గురించి అంత ప్రాముఖ్యత నివ్వవద్దని హెచ్చరించుచున్నాను. వీటన్నిటికన్న అతి ప్రధానమైన శక్తి నాలో ఒకటి ఉన్నది. అదే నా ప్రేమ".*

**- బాబా**

# థాయిలాండ్ కాదు - సాయిలాండ్

కొమరగిరి కృష్ణమోహనరావు, మచిలీపట్నం

భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారి ఆదేశంపై థాయ్‌లాండ్, హాంకాంగ్, జపాన్‌లు పర్యటించివచ్చిన తరువాత ప్రశాంతినిలయంలో గురుపూర్ణిమ సందర్భమున జరిగిన సభలో శ్రీ అనిల్‌కుమార్‌గారు ప్రసంగిస్తూ **"థాయిలాండ్ కాదు సాయిలాండ్"** అన్నారు. టోక్యోలో జరిగిన Spirit & Spirituality అనే విషయం మీద జరిగిన సెమినార్‌కు వారు హాజరైనారు, ఆ దేశస్థులు స్వామి భజనలు ఎంతో మధురంగా శృతిలయబద్ధంగా చేయటమేగాక ఎంతో పారవశ్యంతో చేయటం ఆశ్చర్యకరమైన అనుభూతి అన్నారు. మూడు గంటలపాటు జరిగిన ఆ సెమినార్ ఆఖరిలో హారతి యిచ్చేటప్పడు బాబా ఫోటో నుండి విభూతి పొంగి పొరలివచ్చి సభికులను ఆశ్చర్యపరచింది. అంతేకాదు బాబా పటమునంతను ఆవరించుకొని ఒక నీలి వెలుగు కన్పించడం విశేషం. అనేకమంది వీడియో కెమెరాలతో ఆ విశేష ఘట్టమును ఫొటోలు తీసుకున్నారు.

బాంకాక్‌కు 200 మైళ్ళ దూరంలో ఆ దేశస్థులు "పుట్టపర్తి" లాంటి ఒక గ్రామాన్ని నిర్మించారుట. ఇక్కడ ఏవిధంగా ప్రశాంతి నిలయంలో స్వామి మందిరం వగయిరాలు, చిత్రావతి నది ఉంటుందో, ఏ మాత్రం తేడా లేకుండా ఉన్న అక్కడి పరిసరాలను చూచి ఊహించలేని ఒక ఆశ్చర్యకరమైన విషయమంటారు శ్రీ అనిల్‌కుమార్.

"సాండీతమ్" అనే ఒక చైనా మహిళ ఒక పెద్ద కొండనే కొనివేసి, దానిమీద ఒక చక్కటి సుందరమైన సాయిమందిరాన్ని కోట్ల డాలర్లు ఖర్చుచేసి నిర్మించింది. అందులో ముందర గణేశుని విగ్రహం, తరువాత భజన మందిరం ఉన్నది. ఆమె ప్రత్యక్షంగా పుట్టపర్తి రాలేదు, బాబాను చూడలేదు. అచటనే మిస్ జూడే అనే ఆమె ఇంకొక సాయిసెంటర్ కూడా నడుపుతున్నది. లండన్‌లో బారెట్లా చదివిన లాయర్ "జాన్‌హోం" హాంకాంగ్‌లో ఉన్న పెద్ద సౌధంలో ఉన్న 19వ అంతస్థులోని తన ఇంటికి శ్రీ అనిల్‌కుమార్‌ను ఆహ్వానించి, గదిలోనికి వెళ్ళేముందు శ్రీ సత్యసాయిని ప్రార్థించి లోపలికి వెళ్ళుదామని ఆయన అనటం అనిల్‌కుమార్‌ని ఆశ్చర్యపరచింది. అచట మూడు పటాలు ఉన్నాయి బుద్ధుడు, కృష్ణం, సాయిబాబా పటములనుండి విభూతి, రత్నాలు రావడం చూచి అనిల్‌కుమార్ ఆశ్చర్యపడినారు. కోబేలో జరిగిన సెమినార్ చివరి రోజున బాబాకు హారతి యిస్తుండగా తేనె ధారగా బాబా ఫోటో నుండి ప్రవహించింది, దానిని వందలాది మంది భక్తులు అమృతంగా భావించి సేవించారు.

ఆ పర్యటన సందర్భంలో ఎంతోమంది భక్తులు తమ తమ అనుభూతులను, అనుభవాలను వివరిస్తుంటే నా హృదయం తన్మయత్వంతో పరవశించిందంటారు

అనిల్‌కుమార్. డా॥ రత్నాబే అనే జపనీయుడు స్వామిని పుట్టపర్తిలో సందర్శించి 'Man of Miracles' అనే గ్రంథమును జపాన్ భాషలోనికి అనువదించాడుట. దానిలో "పుస్తకాలలో వర్ణించలేము, పుట్టపర్తి పోయి చూచి రావలసిందే" అని వ్రాశాడుట. ఒసాకాలోని "సుకూరా' అనే మహిళ ఉబ్బసంతో చాలాకాలం బాధపడుతూ పుట్టపర్తిలో స్వామిని ఒకసారి దర్శించుకుంది. స్వామి వరుసలలో కూర్చొని ఉన్న భక్తులను చూస్తూ వెళ్ళుతూ దగ్గుతున్న ఆ మహిళను చూచి "దగ్గబోకమ్మా" అంటూ వెళ్ళారుట. ఆ ఒక్కమాట తోనే ఆమె దగ్గు తగ్గిపోయిందని చెప్పింది. 'సకహషి' అనే ఆయన హమామత్సులో ఉంటాడు. ఆయన స్వామిని ఎప్పడూ చూడలేదు అయినప్పటికీ స్వామి పటమును చూచి తన హృదయంలో తలచుకుంటే చాలు "కలతతీర్చు" నంటాడు కవారా, యుషీమా దంపతులు అక్కడ బాలవికాస్ గురువులు. బాబా బోధనలు చదివి సిగరెట్టు, మత్తుపదార్థములు సేవించటం లాంటి దురలవాట్లను వదలివేశానంటాడు. 'కవారా' భార్య యుషీమా వంట చేస్తుంటే బట్టలు నిప్పంటుకున్నాయి. స్వామిని ప్రార్థించేసరికి మంటలు ఆరిపోయినాయి. కాలినచోట నొప్పిగా వుంటే స్వామి విభూతి సేవించేటప్పటికి ఆ కాస్త బాధ మటుమాయమయిందని "యుషీమా" అనే మహిళ చెప్పింది. తోతోరీలో "సెయింట్ జాకీ" అనే బేస్‌బాల్ ఆటగానికి బంతి కంటికి తగిలి చూపు పోయిందట. డాక్టర్లు ఇక చూపు రాదన్నారు. జాకీ జ్యోతిని వెలిగించి, స్వామి పటమునకు చూపించి, విభూతి తీసుకొనగానే దృష్టి వచ్చింది. స్వామిని దర్శించని ఎందరో భక్తులు, వర్షంలో కూడా నృత్యం చేస్తూ సాయి భజనలు భక్తి శ్రద్ధలతో చేస్తుండటం అందరినీ అక్కడ ఆశ్చర్యపరుస్తుంటాయి. రెండవ ప్రపంచయుద్ధంలో హిరోషిమాలో లక్షలాది మంది మరణించారు. బ్రతికిన కొద్దిమందిలో "మిస్ హితో" ఒకటి. తనను బాబానే ఆ సమయంలో రక్షించాడనే భక్తి విశ్వాసాలతో నేటు ఆమె అక్కడ సత్యసాయి సంస్థలను నడుపుతున్నది.

ఈ విధంగా ఎందరో అక్కడ భక్తి శ్రద్ధలతో బాబాను ఆరాధిస్తున్నారు. సేవా కార్యక్రమాలలో పాల్గొంటున్నారు. బాబా మందిరాలను నిర్మిస్తున్నారు. కాని వారిలో చాలామంది ప్రత్యక్షంగా బాబాను దర్శించనివారే. అయినప్పటికీ వారు బాబాను ఫోటోలో చూస్తున్నారు, ఆరాధిస్తున్నారు, అనుభూతిని పొందుతున్నారు. తన్మయత్వంతో చిందులు వేస్తున్నారు. పారవశ్యంతో భక్తిగీతాలను ఆలపిస్తున్నారు. భగవాన్ బాబా అనుగ్రహమును నిండుగా, దండిగా పొందుతున్నారు. అయితే మనం ఈనాడు భగవాన్ బాబాను ప్రత్యక్షంగా చూస్తున్నాము గాని అటువంటి అనుభూతిని మాత్రం పొందలేకపోతున్నాం. దీనికి కారణమేమిటో? ఆత్మ విమర్శన చేసుకోవాలి.

సెప్టెంబరు - 1992

# ఆపద్బాంధవాయ నమః

వి.ఎస్.పి. పళ్ళంరాజు, వానపల్లి, తూ॥గో॥ జిల్లా

మానవులకు ఆపద లెప్పడూ ఆకస్మికముగా వస్తాయి. అయితే ఆపదల నుండి భక్తులను తప్పక రక్షిస్తానని 'భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారి అభయవాణి'. పలురకములు అయిన ఆపదల నుండి శ్రీ స్వామి నిజ భక్తులను తప్పించిన సంఘట నలు పెక్కులున్నవి. అందులో నా అనుభవం ఒక్కటి ఈ క్రింద వ్రాయుచున్నాను.

మాది తూర్పు గోదావరి జిల్లాలో వానపల్లి అనే ఒక అందమైన గ్రామం. ఈ గ్రామ దేవత "పళ్ళాలమ్మ". మా ఊరిలో చాలామంది పిల్లలకు అమ్మవారి పేర్లు పెట్టడం ఒక ఆనవాయితి. ఆడవారికి "పళ్ళాలమ్మ" అని, మగవారికి "పళ్ళంరాజు" అని పేర్లు పెడతారు. నా పేరు కూడా "పళ్ళంరాజే"

మా కుటుంబ సభ్యులందరికి "బాబా" అంటే చాలా యిష్టం. బాబా వారంటే మాకు అత్యంత గౌరవం. ప్రతి గురువారం మా ఇంటిలో సాయి భజనలు స్వామి వారి దివ్య ఆశీస్సులతో నేటికీ జరుగుతూనే ఉన్నాయి.

అది 1990వ సంవత్సరం. నేను 9వ తరగతి చదువుకుంటున్నాను. అప్పడు నా వయస్సు 14సం. నాకు కరెంటు పని అంటే చాలా యిష్టం. మాకు శెలవు వచ్చినప్పడల్లా మాకు తెలిసిన వ్యక్తితో వెళ్ళి ఇంటి వైరింగ్ చేస్తుంటే నేను చూచేవాడిని. అప్పడు మా అన్నగారు శ్రీ వి. సుబ్రహ్మణ్యశర్మ పుట్టపర్తి వెళ్ళి శ్రీ సత్యసాయి బాబాగారి ఉపన్యాసం, స్వామి పాడిన భజన పాటలు రికార్డు చేసిన ఒక మంచి క్యాసెట్టు తెచ్చినారు. ఆ క్యాసెట్టును టేపు రికార్డ్‌లో పెట్టి నేను చాలా సార్లు విన్నాను. అయినా నాకు తనివి తీరలేదు. ఆ క్యాసెట్టును ఇంకా వినాలనే కోరిక నాలో ఉండేది.

అది 2-11-1990. కార్తీక పౌర్ణమి రోజు రాత్రి గం॥ 7-30 ని॥లకు ఆ క్యాసెట్ వినాలనిపించినది కానీ టేప్ రికార్డు వైరు కనిపించలేదు. అప్పడు నేను మామూలు 5 మీటర్లు పొడవుగల కరెంటు వైరు ఒకటి తీసుకొన్నాను. నా వద్ద ప్లగ్‌పిన్స్‌లేవు అందువలన ఆ వైరును బోర్డు ప్లగ్‌లో పెట్టి రెండవవైపున దానిని టేపు రికార్డుకు పెడితే అది పలుకుతుందనే భావంతో తొందరలో ఆ కరెంటు వైరును ప్లగ్‌లో పెట్టి రెండవది టేపుకు కలుపకుండగానే స్విచ్ వేసితిని.

వెంటనే ఆ కరెంటు వైరు ఎడమ చేతిని తగిలి నన్ను దహించి వేయసాగినది. ఇది చూచిన మా సోదరి వెంటనే "సాయిరాం..సాయిరాం..." అంటూ నన్ను నా చేయి పట్టుకుని లాగింది.

ఆశ్చర్యంగా ఆవైరు నన్ను వదలివేసింది. తరువాత నేను తెలుసుకున్నది ఏమిటి అంటే ఆ వైరులో నుంచి కరెంటు నా శరీరములోనికి వచ్చినదని. అయితే ఆ సమయంలో నేను, నన్ను తాకినవారు కూడా ప్రాణాలతో బ్రతకడం అసాధ్యం. కానీ స్వామి దివ్యానుగ్రహముతో నేను నా సోదరి (సర్వేశ్వరి) ఆ ప్రమాదం నుండి బయటపడినాము.

అయితే మా అక్కగార్కి రెండు వేళ్లు కొద్దిగా కాలినాయి. నాకు మాత్రం అప్పుడు ఏమీ తెలియలేదు. నా ఎడమ చేతిపై ఆ కరంటు షాకు వల్ల ఒక మచ్చ ఏర్పడి ఇప్పటికీ అది ఉంది.

స్వామి అష్టోత్తరంలో "ఓం శ్రీ సాయి ఆపద్బాంధవాయ నమః" అని ఉన్నది స్వామి నిజముగా నిరూపించి నాకు చూపించినారు.

*నవంబరు - 1992*



# దైవచింతన, అన్యచింతన

*"మేము ఏన్నో సంవత్సరాలనుండి ఆశ్రమంలో (ప్రశాంతినిలయం) ఉంటున్నాం. కాని, మాపై స్వామి అనుగ్రహమేమీ రాలేదు" అని కొందరు అనుకోవచ్చు. ఇది ఎట్లున్నదంటే 60సం॥ యజ్ఞం చేసిన ముసలివాని పరిస్థితి వలె ఉన్నది. ఇన్ని సంవత్సరాల నుండి ఆశ్రమంలో ఉంటూ ఏమి చేస్తున్నావు? లోకాభిరామాయణాన్ని చింతిస్తున్నావుగాని, దైవ చింతన ఎంత చేస్తున్నావు? ఆశ్రమంలో వున్నా, అది మీకొక శ్రమనే! ఆశ్రమం యొక్క నియమాలను, పద్ధతులను ఎంతవరకు పోషించుకుంటున్నావు? దేహం ఆశ్రమంలో..... బుద్ధి బజారులో...... ఇది సరియైనది కాదు. ఇదే నాకు కావాలి. నీ తలలోనికి దైవ చింతన తప్ప అన్య చింతనలేవీ చేర్చకూడదు"*

**- బాబా**

# సర్వాంతర్యామి - సాయి భగవాన్

డా॥ ముదిగొండ వీరభద్రయ్య, హైదరాబాద్

భగవంతుని యొక్క సర్వాంతర్యామిత్వాన్ని తెలిసికొనలేనినాడు మనిషి భ్రష్టుడౌతాడు. దాన్తో ప్రపంచంలో అశాంతి తీవ్రరూపంలో కార్చిచ్చులా వ్యాపిస్తుంది.

భక్తుడైనా భగవంతుణ్ణి కేవలం తన ఇంట్లోని పూజ గూటిలో, ఒక విగ్రహంగా మాత్రమే భావిస్తే, అతడు నాస్తికుని కన్నా ఎన్నో అడుగులు ముందుకు పోయినట్లు కాదు. మానవుడు తనలోనూ, తన చుట్టూతా ఇతరులలోనూ భగవంతుని అస్తిత్వాన్ని గ్రహించగలిగిననాడు అతని జీవితానికీ అది సుదినం అవుతుంది. ప్రపంచానికీ అది సుదినం అవుతుంది.

భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారు ప్రపంచం మొత్తంలో అనేకుల ఇండ్లల్లో తమ ఉనికి ఈ సర్వ విశ్వవ్యాప్తమని నిరూపిస్తూ అనేక లీలలను, మహిమలను చేస్తున్నారు. 1964లో ఒక సిద్ధపురుషుణ్ణి ఒక పత్రికా సంపాదకుడు భారతదేశంలో 'ఆయన లాంటి సిద్ధులెంతమంది ఉన్నారు?' అని అడిగితే నాలుగు లక్షలన్నాడు. 1964 సం॥నికి భగవాన్ విభూతులు స్వామి పటాలనుంచి పడుతున్న భక్తుల ఇండ్ల సంఖ్య నాలుగు లక్షలని ఒక అంచనా.

భగవాన్ విభూతులు అనేక రకాలు-కైలాసభస్మం, దివ్య వస్తువులైన భగవన్మూర్తులు, ఉంగరాలు, పతకాలు మొ॥నవి, స్వామి సందేశాలున్న లేఖలు, ధనం, ఇత్యాదులు.

ఇవి కాకుండా మనల్ని ఆశ్చర్యపరచి, మార్గ దర్శనంచేసే సంఘటనలు వేరే. ఇలాంటి వాటికి వేటికీ కూడా హేతువులు దొరకవు. స్వామే వాటికి హేతువు. ఎక్కడో పుట్టపర్తిలో ఉంటూ మన ఇళ్లల్లో ఇవి జరగడంలో ప్రయోజనం ఏమిటి? అని ప్రశ్నించుకొంటే స్వామి సర్వాంతర్యామిత్వనిరూపిణే ఇందులో ప్రధానమని పిస్తుంది. మరొక పరమ ప్రయోజనం, భక్తులకు ఆనందాన్ని కలిగించడం కూడాను. వేయి జన్మలెత్తినా మామూలు క్రమంలో సాధించలేని ఆనందాన్ని భగవాన్ లీలలు, వారి అనుగ్రహం చేత, ఈ జన్మలోనే బ్రహ్మానంద రుచిని భక్తులకు అనుభవంలోకి తెస్తాయి. భగవాన్ లీలలు జరుగుతున్న ఇండ్లల్లోని వాళ్లు, ఊరకే, నిశ్చైతన్యంగా, స్పందన ఏ మాత్రమూ లేకుండా స్తబ్ధంగా ఉండడాన్ని మనం చూడలేము.

నా లీలలు ప్రదర్శనానికి కావు నిదర్శనానికి అని భగవాన్ ఎంతోకాలం క్రితమే సెలవిచ్చి ఉన్నారు. దేని నిదర్శనానికి అని ప్రశ్నించుకొంటే, వారి సర్వాంత ర్యామిత్వ నిదర్శనానికి అన్న సమాధానం అనుభవంలో అందరికీ తోచేదే.

ఒక స్వామి భక్తుని ఇంట్లో దేవీ నవరాత్రుళ్ళ సందర్భంలో నేను దేవీ భాగవతాన్ని పాడ్యమి నుండి ప్రారంభించాను. పాడ్యమి, విదియ, తదియ, చవితి తిధులలో పారాయణం జరిగింది. తర్వాతి రోజున పారాయణానికి ముందు అనుమానం వచ్చింది. ఇవ్వాల్టికి ఎన్ని రోజుల పారాయణం జరిగిందని? ఆ అనుమానాన్ని అట్లాగే ఉంచి, గ్రంధాన్ని నిన్న ముగించినచోట తెరిచాను. అక్కడ ఐదు ఎండుద్రాక్షలు కొంత కుంకుమ ఉన్నాయి!! ఆశ్చర్యమూ, ఆనందాలతో పాటుగా, బుద్ధికి స్వామి నా అనుమానాన్ని తీర్చేట్లు ఇస్తున్న సమాధానం కూడా తోచింది. 5 తిధులు గడిచాయని. కాని నిజానికి గడిచినవి నాలుగుతిధులే. ఐతే నాలుగు పంచాంగం చూస్తే రోజుల్లో ఐదుతిధులు గడిచాయి! ఒక రోజున తిథి ద్వయం వచ్చింది. లీలామానుషవిగ్రహుడు చూపే లీలల్లో రవ్వంత దోషం కూడా ఉండదు. ఉండటానికి వీలులేదు.

ఒక రోజున నగర సంకీర్తనానికి వెళ్ళకుండా, తెల్లవారుఝామునే, పూజగదిలో, స్వామి పటం ముందర వీణ మీద 'నమః పార్వతీ పతియే హర హర' ఇత్యాది స్వామి భజనలు వాయించుకొన్నాను. ఆనాడు సాయంత్రం ఇంకొక మిత్రుని ఇంటికి భజనకు వెళ్ళాను. అక్కడ అందరిముందు, అందరు చూస్తుండగా సింహాసనంలోని స్వామి పటం యొక్క ఫ్రేములోని పై పట్టీ నుంచి కింది పట్టీవరకు ఒక విభూతి పొట్లం అద్దం మీదుగా జారింది. ఆ పాకెట్‌ను పట్టుకొని చూస్తే ఒక వైపున "వీరభద్రయ్యా నీవీణ వింటున్నా" అని ఉంది. ఇది ఎంత ఆశ్చర్యకరమైన సంఘటనో చెప్పనక్కరలేదు. మనం ఎంత రహస్యంగా ఒక పనిని చేసినా, అది స్వామి దగ్గర రహస్యంగా ఉండదు. కారణం మన రహస్యపు లోతులలోనే అంతరాంతరాళాల్లో స్వామి ఉంటారు కాబట్టి.

కేవలం సంఘటనలే కాదు, పనులే కాదు, స్వామి మన అంతరాంతరాళాల్లో మన భావించే భావనల్ని, ఊహల్ని కూడా మనకు తెలిపి వారి సర్వాంతర్యామిత్వాన్ని పరోక్షంగా రూపణని ఇస్తుంటారు.

భగవాన్ అనుగ్రహించిన ఒక ఇంటర్వ్యూలో "స్వామీ! నా భార్య..." అని నేను అంటూండగానే "అవును, నాకు తెలుసు, ఆంజినా పెక్టోరిస్ అనే హృద్రోగంతో బాధపడ్తోంది, భయపడవద్దని చెప్పు. నేనొకటిస్తాను (అని ఒక కైలాస లింగాన్ని సృష్టించి చేతిలో ప్రసాదించారు) రోజూ అభిషేకం చేసి తీర్థమియ్యి, తగ్గిపోతుంది" అన్నారు.

ఇంకా ఇలా మనస్సులో కల్గుతున్న అనేక సందేహాలు, ఆలోచనలూ, వారికి తెలుసునన్న నిరూపణ లభించేట్లుగానే సంభాషణ నాతోనూ, ఇతరులతోనూ స్వామి తమ అనుగ్రహ భాషణ భాగ్యం కలిగించారు.

"స్వామీ అవతల మా..." అని అంటూండగానే "నీ పిల్లలిద్దరు అవతల కూర్చున్నారు. నేనే రావద్దన్నాను. వాళ్ళకక్కడ (కాలేజీలో) సీట్లు ఇవ్వలేము" అన్నారు. ఐతే ఆ తర్వాత వాళ్ళల్లో ఒక్కడికి బి.ఎస్‌సి. అయినా పూర్తికాక ముందే మంచి ఉద్యోగం వచ్చింది. మరొకడికి ఇంజనీరింగ్‌లో మంచి శాఖలో సీట్ వచ్చింది. అసలు విషయం ఇదన్నమాట.

ఇదంతా స్వామి దేహ సమక్షంలో! అక్కడెంతో, మన ఇళ్ళల్లోని పటాల ముందు, అవి లేనప్పుడున్నూ అంతే. మన మనస్సులో అనుకుంటే చాలు, అది స్వామికి అందుతున్నది. స్వామీ మీకు పూజచేసినట్లే, ఒకసారి శ్రీశైలంలో మల్లికార్జున స్వామికి పూజ చేయాలనుంది. అవకాశమీయరా? అని ఒక రాత్రి పూజ గదిలో అనుకొన్నాను. సరిగ్గా ఆ మర్నాడే శ్రీశైలం నుంచి ఒకరు వచ్చి మీరీ శివరాత్రి ఉత్సవాలలో శ్రీశైలంలో ఉపన్యాసమివ్వాలని దేవస్థాన యాజమాన్యం కోరుతోంది. రండి అని ఆహ్వానించారు.

గుండె లోతుల్లో, మనస్సుల్లో, బుద్ధిలో, ఎక్కడ ఒక ఊహ మనకు తెలిసికాని, తెలియకకానీ, వచ్చినప్పటికీ, అది స్వామికి చేరితీరుతుంది. స్వామికి చేరడం అని రాయడం కూడా తప్పే. ఎక్కడో ఉంటే చేరడం. ఇక్కడే, మనలోనే, (మనమే) ఉంటే చేరడమేమిటి? ఊహా, భావముల ఉత్పత్తిస్థానమే సాయీశ్వరుడి పీఠం. అది మనలోనే ఉన్నది. ఈ విషయ నిరూపణకే స్వామి చేసే లీలలు, మహిమలు. నిజం చెప్పాలంటే, స్వామి వీటిని చేస్తారా? లేక అవి జరుగుతాయా? స్వామి లీలలు సహజ సంభవాలు. అవి మనలో జ్ఞానం కల్గడానికి, స్వవిమర్శ దృష్టి కల్గడానికి కారణాలు. ఇవి మనల్ని ఏ లక్ష్యానికి చేరుస్తాయో విజ్ఞులకు, సాధకులకు నావంటివాడు చెప్పాల్సిన పనిలేదు.

*నవంబరు - 1991*



*"మనం బానిసలం కాకూడదు. పశువులు బానిసలై ప్రపంచానికి అణిగి మణిగి ఉంటున్నాయి. మానవుడు మాధవుడుగా, నరుడు నారాయణుడుగా మారి ఈ ప్రపంచాన్ని పాలించాలి. జగన్నాయకుడుగా తయారు కావాలి. పశువుగా కాక పశుపతికావాలి. పరమేశ్వరుడుగా తయారుకావాలి. అందుకు తగిన విద్య ఈనాడు అభ్యసించాలి. అదే ఆధ్యాత్మిక విద్య. 'ఆధ్యాత్మవిద్యా విద్యానాం' అది ఎన్ని విద్యలకు తలమానికము"*

**- బాబా**

# సత్యసాయి దివ్యలీలలు

ఆదూరి శ్రీనివాసరావు, కావలి

బాలసాయిని కరణం సుబ్బమ్మ చిన్నప్పటి నుండి ఎంతో ప్రేమతో, భక్తితో సాకింది. కరణం సుబ్బమ్మ భర్తకు యిద్దరు భార్యలు. వారు సుబ్బమ్మ, కమలమ్మలు. భర్త మరణ కారణంగా వారు ఎంతో దుఃఖిస్తుంటారు. స్వామివారిని పరామర్శించ టానికి వెళ్ళి 'భర్తను చూడాలని వుందా?' అని అడుగుతారు. స్వామి హాస్యం ఆడుతున్నారని వారు మౌనం వహిస్తారు. "నా మాటలమీద నమ్మకమున్నట్లయితే, ఆ తోటలో వెనుకవైపు చూడండి!" అంటారు స్వామి. వారు వెళ్ళి చూచి అమితాశ్చర్య పడుతారు. చనిపోయిన భర్తను మానవ రూపంలో చుట్టత్రాగుతున్నట్లు కళ్ళార చూచి, భయపడుతూ పరుగెత్తికెళ్ళి స్వామిని ఇక మీదట అలా చూపవద్దని ప్రాధేయపడుతారు.

స్వామివారు తలచుకుంటే చనిపోయిన వారిని సహితం మానవాకారంతో చూపగల దివ్యశక్తి సంపన్నులు.

సెప్టెంబర్ - 1991

స్వామివారు నివసించే పరిసర ప్రాంతంలో వుండే ఒక స్త్రీ స్వామికి విషం పెట్టాలనే దుర్బుద్ధితో స్వామిని, వారి బృందాన్ని "టీ" కి రమ్మనమని ఆహ్వానిస్తుంది. స్వామి బృందానికి మంచి వడలు యిచ్చి, స్వామికి మాత్రం విషం కలిపిన రెండు వడలు తినటానికి యిస్తుంది. స్వామి వాటిని ప్రీతిగా తింటారు. తరువాత కరణం సుబ్బమ్మ ఇంటికి వస్తారు. ఆ విషం పెట్టిన స్త్రీ కూడా అక్కడకు వస్తుంది. సుబ్బమ్మ ఇంటిలో స్వామి వాంతి చేసుకుంటారు. అయితే తిన్న రెండు వడలు అదే ఆకారంలో కక్కివేస్తారు స్వామి. భయకంపితురాలై విషం పెట్టిన ఆ స్త్రీ స్వామి పాదాలమీద పడుతుంది. స్వామి కరుణా హృదయంతో ఆమెను క్షమిస్తారు. అప్పుడు స్వామికి 15 సంవత్సరాల వయస్సు మాత్రమే.

భగవంతునికి ద్వేషము లేదు, ప్రతీకార కాంక్షలేదు. అందరినీ ప్రేమించటమే సాయి లక్షణం.

అక్టోబరు - 1991



# సర్వాంతర్యామి బాబా - నా అనుభూతి

- జి. పార్వతి, విశాఖపట్నం

స్వామి ఎప్పుడూ మీ వెంట, జంట, ఇంట, కంట ఉంటాను అని అంటూ ఉంటారు. అది నిజము అని నాకు కలిగిన అనుభవం నాతోటి సోదర, సోదరిసాయి భక్తులకు చెప్పాలని నా ఈ చిన్న ప్రయత్నము.

15 సంవత్సరముల క్రితం ఈ ఊరిలోనే మా బావగారు కూడా ఉండేవారు. వారి ఇంటిలో స్వామి ఫోటో నుంచి అమృతం వచ్చినది. అది వెళ్ళి చూడడానికి నాకు అవకాశము కలుగలేదు. ఎందుకంటే అప్పుడు మా వారికి ఆరోగ్యం బాగులేదు. నేను చూడలేక పోయినానని చాలా బాధపడ్డాను అది తలచుకుని జీవితంలో ఏది అనుకున్నా జరగదు అని అందరినీ విసుక్కుని, కూచుని బాధపడుతున్నాను. ఇంతలో 5 నిముషముల సేపు కళ్ళకు ఇంక ఏమీ కనిపించకుండా అదో రకమైన వింత కాంతి మాత్రం కనపడినది. తరువాత మళ్ళీ మామూలు స్థితికి వచ్చాక ఏమిటి ఇలా జరిగింది, అని అనుకున్నాను. గాని అప్పట్లో అది భగవంతుని లీల అని తెలుసుకోలేకపోయినాను. తరువాత ఆ అనుభూతిని తలుచుకుంటే అప్పుడు అర్థమయినది.

ఆ తరువాత అక్టోబరు 1990లో జ్యోతి స్వరూపుడు విశాఖపట్నములో ఇంటింటికి వచ్చినప్పడు అందరూ అ జ్యోతితో ఫొటోలు తీయించుకున్నారు. ఆ సంగతి మాకు తరువాత తెలిసింది. అప్పటికి జ్యోతిస్వరూపుడు మా ఇంటికి వచ్చి వెళ్ళిపోయారు. మాకు ఫోటో లేదు. నేను మావారితో ఘర్షణపడ్డాను. అందరికి ఉన్నాయి ఫోటోలు, మనకే లేవని. ఇది జరిగిన నాలుగు రోజులకి మా ఇంట్లో ప్రతీనెలా భజన మామూలుగా జరిగింది. ఆ రోజున దుర్గాష్టమి పండుగ. ఆ సమయంలో మాఊరిలో శ్రీ సత్యసాయి విద్యావిహార్‌లో వేదపురుష సప్తాహజ్ఞాన యజ్ఞం జరుగుచున్నది. అది చూడడానికి మేము మందిరానికి వెళ్ళినాము. రాత్రి జరిగిపోయింది. మరునాడు మామూలుగా స్వామికి నమస్కారం చేసుకున్నాము. సాధారణముగా ఇంట్లో భజన జరిగేటప్పడు స్వామికి ఒక కుర్చీ వేస్తాము గదా! పండుగ గదా అని మేము భజన అవగానే స్వామి ఫోటోలు, కుర్చీ మామూలుగా ఎప్పడూ తీసేసే విధంగా తీయకుండా ఉంచాము. అందుకని మరునాడు హాలు లోనికి వెళ్ళి క్రితంరోజు భజన జరిగిన చోట స్వామికి నమస్కారం చేసుకుని కళ్ళు తెరవగానేస్వామి కుర్చీ పైన వేసిన రుమాలు మీద స్వామి పాదముద్రలు కనపడ్డాయి. ఆ సంగతి మా పెద్ద అమ్మాయి చూసి "రుమాలు మీద నీవు చేయిపెట్టి పూలు

తీసేవా" అని అడిగింది. "లేదు" అని నేను చెపితే ఆ విషయం తండ్రికి చెప్పింది. ఆయన చూసి, "నీవు స్వామి మన ఇంటికి రాలేదని బాధపడుతున్నావు కదా, అందుకని స్వామి వచ్చేరు" అని అన్నారు. ఇప్పుడైనా ఒక ఫోటో స్వామి కుర్చీకి తీయించమని నేను మళ్ళీ మా వారిని గట్టిగా అడిగాను. మావారు మళ్ళీ విసుక్కున్నారు. ఆ రోజు ఆదివారం సెలవు గదా, ఎక్కడ నుంచి వస్తాడు ఫోటోగ్రాఫరని, అదీ నిజమేనని సరిపెట్టుకున్నాను. కాని భగవంతుని సంకల్పం చూడండి, ఆ రోజు ఆదివారమే కాకుండా, సాయంకాలము కూడా అయిపోయింది. నాతో అలా అన్న తరువాత ఆయన బయటికి వెళ్ళినారు. అనుకోకుండా ఒక స్టూడియో తెరచేఉంది. పైగా పిలవగానే వచ్చినాడు ఫోటోగ్రాఫరు. అతనికి కూడా ఫోటో తీస్తే సరిగ్గా ఆ ఆనవాళ్ళు వస్తాయో, రావోనని సంశయం కలిగింది. ఏదైతే అది అయింది, మీరు వచ్చేరు కదా, ఫోటో తీసేయండి అన్నాను నేను. సరే అని ఫోటో తీస్తే అందులో స్వామి పాదాలకి బదులుగా 'S' అని పడింది చూసారా భగవంతుడు నా దగ్గరే ఉన్నాడు అని అనడానికి ఇంతకన్నా ఏ విధమైన అనుభూతి కావాలి? నా సంశయాత్మకమైన మనస్సు 'S' గుర్తును, స్వామి ఎల్లప్పుడూ నా వెంట, జంట, కంట, ఇంట ఉన్నారు, ఉంటారు అని విశ్వసించడానికే ఆయన ఈ విధంగా ఆయన కొరకు ఏర్పాటు చేసిన కుర్చీమీద ఉంచిన రుమాలుపై పడేటట్లు చేసారు. ఇది జరిగి అయిదు నెలలు అయినది. ఇప్పటికి ఆ రుమాలు మీద చిన్న ఆనవాలు ఉన్నది. అది ప్రతీ నెలా తీస్తూ భజనరోజున మళ్ళీ కుర్చీమీద వేయడం, మళ్ళీ దాచడం వలన కొద్దిగా ఉన్నాయి. స్వామి కరుణ ఇదే విధముగా అందరిమీద ఉండాలని ఆశిస్తున్నాను.

జూన్ - 1991



*"నీ ప్రయత్నము నీవు చేయక. 'భారము నీదేరా!' అని భగవంతుని మొరలిడిన, భగవంతునికి ఏమివేరే పనిలేదా? భగవంతుడు మీతో పని చేయించి, ఆనందాన్ని అందించి కాపాడుతాడు. అహంకార రహితులై, ఆనందమతులై సేవను చేబట్టండి! భగంతుడు వెంట, జంట, ఇంట ఉండి కంటి రెప్ప వలె కాపాడును".*

- బాబా

# భగవాన్ శ్రీ సాయీశ్వరుని ఆర్తజనరక్షణ లీల

**నారాయణ చరణం, పుట్టపర్తి**

నేను (నారాయణ చరణం) భగవాన్ బాబావారి యనుజ్ఞపొంది 1990 - డిశంబరు 11వ తేదీనాడు మద్రాసులో ఆనందకణ్ణన్ అను డాక్టరుగారి దగ్గర కంటి ఆపరేషన్ చేయించుకొని, మరల పుట్టపర్తి రావలెనని బయలుదేరితిమి. కాని రాత్రి నిద్రలేమిచే బడలికగా యుండుటవలన, నేరుగా పుట్టపర్తికి రాలేక మధ్యలో మదనపల్లిలో నున్న రామకృష్ణ సేవాశ్రమం వెళ్ళి విశ్రమించదలచితిమి. బస్సులో మదనపల్లికి వచ్చితిమి. మదనపల్లి నుండి షుమారు ఒకటిన్నర మైలు దూరంలో ఆశ్రమం ఉంటుంది. సిటిబస్సులో ఆశ్రమం దగ్గర రోడ్డులో దిగినాము.

అప్పుడు రాత్రి 11 గంటల సమయం గాఢాంధకారం. ఏమియు కనబడుటలేదు. నేను సాయిరాం! సాయిరాం! అంటూ ఎటూ కదలక రోడ్ మధ్యలో నిలుచుంటిని. నా ధర్మపత్ని (రుక్మిణమ్మ) భయపడి బాధపడుచూ, బాబా! బాబా! ఏమి నాయనా! ఇట్లు చేయుచున్నావని అనుకుంటూ వుండగా, తటాలున ఒక కారు వచ్చి మా ముందు ఆగినది. ఆ కారులో డ్రైవరు తప్ప మరెవ్వరూ లేరు. కళకళలాడు ముఖముతో ఆయన రాకుమారునివలె కనబడినారు. ఏమమ్మా ఏమి కావాలి అని అడిగారు. బాబా, ఆశ్రమం గేటు కనిపించుటలేదు - చూపించండి అని అడిగినాము. కారులో కూర్చోండి, లోపలికి తీసుకువెళతాను అన్నారు. కారులో కూర్చున్నాము. ఎయిర్ కండీషన్ కారువలె వున్నది. ఆశ్రమం లోపల దించారు. ఎవరో మహానుభావుడు సహాయం చేసినాడనుకొని, రెండుమూడు గజములు వెళ్ళి వెనుకకు తిరిగి చూడగా కారు కనపడలేదు.

మరునాడు పుట్టపర్తికి బయలుదేరి వచ్చితిమి. అదే రోజు బాబావారు కారుణ్యానందస్వామితో, కారుణ్యానందా! రాత్రి మదనపల్లిలో నారాయణ చరణము, ఆయన భార్య దారి తెలియక రోడ్డుమీద బాధపడుచుండగా నేను కారులో తీసుకువెళ్ళి ఆశ్రమంలో వదలిపెట్టి వచ్చితినని చెప్పిరి. ఆ విషయం కారుణ్యానంద స్వామి మాతో చెప్పినారు. అదే రోజు సాయంత్రం స్వామి దర్శనానికి వరండాలో కూర్చుని యుండగా, స్వామి నన్ను చూచి, అర్ధరాత్రి సమయంలో మీరు మదనపల్లిలో గేటు కనబడక రోడ్డు మీద బాధపడుచుండగా ఎవరు రక్షించారయ్యా! అని అడిగారు. వెంటనే నేను స్వామీ! మా దేవుడే రక్షించినాడు. మా భగవానుడే రక్షించాడు అని కన్నీటిధారతో చేతులెత్తి నమస్కరించి చెప్పినాను. నేరుగా పుట్టపర్తికి రాకూడదా పిచ్చివాడా అని కూడా అన్నారు. రాలేకపోతిని స్వామీ

అని అన్నాను. రాలేవా పిచ్చివాడా అన్నారు. భగవానుడు ఆశ్రిత కల్పతరువు, ఆర్తజన రక్షకుడు, భక్తులపాలిట కామధేనువు. సత్యధర్మ ప్రతిష్ఠాపనకు అవతరించిన పరమాత్మ. ఇది భగవానుని లీల.

*యుగయుగంబుల నుండి యీ జగతి జరుగు*
*ఆర్తజనరక్షణములె మీ యాత్మకథలె*
*కాక ఆపాదమస్తకానీక మెల్ల*
*అందమైనట్టి గోవిందు మందిరంబు*
*సర్వ జగదభిరామ ఓ సాయి రామ!*

మే - 1991



# సుఖ దుఃఖములు

*"మానవుడు సామాన్యముగా సుఖసంతోషములను మాత్రమే కోరుకుంటాడు. ఏ పరిస్థితిలో కూడా దుఃఖ విచారములను కోరడు. సుఖ సంతోషములను ఆప్తమిత్రులుగా, దుఃఖ విచారములను అగర్భ శత్రువులుగా భావించుతారు. ఇది పొరపాటు. సుఖము, మానవుని తన కర్తవ్య పాలనమును విస్మరింపజేస్తుంది. అహంకారములోనికి, అహంకారము వలన చేసిన దుష్కర్మల లోనికి, సుఖము మానవుని దింపుతుంది. దుఃఖము మానవునిలోని ఏమరుపాటును తొలగించి, జాగరూకతతో ఉంచుతుంది. మానవునిలో ఆత్మ విచారణకు పురికొలుపుతుంది. దురహంకారము నుండి, దుఃఖము మానవుని హెచ్చరిస్తుంది. కావున దుఃఖమే మానవునికి నిజమైన మిత్రుడు. కష్టములను దుఃఖములను మిత్రులుగా భావించకపోయినా, కనీసం శత్రువులుగా భావించకండి. సుఖ దుఃఖములు రెండూ భగవంతుని అనుగ్రహములుగా భావించండి".*

- బాబా

# భగవాన్ బాబా కృప - అనుగ్రహం

మోటూరి విజయలక్ష్మి హైదరాబాద్

భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారిని నేను ప్రప్రథమముగా 1975 శివరాత్రికి సందర్శించుకొనుట జరిగినది. భగవాన్ మొదటి దర్శనముతోనే సాయి 'శివ స్వరూపము'గా నాకు పూర్తి నమ్మకము ఏర్పడినది. భగవాన్ దగ్గరకు వెళ్లకముందే షిరిడీ సాయి పూజ చేస్తూవుండేదానిని. మా ఇంట్లో అందరికి వేంకటేశ్వర స్వామి ఇలవేల్పు. నేను పర్తికి వెళ్ళుట జరిగిన తరువాత మరల మరల స్వామిని చూడవలయునని తాపత్రయం కలుగుచుండేది. అప్పుడు మేము పశ్చిమ గోదావరి జిల్లాలో ఉండేవారము. కానీ అచ్చట నుండి పర్తికి వెళ్లవలయునంటే 2 రోజుల ప్రయాణం. నేను మనసులో స్వామీ! చాలా త్వరగా ప్రయాణం చేసి వెంటనే మీ దర్శనము చేసికొనునట్లుగా అనుగ్రహించండి అని ప్రార్థించుకొనగా స్వామి వెంటనే నా ఆర్తిని గ్రహించినట్లుగా మా వారు హైదరాబాదు బదిలీ అయినారు. హైదరాబాదు నుండి తరచుగా స్వామి దర్శనమునకు వెళ్తుండే దానిని.

మా తండ్రిగారు డిప్యూటీ కలెక్టరుగా రిటైర్ అయి విశాఖపట్నంలో వుంటున్నారు. వారికి నేను ఎక్కువగా పుట్టపర్తి వెళ్తుంటే ఎందుకు అన్నిసార్లు వెళ్ళుట. ఒక సారి చూస్తే సరిపోదా అనే అభిప్రాయం వుండేది. అప్పుడు స్వామి పుస్తకములు యిచ్చి చదువమని చెప్పినాను. మా తల్లిగారు మాత్రం నాతో వచ్చి స్వామిని చూచి నీవు యిన్నిసార్లు రావటంలో అర్థం యిప్పుడు తెలిసినది. స్వామి సాక్షాత్తు పరమాత్ముడు అని నమ్ముకున్నారు. నమ్మిన తరువాత వారు కట్టిన ఇంటికి "శ్రీ సత్యసాయి నిలయం" అని పేరు పెట్టుకొనుట జరిగినది.

మా తల్లిగారికి స్వామి భజన ప్రతి శనివారం చేసుకొనవలయునని సంకల్పం కలిగినది. ఆ రోజు శనివారం గం॥ 6-00లకు మొదటగా భజన ప్రారంభించుటకు నిర్ణయం జరిగినది. కానీ ఇంతలో మా తమ్ముడి క్వారీలో పని చేయుచున్న ఒక బాలుడు (10 సంవత్సరములు) మాటా పలుకు లేకుండా నోటినిండా నురుగు గ్రక్కుచూ పడిపోయినాడు. అతనిని మా తండ్రిగారు కె.జి.హెచ్. హాస్పటల్‌కు తీసుకొని వెళ్లితే అచ్చట డాక్టర్లు ఈ అబ్బాయి బ్రతుకుట కష్టము. ధనుర్వాతము అయినా అంటురోగుల హాస్పిటల్‌కు తీసికొని వెళ్లండి. కాని ఏమీ ప్రయోజనం వుండదు అని చెప్పినారు. అంటురోగుల హాస్పటల్‌కు తీసుకొని వెళ్లినారు. అప్పడు మా తల్లిగారు ఏమిటి స్వామీ! ఈ పరీక్ష ఈ రోజున భజన ఏర్పాటు చేయవలయునని తలంచినాము. ఆ పిల్లవాడి తల్లిదండ్రులు యిచ్చటలేరు. భగవాన్ ఏమిచేస్తారో అని స్వామిని అనేక విధములుగా ప్రార్థించుచూ ఆ అబ్బాయికి స్వామి విభూతి

పెట్టి స్వామి స్మరణ చేస్తూ కూర్చున్నాము. సాయంత్రం గం॥4-00లకు స్వామి కృపతో ఆ బాలునికి మాట వచ్చినది. మాటవచ్చి యాపిల్‌పండు తింటానని అంటే యిచ్చినారు. ఆ యాపిల్‌పండును తిన్నాడు. డాక్టర్లు అందరూ ఎంతో ఆశ్చర్యపడినారు. అప్పుడు ఎంతో సంతోషముతో మా తండ్రిగారు భజన కార్యక్రమము జరిపించినారు. అప్పటినుండి అంటే చాలా భక్తిశ్రద్ధలు, సేవ చేయవలయుననే భావముకల్గి ఆ క్వారీ కార్మికులకు స్థలములు యిప్పించి వారికి గృహములు కట్టుకొనునట్లుగా చేసి అచ్చట ఒక స్కూలును పెట్టించి అచ్చట పిల్లలకు బాలవికాస్, చదువు చెప్పించుట చేస్తూ ఆ కాలనీకి "శ్రీ సత్యసాయి నగర్" అను పేరు పెట్టుకొనుట జరిగినది. అచ్చట అందరికీ స్వామి అంటే భక్తి వున్నది.

నాకు మా శ్రీవారికి 1978లో ఇంటర్వ్యూను ప్రసాదించి "నేను ఎల్లప్పుడూ నీకు తోడుగా వుంటాను. నీకు ఎడమప్రక్కన నొప్పియున్నది. స్వామి ప్రసాదమే నీకు రక్ష? నీవు ఏదో చిన్న లాకెట్‌ను తాళిబొట్టులో పెట్టుకొన్నావు. అది తీసివెయ్యి నీకు నేను వేరే యిస్తాను" అని చెప్పి స్వామి సృష్టించి స్వామి ఫోటో, 'ఓం' యున్న వెండి లాకెట్‌ను ప్రసాదించారు. ఏ అనారోగ్యము యున్నప్పటికీ స్వామి అనుగ్రహముతో సేవాకార్యక్రమము చేసికొనగలుగుచున్నాను.

1989 సంవత్సరము ఫిబ్రవరి 14వ తేదీన 13 మంది మహిళలు కలిసి 15వ తేది ఉదయమునకు పర్తిని చేరుకున్నాము. అప్పటికే ప్రశాంతి నిలయంలో స్వామి దర్శనము అయిపోయి ఇంటర్వ్యూ రూమ్‌లో వున్నారని తెలిసి మేము రూమ్‌లో సామాన్లుపెట్టి భజన సమయానికి మందిరము దగ్గర కూర్చున్నాము. కొద్దిసేపటికి స్వామి దర్శనము యిచ్చారు. ఆ రోజు సాయంత్రం దర్శనమునకు వచ్చి లైనులో కూర్చుంటే 12వ నెంబరు వచ్చినది. కాని దూరముగా దర్శనము లభించినది. మాతో వచ్చినవారికి కొంతమందికి స్వామి విషయములు అంతగా తెలియక రికమండేషన్ వుంటే స్వామి మనల్ని గమనించి మన దగ్గరకు వస్తారు అని ఆశ కలిగి ఎవరి ప్రయత్నాలు వారు చేస్తూన్నారు. స్వామి తత్త్వం అర్థము చేసుకొన్నవారము కొంతమంది స్వామికి రికమండేషన్లు పనికిరావు. అందరమూ స్వామిని ఆర్తిగా ప్రార్థనచేస్తే స్వామి అనుగ్రహము మనకు లభించును అని అన్నాము. కాని మాతో వచ్చిన వారు ప్రశాంతి నిలయంను కానీ స్వామిని కానీ చూడటం అదే ప్రథమం కావటంతో వారి మనసులు పరిపరి విధములుగా పోవుచున్నవి. స్వామి దగ్గరకు వస్తే తృప్తిగా చూచుకుంటామనియు, కొందరు ఇంటర్వ్యూ యిస్తే అంతకన్నా అదృష్టం లేదనియు, ఇంటర్వ్యూకు యిచ్చి ఆత్మానందము చేకూర్చుమనియు ఎవరికివారు స్వామిని పదేపదే ప్రార్థించుకుంటున్నాము. కానీ

స్వామి దూరమునుండే దర్శనము యిచ్చి వెళ్ళిపోవుటచే అందరము నిరుత్సాహంతో బాధతో ఎవరి రూములకు వారు చేరుకున్నాము. అప్పటికి 2 రోజులు 3 దర్శనములు అయినవి. ఇంక నాలుగో దర్శనము. మాలో ఒకరు అతి కష్టంమీద ముందు వరుసలో కూర్చుని స్వామికి లెటరు యిచ్చినారు. దానితో మాకు కొంత సంతోషం కలిగినది. కొంతమంది తెలియక రికమండేషన్‌కు ఎవరి వద్దకు పోయిన అది మా వలన కాదు. స్వామి దయ వుంటేనే జరుగును అని చెప్పినారు. దురదృష్టవంతులముగా భావించి స్వామిని మరింత ఆర్తిగా ప్రార్థించుట జరిగినది. మా ప్రార్థనలు స్వామి ఆలకించినట్లుగా ఆ రోజు దర్శనమునకు 3వ నెంబరు వచ్చింది. 1వ వరుసలో కూర్చునే అవకాశం వచ్చింది. స్వామి మా దగ్గరకువచ్చి హైదరాబాద్ నుంచి వచ్చారా! ఎంతమంది అని అడిగి లోపలికి వెళ్ళండి అన్నారు. తన్మయత్వంతో ఇంటర్వ్యూ రూమ్‌లోనికి వెళ్ళినాము. స్వామి వేయితల్లుల ప్రేమతో ఒకరిని మోకాలు నొప్పి ఎలాయున్నది? అని పలుకరించి తరువాత నన్ను నీ ఆరోగ్యము ఎలాయున్నది? అని పలుకరించినారు. 2 రోజులుగా ఎంతో తపన పడినారు, ఇటు పరుగెత్తి అటు పరుగెత్తి ఎక్కడకు పోయిన ఏమి ఫలించక మీరు పడిన ఆరాటమే మిమ్ములను ఇక్కడకు రప్పించినది. ఏదైనా "కష్టపడితేనే కదా! ఫలితం లభించేది" అని స్వామి కేసరి ప్రసాదం వేడిగా సృష్టించి అందరికీ యిచ్చి మిగిలినది నా చేతికి యిస్తూ అందరికీ తీసుకొని వెళ్లు అని చెప్పి, ఎన్నో ఆధ్యాత్మిక విషయములను చెప్పినారు. ఇలాంటి అనుభూతులు ఎప్పటికీ మరువలేనివి. నీవు ఒక అడుగు వేసి సేవ చేయుటకు ప్రయత్నిస్తే నేను నీకు పది అడుగులు ముందుగా వుంటాను. అని స్వామి చెప్పతూ వుంటారు. ఆ విషయము నాకు ప్రతి పనిలోనూ స్వామి ప్రత్యేకంగా నిరూపించుచున్నారు.

*జనవరి - 1991*



*"దయగల హృదయమే దైవమందిరము. ధనకనక వస్తువాహన పదవులు కదిలిపోయే మేఘముల వంటివి. వాటిని నమ్ముకొని విఱ్ఱ వీగువారు వెఱ్ఱివారు. హృదయాన్ని నమ్మి జీవించువారు సింహజీవులు. కండబలమును నమ్మి జీవించు వారు గొఱ్ఱె జీవులు. వారు నిరంతరం అదురు బెదురులతోనే జీవితమును గడుపు తుంటారు. తన హృదయమును నమ్మి జీవించువారు నిరంతరం నిర్భయంగా, ఆనందంతో జీవిస్తుంటారు."*

- బాబా

# జగర్తాలో శ్రీ సత్యసాయి

- చోడవరపు బిందుమాధవరావు, జగర్తా

జగర్తాకు శ్రీ సాయిబాబా వచ్చిన తీరుతెన్నులు వింటే మనకు ఆశ్చర్యము, ఆనందము కలుగుతుంది. జగర్తాను గురించి ముందు చెప్పి తరువాత శ్రీవారి రాకను గూర్చి చెప్పతాను.

భిన్నత్వంలో ఏకత్వం గల దేశాలలో ఇండోనీషియా ఒకటి. 300 సంవత్సరాలు డచ్చివారి పరిపాలనలో కృంగి కృశించిన దేశము. 1949లో స్వాతంత్ర్యము సంపాదించుకొన్నది. 13 వేల పైన వున్న లంకలన్ని కలిసి ఇండోనీషియా అయింది. ఇప్పటికి 12 వేల లంకలకు పేర్లు లేవు. జావా, సుమత్రా, బాలీ, ఇరియన్ జయ మొదలగునవి పెద్ద లంకలు. ఇందులో ఇండోనీషియాకు ముఖ్య పట్టణమైన జగర్తా, జావా లంకలోనున్నది, అయిదువేల మీటర్ల ఎత్తుగల మంచు కొండలున్నవి. చిత్తడి నేలలున్నవి, సుందరమైన అడవులున్నవి. భయంకరమైన అగ్నిపర్వతములు న్నవి (నేను ఈ వ్యాసము వ్రాసేముందే ఒక అగ్నిపర్వతము రెండుసార్లు బ్రద్దలై ఎంతో నష్టము కలిగించింది) సుందరమైన పచ్చని పచ్చిక బయళ్ళున్నవి.

జగర్తా ఒకప్పుడు హిందువుల రాజ్యము. పేరు "తరువునగర" ఇప్పటికి బాలీ లంక అంతా హిందువులే. ఆశ్చర్యమైన విషయమేమిటంటే ఆ లంకలో నాలుగు వర్ణములువారున్నారు. అందరూ శివమతస్తులు. వీరి సంఖ్య మూడు మిలియనులు. మొట్టమొదట డచ్చివారు బాలీ లంకకు వచ్చి, దానినిచూచి, "భూతలస్వర్గమని" వర్ణించారు. టూరిస్టులు బాలీకి సంవత్సరానికి సగటున ఒక మిలియన్ వస్తారు. టూరిస్టుల సంఖ్య పెరిగిన కొద్దీ భూతలస్వర్గమల్లా భూతల నరకమగుట సహజమేగా. బాలీలోని హిందువుల మతము 'ఆగమతిరుత్తాల్'. ఇచ్చట 20వేల శివాలయములున్నవి. వీటిలో ముఖ్యమైన "శక్తి" దేవాలయము "గునుంగ్ అగాంగ్" అనే పర్వతము మీదనున్నది. ఇప్పటికి రామాయణ గాథ అనేక రూపములలో చెప్పబడుతోంది. పూర్వము రావణాసురుని లంక ఇదేనని వీరి అభిప్రాయము. అటుగాక రావణుడు శివమతస్తుడేగా. ఇండోనీషియాలో శాకాహారము అంటే యేమిటో తెలియదు. రావణుని రాజ్యము గదా! ఇచ్చట పెట్రోలు కంటే త్రాగే మంచి నీరు ఖరీదు యెక్కువ. ఇండోనీషియాకు వచ్చిన వారందరు 'ఏక్వా' అనే మంచినీటిని 20 లీటర్లు, 30 లీటర్లు ప్లాస్టిక్ డబ్బాలతో కొని త్రాగుతారు.

ఆంజనేయుడు నూరు యోజనముల లవణ సముద్రము దాటి జానకీమాత కొరకు వచ్చిన లంక ఈ బాలీయే. వీరు ప్రస్తుతము లండనులో ఒక సాంస్కృతిక ప్రదర్శన యేర్పాటు చేసినారు. అందులో రామాయణ గాధ తెలిపే నృత్యనాటిక ఒకటి. మనవారు చేయనిది ఇండోనీషియనులు చేస్తున్నారంటే మెచ్చుకోక తప్పదుగా. ఇచ్చట ఆంజనేయస్వామి పెద్ద విగ్రహమున్నది.

" The statue of a man with outstrecthed atop a curving padestal, shaped like a F, is in the circle on jalan Gatot Subroto, called AURI. It is a representation of the Ramayana figure Hanuman, incarnated as God of the Wind" అని వ్రాయబడినది.

నేటికి కొద్ది మార్పులతో మన పేర్లు యెన్నో జయసూర్య, రామ, సీత, విశ్వామిత్ర, అర్ధలోకదేవి, కృష్ణ సుమంత మొదలైనవి. ఇంత పెద్దపట్టణమైన జగర్తాలో హిందూ దేవాలయములు వ్రేళ్ళమీద లెక్కించవచ్చు. మసీదులు కొన్ని వేలు. చర్చిలు కొన్ని వందలు. బౌద్ధ దేవాలయములు కొన్ని పదులు. ఇక్కడ పెద్ద కూడలిలో శ్రీ కృష్ణభగవానుడు అర్జునునికి గీత బోధిస్తున్న చక్కని శిల్పమున్నది. దాని క్రింద నీరు ప్రవహిస్తూ వుంటుంది. అది ఇండోనీషియా అభివృద్ధికి దోహదం చేస్తుందని వీరి భావము. ఇది హనుమ విగ్రహమువలె పురాతనమైనది కాదు.

బౌద్ధ బిక్షువులను గూర్చి మీరు వినేవుంటారు. మన దేశములో పుట్టిన బుద్ధుడు, బౌద్ధమతమును స్థాపించాడు. కాని మన దేశములో ఈ మతస్థులు చాలా తక్కువ. టిబెట్టు, థాయిలాండు, శ్రీలంక, చైనా మొదలైన దేశములలో ఎక్కువగా నున్నారు. ఇండోనీషియాలో 200 బౌద్ధ దేవాలయములున్నవి. రెండు మిలియనుల కన్న ఎక్కువ బౌద్ధమతస్థులున్నారు. వీరందరికి గురువు గౌరవనీయు లైన "అషిన్ జనరల్ కైక". అతి వినయ, జ్ఞాన సంపన్నుడు. గొప్ప భక్తుడు.

సత్యసాయి పిలుపునందుకొని పుట్టపర్తి వచ్చారు. ఆ పిలుపు ఏ రూపంలో ఎలా వచ్చిందో వారిని అడిగితేగాని తెలియదు. వారు కొంతమంది శిష్యులతో పుట్టపర్తి వచ్చారు. వారిని కలుసుకొన్న ఒక భక్తుడు వారికి నమస్కరించి "స్వామీ ఆధ్యాత్మిక చింతనను గూర్చి తెలియచెయ్యండి" అని అడిగారు. చూడండి, పురుషులందు పుణ్యపురుషులు వేరయా అని వేమన ఊరికే చెప్పలా? ఆ పుణ్యపురుషుడు అషిన్ జనరల్ కైక. ఆ భక్తునికి జవాబు చెప్పారుట. "నేను ఇంకా ఆ విషయములో విద్యార్థినే" అని. ఈ మాటలలోని నిగూఢ అర్థము వర్ణించాలంటే బాదరాయణుడు మరల పుట్టవలసిందే.

తరువాత సాయి దర్శనము చేసికొనేందుకు వెళ్ళారు. అషిన్‌గారు యేమి అడిగారో సాయి యేమి చెప్పారో తెలియదు. ఊహించుటకు నేనేమి భక్తపోతనా మాత్యుడనుగాను కదా! “అల వైకుంఠపురములో ఆమూల సౌధంబులో” అని వ్రాసి మిగిలినది శ్రీరామమూర్తిచే వ్రాయించుటకు.

శ్రీ సాయిబాబా వారికి ఆరు శివలింగాలు, ఒక జపమాల, బంగారు బుద్ధ విగ్రహము, పది రవ్వలున్న ఉంగరము ఇచ్చారు. కొద్ది రోజులక్కడుండి బెంగుళూరు వెళ్ళిన బాబా వద్ద శలవు తీసుకోవటానికి వెళ్ళారు. స్వామి వారికి వీడ్కోలు చెపుతూ గుప్పెట మూసి తెరచి ఒక లాకెట్టు బహూకరించారు. అది త్రిభుజాకారముగా నున్నది. అందులో పైన “ఓం” రెండు వైపుల శిరిడి సాయి సత్యసాయి అది తీసికొని ఆషిన్ జనరల్ కైకగారు ఇండోనీషియాకు వచ్చారు. సత్యసాయి బాబా ఆరు లింగాల రూపులో ఇండోనీషియాకు వచ్చారు. వారున్న ఆరు ప్రదేశాలేవో వారిని కలుసుకొని మీకు మనవి చేస్తాను.

ఏప్రిల్ - 1990



# భక్తి....భక్తి....

*“ఈనాడు మనం ఆచరించే భక్తి అల్పత్వమును గోచరిస్తుంది. ఈనాటి భక్తుల లక్ష్యము క్షణ క్షణమునకు మారుతూ ఉంటుంది. నేడు ఒక భావము, రేపు మరొక భావము. ఇలాంటి మార్పులు భక్తికి లక్షణం కాదు. చలించని మనస్సును, భ్రమించని దృష్టిని అభివృద్ధి పరచుకోవటమే భక్తి లక్షణము. కష్టములకు కృంగటం గాని, సుఖములకు పొంగటం గాని ఉండరాదు. ‘భక్తి’ అనగా ఒక లక్ష్యమును పెట్టుకొని, గమ్యమును చేరే వరకు పట్టువదలరాదు. దీక్షమానరాదు. నీవు ఆశించిన రూపాన్ని నిరంతరం చింతించడం, స్మరించడం ద్వారానే హృదయం ద్రవిస్తుంది. హృదయం ద్రవించి, ప్రవహించే తత్త్వమే ప్రేమ తత్త్వము. ఈ ప్రేమకే ‘పరమభక్తి’ అని పేరు. పరతత్వానికి పరమభక్తియే గమ్యము. పరమభక్తుడు మోక్షమును కూడా త్యజిస్తాడు”.*

- బాబా

# భగవాన్ సాయి దివ్యలీలలు

- కొమరగిరి కృష్ణమోహనరావు, మచిలీపట్నం

ఈ మధ్య 'కువైట్'లో జరిగిన విధ్వంసకాండ యావత్ ప్రపంచానికి తెలిసినదే. అక్కడ మన తెలుగువారెందరో ఉద్యోగరీత్యా వెళ్ళినవారున్నారు. వారిలో డా॥ గొరిజాల విజయసింహాలు కుటుంబం ఎంతో కాలం నుండి అక్కడ వుంటున్నది. శ్రీమతి గొరిజాల ఉమ కలలో భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారు పీతాంబరాలు ధరించి దర్శనమిచ్చి "నీవు నీ కుటుంబంతో నీ స్వదేశమైన భారతదేశానికి వెంటనే వెళ్ళు" అని చెప్పగా స్వామి మీద వుండే నమ్మకంతో తన కుటుంబ సభ్యులతో (శ్రీమతి ఉమ మరియు కుమారులు కిరణ్, ప్రవీణ్‌లు) భారతదేశం వచ్చింది ఆమె. వారు ది. 24-8-90 న బయలుదేరి విమానంలో 26వ తేదీకి మద్రాసు చేరుకున్నారు. కువైట్‌లో ఆ రోజుననే విధ్వంసకాండలు జరిగి ఎంతో మంది ప్రవాసాంధ్రులు అనేక యిక్కట్లకు గురియైనారు. "స్వామిని నమ్ముకున్న వారిని కాపాడటం వారి అవతార ప్రత్యేకత" అని శ్రీమతి ఉమగారు "శ్రీవాణి" కి ప్రత్యేకంగా ది 2-9-90న ఒక లేఖ వ్రాసారు. స్వామి మహిమాన్వితశక్తికి ఈ సంఘటన ఒక చిన్ని ఉదాహరణము మాత్రమే.

కృష్ణాజిల్లా నందిగామలో శ్రీ కె.వి. రామశేషు (మొబైల్‌గైడ్, కె.డి.సి.సి. బ్యాంక్) గారు ఉద్యోగరీత్యా వచ్చి వున్నారు. వారిది తూ.గో. జిల్లా. వారి తల్లితండ్రులు స్వామి భక్తులు కావటంవలన ఈ సంవత్సరం ఫిబ్రవరిలో పుట్టపర్తి వెళ్ళి స్వామిని దర్శించి వచ్చారు. మార్చిలో నందిగామలో గీతా మందిరంలో జరిగిన జ్యోతి ప్రారంభోత్సవ సభలో స్వామి అనుగ్రహంతో ప్రసంగించే మహద్భాగ్యం నాకు కలిగింది. ఆ సమావేశానికి రామశేషు దంపతులు కూడా వచ్చారు. మరల ఏప్రియల్‌లో నా సోదరుడు కొమరగిరి రామమోహనరావు స్వగృహంలో ఏర్పాటు చేసిన జ్యోతి కార్యక్రమంలో పాల్గొని ఉపన్యసించే సదవకాశం మరల నాకు లభించింది. అప్పుడు రామశేషుగారు శ్రీవాణిని పంపమని కోరగా స్వామి చిన్ననాటి చరిత్ర ముద్రించిన శ్రీవాణిలు కూడా పంపటం జరిగింది. రామశేషుగారికి సంతానం లేదు. దర్గాకు (ముస్లిముల ఆరాధనా మందిరం) వెళ్ళి విభూతిగాని, తాయత్తుగాని తెచ్చుకుంటే మీ కోరిక సఫలీకృతమవుతుందని మిత్రులు ఆయనకు చెప్పారు. కానీ వెళ్ళలేదు. ఈ లోపు నేను పంపిన శ్రీవాణి పత్రికలు వారికి అందినాయి. అందులో ఒక పత్రిక చదువుదామని తీయగా దానినుండి ఒక బంగారపు చిన్ని మంగళసూత్రం క్రింద పడింది. ఆయన ఆశ్చర్యానికి అంతులేకపోయింది, భార్యకు చూపించాడు.

దానిని మహాప్రసాదంగా భావించి బాబా ఫోటో ముందుపెట్టి స్వామిని మనసారా ఆరాధించారు. ఆమె మరల మరునాడు అదే శ్రీవాణిని చదవటానికి తీసింది. మరల మరొక మంగళసూత్రం శ్రీవాణి నుండి పడింది. భర్త ఇంటికి వచ్చిన తరువాత చూపించింది. ఆ రెండు మంగళసూత్రాలను తీసుకొని వెళ్ళి సమితిలో అందరికి చూపించారు. నందిగామ సమితి కన్వీనర్ శ్రీ పబ్బతి సత్యంగారి సూచనపై ఆ రెండు మంగళసూత్రాలు ఆమె మెడలో ధరించింది. ది. 21-9-90న నందిగామ వెళ్ళి శ్రీవాణి ద్వారా ప్రసాదించబడిన ఆ రెండు మంగళసూత్రాలను చూచి వచ్చాను. ఆ రెండు మంగళసూత్రాలపైన మసీదు బొమ్మలు ముద్రించబడి వున్నాయి. స్వామి అద్భుత లీలకు అది ఒక నిదర్శనం. అంతేకాదు స్వామి ప్రబోధించే మత సామర స్యానికి మచ్చుతునక. ఈ మధ్య కాలంలో శ్రీ పబ్బతి సత్యంగారింట్లో అనేక రకాల అత్యద్భుతాలను స్వామి ప్రదర్శించారు. చుట్టు ప్రక్కల గ్రామాల ప్రజలు తండోప తండాలుగా వచ్చి స్వామి ప్రదర్శించిన దివ్యలీలలను తిలకించి ఆశ్చర్యచకితులైన వారెందరో... నాస్తికులు, హేతువాదులు కూడా పరిశీలించి స్వామి అద్భుతశక్తికి తలలొంచారు. స్వామి సర్వాంతర్యామి, మహిమాన్విత శక్తి సంపన్నులేనని అంగీకరించక వారికి తప్పలేదు. రామశేషు దంపతులకు మంగళసూత్రాలు శ్రీవాణి ద్వారా భగవాన్ బాబావారు ప్రసాదించటం శ్రీవాణికి కూడా ఒక అదృష్టమే. ది. 7-11-1937న శ్రీవాణి ప్రత్యేక సంచిక (స్వామి జన్మదినోత్సవ సందర్భమున ముద్రించిన) స్వామికి సమర్పించి వారి దివ్యసందేశమును అర్థించగా "శ్రీవాణి నా వాణే గదా! ఇంకా మరో సందేశం దేనికి?" అనిన స్వామి మాటలు ఈనాడు నాకు గుర్తుకు వచ్చి నేను పొందిన ఆనందానికి అవధులే లేకుండా పోయింది. శ్రీవాణిని ఇంతకాలంగా నడుప గలుగుతున్నానంటే స్వామి ఆశీస్సులు, అనుగ్రహ ప్రభావమే తప్ప వేరొకటి కాదు. రామశేషు దంపతులు పొందిన ఆనందంలో కొంత భాగాన్ని స్వామి ఈ విధంగా నాకు ప్రసాదించారేమో!... స్వామి లీలలు సామాన్యులమైన మనకు అర్థంకావు గదా!.. స్వామి ఎవరిని, ఎప్పుడు ఏ విధంగా అనుగ్రహిస్తారో! వారి దివ్యాశీస్సులను అందిస్తారో! చెప్పటం కష్టం.

స్వామి అవతార ప్రకటన స్వర్ణోత్సవ మహోత్సవములకు ప్రపంచం నలుమూలల నుండి 20 లక్షల మంది భక్తులు వస్తారని నిర్వాహకుల అంచనా. యావన్మంది భోజన వసతి సౌకర్యములు వారం రోజుల పాటు ఉచితంగా ఏర్పాటు చేస్తున్నారు. ఇది మానవ మాత్రులకు సాధ్యమయ్యే విషయంకాదు. నవంబర్ 1వ తేదీన భారత రాష్ట్రపతి బీడుపల్లి గ్రామం వద్ద (ప్రశాంతినిలయంకు 5 కిలోమీటర్లు) బ్రహ్మాండమైన ఆసుపత్రి సముదాయానికి శంఖుస్థాపన చేస్తారు.

భారతదేశంలో ఇటువంటి వైద్య సౌకర్యముగల హాస్పిటల్ వేరొకటి ఉండకపోవచ్చు నని భావిస్తున్నారు. మెదడు, గుండె, కాలేయములకు సంబంధించిన చికిత్సలు యిక్కడ ఉచితంగా లభిస్తాయట. నవంబర్ 22న జరుగు శ్రీ సత్యసాయి విశ్వవిద్యాలయ ఎనిమిదవ స్నాతకోత్సవంలో గౌ॥ రాష్ట్రపతి ముఖ్య అతిథిగా పాల్గొంటారు. నవంబరు 23న భగవాన్ బాబావారి 65వ జన్మదినోత్సవ వేడుకలు కడు వైభవంగా జరుగుతాయి. కొండమీద రెండు అంతస్తుల మ్యూజియం రూపురేఖలను దిద్దుకుంటున్నది. అది ప్రపంచ సాంస్కృతిక, ఆధ్యాత్మిక విలువలకు ప్రతీకగా నిర్మించ బడుతున్నది. బ్రాహ్మణపల్లి సమీపంలో వాయుదూత్ విమానములు దిగడానికి వీలుగా విమానాశ్రయము కూడా నిర్మించబడుతున్నది. కొండమీద 65 అడుగుల ఆంజనేయస్వామి విగ్రహం చూడముచ్చటగా నిర్మించబడుతున్నది. లక్షలాదిమంది కూర్చొని ఉపన్యాసాలు వినటానికి వీలుగా Open Air Stadiumను విస్తృత పరుస్తున్నారు. అందులోనున్న 'శాంతి వేదిక'ను విశాలంచేసి అతి సుందరం గా తీర్చిదిద్దుతున్నారు. నూతనంగా మూడంతస్తుల సుందర భవనాలు ప్రపంచ ప్రముఖుల వసతికోసం ప్రత్యేకంగా నిర్మించబడుతున్నాయి. లక్షలాది భక్తుల వసతికోసం వందల ఎకరాలు బుల్‌డోజర్ల ద్వారా చదును చేయబడుతున్నది. షామియానాలు, టెంట్లు వుండటానికి వేస్తారుట. దాదాపు 90 దేశాలనుండి ప్రతినిధులు ఈ మహోత్సవాలలో పాల్గొంటారని నిర్వాహకులు చెబుతున్నారు. అలనాడు రామావతార కాలంలో అయోధ్య, కృష్ణావతారంలో ద్వారక మహానగరాలు విలసిల్లినట్లుగా, ప్రస్తుత ఈ అవతార (శ్రీ సత్యసాయిబాబా) కాలంలో ప్రశాంతి నిలయం కూడా అంతటి విశిష్టతను, శోభను సంతరించుకుంటుందనటంలో ఏమాత్రం అతిశయోక్తిలేదేమో! ఎక్కడో మారుమూలనున్న పుట్టపర్తి గ్రామమునకు ఇంతటి ప్రపంచ ప్రాముఖ్యత రావటం కేవలం భగవాన్ బాబా వారి దివ్యలీలలు ప్రభావమే తప్ప వేరొకటి కాదు. అట్టి దైవాంశసంభూతుని సమకాలీనులుగా వుండే మహద్భాగ్యం కలగటం నిజంగా మన పూర్వజన్మ సుకృతమే.

అక్టోబరు - 1990



# గుంటూరులో సాయిలీలలు

- శశిబాల, గుంటూరు

మాతృశ్రీ ఈశ్వరాంబవర్ధంతి సందర్భమును పురస్కరించుకొని జిల్లా కేంద్రం అయిన గుంటూరు శ్రీ సత్యసాయి శాంతి సుధ యందు రంగరంగ వైభవంగా జరుపుకొనుటకు జిల్లా నలుమూలలనుండి 270 మంది బాల వికాస్ గురువులు, బాలబాలికలతో మే 5వ తేది సాయంత్రానికల్లా మందిర ప్రాంగణం చేరుకున్నారు. వారి యొక్క భావానికి పరవశించిన స్వామి చూపిన లీలా విశేష ప్రదర్శనము వారియొక్క మనోఫలకాల మీద చెరగని ముద్రవేసింది. ఆదినుండి తుది వరకు తానుగా ఇక్కడే వుండి ఆశీర్వదించమని నిశ్చలమైన భక్తితో స్వామిని వేడుకుంటూ ముందుగానే టెలిగ్రాం ఇచ్చి ఉన్నాము. స్వామి అనుగ్రహించారు. తానే స్వయంగా కార్యక్రమాన్ని పర్యవేక్షించి దిగ్విజయంగా నిర్వహించారు. ఇది వేలాదిమంది భక్తులకు, ప్రేక్షకులకు అనుభవంలోకి వచ్చిన చారిత్రాత్మకమైన సత్యం.

బ్రాహ్మీ ముహూర్తంలో మాతృశ్రీ ఈశ్వరాంబ వర్ధంతి వేడుకలు ప్రణవోచ్చారణ, సుప్రభాత గీతాలాపన, నగర సంకీర్తనలతో ప్రారంభమయ్యి ప్రశాంతి పతాకావిష్కరణ తో కార్యక్రమములు మొదలయ్యాయి. ఆ తదుపరి బాలవికాస్ విద్యార్థులచే 'ర్యాలి' ఆ తదుపరి భజన గీతాలకు అనుగుణంగా కోలాటాలు మున్నగునవి కన్నుల పండుగగా జరిగాయి. వ్యాసరచన, వక్తృత్వము తదితర పోటీలు ఉత్సాహభరితంగా నిర్వహించబడ్డాయి. ఉదయం కార్యక్రమాల సమాప్తి సూచనగా సర్వాధ్యక్షుడైన శ్రీ స్వామికి నైవేద్యం సమర్పించి హారతి ఇవ్వవలసిన తరుణం అది. అదృశ్యరూపుడైన ఆ సాయి ప్రత్యక్ష గోచరుడై అందరిని సంభ్రమాశ్చర్య ఆనందాల్లో ముంచెత్తారు. ఇటువంటి లీలలు స్వామి అనేకం చేసారని విన్నాము, చదివాము. క్రిందటి నెల 6,7, తేదీలలో శ్రీ సత్యసాయి శాంతి సుధ వార్షికోత్సవం వేడుకలప్పుడు ప్రప్రథమంగా కన్నులారా చూశాం, చిదానంద చిన్మయమూర్తి, స్వామి అభయహస్తంతో సింహాసనారోహణం చేసి తాను ప్రత్యక్షదైవాన్నని మనకు రుజువు చేశారు ఆనాడు. తిరిగి అదే అనుభూతిని ఆనందాన్ని ఈనాడు ప్రసాదించటం భక్తుల, బాలవికాస్ గురువుల, విద్యార్థుల పూర్వజన్మ సుకృతం.

సరిగ్గా గం॥ 12-10 లకు తన్మయత్వంలో వేయి గొంతుకల ఏకనాధంతో గీతాలాపన చేస్తూ శ్రీమతి శశిబాలగారు హారతి ఇస్తుంటే కరుణామయుడు, భగవాన్ శ్రీ సత్యసాయి కోటీ సూర్య ప్రభలతో వెలుగొందుతూ "సాయిగణేశ" రూపంలో సింహాసనాధిష్టితుడై తానే స్వయంగా హారతిని స్వీకరించారు. ప్రత్యేకత

ఏమిటంటే, గగుర్పాటుతో, గద్గద కంఠాలతో ఒక్కపాటున అనేక కంఠాలు "అమ్మో, స్వామి వచ్చేశారా! స్వామి వచ్చేసారు! స్వామి! స్వామి" అని నినాదించారు.

లంబోదరం, వక్రతుండం, ప్రకాశమైన కిరీటంతో సహా మూషిక వాహన రూఢుడైన సాయి విఘ్నేశ్వరుడు సింహాసనం మీద వెలసిన దివ్యానుభూతి అందరికి కలిగింది. స్పష్టమైన రూపం, పూజామంటపంపైన విఘ్నేశ్వరుని ప్రతిమ వున్నది. అదేరూపం, సర్వావయవ సమన్వితం, సర్వాలంకార శోభితం పూజావేదికపై అమర్చిన సింహాసనంపై ప్రత్యక్షం. భగవాన్ కృప నిరుపమానం నిర్దిష్టం. జన్మలు చరితార్ధ ములైన వని అందరూ ఉప్పొంగిపోయారు. గళాలు విప్పి భక్తి పారవశ్యంతో హారతి గీతాలాపనం చేశారు. క్షణంలో వార్త నలుదిశలా వ్యాపించింది. ఎవరి ఆదేశమూ లేకుండానే చిరంజీవులు ఇతర భక్తులు నామజపం మొదలుపెట్టారు. విరామం లేకుండా అఖండనామ సంకీర్తనం, భజన మొదలయ్యాయి. చిన్నారి బాలలని ఆశీర్వదిస్తూ సర్వ విఘ్నహారి, విద్యాబుద్ధి సిద్ధిప్రదాత అయిన సాయిగణేశుని రూపంలో ప్రత్యక్షం కావటం సర్వవిధముల ఆశీర్వదించటమేనన్న దివ్యస్ఫూర్తి అందరి హృదయాలల్లోను కల్గింది.

స్వామి సాయిగణేశుని రూపంలో సింహాసనాధిష్టుతుడై దర్శనమిస్తున్న సమయంలోనే మాతృశ్రీ ఈశ్వరాంబ చిత్రపటానికి భక్తులు ఉదయాన్నే అలంక రించిన పూలమాల సరసరా జారి క్రింద వాలింది. తనయునిరాక తల్లికి సంతోష దాయకం కదా! పుత్ర దర్శనంలో మాతృమూర్తి ఒడలు పులకరించాయి. గళ బద్ధమైన మాల పీఠంపై వ్రాలింది. అమ్మ ఆనందం అలా అభివ్యక్తమయింది. సంశ యాత్ములకు సందేహనివారకం ఆ దృశ్యం. పాదపీఠం పై స్వామి పాదముద్రులు స్పష్టంగా గోచరించాయి. ఒక ప్రక్క నామ సంకీర్తనం ప్రారంభమయింది. అవతార దర్శన ప్రారంభమైనప్పటి నుండి వంతులువారీగా బాలవికాస్ విద్యార్థులు సాయి గణేశుని కిరుప్రక్కలా నిలబడి భక్తి శ్రద్ధలతో వింజామరులు విసురుతూ సేవ చేసుకుంటూనే ఉన్నారు.

సాయింత్రం సాంస్కృతిక కార్యక్రమాలు, లీలా మానుష వేషధారియైన సాయిని కీర్తిస్తూ ఉపన్యాసాలు జరిగాయి. కార్యక్రమాల ముగింపు సూచనగా స్వామికి హారతి ఇవ్వటం సర్వసాధారణం. హారతినిందుకుంటూనే స్వామి సభ నుంచి నిష్క్రమిస్తారు. ఇది మనందరి అనుభవం. మన ప్రార్థనలను ఆలకించి అనుగ్రహించటానికి స్వయంగా విచ్చేసి సింహాసనాధిష్టితుడైన సాయి గణేశుని పట్టుకొని నిలబెట్టుకోవాలి. చిక్కిన స్వామిని దక్కించుకోవాలిగాని హారతి ఇచ్చి పోగొట్టుకోకూడదు అన్న స్ఫూర్తితో రాష్ట్ర కో-ఆర్డినేటర్ శ్రీ నారాయణరావుగారు

రాత్రల్లా అఖండ భజన కొనసాగాలని సూచించారు. సూచన భక్తుల హృదయాల్లో అవ్యక్తంగా ఉన్న వాంఛకు బహిరంగ వ్యక్తీకరణమే, ఉత్సాహం ఉరకలు వేస్తుంటే, ఆనందం వెల్లువలు పెల్లుబికి చిందులు త్రొక్కుతూ వుంటే అఖండసాయి నామస్మరణ తెల్లవారే వరకు కొనసాగింది. 7వ తేది ఉదయం 6 గం॥లకు స్వామికి హారతి ఇవ్వాలని నిర్ణయమైంది. హారతినందుకొని నీవు అదృశ్యుడవు కాకు, మా దగ్గరేవుండు అని త్రికరణ శుద్ధిగా స్వామిని ప్రార్థించుకున్నాం. 6వ తేది రాత్రి స్వామికి టెలిగ్రాం ద్వారా మా మనోగత వాంఛను తెలుపుకున్నాం.

భక్తి వశంవదుడు, వరదుడు, స్వామి అలానే అనుగ్రహించారు. ఈ క్షణం వరకు స్వామి సాయి గణేశునిగా అలానే సింహాసనంలో ముద్రితులై దర్శనమిస్తున్నారు. మాతృశ్రీ ఈశ్వరాంబా వర్ధంతి సందర్భముగా మనం ఏర్పాటు చేసుకున్న జిల్లాస్థాయి బాలవికాస్ విద్యార్థుల సమ్మేళనం, కార్యక్రమాల ముగింపు సూచనగా ఉదయం 6 గం॥లకు ముక్త కంఠాలలో ముకుళిత హస్తాలతో స్వామికి హారతి ఇచ్చాం.

జూన్ - 1989



*"శరీరమాద్యంఖలు ధర్మసాధనం. ధర్మమును ఆచరించే పనిముట్టు శరీరం. స్వయంగా అది కర్మలలో ప్రవేశించదు. మనస్సు ప్రోత్సాహంతో శరీరం పని చేస్తుంది. అన్నిటికి మనస్సే ఆధారం. అయితే మనం, మనస్సు చేసే పనులకు దేహాన్ని శిక్షిస్తున్నాం. ఒకనిని చంపిన వానికి ఉరిశిక్ష వేస్తారు. అయితే అక్కడ శిక్షను అనుభవించేది శరీరం. దోషం చేసినది మనస్సు. మనస్సు ప్రోత్సాహం లేకుండా దేహం ఏకర్మ ఆచరించడానికి వీలుకాదు కదా! అయితే మనస్సును శిక్షించే అధికారి ఈ జగత్తులో లేదు. ధర్మశాస్త్రము కూడా శరీరాన్నే శిక్షిస్తుంది. ఇది ప్రాకృతధర్మం. పరమాత్మ ధర్మం ఇదికాదు. తప్పు చేసేది మనస్సు. ఉపాధిగా ఉపయోగపడేది దేహం. దేహం తన కర్తవ్యాన్ని అనుసరించేదే. దోషమంతా మనసుదే కనుక మనసుకు శిక్షిస్తాడు భగవంతుడు, అది పరమాత్మ ధర్మం".*

**- బాబా**

# భగవాన్ బాబాచే సృష్టించబడిన వానరము

- స్వామి మహేశ్వరానందజీ

కుమ్మరి పలుపలు విధాలుగా మట్టితో కుండలు తయారు చేస్తున్నట్లు, బ్రహ్మ దేవుడు ప్రాణి సంస్కారం అను మట్టితో మానవదేహం అను ఘటాన్ని తయారు చేస్తుంటాడని పండితులు చెబుతారు అయితే ద్వాపరయుగంలో శ్రీ కృష్ణభగవానుడు సంస్కారం (మట్టి)తో పనిలేకుండానే అంతకు మించిన అందమైన దేహాలను సృజించాడట...ఈ కలియుగంలో ఆ కృష్ణభగవానునికి మారు రూపమైన శ్రీ సత్యసాయిబాబావారు అటువంటి అసాధారణమైన అద్భుతాలెన్నిటినో చేయగలగడం మనకు తెలుసు. ఆ అద్భుతాలలో మనం తెలుసుకొనవలసినదొకటి.

ఒక అమెరికన్ మహిళకు బాబాగారి పట్ల అమిత శ్రద్ధా భక్తులుండేవి. ఆమె కొన్నిసార్లు బాబాను సందర్శించడం కూడా జరిగింది. అయితే ఆమె భర్తకు బాబాగారి పట్ల, ఆయన దివ్యశక్తుల పట్ల ఏ మాత్రం నమ్మకం ఉండేది కాదట. అలక్ష్యభావంతో బాబాగారిని ఎప్పుడూ విమర్శిస్తుండేవాడట ఆయన భార్యామణి తన భర్తను బాబా సమక్షానికి తీసుకొనివచ్చి, ఆయన దివ్యత్వాన్ని తెలియజెప్పాలని చాలా సార్లు యత్నించింది. ఆఖరికొక పర్యాయం భార్య మాటను మన్నించి ఆయన ప్రశాంతినిలయం వచ్చాడట. అతనికి భగవాన్ బాబాతో ఇంటర్వ్యూ పొందే అదృష్టం కూడా లభించింది. ఇష్టా గోష్ఠి సంభాషణల మధ్య ఆయన బాబాగారితో "బాబా! విభూతి, లాకెట్, ఉంగరంలాంటి వాటిని సృష్టించ డానికి నేను పెద్దగా విలువివ్వను. కారణం అవన్నీ జడపదార్థములు కనుక ఏదైనా నలుగురి మధ్య నడయాడగలిగిన సజీవ ప్రాణినొకదానిని సృష్టించగలిగితే, దాన్ని ఘనంగా భావిస్తాను" అని చెప్పాడట.

బాబా చిరునవ్వుతో ఆయన సవాలు స్వీకరిస్తూ "సరే అలా అయితే నావంక చూడు...నాచేతుల్లో ఏముంది?" అని అడుగుతూ తన చేతులను చూపించాడు. "చేతుల్లో ఏముంది? అవి వట్టి చేతులే కదా!" అన్నాడట ఆ పెద్ద మనిష. అప్పుడు బాబా తన ఎడమ అరచేతిపై కుడి అరచేతిని మోపి మూడుసార్లు ఆయన కెట్టి సంశయం రాకుండా వుండేందుకు గాను మరల, మరల మూసిన చేతులను తెరచి చూపి, ఆఖరు సారిగా చేతులను మూసిపెట్టి "మీరొక ప్రాణి నడిగారు గదా!.. ఏప్రాణి కావాలో చెప్పండి." అన్నారుట బాబా. అప్పుడు ఆ పెద్ద మనిషి ధీమాతో తడుముకోకుండా ఒక "కోతి" కావాలన్నాడట. అంతే...బాబా నిశ్చల మనస్కులై తన కుడిచేతిని 3-4 అంగుళాలు పైకెత్తగానే రెండు చేతుల మధ్య ఒక కోతి పిల్ల ప్రత్యక్షమైంది అప్పుడా అమెరికన్ ఆశ్చర్యంతో "ఓ! బాబా! బేబీ మంకీ, లవ్లీ మంకీ, బహుత్ సుందర్ ప్యార్ వానర్‌కా బచ్చాహై" (చాలా అందమైన కోతి పిల్ల) అని అన్నాడట. బబా రెండవసారిగా తన కుడిచేతిని మరి 3-4 అంగుళాలు పైకె

ఎత్తగా ఆ చేతుల మధ్య నున్న పిల్లకోతి మరింత పెరిగి యువకోతిగా మారి కిచకిచలు ప్రారంభించింది. అప్పుడు ఆ పెద్ద మనిషి "OH my lord, He is Speaking" (ఓ బాబా! అది పెద్దదై మాట్లాడుతుంది కూడానే!) అని విస్తుపోయాడట.

మూడవసారి బాబా తన చేతిని షుమారు 15 అంగుళాల వరకు పైకి ఎత్తగా ఆ కోతి పూర్తిగా పెద్దదై అరచేతి పై నుండి దూకి, దగ్గరలో నున్న కుర్చీలపై బీరువాలపై గంతులు వేయండ ప్రారంభించిదట తన కళ్లముందు జరిగిన ఈ అపూర్వ సంఘటన ఆ అమెరికన్ వ్యక్తిని సంభ్రమాశ్చర్యాలలో ముంచెత్తింది. అయితే.. ఆ వ్యక్తి పాశ్చాత్య పండితుడు గదా! బాబా దివ్య శక్తులను ఆఖరిసారిగా పరీక్షింప బూనుకున్నాడేమో నన్నట్లుగా "బాబా! ఆ కోతి పిచ్చిగోల చేస్తున్నది. అది మన సంభాషణలకు అంతరాయం కలిగిస్తున్నది. దయచేసి దానిని శాంతింపజేయండి.' ' అని కోరాడట. అప్పుడు వెంటనే బాబా ఒక అరటిపండు సృష్టించి ఆ కోతి వైపునకు విసరగా అది దాన్ని తింటూ కూర్చుంది. దానితో అమెరికన్ సజ్జనుడు అవాక్కయిపోయాడు. బండెడు సందేహాలతో, అపనమ్మకాలతో వచ్చిన ఆయన మనస్సు భక్తిశ్రద్ధలతో నిండిపోయింది. ఆయన తన అల్పజ్ఞత నంగీకరిస్తూ, వంగి బాబా పాదపద్మములకు నమస్కరించాడు. అప్పుడు బాబా ఇలా అన్నారుట. "చూడు! ఈ సాయి శూన్యం నుండి ప్రాణిని సృష్టించగలడు. మరల అదే ప్రాణిని అలాగే శూన్యంలోకి పంపించనూగలడు" అంటూ బాబా ఆ వానరాన్ని పిలిచి మరల అరచేతుల మధ్య యిమిడ్చారు. నిశ్చలత్వంతో ఆయన తన చేతులను దగ్గర దగ్గరకు చేర్చిన కొలదీ ఆ వానరం చిన్నదైపోతూ చేతులు మూయగానే అది అదృశ్యమైపోయింది. బాబా చిరునవ్వుతో వట్టిచేతులను ఆ అమెరికన్ ఆగంతకునికి చూపించగా.. అతను తల వంచి వినయవిధేయతలతో బాబాకు నమస్కరించాడుట. ఈ అపూర్వసంఘటనను గురించి ఆ అమెరికన్ ప్రశాంతి నిలయంలో నున్న పోష్టాఫీసు ద్వారా బాబా దివ్యశక్తులను గురించి, వారి అసాధారణ వ్యక్తిత్వం పట్ల తనకు కలిగిన అనుభూతులను టెలిగ్రాం ద్వారా తన ఇంటికి తెలియబరిచాడుట. ఈ వివరాలు ఆ పోష్టు మాస్టర్ ద్వారా వెలుగులోనికి వచ్చాయట.

ఈ ఉదంతం స్వామీ మహేశ్వరానందజీ రచించిన "శ్రీ నరనారాయణ గుహాశ్రయం" అనే హిందీ పుస్తకము నుండి సేకరించబడినది. ఆ పుస్తకంలో భగవాన్ బాబా ప్రదర్శించిన మహిమలెన్నో పేర్కొన బడినాయి ఆ పుస్తకమునకు ఆచార్య బి. రామరాజు ముందుమాట వ్రాశారు. ఆ పుస్తక ప్రకాశకులు : శ్రీ ఎం. వెంకటేశ్వరరావు, శ్రీ సత్యసాయి పబ్లికేషన్స్, 1-8-522/22, చిక్కడ్‌పల్లి, హైదాబాద్

*నవంబరు - 1989*

# గిద్దలూరులో భగవాన్ శ్రీ సత్యసాయిబాబా మహిమలు

- కుందుర్తి రాజేశ్వరప్రసాద్, గిద్దలూరు

విశ్వమంతా తన రూపమేనని మానవులకు తెలియజేయుటకు మహా పురుషులు అన్ని యుగాలలో దైవస్వరూపులుగా జన్మించి ధర్మ స్థాపనమునకు మానవ కళ్యాణమునకు తోడ్పడుదురు. తమ క్రియలవల్ల, జీవన విధానం వల్ల మానవుల మనస్సులయందు మార్పు రావించి వారిని ధర్మాచరణవైపు నడిపింతురు. 19, 20 శతాబ్దంలో ఇలా వెలసిన మహాపురుషులలో శ్రీ షిర్డి సాయిబాబా, భగవాన్ సత్యసాయిబాబా, రమణమహర్షి మొదలగువారు కలరు. శ్రీ షిర్డీ సాయిబాబా తాను భౌతిక దేహాన్ని వదలినప్పటికీ తన భక్తుల క్షేమాన్ని కాపాడుతూ వుంటానని అనేక నిదర్శనాలు భక్తులకు కలిగించుచున్నారు. మన మధ్యవున్న భగవాన్ శ్రీ సత్యసాయిబాబాగారు మరిన్ని నిదర్శనాలతో భగవంతుని ఔన్నత్యాన్ని భక్తులకు తెలియజేయుచున్నారు.

1984వ సంవత్సరంలో గిద్దలూరు పట్టణమందు భక్తులకు ఈ విధమైన అనుభవాలు కలగడం నిజంగా భక్తుల అదృష్టము. 1984వ సంవత్సరం గిద్దలూరునందు వైద్య ఆరోగ్యశాఖలో పనిచేయుచున్న శ్రీ వై.యన్. గోపాలశర్మగారి ఇంటియందు శ్రీ భగవాన్ సత్యసాయి పటంనందు విభూతి రావటం భక్తులందరూ చూచారు. కానీ విభూతి ఏ విధంగా వచ్చేది, ఎప్పుడు వచ్చేది ఎవ్వరికీ స్పష్టంగా తెలియదు. దాదాపు ఒక నెలరోజులు ఈ విధంగా రావటం జరిగింది. బాబా చిత్ర పటాలపై ఊదీ రావటం మరో విచిత్రం.

ఇదే పట్టణంలో మరో విచిత్రం అందరినీ ఆశ్చర్య పరచింది. 1984 మే నెలలో కుందుర్తివారి ఇంట్లో విభూతి రావటం గమనించాము. షిర్డీసాయి, సత్యసాయి పటాలు ఒకే ప్రాంతంలో వుండేవి. ఆ పటాల నిండుగా విభూతి వచ్చింది. ఇవే పటాలనుండి కలకండ, చిన్న బంతి పరిమాణంలో విభూతి పండ్లు రావటం గమనించాము. వారిలో కొందరు విభూతి ఏమి చేయుటకు? టాల్కమ్ పౌడరైతే ముఖమునకు సౌందర్యమునకు పనికివచ్చునని పరిహసించిరి. భగవంతుడు ఈ మాటలకు జవాబు చెప్పదలిచాడో ఏమో! అన్నట్లు మరుసటిరోజు ఉదయం బాబా పటములున్న ప్రాంతమంతటా సువాసనతో నిండిన టాల్కమ్ పౌడర్ వుండినది. దీనిని తొలగించిన కొలది మరల మరల సువాసనతో నిండిన పౌడర్ ఆ దినమంతా వచ్చినది. ఇవి తమకు మంచిది కాదన్న అభిప్రాయంతో వారు ఆ చిత్రాలను వేరొకచోట భద్రపరిచారు. ఈ పౌడర్ విదేశాలలో తయారయిన పౌడర్లకన్న మేలురకంగా వుండినది.

ఇదే సంవత్సరం మార్చి నెలలో కీ॥శే॥ కుందుర్తి పరమానందంగారి ఇంటియందు షిర్డీనుండి విగ్రహం పూజచేయించి తెచ్చి ఇంటియందు అల్మరాయందు వుంచారు. మొదట కొన్నిరోజులు విగ్రహం చుట్టూ విభూతి రావటం గమనించాము. ఈ విభూతి పరిమాణం ఒక్కొక్కప్పుడు ఎక్కువగానూ, మరొకప్పుడు తక్కువగానూ వుండేది. ఈ విభూతి షిర్డీ నందలి ద్వారకమాయిలోని ధునిలోని ఊదిని పోలి యుండేది. వచ్చిన విభూతి పూర్తిగా పంచిపెట్టబడిన తరువాత వచ్చే విభూతి ఎక్కువగా వుండేది. ఇదే సంవత్సరం జూన్ నెలలో ఒకనాటి సాయంత్రం భజన అనంతరం హారతి ఐన తరువాత బాబా పాదముల వద్ద రెండు కలకండ ముక్కలు వుండటం గమనించాము. అప్పటినుండి బాబా విగ్రహంనుండి కలకండ ముక్కలు వచ్చాయి. ఈ కలకండ ముక్కల పరిమాణం ఒక్కొక్కప్పుడు విగ్రహంతో సమానంగా వుండేవి. బాబాకు నివేదనగా వుంచిన ఆహారపదార్థాలపై విభూతి స్పష్టంగా గమనించాము. ఈ విభూతి విగ్రహం నుండి గత మూడు సంవత్సరాలుగా వచ్చుచున్నది. ఇంతేకాక విగ్రహంనుండి పూలు, అక్షింతలు కూడా వచ్చాయి. విగ్రహమున్న ప్రాంతం సువాసనతో నిండి వుండును.

ఒకసారి శ్రీమతి గిరిజగారు విగ్రహం ముందు నిలబడి షిర్డిసాయి, సత్యసాయి ఒకరే ఐతే సత్యసాయిలో కూడా విభూతి రావాలి కదా? అని ప్రశ్నించారు. ఈ మాటలు అనిన కొలది సేపటికే సత్యసాయి పటం నుండి కూడా విభూతి వచ్చి అది షిర్డి సాయి విగ్రహం వరకు వ్యాపించింది. మానవాతీత శక్తి ప్రపంచాన్ని నడిపిస్తుందనటానికి మరో నిదర్శనం అవసరం లేదేమో! విగ్రహం నుండి విభూతి వచ్చే విషయం షిర్డీనుండి వెలువడే శ్రీ సాయిలీల (ఇంగ్లీషు) మాసపత్రిక మే 1987 సంచికలోనూ, హైదరాబాదు నుండి వెలువడే సాయిప్రభ (తెలుగు) మాసపత్రిక జనవరి 1985 సంచికలో ప్రచురితమయింది. 1984వ సంవత్సరంలో పి.ఆర్. నగర్‌నందు డా॥ రాజగోపాలరావు ఇంటియందు బాబా పటమునుండి తేనె రావటం కూడా గమనించినట్లు భక్తులు తెలియజేశారు. చాలామంది భక్తులు పాలలో శ్రీ సత్యసాయి స్వరూపాన్ని స్పష్టంగా చూడగలిగారు. ఇన్ని వింతలు గిద్దలూరులోనే జరగటం విశేషము.

*జనవరి - 1988*



# భగవాన్ సాయి దివ్యలీలలు

- చీతిరాల బాలకృష్ణమూర్తి, గిద్దలూరు

పురాకృత కర్మఫలం అనుభవించక తప్పదు. కానీ మహాత్ములు తమ కరుణార్ద్ర దృష్టిచేత తమనే నమ్ముకున్న వారిని ఉద్ధరించగలరు అన్న యీ సూక్తినాయెడల సార్థకమైనది.

నేను 1955 నుండి గ్యాస్టిక్ ట్రబుల్‌వల్ల బాధపడుతూ వుండేవాడిని. అనేక చికిత్సలు చేయించుకొని వివిధ ఔషధాలు సేవించి తాత్కాలికంగా స్వస్థత పొందేవాడిని.

పూర్వ పుణ్య ఫలంవల్ల నేను భగవాన్ శ్రీ సత్యసాయిబాబాగారిని గురించి విని వారి దర్శనం కోసం 1979వ సంవత్సరంలో కొందరు మిత్రులతో కలసి పుట్టపర్తి వెళ్ళినాను. వెళ్ళడంలో ప్రధాన ఉద్దేశ్యం ఒక మహాత్ముడు అవతరించినప్పుడు వారిని దర్శించడం మానవునిగా నా విధి అని నేను అనుకోవడమే.

"దైవం మానుష రూపేణా" అని పెద్దలవల్ల విన్నందున పరమాత్మ స్వయంగా రామకృష్ణాది అవతారాలలో వచ్చి తన్ను నమ్మిన కోట్లాది బద్ధ జీవులను ఉద్ధరించినట్లు పురాణములు చెప్పివున్నందున, భారతీయ సంస్కృతీ సంప్రదాయాల ఎడల అచంచల విశ్వాసం వున్నందున నేను శ్రీవారిని దర్శించినాను. అంతేకానీ నా వ్యాధిని నివారించమని అర్థించేందుకు కాదు.

శ్రీ బాబావారిని దర్శించిన లగాయితూ గిద్దలూరు పట్టణంలో నా మిత్రులు, డాక్టర్ శ్రీ పి.సి. రంగారెడ్డిగారి సహచర్యంతో సాయీ భజనలు చేయటం తదితర ఆధ్యాత్మిక కార్యక్రమాలలో ఆసక్తిగా పాల్గొంటూ వుండేవాడిని.

1980 సంవత్సరంలో నా వ్యాధి ముదిరి అన్నపానీయములు వదలి ఒక నెలరోజులు మంచం పట్టాను. నాకు గానీ, నా ఆప్తబంధు మిత్రాదులకు గానీ నేను బ్రతుకుతానన్న ఆశ లేదు. కానీ మా శ్రీమతి "ఏమండీ మీరు సదా బాబానే చింతన చేస్తూ వారి కార్యక్రమాల్లో పాల్గొంటున్నారు కదా! ఈ ఆపత్సమయంలో ఆ దయామూర్తిని ప్రార్థించి వారితో ఇంటర్వ్యూ పొంది ఎందుకు ఉపశమనం పొందకూడదు!" అని సూచన చేసింది.

సాయిని నేను సేవిస్తున్నది ప్రతిఫలం కోసం కాదు. నేను ఆయనతో ఇంటర్వ్యూ కోరవలెనని నాకభిలాష లేదు. స్వప్న దర్శనం యివ్వమని అర్థించలేదు. ఎన్నిసార్లు పుట్టపర్తి వెళ్ళినా దూరాన్నుంచే వారిని దర్శించుకొని తృప్తిపడేవాణ్ణి.

"అల్పమైన యీ నా వ్యాధిని తొలగించమని వారిని కోరే కంటే మరణమే శరణ్యమని తెలుస్తాను" అని నేను జవాబు యిచ్చితిని.

కానీ సర్వాంతర్యామియైన, పరమాత్మకు తనను నమ్మినవారి బాధలు తెలియునా? బిడ్డ అవసరాలు తల్లి తనంతట తానే తెలిసికొని తీర్చడంలేదా? అలాగే నా భక్తి నిజమైన ఎడల స్వామియే తనంతట తానే నన్ను ఆదుకుంటారు అని మా శ్రీమతితో చెప్పాను. మరియు నేను నా జబ్బు విషయం చెప్పితేనే, వారికి తెలిస్తే వారు ఏలా భగవంతుడవుతారు అని కూడా చెప్పడం జరిగినది.

అదే రాత్రి స్వప్నం కాని స్వప్నం, జాగ్రదవస్థాకాని జాగ్రదవస్థ, స్వయంగా బాబా నా పడక దగ్గరకు వచ్చి "ఏమి బంగారూ బాధపడుతున్నావా? నేనుండగా నీకు భయమెందుకు. లే! నీ వ్యాధి పోయిందిలే" అంటూ విభూతి నోటిలో వేసి అంతర్థానమయ్యారు. చేతితో తీసివేసినట్లుగా నా వ్యాధి సంపూర్ణముగా నివారణమై నేనిప్పుడు పూర్తి స్వాస్థ్యంతో స్వామి సేవ చేయగలుగుచున్నాను. నా హృదయ మందిరంలో స్వామిని నిలుపుకొన్నాను. సాయి చూపిన యీ దివ్యలీల స్మరించినపుడల్లా నాకు గీతలోని శ్లో॥ అనన్యాశ్చింతయంతోమా... వహామ్యహం అన్న శ్లోకం యదార్థమని స్వానుభవంగా నిర్థారణమై కన్నులు అశ్రుపూరితాలవుతూ వుంటవి.

*జనవరి - 1988*



*"జీవితమొక్క రైలు ప్రయాణం వంటిది. చిన్నవారైన వారు చాలా దూరము ప్రయాణము గావించవలసి యున్నది. కానీ, పెద్దవారు త్వరలో రైలు బండి దిగవలసి ఉన్నది. మీ యీ ప్రయాణం, సదుపాయంగా, ఆనంద దాయకంగా ఉండునట్లు చేసుకొండి. వెంట ఈర్ష్యా ద్వేషములు, అసూయా క్రోధములు అనే భారమైన, బాధావహమైన అనవసర సామాగ్రిని ఉంచుకొనవద్దు. అవి ప్రయాణమును దుఃఖ దాయకము గావించుతాయి. ఇతరుల లోపములెన్ని వారితో తగవులాడరాదు. అన్ని మంచి వస్తువులు మీకే కావలెనని కోరవద్దు. ఉన్నవాటిని అందరితో పంచుకొనండి".*

**- బాబా**

# కరుణామూర్తి భగవాన్ బాబా

- ఎ. ఆదిలక్ష్మి, మద్రాస్

మేము సామాన్య కుటుంబీకులం. మావారికి ఆరోగ్యం సరీగా వుండేది కాదు. మధుమేహం, గుండె జబ్బు, రక్తపుపోటు వగయిరాలతో బాధపడుతుండేవారు. నేను 1958 నుండి భగవాన్ బాబాను ప్రతి సంవత్సరం దర్శించుకొనేదానిని. అయితే మావారు మాత్రం స్వామి మద్రాసు వచ్చినప్పుడు మాత్రం దర్శించుకొనేవారు. కాని పుట్టపర్తి వచ్చేవారు కాదు. నేను కోరికలు మనసులో పెట్టుకొని వెళ్లలేదు కాబట్టి స్వామి మొదటి పర్యాయమే నాకు ఇంటర్వ్యూని ప్రసాదించారు. 1972లో ఒక పర్యాయము సకుటుంబముగా పుట్టపర్తి వెళ్లదలిచాం. అంతకుముందు ఒకరోజున మావారిని ఆఫీసుకు పంపి ఇంట్లోకి వచ్చాను. ఈలోగా ఒక సాధువు మా గేటు వద్దకు రాగా మా అబ్బాయి ఆయనను చూచి లోపలికి రమ్మనమని పిలవనా! అని అడిగాడు. ఇంతలోనే ఆ సాధువు సరాసరి ఇంట్లోకి వచ్చి కుర్చీలో కూర్చో వచ్చునా! అని అడిగాడు. సరే అన్నాం. ఆ సాధువు కుర్చీలో కూర్చొని మీ వారికి ఆరోగ్యం సరీగా లేదు. పుట్టపర్తి పోదలిచారు గదూ! అని హిందీలో అంటూ ఇప్పట్లో అచ్చటికి వెళ్లవద్దు. ఇచ్చటినుంచే ప్రార్థించుకోండి. నేను ప్రసాదం యిస్తాను, వాడుకోండి అని చెప్పి కాగితం తీసుకోని రమ్మన్నాడు. కాగితం యిచ్చాం. దానిమీద 'ఓం' అని వ్రాసి మడిచి యిచ్చాడు. దానిని లోపలికి తీసుకొనివచ్చి విప్పిచూడగా దానిలో విభూతి ప్రసాదం వున్నది. అనుమానం వచ్చి దానిని ప్రక్కన పెట్టాను. ఈలోగా మా కొడుకు కోడల్ని పిలిచి అమృతం యిస్తున్నారు. నాకు భయం వేసింది. నన్ను చూచి నీ కొడుకు ఏమైపోతాడేమోనని భయపడుతున్నావా? అంటూ నాకు కూడా అమృతం యిచ్చి త్రాగవద్దని తలకు పూసుకోమ[illegible]రు. మీరు మాత్రం పుట్టపర్తి వెళ్లవద్దని చెప్పి ఆ సాధువు వెళ్లిపోయాడు. [illegible]లోగా నడవలేని మావారు స్టేషన్‌కు వెళ్లి బెంగుళూరువైపు టిక్కెట్లు కో[illegible]ు. మేమందరం బెంగుళూరువెళ్లి పుట్టపర్తికి కారులో వెళ్ళాం.

ఆరోజు వైకుంఠ ఏకా[illegible] స్వామి ప్రసంగంలో ఎప్పుడూ ఓనమ[illegible] చెబుతుంటే అ ఆ లు వచ్చే[illegible]ప్పడు? అన్నారు. మాకు స్వామి ఆ ఇంటర్వ్యూను ప్రసాదించలేదు[illegible]ాదము కూడా యివ్వలేదు. ఐదురో[illegible] తిరిగి వచ్చాము. అప్పుడు అ[illegible]యింది ఇంటికి వచ్చిన స్వామి బాబాగారేనని. ఆయన వద్ద[illegible]్మాము కాబట్టి మమ్ముల్ని స్వామి

స్వామిచేత అమృతం తీసుకోవాలనే కోరిక ఏనాటిదో. ఆ కోరికను స్వామియే స్వయంగా వచ్చి తీర్చారు. అప్పుడు గ్రహించలేకపోయాం. స్వామి మహిమలు తెలుసుకోవటం బహు కష్టం. స్వామి నిజంగా కరుణామూర్తియే.

స్వామి ఒకసారి మద్రాసు వచ్చారు. ఎవరో అపరిచితులు స్వామి రాకను ఫోన్ ద్వారా తెలియపరిచారు. అక్కడికి వెళ్ళాం. స్వామి అనుగ్రహించి ఇంటర్వ్యూను ప్రసాదించి ప్రసాదం యిచ్చి ఆశీర్వదించారు. మీవారు బలహీనంగా వున్నారు అంతే. వ్యాధి ఏమీ లేదంటూ ఎచ్చటికీ తీసుకొని పోవద్దన్నారు. అయితే కొంత కాలానికి బెంగుళూరు వెళ్ళాలని మావారు పట్టుపట్టారు. మేమంతా వెళ్ళాం. అక్కడ మా అందర్ని స్వామి పిలిచి నేను మీ కొరకు మద్రాసువచ్చి ఇంటర్వ్యూ యిస్తే మరల ఎందుకు యిక్కడికి వచ్చారు? అని అరచినారు. మేము చేసింది పొరపాటేనని బాధపడ్డాం.

మద్రాసులో స్వామి విభూతి యిచ్చిన తరువాత మావారికి కండ్లు బాగా కనిపించటం జరిగింది. వారి పనులు వారే చేసుకొనేవారు. ఆఫీసుకు ఎవరి సహాయం లేకుండా వెళ్ళివచ్చేవారు. అయితే స్వామి ఎచ్చటికీ రావద్దని చెప్పినా వినకుండా బెంగుళూరు వెళ్ళాం. స్వామి మా ఇంటికి వచ్చి తీర్థప్రసాదములు యిచ్చి ఆశీర్వదించి పుట్టపర్తి రావద్దన్నా వెళ్ళాం. ఆనాడు మేము గ్రహించలేక పోయాం. ఆరునెలల తరువాత మావారు ఎలాంటి బాధపడకుండా సునాయాసంగా పోయారు. స్వామి మాటలను అర్థం చేసుకోవటం చాలా కష్టం. అర్థంచేసుకొని ఆచరించినవారికి స్వామి అనుగ్రహం లభిస్తుంది. స్వామి ఆదేశించిన విధంగా నడచుకున్నవారు పొందుతారు అనుభూతిని. లేనివారు చింతించవలసి వస్తుంది అవసానదశలో.

*జూన్ - 1988*



*"అజ్ఞానమును మొదట రూపుమాపవలెను. ఆ అజ్ఞానమునకు ఒక అసుర కుమారుడు కూడా కలడు. వాడే 'అహంకారి' అట్టి అహంకారికి ఇద్దరు బిడ్డలు. అవియే రాగము, వాసన. రాగమునకు, వాసనకు దగ్గర సంబంధం కలదు. రాగమెచ్చటుండునో, వాసనా అచ్చటనే యుండును. రాగము వల్లనే మానవునకు 'మమత' కలుగుచున్నది".*

**- బాబా**

# అద్భుతమూర్తి అనుగ్రహం పొందిన అమెరికా మహిళ

- శ్రీమతి జాయ్ థామస్, అమెరికా

జాయ్ థామస్ (Joy Thomas) భర్త పేరు రాయె థామస్. (Raye Thomas) వీరు అమెరికాలోని కాలిఫోర్నియా పట్టణమునకు చెందినవారు. భగవాన్ బాబాను సందర్శించడానికి ఇండియా రావటం వీరికి ఇది ఏడవసారి. 1981 సం॥లో మొదటిసారి వచ్చారు. శ్రీమతి జాయ్ థామస్ భగవాన్ బాబాతో తన అనుభవాలను, అనుభూతులను వివరిస్తూ ఒక పుస్తకం కూడా వ్రాసి ముద్రించింది. దాని పేరు "Life is a Game, Play it!" వీరుభయులు ది 30-11-1988న ప్రశాంతి నిలయం చేరుకున్నారు. ది. 1-12-1988 ఉదయం గం॥ 7-15 నిముషములకు వీరిని బాబా ఇంటర్‌వ్యూకు పిలిచారు. నడవలేక చక్రాల కుర్చీ (Wheel Chair) లో వచ్చిన జాయ్‌థామస్‌ను ముగ్గురు వలంటీర్లు అతి కష్టము మీద వరండాలోనికి చక్రాల కుర్చీతో సహా తీసుకొని వచ్చారు. తరువాత స్వామి ఆమెవద్దకు వచ్చి ఏదో అనటం (దూరంగా ఉన్న మాకు వినిపించలేదు) వెంటనే ఆమె లేచి నిలబడటం, నడుస్తూ ఇంటర్‌వ్యూ గదిలోనికి వెళ్ళిన దృశ్యమును చూచి ప్రశాంతి మందిరమునకు ఎదురుగా కూర్చుని ఉన్న భక్తులు చప్పట్లు కొట్టారు. ఇంటర్‌వ్యూ అనంతరం ఆమె బయటకు నడచివస్తుంటే, మరల భక్తులు చప్పట్లు కొట్టారు. ఈ దృశ్యమును చూచే మహద్భాగ్యం నాకూ కలిగింది. ఆ రోజుల్లా ఆమెకోసం ప్రశాంతి నిలయమంతా గాలించాను. రాత్రి గం॥ 7-00లకు R.I; G 4 గదిలో ఆమెను కలిసి వివరాలు తెలుసుకొనినాను. ఆమె ఇంగ్లీషులో వ్రాసి ఇచ్చిన వ్యాసము యొక్క తెలుగు తర్జుమాను, ఆమెతో కలిసి తీసుకొనిన ఛాయా చిత్రమును శ్రీవాణి పాఠకులకు అందిస్తున్నాను. భగవాన్ బాబా దివ్యశక్తికి ఇది ఒక నిదర్శనం. సం.)

సరీగా ఒక సంవత్సరం క్రిందట (డిశంబర్ 1987) నేను నా భర్త భగవాన్ బాబా సన్నిధిలో కూర్చొని ఉండగా నా భర్త రాయె థామస్‌వైపు చూస్తూ "నీకేమి కావాలి?" అని బాబా అడుగగా "నా శ్రీమతి మోకాలు నొప్పిని నయం చేయండి" అని నా భర్త కోరారు అప్పుడు స్వామి నా మోకాలును స్పృశించి "నీవు వెళ్ళేముందు శివలింగం యిస్తాను" అన్నారు బాబా. తరువాత మమ్ము ఇంటర్‌వ్యూకు పిలిచి ఒక అందమైన స్ఫటిక జపమాలను సృష్టించి యిచ్చారు. అయితే బాబా వాగ్దానం చేసిన శివలింగం మాత్రం యివ్వలేదు.

నేను నా భర్త ఈ సంఘటనను గురించి అనేక సందర్భాలలో చర్చించుకున్నాం. బాబాగారెన్నడూ వాగ్దాన భంగం గావించరనే నమ్మకం

మాకున్నది. అయితే బాబా యిస్తానన్న శివలింగం యివ్వలేదనే బాధతో తిరిగి అమెరికా వెళ్ళాం. అమెరికాలో చాలామంది మిత్రులు మమ్ము ఆహ్వానించి స్వామిని గురించి చెప్పమని కోరారు. శివలింగం ఇస్తానని చెప్పి జపమాలను యివ్వటంలోని ఉద్దేశ్యమేమిటోయని చాలామంది మిత్రులు మాతో చర్చించారు.

ఒకరోజున నా స్నేహితురాలు ఫోన్‌లో నన్ను పిలిచి "మీకింకా సనాతన సారధి రాలేదా?" అని అడిగింది. రాలేదన్నాను. అప్పుడు ఆమె సనాతన సారథిలోని విషయాలను ఫోన్‌లోనేచదువుతూ "స్వామి మూర్తీభవించిన దయా స్వరూపం. మన తప్పలను తప్పనిసరిగా క్షమిస్తారు. మిమ్ములను ఏ మూలసూత్రమైతే రక్షిస్తూ ఆధ్యాత్మిక మార్గంలో ముందుకు నడిపిస్తుంటుందో ఆ మూల సూత్రమే లింగం. ఆ లింగమే చైతన్యశక్తి యొక్క కేంద్రం. దానిచుట్టూ అంతర్, బాహ్యా ఇంద్రియములు మూగి ఉంటాయి" అని ఆమె చదివింది. ఈ క్రొత్త విశదీకరణ నాకు చాలా ఆనందం కలిగించింది. అయితే నా కాలి నొప్పి నయం కావటానికి దీనికి గల సంబంధం మాత్రం నాకు వెంటనే అర్థం కాలేదు. స్వామి వారు చేయాలని అనుకొనే కార్యం మాత్రం ఆరంభమైనదని తేట తెల్లమైంది. ఎట్టి ఆందోళన పడకుండా ఉంటూ, ఉత్సాహంగా, ఉండటం మాత్రమే నేను చేయవలసిన పని అని గ్రహించాను. ఈ నాటకంలో నేను కేవలం సాక్షిని మాత్రమేనని ఊహించగలిగాను.

నెలలు గడిచిపోతున్నాయి. నా ఆలోచనలలోని తప్పలు, నా ప్రవర్తన, నా నిర్ణయాలు తేటతెల్లముగా నాకే తెలియుచున్నాయి. నా తప్పల విషయంలో ఒక దాని తరువాత ఒకదానిపై అవసరమైన చర్యలను తీసుకొని సరిదిద్దుకుంటున్నాను.

నా మోకాలినొప్పి బాధ పుట్టినప్పటినుండే ఉన్నది. కొంతకాలం ఈ సమస్య అప్రధానంగా ఉన్నది. గత ఐదారు సంవత్సరాలనుండి మాత్రం పూర్తిగా కదలలేనంత ప్రబలింది. వైద్యులు పదేళ్ళకు పూర్వమే మోకాలు జాయింటును తీసివేసి కృత్రిమ జాయింట్‌ను వేయాలన్నారు. అసలు నడువలేని స్థితి ఏర్పడుతుందని ఆనాడే చెప్పారు. చక్రాల కుర్చీ సహాయంతో నా పనులను పూర్తి చేసుకోవటానికి అలవాటుపడ్డాను. 1988 నవంబరు 30వ తేదీకి ప్రశాంతినిలయం చేరుకున్నాం. డిశంబర్ 1వ తేదీన బాబా మమ్ములను ఇంటర్‌వ్యూకు పిలిచారు. వాలంటీర్లు అతి కష్టంతో, నేను కూర్చొనిన చక్రాల కుర్చీతో సహా నన్ను వరండాలోనికి తీసుకొని వెళ్ళారు. బాబా నా వద్దకు వచ్చి "పైకిలే! పైకిలే! (Get up! Get up!)" అన్నారు. నేను లేచి నుంచున్నాను. "లోపలికి వెళ్ళు!" (Go inside) అన్నారు. నేను ఇంటర్‌వ్యూ గదిలోనికి నడిచి వెళ్ళాను. ఆనాటి ఇంటర్‌వ్యూ గదిలో నాతోపాటు 25 మంది వున్నారు. ఆత్మవిశ్వాసము యొక్క ప్రాముఖ్యతను, అవశ్యకతను గురించి బాబా

నొక్కి వక్కాణించారు. విశ్వాసమే దైవమని చెప్పారు. భగవంతునిపై విశ్వాసం వుండాలని, ఎవరి శక్తిమీద వారికి సంపూర్ణ విశ్వాసం వుండాలని బోధించారు. ఇంటర్వ్యూ అయిపోయింది. నేను చక్రాల కుర్చీనద్దకు వెళ్ళాలా! వద్దా! అనే విషయంపై నాలో కొంత తర్జన భర్జన జరిగింది. భగవంతునిపై విశ్వాసంతో, స్వామియే భగవంతుడనే నమ్మకంతో, నేనే దేవుడననే భావంతో ముందుకు నడిచాను. ఈ బాధలు శరీరానికి మాత్రమే సంబంధించినవనే భావం నాలో వుండటంవలన నాకు మోకాలినొప్పి అనిపించలేదు. మందిరం నుండి నేను నివసించే ఆర్-1 బ్లాకుకు సునాయాసంగా నడిచివెళ్ళగలిగాను. వచ్చేటప్పుడు చక్రాల కుర్చీలో వచ్చిన, నేను, వెళ్ళేటప్పుడు నడిచి వెళ్ళటం చూచిన వారందరూ ఆశ్చర్యపోయారు.

స్వామీజీకి ఈ మధ్య తొంటె విరిగినప్పుడు బాధ యెడల వారు ప్రదర్శించిన నిర్లిప్తతనే నేను కూడా అనుసరించి బాధపై మనస్సును లగ్నంచేయకుండా నా విధి నిర్వహణలో నిమగ్నమయ్యాను. సాయంత్రం దర్శనానికి కూడా నడిచివెళ్ళి నడిచిరావడంతో చాలామంది మిత్రులు ఆశ్చర్యంతో ఇది మహిమ! (Miracle) కాదా! అని అడిగారు. అప్పుడు నేను అవును మరియు కాదు అని సమాధానం చెప్పినాను. ప్రకృతి సిద్ధాంతమును నిర్లక్ష్యం చేసేది మిరకిల్. కాని ఇది అద్భుతం (Miracle) కాదు. స్వామి ప్రకృతి సిద్ధాంతాన్ని పూర్తి (Ful-Fil) చేశారు. స్వామి అత్యున్నతమైన సిద్ధాంతాలకు అనుగుణంగా జీవిస్తున్నారు. వారు మన కోసం పనిచేయటంలేదు. వారి అడుగుజాడలలో నడవటం ఎట్లాగో మనకు చూపుతున్నారు.

స్వామి నన్ను పైకిలే! అని ఆదేశించినప్పుడు, వారి మీద ప్రగాఢమైన విశ్వాసంతో లేచి నుంచున్నాను. స్వామి ఎన్నడూ శక్తికి మించిన పనిని నాచేత చేయించరనే విషయం గ్రహించాను. బాధనుండి మన ఆలోచనను దూరం చేయటం ఎట్లాగో ప్రపంచానికి స్వామి తెలియపరచారు. ఆ విశ్వాసంతోనే నడిచాను. మిరకిల్ అంటే కేవలం శరీరం చేసే పనులలో అభివృద్ధి మాత్రం కాదు. భక్తుల అవసరాలను గుర్తించి వారి ప్రేమను ప్రభావితం చేసి, విశ్వాసమును పంచి చిట్ట చివరకు సృష్టిలోని ఏకత్వాన్ని గుర్తించేటట్లు చేసి, వారిని అద్వైత స్థితికి చేర్చునదే మిరకిల్. స్వామి చేసేది సాధారణ మిరకిల్ కాదు. స్వామి ప్రదర్శించేది అనంతమైన దివ్యశక్తి.

*డిశంబరు - 1988*



# బ్రిగేడియర్ బోస్ పునర్జన్మ

- చన్నాప్రగడ లక్ష్మీనరసింహమూర్తి పుట్టపర్తి

అందరినీ ఆశ్చర్యంతో పులకితులను చేసే ఆ అద్భుత సన్నివేశం పునరావృతం అయ్యింది. పూర్వం కుప్పం రాధాకృష్ణ, కరణం సుబ్బమ్మ, వాల్టర్ కోవన్‌లు ఏ విధంగా అమృత స్పర్శతో జీవితులయ్యారో, అదే విధంగా బ్రిగేడియర్ బోస్ వేలాది భక్తుల కండ్లఎదుట మృత్యుదేవత కరాళ కోరలనుండి కలియుగ అవతారమైన భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారి అమృత కర స్పర్శతో రక్షింపబడి, పునర్జీవితులయ్యారు.

అది అక్టోబర్ 20, 1988 గురువారం, విజయదశమి పర్వదినం, ఉదయం గం॥ 9-00 ల సమయం. ప్రపంచ నలుమూలల గల దేశదేశాలనుంచి వచ్చిన వేలాది భక్తులతో పూర్ణచంద్ర మండపం క్రిక్కిరిసిపోయింది. అప్పడే వేదపురుష సప్తాహయజ్ఞం ముగిసి పూర్ణాహుతి జరిగింది. స్వామి విజయదశమి దివ్యోపన్యాసం మొదలెట్టి ప్రారంభ పద్యం ఆలపిస్తున్నారు. ఆంగ్ల అనువాదం ఇంకా మొదలు కాలేదు.

ఉన్నట్టుండి స్వామి పద్యం ఆపేశారు. వడివడిగా నడుచుకొంటూ పురుషుల వైపు స్టేజి చివరికి వచ్చారు. స్వామి వచ్చిన తీరు ఎవరినో 'చెంప ఛెళ్ళు' మనిపించేందుకు వస్తున్నట్లుంది. భక్తులందరూ అవాక్కై ఏం జరుగుతుందో అని ఊపిరి బిగపట్టుకొని ఉండిపోయారు. వేలకొలది కళ్ళు స్వామినే రెప్పవాల్చలేక ఉత్కంఠతో అనుసరించాయి. స్వామి చకచకా స్టేజి మెట్లు దిగి కుర్చీలలో కూర్చొన్న V.I.P. ల దగ్గరకు వచ్చారు.

బ్రిగేడియర్ S.K. బోస్ భారత సైన్యంలో చాల సంవత్సరాలు భారతదేశానికి ఎనలేని సేవ చేశారు. తరువాత పదిహేనున్నర సంవత్సరాలు 1959 నుంచి 1974 వరకు మొదట I.I.T. బొంబాయి, తరువాత I.I.T. ఖరగ్‌పూర్‌లకు డైరెక్టర్‌గా వీరు పనిచేశారు. అంతర్జాతీయ సంస్థ UNESCO పరంగా 1962లో నైజీరియాలో లాగోస్ విశ్వవిద్యాలయంలోనూ, 1964లో కొలంబోలో ఇనిస్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీలో ఇంజనీరింగ్ విభాగం ప్రారంభించేందుకు కన్సల్టెంట్ (Consultant) గా పని చేశారు. 1968లో UNESCO సహాయంతో ఆంధ్రప్రదేశ్‌లో వరంగల్‌లో శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ టెక్నలాజికల్ యూనివర్సిటీ స్థాపనకు ఏర్పడిన భారత ప్రభుత్వ సలహా సంఘానికి వీరు అధ్యక్షత వహించారు. 1970లో UNESCO పరంగా యునైటెడ్ అరబ్‌రిపబ్లిక్, కైరో ప్రభుత్వానికి టెక్నలాజికల్ కన్సల్‌టెంట్‌గా సేవచేశారు. 1975లో ప్రపంచ బ్యాంక్ సహాయంతో మన్‌రొనా యూనివర్సిటీ ఇంజనీరింగ్

విభాగం ప్రారంభించేందుకు మాస్టర్ ప్లాన్ తయారుచేశారు. శ్రీ బోస్ భారత దేశంలో అతి పెద్దదైన బరోడా రైల్వేస్టేషన్‌ను నిర్మించారు.

శ్రీ బోస్ 1973లో మొదటిసారిగా దసరా ఉత్సవాలలో మహర్నవమినాడు స్వామిని పూర్ణచంద్రలో దర్శించుకొన్నారు. అనుకోని విధంగా స్వామి వీరి ముందు నిలబడటం, వీరు పాదనమస్కారం చేసుకోవడం లిప్తకాలంలో జరిగిపోయింది. పుట్టపర్తి వస్తున్నట్లు ఎవరికీ తెలియజేయనప్పటికీ, అంత సందడిలోనూ, గదులు దొరకనప్పటికీ, స్వామి వీరికై ఒక గదిని ప్రత్యేకంగా ఉంచటం, వీరు వస్తున్నట్లు డా॥ గోకాక్‌గారితో చెప్పటం శ్రీ బోస్‌ను ఆశ్చర్యపరిచింది. 1974లో మరో మారు స్వామి దర్శనం చేసుకొన్నారు. I.I.T. డైరెక్టరుగా 1975లో పదవీవిరమణ చేసిన తరువాత స్వామి సేవకు అంకితమయ్యారు. 1975 నవంబర్‌లో స్వామివారి పుట్టినరోజు స్వర్ణోత్సవాల సందర్భంలో స్వామి వీరిచేత సర్వధర్మ స్థూపాన్ని నిర్మింపజేశారు. 1976లో వైట్ ఫీల్డులో శ్రీ సత్యసాయి కళాశాల విద్యార్థులకై మొదటి హాస్టల్ వీరు నిర్మించారు. 1977లో శ్రీ సత్యసాయి కళాశాలకు అనుబంధంగా 1000 సీట్లతో అతిథి గృహాలతో ఆడిటోరియం వీరు నిర్మించారు. పుట్టపర్తిలో 1979లో శ్రీ సత్యసాయి కళాల, 1982లో శ్రీ సత్యసాయి విశ్వవిద్యాలయ పాలక భవనం (అడ్మినిస్ట్రేటివ్) నిర్మించారు. ఇంతేకాక స్వామి వీరిచేత మరెన్నో భవనాలు నిర్మింపజేశారు. ఈ సంవత్సరం దసరాపండుగకు కొద్ది రోజుల ముందే ప్రశాంతిమందిరం ఆవరణ పూర్తిగా గచ్చువేయబడింది. ఈ పనిని భక్తుల సహాయంతో వీరు నిర్వహించారు.

V.I.P. వరుసలో చివరగా శ్రీ బోస్ కుర్చీలో కూర్చున్నారు. స్వామి దసరా పండుగకు అనుగ్రహించిన నూతన వస్త్రాలను ధరించారు. స్వామి యజ్ఞంలో నవరత్నాలను వేయడం, దివ్యాక్షతలను సృష్టించి హోమంలోనూ, అందరు ఋత్వికుల మీదను చల్లటం అంతా నేత్ర పర్వంగా చూస్తున్నారు. యజ్ఞం ముగిసింది. ఋత్వికులు చిత్రావతీనదీ స్నానానికి వెళ్ళటం కూడ జరిగింది. స్వామి దివ్యోపన్యాసం ప్రారంభించారు.

ఉన్నట్టుండి శ్రీ బోస్ కుర్చీలోంచి క్రిందకు ఒరిగిపోయారు. చుట్టూ ఉన్నవారిలో కలకలం మొదలయ్యింది. ప్రక్కనే ఉన్న డాక్టర్లు పరుగుపరుగున వచ్చి నాడి, శ్వాస పరీక్షించటం మొదలెట్టారు. డాక్టర్లు చేయగలిగింది అప్పటికే దాటిపోయింది. శ్రీ బోస్‌వారి పంచప్రాణాలు అప్పటికే శరీరాన్ని వీడి అనంతంలో లీనమైనాయి.

ఎవరైనా తనువు చాలించడానికి మంగళప్రదమైన సమయం ఏదైనా ఉంటే అది ఆరోజుకంటే మరొకటి కాలేదు. విజయదశమి పర్వదినం. శ్రీ షిరిడీసాయి

అవతారం చాలించిన దినం. గురువారం ఉదయం గం॥ 9-00ల సమయం. స్వామి మంగళరూపాన్ని కనులారా గాంచుతూ, చెవులారా అమృత వాక్కులు వింటూ స్వామిని చింతిస్తూ తనువు చాలించడం వేదపురుష యజ్ఞంలో నిజంగా "పూర్ణాహుతి" చెందడమే.

వయసు ఎనిమిది పదులలో ప్రవేశించినా రక్తపోటుగానీ, మధుమేహంగానీ, హృదయాఘాతం గానీ లేకుండా ఎప్పుడూ ఆరోగ్యంగా, ఉత్సాహంగా ఉండేవారు శ్రీ బోస్. పరమ భాగవతోత్తములు కూడ "అనాయాసేన మరణం. దేహిమే ప్రభో' అని పరితపించి పొందే మరణాన్ని అనాయాచితంగా పొందటంకన్నా భగవంతుని కోరుకోదగ్గ మరే వరం ఉంటుంది.

అయినా జగన్నాటక సూత్రధారి నాటకం కొనసాగించాడు. ఇక పాత్ర ఏ విధంగా నిష్క్రమిస్తుంది? స్వామి, తాము తలుచుకొంటే ఏమైనా చేయగలరనేదానినీ, భక్తుని రక్షించడానికై తాము ఎంతవరకు వెళ్ళగలరనేదానినీ, ఒక్కసారే నిరూపించారు. వేలాది భక్తులకు జీవితంలో మరువరాని దివ్యానుభూతినీ ప్రసాదించారు.

స్వామి పరుగులాంటి నడకతో, ఎత్తిన కుడిచేతిలో ఏదో కనబడనిదాన్ని జాగ్రత్తగా పట్టుకొని శ్రీబోస్ దగ్గరకు వచ్చారు. ప్రాణరహితంగా పాదాల వద్ద పడివున్న శ్రీబోస్ మీదకు వంగి తమ దివ్యకరముతో ఆయన శిరస్సు మీద గట్టిగా అదిమారు. "Get Up" అని అన్నారు. అంతే కాలకాలుని ఆజ్ఞను మీరే శక్తివుందా కాలునికి. ఏసుప్రభువు లెమ్మనగానే మృత్యువు నుంచి లేచిన లాజరస్‌లాగా శ్రీబోస్ కళ్ళు తెరిచారు. ఎదురుగా స్వామి పాదపద్మాలు. తక్షణమే భక్తిపూర్వకంగా ఆయన పాదనమస్కారము చేసుకొన్నారు. "Stand Up" అని స్వామి ఆదేశించారు. శ్రీ బోస్ గారు అంజలి ఘటిస్తూ లేచి నిలబడ్డారు. "Go and sit on the steps" అని మళ్ళీ ఆదేశించి స్వామి మందగమనంతో మనోహరంగా నడుచుకొంటూ వెళ్ళి తమ ఆగిపోయిన అమృతఝురిని కొనసాగించారు. భక్తులు జేజేలతో కరతాళ నాదులతో పూర్ణచంద్ర ప్రతిధ్వనించింది. శ్రీ బోస్ మెల్లగా నడచి స్టేజ్ సైడ్ మెట్లమీద కూర్చున్నారు. భక్తవత్సలుడు, ప్రాణదాత, కృతజ్ఞతా రూపధారి, స్వామిని మనస్సులో మరల మరల కృతజ్ఞతాంజలి సమర్పించుకొన్నారు.

తరువాత వేరొక సందర్భంలో మాట్లాడుతూ, స్వామి "అంతగా సేవచేసిన బోస్ మీద స్వామికి కృతజ్ఞత ఉండదా!! అందుకే బోస్‌ను బ్రతికించాను" అంటూ "My Life is my message" అనే తమ మార్గ సూత్రానికి మరోమారు ప్రాణం పోశారు.

*డిశంబరు - 1988*

# చిన్నగంజాములో శ్రీసత్యసాయి అద్భుతలీలలు

- డి. సుబ్రహ్మణ్యం, చిన్నగంజాము

భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారు మా చిన్న గంజాంలో అత్యద్భుత లీలలను ప్రదర్శించి మమ్ములను ఆశ్చర్యచకితులను గావించినారు. బాబావారి చిత్రపటమును మా పూజామందిరంలో ఉంచి భక్తితో స్వామికి పూజలు చేయుచూ సేవించుచుంటిమి. ఒక శుభసమయమున అనగా ది. 15-2-1986న భగవాన్ బాబా పటమునుండి 'దివ్య విభూతి' ప్రసాదించుట చూచి అనిర్వచనీయమైన ఆనందోత్సాహంతో స్వామి కృప మాపై కలిగినందులకు భక్తిపారవశ్యముతో ప్రణమిల్లితిమి. ఆ విధముగా నాలుగు రోజుల పాటు స్వామి పటమునుండి విభూతి, కొంత శ్రీగంధమును ప్రసాదించిరి. మరొక స్వామి పటములోని అభయ హస్తమునుండి కూడా దివ్యవిభూతి ప్రసాదించబడినది. ఒంగోలు, చీరాల పరిసర ప్రాంతముల నుండి వేలాది ప్రజలు స్వామివారి అద్భుత లీలలను కనులారాగాంచి తన్మయత్వంతో భజన కార్యక్రమాలలో పాల్గొని స్వామిని మనసారా సేవించినారు. అప్పటినుంచి స్వామి వారి లీలలు తరచుగా మా పూజామందిరములోనూ, మరియు మా గ్రామంలోని మరికొంత మంది గృహములలోను అనుగ్రహించబడినవి. మా గ్రామంలోనివారు అప్పటినుంచి ఒక సేవాసమితిగా ఏర్పడి స్వామి సేవా కార్యక్రమాలలో శక్తివంచన లేకుండా పాల్గొనటం జరుగుతుంది. ఉగాది పర్వదినము నందు "అమృతము" కూడా ఫోటో నుండి ధారగా ప్రవహించటం మరొక విశేషం.

## షిర్డీబాబాపై విభూతి

ది. 1-6-1956న "శ్రీ హనుమజ్జయంతి" సందర్భమున మా మందిరంలో "శ్రీ సత్యసాయి సహస్రనామ పూజ" మరియు భజన కార్యక్రమము నిర్వహించితిమి. సింహాసనంపై శ్రీ సత్యసాయిబాబా పెద్ద ఫోటోనుంచి దాని ముందు షిర్డి సాయిబాబా విగ్రహము నుంచినాము. హఠాత్తుగా బాబా సింహాసనం మీద యున్న ఫోటో నుండి విభూతి ఉద్భవించి షిర్డి సాయిబాబా విగ్రహం మీద అభిషేకము జరిగినది. ఈ స్వామి అద్భుత లీలను గాంచిన భక్తుల ఆనందోత్సాహాలకు ఆనాడు అంతులేదు.

## కుంకుమ ఉద్భవము

ది. 15-8-1986న 'శ్రీ వరలక్ష్మీవ్రత' సందర్భమున శ్రీ అలివేలు మంగమ్మ, శ్రీ వేంకటేశ్వరస్వామి మరియు బాబా పటములనుండి 'కుంకుమ' ప్రసాదించబడినది.

## విభూతిరాశి - పొట్లములు

ది. 17-9-1986న మా పూజా మందిరంలో స్వామి పటమునుండి విభూతి రాశి కొండవలె ప్రసాదించబడినది. ఆ రాశిలో చిన్నపొట్లములు కూడా ఉండి నట్లుగా గమనించి, అవి ఏమిటోనని అర్థముగాక, కొంత విభూతిని ఒక టిన్నులోనికి తీయగా, అందు మూడు పొట్లములు కనిపించినవి. ఆ పొట్లములు ప్రత్యేకముగా మా కుటుంబ సభ్యుల ఆరోగ్య నిమిత్తమై ప్రార్థించగా స్వామిచే ప్రసాదించబడినవని గ్రహించి వాటిని విడిగా భద్రపరచుకొంటిమి.

## విభూతి అక్షయం

స్వామి పటమునుండి ప్రసాదించబడిన విభూతిని "టిన్"లో భద్రపరచి వచ్చే భక్తులందరికి పంచటం చేస్తున్నాం. చాలావరకు "టిన్"లోని విభూతి అయిపోయింది. మరల స్వామి ఎప్పుడు విభూతిని ప్రసాదించుతారోనని వేయి కళ్లతో చూస్తున్నాం. ఒకరోజు ఆ టిన్‌ను తెరచి చూడగా స్వామి దివ్య విభూతిచే "టిన్" నిండి ఉన్నది. ఆ విభూతిని తీసి పొట్లములు కట్టి వచ్చిపోయే భక్తులకు యిచ్చుచుంటిమి. అలా ఎన్ని పర్యాయములు తీసినా ఆ "టిన్" స్వామి అనుగ్రహంతో మరల నిండుతునే ఉన్నది. స్వామి అపార కరుణాదృష్టిని మేము అనుభవిస్తున్నాం, అనుభూతిని పొందుతున్నాం, ఇతరులకు పంచుతున్నాం. ఈ అత్యద్భుత మహిమలను కళ్లారా తిలకించిన వేలాది జనం స్వామి లీలలను గురించి చెప్పకుంటున్నారు. స్వామి నిజంగా సర్వాంతర్యామేనని మా ప్రగాఢ విశ్వాసం. ఆయన ప్రేమమూర్తి, కరుణామూర్తి, భక్తజన సంరక్షకుడు.

## స్వామి పటము కదలుట

ప్రశాంతినిలయంలో జరిగిన సాధు సమ్మేళనమునకు వెళ్లి ది. 5-1-1987న తిరిగి వచ్చితిమి. ఆ రోజే మా పూజా మందిరంలో ఒక ప్రక్క స్టూలుపై స్వామి సింహాసనం ఫోటో వుంచి దాని ముందు షిర్డీబాబా విగ్రహమును ఉంచితిమి. తరువాత స్వామి ఫోటో అంతా విభూతితో కప్పబడి షిర్డీబాబా విగ్రహంపై కూడ విభూతి అభిషేకం ప్రసాదించబడింది. అప్పడు ఆ ప్రక్కనే స్వామికి కుర్చీ వేసి, కాషాయ వస్త్రమును పరచి పూలతో అలంకరించి భజన చేసితిమి. మరుసటి రోజున స్వామి పూజా మందిరంలో పూజింపబడిన పటము ముందరి పూలను త్రోసికొనుచూ కదలివచ్చి, స్వామికై భజన సందర్భమున వేసిన కుర్చీలో వుండటం కనిపించింది, కుర్చీ నుండే విభూతిని ప్రసాదించుట, స్వామి పాదముల వద్ద ఉంచిన దిండుపై (కుర్చీ ముందు వుంచిన) స్వామివారి విభూతి పాద ముద్రలు, కుర్చీ చేతులపై స్వామి విభూతి హస్త ముద్రలు, ఉండుటను చూచి, స్వామి అనుగ్రహం

కలిగి, స్వామియే వచ్చారని మేమంతా భావించాం. ఆనందానుభూతితో స్వామిని సేవించాం. ఆ విధముగా వరుసగా మూడు రోజులు కుర్చీలో వున్న ఫోటో నుండి విభూతి ప్రసాదించబడింది. తరువాత స్వామి పటము కుర్చీ దిగి దానంతట అదే విభూతిని చల్లుతూ పూజా మందిరంలో యధాస్థానంలో వచ్చి నిలచి యుండుట చూచి మేమెంతో ఆశ్చర్యపడినాము.

## బాబా పటము అంతర్ధానం

ఒక రోజున పూజా మందిరం నుండి స్వామి ఫోటో అంతర్ధానం అగుట చూచి మేమెంతో బాధపడ్డాం. నిత్యమూ మాకు ఆశీస్సులనందిస్తున్న అభయ హస్తము ఫోటో కనిపించనందులకు మేము తీవ్ర వ్యధకు గురైనాం. ఆ విధముగా సుమారు నెల రోజులు స్వామి (పటము) కనిపించలేదు. ది. 26-2-1987న మహా శివరాత్రి పర్వదినం. నారాయణ సేవకై వండిన పదార్థములను స్వామికి నివేదన చేయుటకై ఉద్యుక్తుల మవుతున్నాం. ఆ సమయంలో గత నెల నుండి కనిపించకుండా పోయిన స్వామి ఫోటో పూజామందిరంలో ప్రత్యక్షమైంది. స్వామి పునరాగమనమునకు మాకు అమితానందం కలిగినది.

## నివేదనను గ్రహించుట

భగవాన్ బాబా ప్రదర్శించిన లీలలలో ఇది అత్యంత అద్భుతమైన లీల. స్వామికి నివేదన చేసిన పదార్థములను పటము నుండి గ్రహించుట, ఆనవాలుగా పాత్రలో ఉంచిన నివేదన పదార్థములు తగ్గియుండుట, పటమునకు మెతుకులు అతికి యుండుట, మొదలగు లీలలు మమ్ములను ఆనందాశ్చర్యములలో ముంచివేశాయి. స్వామికి నివేదించిన పదార్థముల మీద ఓంకార అక్షరమును ముద్రపడుట, కొన్ని ప్రసాదముల మీద 'అభయహస్తముద్ర' వేయబడి ఉండటం లాంటి విచిత్ర అద్భుత లీలలు చూచి మేమెంతో తన్మయత్వం చెందాం.

## అమృతము

బాబా అభయహస్త పటము నుండి ఒక రోజున అమృతధార రావటం చూచి, ఆ పటము క్రింద ఒక పళ్లెం ఉంచాం. ఆ ధార ఊరుతూ వచ్చి పళ్లెములో పడనారంభించింది. స్వామి కరుణచే ప్రసాదించబడిన ఆ 'కరుణామృతము'ను ఆనందంతో మేమంతా స్వీకరించాం.

## పుష్పగుచ్ఛములు, దండలు కదులుట

స్వామి భజన జరుగు సమయమున స్వామి పటమునకు అలంకరించిన దండలు, పూలు మరియు ఫోటో లయబద్ధంగా కదులుట చూచిన భక్తులందరూ



స్వామి దివ్య సందర్శన భాగ్యం కలిగిందని ఎంతో సంతోషించారు. ఈ విధంగా మా పూజామందిరంలో స్వామి ప్రసాదించిన అత్యద్భుత లీలలను చూచి మేము ధన్యులమైనాము. సాయినాధుని లీలలు కనులారా గాంచిన వారందరికీ అనుభవైక యోగ్యము. స్వామి పలురకముల లీలా విశేషములతో అనుగ్రహించుట, మా జన్మ జన్మల సుకృత విశేషముగా భావిస్తూ, సదా స్వామి సేవలో జన్మ పునీతమగునటుల దీవించమని ఆ ప్రేమావతారుడైన శ్రీ సత్యసాయినాధుని దివ్య చరణములకు శిరసాప్రణమిల్లుచూ వేడుకొనుచున్నాము. స్వామి కృప సదా అందరికీ ప్రసాదించ మని వేడుకొనుచున్నాము.

ఓం సాయిరాం!

*నవంబరు - 1987*



## నా ప్రధాన లక్ష్యం

*"వ్యక్తుల కష్టాలు తొలగించి, వ్యాధులు నివారించి ఓదార్చటమే నా లక్ష్యం అనుకోవద్దు. అంతకంటే ముఖ్యమైన ఉద్దేశ్యము వేరొకటి ఉన్నది. మామిడి పండ్లను అందించడం మామిడి చెట్టు యొక్క ముఖ్య ప్రయోజనం. అరటి పండ్లను అందించడం అరటి చెట్టు యొక్క ముఖ్య ప్రయోజనం. కాని వాటి ఆకులు, కొమ్మలు, ఊచ, మ్రానులకు వేరువేరు ప్రయోజనాలు ఉండవచ్చును. అదే విధముగా వ్యక్తుల యొక్క దుఃఖములను ఉపశమింప జేయటం నా ఉద్యమంలో ఒక అంశం మాత్రమే. భారత వర్ష హృదయంలో వేదశాస్త్రాలను పునఃప్రతిష్ఠచేసి, ప్రజలలో వాటి పట్ల అభినివేశం కలిగించడమే - నా ప్రధాన లక్ష్యము. దీనికి ఏ ఆటంకాలు అడ్డు రాలేవు. ఎటువంటి అవరోధాలు ఉండవు. ఇది దైవ నిర్ణయం. ఇది దైవ సంకల్పం".*

**- బాబా**

# అద్భుతమూర్తి అనుగ్రహం పొందిన పశ్చిమ జర్మనీ మహిళ

- కొమరగిరి కృష్ణమోహనరావు, మచిలీపట్నం

భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారి లీలలు కోకొల్లలు. మహిమలు అత్యద్భుతములు. ఒక్కొక్క భక్తుణ్ణి కదిలిస్తే చాలు, గంటల తరబడి స్వామితో పొందిన అనుభూతులు చెప్పింది చెప్పకుండా చెబుతుంటారు. కొన్ని వ్యక్తిగతమైనవి అయితే మరికొన్ని క్రొత్తవారిని సయితం ఆశ్చర్యంలో ముంచివేసేటటువంటివి కూడా ఉన్నాయి. ఆధునిక వైద్యంతో కుదరని దీర్ఘరోగాలు, స్వామి అనుగ్రహంతో కుదిరినవి ఎన్నో ఉన్నాయి. అనుభవజ్ఞులైన డాక్టర్లు వదిలివేసిన కేసులెన్నో బాబా అనుగ్రహంతో కుదిరినవి కూడా ఉన్నాయి. ఇటువంటి అత్యద్భుత సంఘటనలు మన దేశంలోనే గాక విదేశాలలో కూడా ఎన్నో జరగడం విశేషం.

నేను జూలై నెలలో గురుపూర్ణిమ ఉత్సవ సందర్భమున ప్రశాంతినిలయం వెళ్ళాను. అనుకోకుండా అక్కడ పశ్చిమ జర్మనీకి చెందిన Wilhelm Kaiser ను కలుసుకున్నాను. అతను Kiel పట్టణమునకు చెందినవాడు. మంచి సంగీత పాటకుడు (Musician) మరియు అనేక రకముల వాయిద్యములను వాయించగల నిపుణుడు. అతని Lady Friend యొక్క కాన్సర్ విషయం చెప్పి నన్నాశ్చర్య చకితుణ్ణి గావించాడు. ఆమె పేరు Theresa De Groot. ఆమెకు కాన్సర్. పశ్చిమ జర్మనీలో అనుభవజ్ఞులైన డాక్టర్లు పరీక్షించారు. అనేక నర్సింగ్ హోములలో పరీక్షలు జరిపి కాన్సర్ (పొట్టలో) అని నిర్ధారణ చేసారు. ఆపరేషన్ చేసే స్టేజీ కూడా దాటిపోయిందని చెప్పారు. ఆపరేషన్ చేస్తే వెంటనే పోవచ్చు. చేయకుండా వుంటే కొద్ది నెలలు బ్రతుకవచ్చునని డాక్టర్లు చెప్పారు. ఏమి చేయాలో తోచక ఏసుప్రభువును, మేరీమాతను ధ్యానించుతూ కాలం గడుపుతున్నది ఆమె.

ఇంతలో మరొక Family Friend ఆమెను కలిసాడు. 'వైద్యరీత్యా నీ రోగం ఎలాగూ కుదరదు. భగవంతుడొక్కడే నిన్ను రక్షించాలి. ఈనాడు ఈ భూప్రపంచంలో మానవరూపం లో మనకు కనిపిస్తున్న భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారికి మాత్రమే ఈ మహత్తరమైన శక్తి ఉన్నది. వారిని నేను ఒక పర్యాయం ఇండియా వెళ్ళి సందర్శించాను. వారి అనుగ్రహమును పొందగలిగితే నీ రోగం నయమవుతుంది' అని బాబా ఫోటోను ఆమెకు ఇచ్చాడు. ఆ ఫోటోను తీసుకొని మేరీమాత ఫోటో క్రింద ఒక ఫ్రేమ్‌లో మూల ఉంచి నిత్యమూ "సాయిరాం" అంటూ ధ్యానం చేస్తూ వుండేది.

ఈ ఫోటో ఇచ్చిన Family Friend బాబాను సందర్శించటానికి ఇండియా రాదలచి, బయలుదేరేముందు ఆమె వద్దకు వెళ్ళాడు. అప్పుడు ఆమె మెడలో వున్న

లాకెట్‌ను యిచ్చి బాబా ఆశీస్సులను పొంది తీసుకొని రమ్మనమని చెప్పింది. ఆ లాకెట్‌ను తీసుకుని ప్రశాంతినిలయం చేరుకున్నాడు. ఈ సంఘటన సుమారు ఒక సంవత్సరం క్రిందటనే జరిగింది. కొన్నిదినాలకు బాబా ఇంటర్వ్యూకు పిలిచారు ఆ జర్మనీ వ్యక్తిని. అతను కోరికల గదిలో Theresa యొక్క కాన్సర్ విషయం చెప్పి, ఆమె యిచ్చిన లాకెట్‌ను బాబాకు యిచ్చాడు. అప్పుడు ఆ లాకెట్‌ను బాబా రెండు చేతుల మధ్య పెట్టుకొని బిగ్గరగా 'ఓం సాయిరాం' అని మూడు పర్యాయములు అరచి, ఆ లాకెట్‌ను ఇచ్చి వేశారుట. దాని మీద "ఓం సాయిరాం" అని ముద్ర పడిందట. ఆ భక్తుడు ఆ లాకెటును తీసుకొని తన దేశం వెళ్ళి ఆమెకు యిచ్చి విషయమంతా చెప్పి బాబాను ధ్యానించమని కోరాడు.

అప్పటి నుంచి Theresa ఆ లాకెట్ రెండు అరచేతుల మధ్యలో పెట్టుకొని, బాబా పటము ఎదురుగా కూర్చొని "ఓం సాయిరాం" అని జపం చేసేదట. ఒక రోజున బాబా ఫొటోనుంచి విభూతి వచ్చి క్రిందనున్న టీపాయి మీద పడనారంభించింది. అరచేతుల మధ్యలో నుంచుకొన్న లాకెట్ నుండి వేడి పుట్టనారంభించింది. అప్పుడు ఫోన్ చేసి Wilhelm Kaiser ను రప్పించుకుంది. ఈ విషయం అంతా చెప్పింది. అప్పుడు అతను ఆ లాకెట్‌ను తీసుకొని తన అరచేతుల మధ్యలో ఒక అరనిముషం ఉంచుకొనేటప్పటికి, భరించరాని వేడి రావటంతో విసిరి పారేశాడుట. అరచేయి కమిలిపోయింది. బాబా మహత్తరమైన శక్తిని దీనిలో పెట్టి ఉంటారని, రేడియం ట్రీట్‌మెంట్ లాంటిది అయిఉంటుందని అతను అభిప్రాయపడ్డాడు. ఆ భస్మమును చూచి నీకోసం బాబా పంపిన ఔషధమని చెప్పి నిత్యమూ నీళ్ళలో వేసుకుని త్రాగమని ఆమెకు సలహా యిచ్చాడు.

జర్మనీలో అనాదిగా వస్తున్న ఒక సంప్రదాయం ఉన్నదిట. ఇష్టదైవమును తలచుకొని ఒంటి వరుస గల లాకెట్‌ను చేతిలో పట్టుకుంటే, ఆ దైవం అనుగ్రహిస్తే గుండ్రంగా తిరుగుతుందట. అనుగ్రహించకపోతే గడియారం పెండ్యులంలాగే అటూ ఇటూ ఊగుతుందట. Kaiser తన జేబులో నుంచి లాకెట్ గొలుసును తీసి భక్తితో బాబాను మనసులో తలచుకొని చేతిలో పట్టుకున్నాడు. మరుక్షణంలో Rounds కొట్టడం మొదలుపెట్టి ఎంతో వేగంగా తిరగటం జరిగిందట. 10 గ్రాములు మాత్రమే బరువుగల ఆ లాకెట్ గొలుసు స్పీడుగా గుండ్రంగా తిరుగుతుంటే పట్టుకోలేక పోయాడుట. షుమారు 6 అడుగులు పొడవుండి మంచి శరీర దారుఢ్యం గలిగిన Kaiser చేయి లాగ నారంభించిందట. తట్టుకోలేక వదలివేశాడుట. బాబా అనుగ్రహం ఉన్నది కాబట్టే ఆ విధంగా తిరిగిందని, బాబా నిజంగా దైవాంశ సంభూతుడేనని ఆ మాంత్రికుడు సహితం అంగీకరించాడు. స్వామినే ధ్యానించమని చెప్పి వెళ్ళిపోయాడు.

ఒక నెలరోజుల తర్వాత, అంతకు ముందు పరీక్షించిన డాక్టర్లు వద్దకు Theresa వెళ్లి పరీక్ష చేయించుకొనగా ఇప్పుడు ఆపరేషన్ చేయడానికి అవకాశ మున్నదని చెప్పారుట. ఏ డాక్టర్లయితే ఆపరేషన్ చేస్తే చచ్చిపోతుందని చెప్పారో వారే ఆపరేషన్ చేయవచ్చునని అభిప్రాయపడటం ఆశ్చర్యకరం. దానికి Theresa అంగీకరించలేదు. బాబాను మాత్రమే పూర్తిగా నమ్ముకున్నది. కేవలం బాబా అనుగ్రహంతోనే నయమై తీరుతుందని ఆమె భావించింది. భక్తి శ్రద్ధలతో స్వామిని నిరంతరం ఆరాధిస్తూవచ్చింది. రెండు నెలల తరువాత మరల డాక్టర్ల వద్దకు వెళ్లి పరీక్ష చేయించుకొనగా కాన్సరే కనిపించడం లేదని ఎక్కడా దాని ఛాయ లేదని చెప్పారుట. ఇది ఆధునిక శాస్త్ర విజ్ఞానవేత్తలకు అందని రహస్యం. ఆ డాక్టర్లను ఆశ్చర్యచకితులను గావించిన అత్యద్భుతం.

ఈ అత్యద్భుతాన్ని కనులారా గాంచి, ఆశ్చర్యపడి Kaiser ప్రత్యేకంగా బాబాను సందర్శించటానికి ప్రశాంతి నిలయం వచ్చాడు. అనుకోకుండా అతనిని కలిసే సమయం నాకు లభించింది. అప్పుడు నాకు ఈ కాన్సర్ కేసుకు సంబంధించిన ఫోటోలనిచ్చాడు. అతని వద్ద నెగిటివ్స్ లేవు. వాటిని తీసుకొని ప్రశాంతినిలయంలో నున్న సాయిబాబా ఫోటో స్టూడియోకు వెళ్లాను. ఆ ఫోటోలను రీ కాపీ చేయమన్నాను. చేసిన తరువాత Kaiser వద్ద తీసుకున్న ఫోటోలను తిరిగి అతనికి యిచ్చివేశాను. అతని అడ్రసు మాత్రం నేను తీసుకొనలేదు కాని నా చిరునామా అతనికిచ్చాను. మళ్లీ అతను నన్ను కలువలేదు. 16న తిరిగి వచ్చేటప్పుడు స్టూడియో అతను కాపీలు తయారు కాలేదనగా, డబ్బు యిచ్చి Post లో పంపమన్నాను. కానీ అతను పంపలేదు.

దసరా సందర్భమున ప్రశాంతినిలయం వెళ్లి ఫోటోలు యివ్వమని అడిగాను. రెండు రోజులలో యిస్తానని చెప్పాడు. 27వ తేదీన వాటిని తీసుకొనగా మల్టీ కలర్ ఫోటోలు ఒకే జేగురు రంగులో వచ్చాయి. వాటిని పత్రికలో ప్రింటు చేస్తే ఏమీ కనిపించదని బాధ పడ్డాను. విచారించాను. ఇంకా చేయగలిగేదేమీ లేదు గదా, నిరాశతో వాటిని తీసుకుని బందరు వచ్చాను (6-10-87) 9వ తేదీన వాటిని తీసుకుని విజయవాడ వెళ్లి నా పత్రిక కలర్ వర్కు చేస్తున్న విజయవాడ ఆఫ్‌సెట్ ప్రింటర్స్‌లో చూపిద్దామని నిర్ణయించు కున్నాను. 8వ తేదీన అత్యంత ఆశ్చర్యకరంగా పశ్చిమ జర్మనీ నుంచి Kaiser కవరు పంపాడు. దానిలో నాలుగు మంచి ఫోటోలు వచ్చాయి. అందులో నాకు లోగడ జూలైలో యిచ్చినప్పుడు ఫోటోలు లాంటివే ఉన్నాయి. నాల్గవ ఫోటోలో లాకెట్ ధరించి వున్న Theresa. నేను అతనికి ఉత్తరం వ్రాయలేదు. అతనిని ఫోటోలు పంపమని ప్రశాంతినిలయంలో

కోరలేదు. నాకు అవసరమైనవి ఆనాడే తీసుకున్నానుగదా! అయితే అవి సరిగా రానప్పుడు సెప్టెంబర్ 27,28 తేదీలలో ఎంతో బాధ పడ్డాను. ప్రత్యేక సంచికలో ఫొటోలు వేసే అవకాశం పోయిందని విచారించాను. Kaiser 29వ తేదీన జర్మనీలో Post చేసిన కవరు నాకు 8వ తేదిన అందింది. కవరు మీద మచిలీపట్నం, అనంతపూర్ జిల్లా అని వ్రాశాడు. అయినప్పటికీ నాకు సకాలంలో అందటం విశేషం. విజయవాడ వెళ్ళకమునుపే అందటం ఇంకా విశేషం. ఇది కేవలం బాబా సంకల్పంతోనే జరిగి ఉంటుందని భావిస్తున్నాను, విశ్వసిస్తున్నాను. బాబా నిజంగా సర్వాంతర్యామే. వారికి తెలియని విషయమంటూ ఏమీ లేదు. వారి సంకల్పానికి ఎదురు నిలవగలిగినది మరొకటి లేదు. వారి శక్తి అనంతం. ఆ శక్తిని గుర్తించిన వారికి, ఆ మహనీయుని నమ్ముకున్నవారికి ఎట్టి ఆటంకాలు దరికి చేరవు.

*నవంబరు - 1987*



## శివం - శవం

*"ఒక వేటగాడు ఒక పక్షిని కొట్టి, దానిని పట్టుకొని, బజారులో నడచుకుంటూ పోతున్నాడు. మాంసాహారులు దానిని చూచి 'ఎంత వెల?...ఎంతవెల?... అని ఎగబడి అడుగుతున్నారు. అదే రోజున ఒక మహారాజు కూడా మరణించాడు. ఆ మృతదేహాన్ని శ్మశానానికి తీసుకొని వెళ్ళుతున్నారు. దారిలో పెద్ద వర్షం వచ్చింది. ఆ శవాన్ని ఎవరి ఇంటి ముందు వరండాలో నైనా పెట్టి, కొంతసేపు నిలుద్దామనుకున్నారు శవవాహకులు. ఎంత మహారాజైతేమి? ఆ శవాన్ని తను ఇంటి ముందు వరండాలో పెట్టడానికి ఎవరూ అంగీకరించలేదు. పరాయివారు సరే! ఇంటి వారు కూడా శవాన్ని ఇంట్లో పెట్టుకోరు గదా! చచ్చిపోయిన పక్షికి అయినా విలువ వున్నది. గాని, చనిపోయిన మనిషికి మాత్రం విలువలేదన్న మాట. శ్వాస ఉన్నంత వరకే విలువ. శ్వాస ఉన్నప్పుడు 'శివం'. శ్వాస పోగానే అది 'శవం'.*

**- బాబా**

# శ్రీ సత్యసాయి దర్శనం - నూతన జన్మ

- ఆర్.యల్. కాంతారావు, విజయవాడ

1968 నుంచి పరోక్షంగా శ్రీ సత్యసాయిబాబా వారితో నాకు సంబంధం ఏర్పడింది. మా సోదరుని అత్తగారు శ్రీమతి రెంటాల భ్రమరాంబగారు నాకు స్వామి ఫోటోలను రెండింటిని యిచ్చింది. ఒక ఫోటోను పూజామందిరంలోను, మరొక ఫోటోను మా షాపులోను ఉంచి ప్రతి రోజు పూజించటం అలవాటయింది. ఒక రోజు ఒక మిత్రుడు మా షాపుకు వచ్చి ఆ ఫోటో (స్వామి) తీసివేస్తే సామానులు కొంటానన్నాడు. కొనినా కొనకపోయినా ఆ ఫోటోను (బాబా) తీసే ప్రసక్తే లేదని స్పష్టంగా చెప్పాను. అప్పటి నుంచి నాకు పట్టుదలతో పాటు స్వామి యెడల భక్తి కూడా పెరిగింది.

ది. 21-1-1969న విజయవాడకు బాబా విచ్చేసిన సందర్భమున పెద్ద సభ జరిగింది. లోపలికి వెళ్ళటానికి అవకాశం లేక నేను నా సోదరుడు మోహనరావు, మా అబ్బాయి సుందరం బయటనే నిలబడ్డాం. ఇంతలో ఒక అపరిచితుడైన సి.ఐ. మావద్దకు వచ్చి మమ్మల్ని వేదిక దగ్గర కూర్చోబెట్టాడు. ఇంతలో స్వామి వచ్చారు. దర్శనం బాగా జరిగింది. ఉపన్యాసం కూడా దగ్గరనే కూర్చొని వినే సద్భాగ్యం కలిగినందులకు ఎంతో సంతోషించాం. నా జీవితంలో స్వామిని దర్శించటం అదే ప్రథమం. మమ్ములను లోపలికి తీసుకొని వచ్చిన సి.ఐ. గారికి కృతజ్ఞతలు తెలియపరచుకోవటానికి ఆ ప్రదేశమంతా తిరిగాము. కాని ఆయన కనిపించలేదు. కేవలం స్వామి అనుగ్రహం వలననే లోపలికి వెళ్ళ గలిగామని అభిప్రాయపడ్డాం.

అంతకు పూర్వం మా షాపు కాళేశ్వరరావు మార్కెట్‌లో ఉండేది. స్వామి దర్శనం చేసుకున్న 10 రోజుల తరువాత ఒక గురువారం స్వామి ఫోటో వద్ద నుంచొని గవర్నరుపేటలో షాపు అద్దెకు యిప్పించమని ప్రార్థించాను. ఆ మరునాడే గవర్నరుపేట గుండా ఇంటికి వెళుతుంటే ఆ షాపు యజమాని (ఇప్పడున్న షాపు) అతనంతట అతనే పిలిచి అద్దెకు యిస్తానని చెప్పటం నన్ను ఆశ్చర్యచకితుడను గావించింది. స్వామి కరుణా కటాక్షము వలననే నాకు ఆ షాపు లభ్యమయినదని నా నమ్మకం. స్వామి అనుగ్రహం వలననే దానిని కూడా కొని అందులో స్వంత బిల్డింగు కూడా కట్టించగలిగాను.

స్వామి దర్శనానికి పూర్వం నేను అనేక దురలవాట్లకు లోనై, రోజుల తరబడి పేకాటలో నిమగ్నమై ఇంటికి కూడా వెళ్ళేవాడను కాదు. వ్యాపారం అంతంత మాత్రంగా వుండేది. స్వామి దర్శనం తరువాత నా ప్రవర్తనలో మార్పు రావటమే గాక, వ్యాపారంలో కూడా కలిసి వచ్చింది.

1973 మార్చిలో మొట్టమొదటిసారి సకుటుంబంగా ప్రశాంతి నిలయం వెళ్లి స్వామి దర్శనం చేసుకొని కృతజ్ఞతలు తెలియబరచుకున్నాం. తరువాత 1975లో గురుపూర్ణిమ సందర్భమున నేను నా కుమారుడు సుందరం వెళ్లాం. వరుసలలో కూర్చున్నాం. స్వామి వచ్చి అందరికీ పాద నమస్కారం యిచ్చి, విభూతి పొట్లాలు పంచుతున్నారు. నాకు రెండు విభూతి పొట్లాలు ప్రసాదించమని మనసులో స్వామిని వేడుకున్నాను. నా వద్దకు వచ్చి నన్ను చూస్తూ రెండు విభూతి పొట్లాలను నా దోసిట్లో వేసి వెళ్లిపోయారు. నా ప్రక్కనే కూర్చున్న మా వియ్యంకుడు శ్రీ కాంతారావుగారికి దోసిటి నిండా పొట్లాలు వేసినారు. బయటకు వచ్చి లెక్క పెట్టుకుంటే అవి వారి కుటుంబ సభ్యులందరికి తలా ఒకటి వచ్చాయి. నేను కోరుకున్నవి రెండే కాబట్టి రెండే యిచ్చారు. ఆ సంఘటన మమ్మల్ని ఆశ్చర్యంతో ముంచివేసింది.

1974లో మా మామగారు, దత్తత తల్లిగారు ఒక మాసం వ్యవధిలో పోయారు. మనసు బాగాలేకపోవటం వలన నా భార్య సత్యవాణి ప్రోద్బలంతో ప్రశాంతి నిలయం వెళ్లాం. అక్కడ ఒక కాటేజీ ఇప్పించమని స్వామివారిని వేడుకున్నాను. 1976లో కాటేజీ యిచ్చారు. ఒక పర్యాయం స్వామే ఒక విషయం చెప్పారు. తన వైపుకు ఒక అడుగు వేస్తే, మన వైపుకు పది అడుగులు వేస్తానన్నారు. అది అక్షరాల నిజం. అదే విధంగా నా జీవితంలో కూడా జరిగింది.

అప్పటినుంచి స్వామితో ముందుగా ఏమీ చెప్పకుండా మా ఇంట్లో ఏ శుభ కార్యం ప్రారంభించం. స్వామికి నివేదించిన తరువాతనే ఏపనైనా మొదలుపెడ తాము. స్వామి అనుగ్రహం వలన నేను తలపెట్టిన కార్యక్రమాలన్నీ నిర్విఘ్నంగా విజయవంతం అవుతున్నాయి. స్వామి దర్శనానికి పూర్వపు నా పరిస్థితి, ఈనాటి నా పరిస్థితికి ఏమాత్రం పోలికే లేదు. స్వామి దర్శనంతో నా జీవిత గమనమే మారిపోయింది. స్వామి నాకు ప్రసాదించిన మరో జన్మయని నా పూర్తి విశ్వాసం, నమ్మకం.

*నవంబరు - 1987*



# 'స్వామి లీలలు

- ఎస్. కాశీపతిరావు, సికింద్రాబాద్

సాక్షాత్ పరమేశ్వరుడు మానవ రూపంలో తిరుగుచుండుట అంత తేలికగా నమ్మదగ్గ విషయం కాదు. అయినప్పటికి యిది యదార్థము. నిరాకారుడు సాకారముతో నుండుట మనలో అనేకమంది గుర్తించలేక, అనేక విషయ వాంఛలతో స్వామి వద్దకు వచ్చుచున్నారు.

స్వామి పేరును 1959లో ప్రప్రథమంగా వినియుంటిని. ఏ తప్పు చేయక పోయినా విధివశాత్తు నన్ను ఉద్యోగము నుంచి Suspend చేసినారు. ఈ విషయ మును ఒక గొప్ప వ్యక్తికి వివరించుదామని 1960లో సికింద్రాబాద్ నుండి కర్నూలు వెళ్ళాను. తిరిగి సికింద్రాబాద్ వెళ్ళుదామని రైల్వేస్టేషన్‌కు వెళ్ళిన నేను, మనసు మార్చుకొని అనంతపురం మీదుగా పుట్టపర్తికి ప్రయాణమై రైలు ఎక్కాను. రైలు కదులు సమయంలో ఒక వయోవృద్ధుడు, నేను ఎక్కిన రైలు పెట్టెలో ఎక్కి, నా ప్రక్కనే కూర్చుని, నా వీపుమీద చేయివేసి నిమురుతూ నా కుటుంబ వివరాలన్నీ పూసగుచ్చినట్లు చెప్పి నన్నాశ్చర్యపరచినాడు. 'భయములేదు, నీవు ఏ తప్పు చేయలేదు' అని ప్రక్క స్టేషన్ దిగుతూ 'నీవు నా దగ్గరకే వస్తున్నావులే' అని నవ్వుతూ దిగి వెళ్ళిపోయాడు. తరువాత నేను అనంతపురం స్టేషన్‌లో దిగగానే 14సం॥ బాలుడు వచ్చి నీ పర్సు జాగ్రత్త అని హెచ్చరించి, అక్కడ ఒక హోటల్‌ను చూపించి దానిలో విశ్రమించమని చెప్పి వెళ్ళిపోయాడు. ఆ హోటల్ యజమాని ఎంతో పరిచయస్థుడుగా నన్ను ఆదరించి సదుపాయములు చేసి, మరునాడు బుక్కపట్నం బస్సు ఎక్కించాడు. ఆ రోజులలో పుట్టపర్తికి బస్సులు లేవు. నడిచయినా వెళ్ళాలి లేక బండిమీదనయినా వెళ్ళాలి. ఒక రెండెడ్ల బండివాడు నన్నెరిగివున్నట్లుగా పలుక రించి, 'హైద్రాబాద్ నుంచి వస్తున్నారు కదూ' అని బండిలో ఎక్కించుకొని పుట్టపర్తి గ్రామం వద్ద వదలి వెళ్ళిపోయినాడు. ఇదంతా నాకెంతో విచిత్రమనిపించింది.

స్వామి మందిరం వద్దకు చేరాను. స్వామి దర్శనం కోసం సుమారు 50 మంది భక్తులు అక్కడ వేచి యున్నారు. నేను వారందరికన్నా ముందుగా వెళ్ళి కూర్చున్నాను. స్వామి బయటికు వచ్చి హేళన రూపము చూచి మాటలాడక గదిలోనికి తిరిగి వెళ్ళిపోయినారు. అక్కడ ఎవరూ తెలిసినవారు కనిపించక పోవటం వలన విసుగు చెందాను. అనేక చెడు తలంపులు కూడా నా మనసులో మెదిలాయి. సాయంకాలం దర్శనం సమయంలో విరక్తిగా దూరంగా నుంచున్నాను. స్వామి బయటకు వచ్చారు. ఏ కారణము చేతనో నాకు విపరీతమైన దుఃఖం వచ్చింది. కనుల వెంబడి కారుతున్న నీటిని తుడుచుకొనుచుండగా స్వామి

నా వీపు తట్టారు. ఉలిక్కిపడ్డాను. 'పద' అని స్వామి నన్ను కోరికల గదిలోనికి తీసుకువెళ్ళారు. అక్కడ 'ఏమి సంగతి' అని స్వామి అడిగితే నాకు నోట మాటరాలేదు. స్వామియే నా పరిస్థితి అంతా చెప్పి 'నీ తప్పు లేదు, నీ ఉద్యోగం నీకుంది' అని నన్ను ఓదార్చి ఈ రోజే సికింద్రాబాద్ వెళ్ళమని ఆదేశించారు స్వామి. ఆ అయోమయం స్థితిలో ఇంటికి చేరాను. 4,5 నెలల్లో ఊహించని మార్పులు వచ్చి మరల నేను ఉద్యోగంలో చేరగలిగాను. అంతా నా అదృష్టమే అనుకున్నాను. ఇంత జరిగినా ఆనాడు నాకు స్వామి మీద మాత్రం నమ్మకం కుదరలేదు.

1969సం॥ లో రిటైర్ అయిన వెంటనే (రెండవసారి అనగా 9స॥ తరువాత) మరల శివరాత్రికి పుట్టపర్తి వెళ్ళాలని కోరిక కలిగి బయలుదేరాను. స్వామిని సందర్శించాను. అయినా నమ్మకం కుదరలేదు. తరువాత రెండు సంవత్సరములు ప్రయివేటు కంపెనీలో పనిచేశాను. ఆ సమయంలో అనగా 1971సం॥ లో అహమ్మద్‌నగరంలో పని చేయుచూ 'షిర్డి'కి వెళ్ళాను. 4,5 నెలల తరువాత సికింద్రాబాద్‌లో నా ఇంట్లో వున్నప్పుడు పుట్టపర్తి నుండి నన్ను రమ్మనమని ఒక మనిషి ద్వారా కబురు వచ్చింది. ఇది ఈనాటికీ నాకు అర్థం కాని సంఘటన. ఈ తమాషా ఏమిటో చూద్దామని బయలుదేరి అనంతపురం వెళ్ళాను. అక్కడ స్వామి లేరు. బెంగుళూరులో వున్నారని తెలిసి అక్కడికి వెళ్ళి 'వైట్ ఫీల్డ్' చేరుకున్నాను. అక్కడికి చేరేంతవరకు నాకు ఎవరో ఒకరు కలిసి త్రోవ చూపుతూ సహాయం చేయుచునేయున్నారు. అక్కడకు చేరిన తక్షణమే, స్వామి నా వద్దకు వచ్చి పలుకరించి, వారి గదిలోనికి తీసుకొని వెళ్ళి 'నా దగ్గర పని చేస్తావా?' అని అడిగారు. నాకు ఆశ్చర్యం వేసింది. నేను అప్పటికే "ఇరాన్" వెళ్ళడానికి అన్ని ఏర్పాట్లు చేసుకున్నాను. ప్యాస్‌పోర్టు కూడా వచ్చింది. ఆ వివరమంతా స్వామే, నేను చెప్పకుండానే చెప్పివేసి నన్ను ఆశ్చర్యచకితులను గావించారు. వారం రోజులున్నా మళ్ళీ నన్ను మాట్లాడించలేదు. నా వైపు కూడా చూడలేదు. నేను తెచ్చుకున్న డబ్బు అయిపోవస్తున్నది. బెంగుళూరు పరాయి స్థలం కదా! రమ్మనమన్న స్వామి మళ్ళీ మాట్లాడించలేదు. ఏమి చేయాలో నాకు తోచలేదు. ఒక రోజున స్వామి ఎవరితోనో మాట్లాడుతూ "కల్ మై పుట్టపర్తి జారహాహూం" అని నా వైపు చూచి నవ్వి, మాట్లాడకుండా వెళ్ళిపోయారు. నాకు చాలా ఆశ్చర్యమేసింది. విచారం వేసింది. ఉండమని చెప్పిన స్వామి మళ్ళీ కనీసం మాట్లాడించకపోవడం వలన నాలో నేను కుమిలిపోయాను. ఇంత దూరం వచ్చాను గదాయని, పుట్టపర్తి చూచి తిరిగి సికింద్రాబాద్ వెళ్ళిపోదామని బస్సు ఎక్కాను. స్వామి ప్రయాణం చేస్తున్న చిన్న కారు నేను ఎక్కిన బస్సును దాటివేస్తుండగా స్వామి నా వైపు చూచి చేయి ఊపారు. తీరా పుట్టపర్తి చేరేటప్పటికి స్వామి అక్కడ లేరు. అయోమయ స్థితిలో

పడిపోయాను. సాయంత్రానికి స్వామి అనంతపురం మీదుగా పుట్టపర్తి చేరి, కారు దిగుతునే నా వద్దకు వచ్చి హేళనగా "ఎక్కడికి పోయావ్! బెంగుళూరంతా గాలించాను. నాకు కనపడతావా? నీవు కాశీపతివి కదూ!" అంటూ 'కాశీపతే వారణాశీపతే' అని పాడుతూ వెళ్ళిపోయారు. తరువాత కొంతసేపటికి నా దగ్గరకి వచ్చి 'రేపు అనంతపురం రా!' అని చెప్పారు. వారి ఆజ్ఞ ప్రకారం అనంతపురం చేరాను. స్వామి కూడా అక్కడికి వచ్చారు. చాలాసేపు మాట్లాడించలేదు. తరువాత కొంతసేపటికి నావద్దకు వచ్చి "ఈ రోజే సికింద్రాబాద్ వెళ్ళి ఒక వారం రోజులలో వచ్చి యీ కాలేజీలో పనిచేయి" అని చెప్పి వెళ్ళిపోయారు. వారి ఆదేశానుసారం వచ్చి కాలేజీలో అకౌంట్సు చూడటం ప్రారంభించాను. 1972లో ఒక రోజున కాలేజీ పనిమీద హైద్రాబాద్ వెళ్ళివచ్చాను. ఆ మరునాడే స్వామి హైద్రాబాద్ వెళ్ళినట్లు తెలిసినా నా ఇంటికి ఆహ్వానించలేకపోతినే యని బాధపడ్డాను. నిజంగా స్వామి భగవంతుడయినట్లయితే నా మొర ఆలకిస్తాడని వాపోయాను. అదే సమయంలో స్వామి సికింద్రాబాద్‌లో మా ఇంటికి వెళ్ళి నా భార్యతో కాశీపతి నన్ను వెళ్ళి చూచి రమ్మన్నాడని చెప్పి 15ని॥లు మా ఇంట్లో కూర్చుని నా కుటుంబ సభ్యులను పరామర్శించి వెళ్ళిపోయారు (ది. 25-3-1973). ఇది నాకు తెలిసి ఆశ్చర్యపడటమే గాక, స్వామి నిజంగా భగవంతుడే ననే అభిప్రాయం స్థిరపడింది.

స్వామి ఆజ్ఞ ప్రకారం 1973లో పుట్టపర్తి చేరాను. స్వామి నావంక ఒక వారం రోజుల వరకు చూడలేదు. నేనేమి తప్పు చేసానో, నాకర్థం కాలేదు. నేను ఒక రోజు రాత్రి 9 గంటల వేళలో భోజనం చేస్తుండగా, "ఫలాన చోటున భోజనం చేస్తున్నాడు, అతని పేరు కాశీపతి, తీసుకొని రా" అని ఒక ద్వారపాలకుణ్ణి నావద్దకు పంపారు. నేను వెళ్లేసరికి ఆ గదిలో ముఖ్యులందరూ ఉన్నారు. వారందరి సమక్షంలో నన్ను 'Accounts Officer' గా పరిచయం చేసి నాకు బాధ్యతలను అప్పగించారు. 1973-81 వరకు ఆ బాధ్యతను నిర్వర్తించాను. ఆ సమయంలో నా భార్యకు రెండో తడవ వచ్చిన గుండెపోటు (Heart Attack) ను నయం చేసి డాక్టర్లనే ఆశ్చర్యచకితులను గావించారు. నా ఇద్దరు కుమారులకు యజ్ఞోపవీతములను సృష్టించి ఉపనయనం చేయించారు. ఈ పని సిద్ధ పురుషులకు మాత్రమే సాధ్య మయ్యేది. సామాన్యులకు అలవి కానిది. 1982లో నా తల్లిగారు దివంగతులు కావటం వలన సికింద్రాబాద్ చేరాము. 1985లో అమెరికా వెళ్ళి 1987 మార్చి 9న హైద్రాబాద్ తిరిగి వచ్చాను.

వెస్టు వర్జీనియాలో డాక్టర్‌గా పనిచేస్తున్న నా ఆఖరి కుమార్తెకు ఇండ్ల స్థలం హయ్యత్‌నగర్‌లో కొన్నాను. రిజిస్ట్రేషన్ ఖర్చుల నిమిత్తం రు. 3,300/-లు తీసుకొని 19-3-87న రిజిస్ట్రార్ ఆఫీసుకు వెళ్ళాను. సాయంత్రం 4గంటలకు

రిజిస్ట్రేషన్ చేయటానికి పిలిచారు. ఇంకా రు. 200/-లు తక్కువైంది. ఇంటికి వెళ్ళి వచ్చే సమయం లేదు. ఏమి చేయాలో తోచక 'స్వామీ నీవే గతి' అని మనసులోనే ప్రార్థించాను. మరుక్షణంలో 19సం॥ బాలునిగా వచ్చి 'ఏమి కావాలి సార్!' అని అడిగి రు. 200/-లు యిచ్చాడు. రిజిస్ట్రేషన్ అయిన తరువాత, అతని కోసం వెతికాను, కనిపించలేదు. నాకు ఆశ్చర్యంవేసింది. ఏడుపు వచ్చింది. స్వామికి తెలియనిదేమి లేదని అనుకుంటూ ఇంటికి చేరాను.

ఈ విధంగా స్వామి సన్నిధిలో ఎన్నో అనుభవాలను పొందాను, ఎన్నో పరీక్షలకు గురైనాను. ఆ లీలామానుషమూర్తిని అర్థం చేసుకోవటం అంత తేలిక కాదు. స్వామి మనల్ని ఎప్పుడు ఎందుకు దూరంగా ఉంచుతారో? ఎప్పుడు, ఎందుకు దగ్గరకి తీసుకొని ప్రేమ కరుణలను ఒలికిస్తారో సామాన్యులమైన మనం ఊహించలేం. ఒక్కొక్క పర్యాయం స్వామి చూపించే వాత్సల్యానికి ముగ్ధుల మవుతాం. వారి ప్రేమ కోటి తల్లుల ప్రేమ కంటే ఎక్కువ. ఆయనది ప్రేమావతారం. భక్తులను పరీక్షించటానికి అప్పడప్పడు కొన్ని పరీక్షలు పెడుతుంటారేమో ననిపిస్తుంది. ఆ పరీక్షకు నిలువగల శక్తి మనకుండాలి. ఆఖరి నిముషం వరకు మనవైపు చూడరు, పలుకరు. నిరాశ, నిరుత్సాహం పొంది దూరంగా పోతే శాశ్వతంగా దూరమైపోతాం. పరీక్షలకు తట్టుకొని, నమ్ముకొని వున్నవారికి స్వామి అనుగ్రహం లభ్యమవుతుందని నా ప్రగాఢ విశ్వాసం. స్వామి లీలలు సామాన్యులకు అర్థం కావు. స్వామి చెప్పిన మాటలను చెప్పి ముగిస్తాను. వాటిని అర్థం చేసుకుంటే స్వామి తత్త్వం ఏమిటో బోధపడుతుంది. మనకు కనువిప్పు కలుగుతుంది.

"చెంత చేరెనటంచు సంతోసించెదరన్న
వెంటనే ఎడబాటు చింతగూర్చు
ఏడిపించుటే సాయి వేడుక యందురా
కడుపుబ్బ నవ్వించు నడుమ నడుమ
పొగడుచున్నారని పొంగిపోయెదరేమొ
తప్పకపుడే ఎగతాళి చేయు
అభయమిచ్చెను గాన హాయి నుండెదరన్న
పడబాధలకు అంతు పట్టకుండు
వెనుక కేగనీదు చననీదు ముందుకు
మనసు మరులుగొలుపు మదనపెట్టు
ఇట్టి చిన్ని సాయి చిన్మయమూర్తిని
ఎట్లు లెరుగగలరు ఇలను మీరు!"

# స్వామి సర్వాంతర్యామి

- వి.పి.ఆర్. విశ్వనాథం, ఉడుమల్‌పేట, కోయంబత్తూరు జిల్లా

1947 సం॥ నుండి భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారి సన్నిధికి మా కుటుంబ సభ్యులం వస్తున్నాం. మా కుటుంబం పొందిన అనుభూతులు కోకొల్లలు. శ్రీ సత్యసాయిబాబా సాక్షాత్ భగవత్స్వరూపులేనని మా నమ్మిక. మా అన్నగారికి పెండ్లి అయిన సుమారు 25సం॥ వరకు పిల్లలు లేరు. ఒకానొక సమయంలో పర్తిలో భగవాన్ సన్నిధిలో సంభాషణ చేస్తున్నప్పుడు స్వామి తులసిమాలను సృష్టించి మా వదినగారికి యిచ్చినారు. తరువాత ఒక సంవత్సరమునకు ఆమెకు ఆడ శిశువు కలిగినది. మా అన్నగారు బాబా ఆశీస్సులను పొందటానికి కుటుంబంతో (పాపతో సహా) పర్తికి వచ్చారు. అప్పుడు ఫలానా తేదీ చెప్పి మరల ఆ సమయమునకు పాపనుకూడా తీసుకొని రమ్మనమని ఆదేశించినారు. కారణమేమిటో అప్పుడు మాకు తెలియలేదు, బాబా ఆజ్ఞ ప్రకారం మా అన్నగారు కుటుంబంతో సహా పర్తికి వచ్చారు. సరీగా లోగడ బాబాగారు చెప్పిన తేదీన పాపకు ఫిట్స్ వచ్చి స్పృహ లేకుండా పడిపోయింది. 3 గంటలయినా తెలివి రాలేదు. అందరూ ఆశ వదులుకున్నారు. తరువాత స్వామి వచ్చి విభూతి సృష్టించి పైన రాసి నిమిరారు. పాపకు స్పృహ వచ్చింది. తరువాత స్వామి నేను చెప్పినట్లుగా వచ్చారు గనుక పాప మరొక జన్మ ఎత్తిందన్నారు. ఆనాడు బాబా దివ్య శక్తిని చూచి విస్మయం చెందాం. పాప బ్రతికినందులకు ఆనందించాం. వారు సాక్షాత్ భగవంతుడేనని మా నమ్మిక.

## బండి యాక్సిడెంట్

మా గ్రామం టౌనుకు 2 మైళ్ళ దూరంలో ఉన్నది. ఒక దినం నేను నా నల్గురు బిడ్డలు కలిసి ఎడ్లబండి మీద టౌనుకు వెళ్ళి రాత్రి 8గంటలకు తిరిగి వస్తున్నాం. దారిలో కరెంట్‌పోలుకు బండి గుద్దుకొని యాక్సిడెంట్ అయింది. కాడి విరిగిపోయింది, బండి తల్లక్రిందులయింది, పిల్లలు నేను దూరంగా విసిరివేయ బడ్డాం. ఆ చీకటిలో ఎవరు ఎక్కడ పడ్డామో మాకే తెలియదు. ఆ సమయంలో ఆ దారిలో జనసంచారం ఉండదు. మా దిక్కు ఆలకించేవారే లేరు. ఎట్లా ఇల్లు చేరటమా యని స్వామిని ప్రార్థిస్తున్నాను. అయితే స్వామి దయవలన మాకు ఎలాంటి దెబ్బలు తగులలేదు. అదే ఆశ్చర్యం. మేము ఊహించని రీతిలో మా పాలేరులు మరొక బండి కట్టుకొని ప్రత్యక్షమయినారు. మీరెందుకు వచ్చారని అడిగాను. అమ్మగారు పంపారని చెప్పారు. సుఖంగా ఇంటికి చేరి మా ఇంట్లో వున్న మా తల్లిగారిని, భార్యను అడిగాం. అత్యంత ఆశ్చర్యకరమైన విషయం నాకు

చెప్పారు మా తల్లిగారు. మాకు యాక్సిడెంట్ జరిగిన సమయంలో బాబాగారే (ఫిజికల్ బాడీలో) స్వయంగా మా ఇంటికి వచ్చి నా తల్లిగారికి భార్యకు కనిపించి యాక్సిడెంట్‌ను గురించి చెప్పి, ఏమీ దెబ్బలు తగలలేదని కూడా చెప్పి మరుక్షణంలో స్వామి కనిపించలేదని వాళ్ళు చెప్పారు. ఎక్కడ ఆంధ్రప్రదేశ్‌లో నున్న పుట్టపర్తి? మాది తమిళనాడు కోయంబత్తూరు జిల్లాలోని మారుమూల గ్రామం. ఈ సంఘటన మమ్ములను మార్చివేసింది, కదిలించివేసింది. ఈ సృష్టిలో బాబాకు తెలియనిది అంటూ ఏదీ లేదని ఈ సంఘటన రుజువు చేస్తున్నది. అంతే కాదు బాబాను నమ్ముకున్నవారు ఎటువంటి విపత్కర పరిస్థితుల నుండైనా రక్షించబడుతారనే విషయం కూడా స్పష్టం చేస్తున్నది ఈ సంఘటన.

## కోదండస్వామి విగ్రహం

మరొక సందర్భంలో చిత్రావతి ఇసుక తిన్నెలలో మా అన్నగారు శ్రీ ఆర్. బాలపట్టాభిగారికి కోదండ రామస్వామి విగ్రహం సృష్టించి యిచ్చారు. ఆ విగ్రహం 4 అం॥ ఎత్తు మాత్రమే ఉంటుంది. దానిని పాత మందిరం వద్దకు తీసుకొని వస్తుంటే, రాను రాను బరువెక్కడం ప్రారంభించింది. ఆయన మోయలేక పోయినారు. 4 అం॥ విగ్రహం ఇంత బరువేమిటాయని ఆశ్చర్యపోయినాము. స్వామి పాతమందిరం వద్దకు చేరేటప్పటికి, అక్కడనున్న తెర తగుల బడుతున్నది. అది చూచి స్వామి "రామ జననం, లంకాదహనం" అంటూ ఆ తెరను చేతితో స్పృశించి, ఆర్పివేశారు. అప్పుడు ఆ విగ్రహం బరువు తగ్గింది. ఆ విగ్రహమును మా పూజా మందిరంలో పెట్టి పూజించుకుంటున్నాం. ప్రతి సంవత్సరం లక్షార్చన జరుపు కుంటున్నాం.

## కట్టుడు పండ్లు

మేము 20 మంది మా సేవాసమితి సభ్యులతో కలిసి పుట్టపర్తికి ఒక పర్యాయం వెళ్ళాం. మాతోపాటు ప్రప్రథమంగా శ్రీ జి.టి.కె. నాయుడుగారు కూడా వచ్చారు. ఒక రోజు తెల్లవారుజామున 4 గంటలకే చిత్రావతికి స్నానముచేయటానికి వెళ్ళాం. శ్రీ జి.టి.కె. నాయుడుగారు తన కట్టుడు పండ్లను తీసి, ఇసుకమీద తువాలు పరచి దానిమీద పెట్టి స్నానమునకు వచ్చాడు. స్నానం అయిన తరువాత ఆయన తన నౌకరును తుడుచుకోవటానికి తువాలును తీసుకొని రమ్మనమని ఆదేశించాడు. చీకటిలో దాని మీదనున్న కట్టుడు పండ్లను గమనించక తువ్వాలును లాగి తీసుకొనిపోయినాడు. దానిమీద నున్న పండ్లసెట్టు రాయి మీద పడి విరిగిపోయింది. నాయుడుగారు ఆగ్రహించి నౌకరును కొట్టాడు. మరుసటి రోజున నాయుడుగారిని పిలిచి స్వామి 'తప్పు నీవు చేసి దండన మరొకరికా,

తప్పకాదూ' అని మందలించారు. పండ్లు లేకపోవటం వలన నాయుడుగారు నోటికి టవల్ అడ్డం పెట్టుకొని వున్నాడు. అది గమనించిన స్వామి తన సంకల్పంతో మరొక పండ్ల సెట్టును సృష్టించి నాయుడుగారికి యిచ్చి, అది పెట్టుకొని వచ్చిన తరువాత 'సరిపోయినదా' అని అడిగారు. ఆ కృత్రిమ పండ్లసెట్టు నాయుడుగారికి ఖచ్చితంగా సరిపోయింది. స్వామి మహిమలకు మేమంతా ఆశ్చర్యపోయాం.

స్వామి చేసేది మ్యాజిక్ కాదు, మెస్మరిజం అంత కన్నా కాదు- ఆయన సంకల్పంతో దేనినైనా సృష్టించ గలరు. ఆయనకు తెలియనిదేమీ లేదు. ఆయన సర్వాంతర్యామి. ఆయన నిజంగా భగవంతుడేనని మా నమ్మిక.

*నవంబరు - 1987*



# ఇంద్రియనిగ్రహము

*"ఇంద్రియ నిగ్రహము యోగులకు, సన్యాసులకు అవసరం కాని, నాకెందుకు? అని కొందరు వాదిస్తుంటారు. "ఇది నా కారు. నాపేరుతోనే రిజిష్టర్ చేశాను. నేనే దీనికి డ్రైవర్‌ను కూడా. మరి ఇది నాకెందుకు ప్రమాదం తెచ్చి పెడుతుంది? "అనే తలంపుతో, బ్రేకులు బాగున్నాయో! లేవో! పరీక్షించక, అహంకారంతో, ఆడంబరంతో డ్రైవ్ చేస్తే, ప్రమాదం తప్పదు. అదే విధముగ ఈ కారు అనే దేహమును కూడా ఇష్టం వచ్చినట్లుగా ప్రవర్తింపజేయరాదు. ఈ దేహమే ఒకకారు. కన్నులే హెడ్ లైట్స్, కడుపు పెట్రోల్ టాంక్, నోరు హారను, మనస్సు స్టీరింగు, ధర్మార్థ కామ మోక్షములే టైర్లు, విశ్వాసమే వాటిలో గాలి, బుద్ధియే స్విచ్, ఇంద్రియ నిగ్రహమే బ్రేకులు. కనుక ఇంద్రియ నిగ్రహము కలిగిన చిత్తశుద్ధి, చిత్తశుద్ధి కలిగిన జ్ఞాన సిద్ధి కలుగును".*

**- బాబా**

# సత్యమైన మాట సాయిమాట

- శ్రీమతి హంసలక్ష్మి వెంకటేశన్, తిరుపతి

ఆనాడు 'ఆదిమూలా' అని పిలిచినపుడు శ్రీమహావిష్ణువు ఏ విధముగా పరుగిడి వచ్చినారో అదే విధముగా ఈనాడు మనస్ఫూర్తిగా "హే సాయినాధా" అని పిలిచిన మన సత్యసాయి తప్పక వచ్చి కాపాడుదురు. ఇది సత్యము. సత్య స్వరూపుడైన భగవాన్ శ్రీ సత్యసాయిబాబా ప్రత్యక్షముగా అనుగ్రహించిన ఈ నా అనుభవాన్ని మీ ముందు సమర్పించవలసినందుకు బాబావారికి నా కృతజ్ఞతాభి వందనములు.

1983 మే నెలలో ఒకరాత్రి భోజనానంతరము పనులను ముగించుకొని నిద్రించవలెనన్న సమయంలో విపరీతమైన కడుపునొప్పితో తాళలేక క్రిందపడి పోయినాను. ఒళ్లంతా చెమటలు పట్టి, గుండె దడ ఎక్కువయినది. వెంటనే నా భర్త వేడి నీటిలో ఒక చెంచా నెయ్యి, చిటికెడు స్వామివారి విభూతి కలిపి ఇచ్చినారు. 5 నిముషములలో బాగా నిద్రపట్టినది. మరుసటి రోజుకు మామూలు మనిషి నయినాను. అసలు నాకేనా కడుపునొప్పి అనిపించినది. ఆ రోజు సాయంత్రము డాక్టరు వద్దకు వెళ్ళగా పరీక్షించి "గర్భకోశము తీసివేయాలని" చెప్పినారు. కాని స్వామి అనుమతితో ఆపరేషన్ చేయించుకోవాలని అనుకొన్నాను. స్వామి అనుమతికై అడుగగా "అదేమి-కూరగాయా? తరిగి వేయడానికి!" అని అన్నారు. అపుడు స్వామి 9 పొట్లాల విభూతి ఇచ్చి వాడమనినారు. తరువాత నొప్పి ఉపశమించింది.

మరల జూలై 1984లో ఇదే విధముగా కడుపునొప్పి వచ్చినది. అప్పటికి మేము హిందూపురం నుండి ట్రాన్స్ఫర్ అయి తిరుపతికి వచ్చినాము. ఇప్పుడు కూడా స్వామి సృష్టించి ఇచ్చిన విభూతితో నానొప్పి మాయమయినది. ఇదే విధముగా 1985లో రెండుమార్లు వచ్చినది. అప్పుడు డాక్టరుకు చూపించగా ఇప్పటికే ఆలస్యమయినది. ఆపరేషన్ తప్పకుండా చేయవలెనని చెప్పినారు. స్వామి అనుమతితో ఆపరేషన్ చేయించుకోవాలని తలచి స్వామిని అడుగగా ఆపరేషన్ చేసుకోమన్నారు. 14-2-1986 పర్తికి వచ్చినాను. ఫిబ్రవరి 18న నా పుట్టినరోజు. ఆ రోజు స్వామి నాకు పాద నమస్కారము ఇచ్చి "మీకు ఏమయినది?" అని అడిగినారు. నేను "స్వామీ! మీరు ఇన్ని రోజులు ఆపరేషన్ వద్దని ఇప్పుడు చేసుకో మంటున్నారు. నాకు మీరు తప్ప మరెవ్వరూ లేరు. మీరే రావాలి" అని చెప్పి పాదములను గట్టిగా పట్టుకున్నాను. స్వామి అపుడు "చాలా సంతోషము. అలాగేకాని" అని అన్నారు.

తిరుపతిలో ఫిబ్రవరి 24న డాక్టరు విద్యాసాగర్ గారి నర్సింగ్‌హోమ్‌లో అడ్మిట్ అయినాను. ఫిబ్రవరి 26వ తేది రాత్రి చాలా బేజారుగా వుండగా స్వామి నా కుడి ప్రక్కన నిలుచొని "భయపడవద్దు" అని వీపు తట్టినారు. అపుడు నాకు తోడుగా

వున్న నా స్నేహితురాలితో ఈ మాట చెప్పగా ఆమె నన్ను చూసి "మీ ముఖము తేజోవంతముగా వున్నది. ఏదో స్వామి మహిమ జరుగనున్నదని" చెప్పినారు.

ఫిబ్రవరి 27న ఆపరేషన్ రోజు. ఆపరేషన్ థియేటర్‌లో అడుగు పెట్టేమునుపు అందరు డాక్టర్లు స్వామి విభూతి పెట్టుకొనవలెనని నా చేతిలో వున్న స్వామి సృష్టించి యిచ్చిన విభూతిని తీసుకోమన్నాను. వారు అట్లే పెట్టుకొని నాకూ పెట్టినారు. నేను స్వామి ఫోటో, విభూతి చేతిలో పట్టుకొని ఆపరేషన్ థియేటర్ లోనికి ఉదయం గం॥ 6-30 ని॥లకు ప్రవేశించినాను. అపుడు స్వామి ఆపరేషన్ టేబుల్ పైనున్న బల్బులో అభయహస్తముతో చిరునవ్వుతో కనిపించినారు. అంతలోనే నాకు మత్తు ఆవరించినది. నాకు అనిర్వచనీయమైన ఆనందము కలిగి సమాధి స్థితిలో వున్నట్టు అనిపించినది. నిజముగా ఆ స్థితిని నేను వర్ణించలేను. అట్టి అనుభూతిని నేను నా జీవితములో యెప్పడు అనుభవించలేదు. ఆ స్థితిలో నాకు గ్లూకోజు ఎక్కించవలెనని నా చేతినుండి స్వామి ఫోటోను బలవంతముగా విడిపించి నా తలపై పెట్టినారు. ఆ స్థితిలో నేను "సాయిరాం సాయిరాం" అని అంటున్నానని చెప్పినారు. ఆపరేషన్ అయిన తరువాత డాక్టర్లు ఇలా ప్రక్కకు తిరుగగా ప్రక్కలోనే స్వామి ప్రత్యక్షముగా నిలుబొనియున్నారు. "స్వామీ ఎప్పడు వచ్చినారు? కుర్చీలో కూర్చోండి" అని డాక్టరు లక్ష్మణరావు పలుకగా స్వామి "ఇప్పటికే 7 గంటల 40 ని॥లు అయినది. నేను అప్పడే వచ్చినాను. నా కోసము భక్తులు పర్తిలో వేచియున్నారు. 'అమ్మ' నన్ను ఆపరేషన్ అపుడు రమ్మని చెప్పినారు. అందుకే వచ్చినాను. అమ్మకు చెప్పండి" అని పలికి మూసిన తలుపుగుండా వెళ్తూ అదృశ్యమయినారు. ఆపరేషన్ డ్రెస్‌లోనే డాక్టరు లక్ష్మణరావు, విద్యాసాగర్‌గారు నా భర్తకు చెప్పటకై వెలుపలికి రాగా వారి తత్తరపాటును చూచి నా భర్త ఇక ఏమో కాంప్లికేషన్ అని చాలా భయపడినారు. డాక్టర్లు స్వామి వచ్చిన విషయమును చెప్పగా విని అందరూ ఆనందపరవశులైనారు.

ఇదియే నాకు స్వామి ఇచ్చిన దివ్యానుభవము. ఆనాడు స్వామి పాదములను పట్టుకొని ప్రార్థించగా ఇచ్చిన మాటను, నాకు ఆపరేషన్ సమయములో ప్రత్యక్షమై తన మాటను ఋజువు చేసినారు. ఎవరైతే స్వామిని పూజించి, భజించి, సేవిస్తారో వారిని స్వామి తప్పక కంటికి రెప్పలా కాపాడుతారు.

**అనన్యా శ్చింత యంతోమామ్**
**యేజనాః పర్యు పాసతే**
**తేషాం నిత్యాభి యుక్తానామ్**
**యోగక్షేమం వహామ్యహమ్**

అని భగవద్గీతలో ఏనాడో భగవానుడు చెప్పినాడు గదా!

*నవంబరు - 1987*